ఓం

శ్రీ గురుభ్యోనమః

# గురుస్తోత్రము

(మొదటి భాగము)




రచయిత

"పరిపూర్ణ దర్శనాచార్య సదానంద"

శ్రీ యలపకుర్తి వీర వెంకట రామచంద్రరావు

నర్సాపురం, ప॥గో॥జిల్లా

ఓం

శ్రీ గురుభ్యోనమః

# గురుస్తోత్రము

(మొదటి భాగము)



రచయిత

"పరిపూర్ణ దర్శనాచార్య సదానంద"

శ్రీ యిలపకుర్తి వీర వెంకట రామచంద్రరావు

నర్సాపురం, ప॥గో॥జిల్లా

ఓం

శ్రీ గురుభ్యోనమః

# గురుస్తోత్రము

(మొదటి భాగము)




రచయిత

"పరిపూర్ణ దర్శనాచార్య సదానంద"

శ్రీ యిలపకుర్తి వీర వెంకట రామచంద్రరావు

నర్సాపురం, ప॥గో॥జిల్లా



| | | |
|---|---|---|
| రిజిష్టర్డు | ద్వితీయ ముద్రణ | వెల |
| కాపీరైటు | 1999 ప్రతులు 1,000 | రూ. 25-00 |

# ముందుమాట

పరిపూర్ణ దర్శనాచార్య, సదానంద శ్రీ యిలపకుర్తి వీర వెంకట రామచంద్రరావు గారు, శ్రీ అచల ఋషి దయానంద పొన్నాల రాజ యోగీంద్రుల వారి అనుగ్రహముచే వారి దివ్యాశీస్సులతో శ్రీ శివరామ దీక్షితీయ సాంప్రదాయమును తమ గ్రంథ రచనల ద్వారా బహుళ ప్రాచుర్యము చేసి పాఠక లోకమును ఉత్తేజితులుగా జాగృతమొనరించినారు. వారి శిష్య ప్రశిష్యులు వలయు ఆర్థిక సంపత్తిని సమకూర్చి, వారి గురుభక్తిని వ్యక్తపరచుకొనుచునే ఉన్నారు.

అంతేకాక గురు ధర్మ నిర్వహణలో శ్రీరామచంద్రరావు గారు దంపతులు జరిపిన కృషిని, గడిపిన ఆదర్శవంతమగు జీవితమును లోకములో ప్రచారం చేయుటకై గురుదేవుల ఆశయ సంసిద్ధి కొరకు "శ్రీశ్రీశ్రీ సీతారామచంద్ర పరిపూర్ణ బోధోపదేశ మందిర సంస్థ" ను గుంటూరు జిల్లా, మంగళగిరి మండలం, యర్రబాలెం గ్రామంలో ఏర్పాటుచేసి శ్రీ గురుదేవుల ఆదర్శమును లోక కళ్యాణార్థము వివరించడంలో వారికి గల సహాయ సంపత్తిని అందించు చున్నారు. ఇది సహృదయులు సంతసించి ప్రోత్సహించవలసిన అంశము.

శ్రీ రామచంద్రరావు గారి రచనలన్నియు వారి గురుదేవులు శ్రీ శివరామ దీక్షితీయ పీఠాధిపతులైన దయానంద పొన్నాల రాజయోగీంద్రుల వారి దివ్యశ్రీ చరణములకు పూజాపుష్పములుగా సమర్పింపబడియున్నవి. అట్లే యీ భాగం కూడా యొక పూజాపుష్పంగా వారి చరణ సన్నిధి చేరాలని భక్తమండలి వారి తరపున శ్రీ గురుపరమాత్మను ప్రార్థించు చున్నాము.

ఇట్లు

*భక్తమండలి తరపున*

**మంచిరాజు శ్రీనివాసమూర్తి**

# పీఠిక

జన్మరాహిత్య విధానమందు ఆదర్శవంతమగు కృషి ద్వారా ధృడవరచు మార్గములలో శ్రీ శివరామదీక్షితీ సిద్ధాంతమును ప్రముఖముగా చెప్పవచ్చును. ఇందు "గురున్ముఖ్యేన జ్ఞాతవ్యం నాన్యదా గ్రంధ కోటిభి". గురూపదిష్ట మార్గేన మనశ్శుద్ధ్యంతు కారయేత్" అని చెప్పబడినట్లుగా గురువు, గురుదర్మము యొక్క అవసరాన్ని స్పష్టపరచుచు సర్వభ్రాంతి రాహిత్య స్థితి ఆరూఢత కాగలగటంలో గురుకృప యొక్క అవసరాన్ని ఈ సాంప్రదాయము నందు ప్రముఖముగా నిర్దేశింపబడి యున్నది. పరంపరా ప్రోక్తమై గురుశిష్య న్యాయముగా "శ్రీ బ్రహ్మా విద్యా గురువిష్ణు సూర్యం" దగ్గర నుండి నేటి వరకు అవిచ్ఛిన్నంగా ప్రకాశింపబడు చున్నది. ఈ సిద్ధాంతము నందు గురుగీతా దర్మము చాలా ప్రాధాన్యత కల్గియున్నది. గీత అనగా వేదములలో నిర్దేశింపబడిన రహస్యార్ధమును జిజ్ఞాసువులకు సులభముగా తెలియుట కొరకు మహర్షులు విశాల దృక్పదములో అనుభూతములుగా అందించిన పరమ సత్యములు. ఈ గురుగీత ఒక ప్రముఖమైన ఆదర్శవంత అనుష్ఠాన రూపక తత్వోపదేశముగా సమాజమునకు అనుగ్రహింపబడినది. "సనత్కుమార సంహిత" అను పేర స్కాందపురాణ అంతర్గతమై ఉమామహేశ్వర సంవాద రూపముగా " సుజ్ఞాన దీపమను గురుగీతలు" సర్వవేదాంతసారమై ప్రకాశించుచున్నవి. ఈ గీతా దర్మమును దీక్షా పద్ధతిగా మాత్రమే గ్రహించవలసియున్నది. "ధీయతే విమలం జ్ఞానం క్షీయతే కర్మ వాసనః" అనగా ఏది సకల కర్మలను నశింపచేసి నిర్మలమైన, పరిశుద్ధ జ్ఞానము అనుగ్రహించుచున్నదో అట్టి దానినే దీక్ష అని చెప్పవచ్చును. ఈ గ్రంధమునకు శ్రీ బ్రహ్మావిద్యా గురువైన శ్రీ గురుమూర్తియే అధిష్టాన దేవత అయి యున్నాడు. ఇందు గురుస్వరూప నిర్ణయము గురుశ్శిష్యుల లక్షణములు వారి యందలి ఆదర్శములు విపులీకరింపబడినవి. ఈశ్వరానుగ్రహప్రాప్తి (ధైవానుగ్రహ ప్రాప్తి) నే ఈ పరిబాషలో గురుకృపగా చెప్పబడుచున్నది. అట్టి గురుకృపను కల్గించు కొనుటకు వలయు సాధనా క్రమమంతయు ఉపదేశ రూపముగా అనుష్ఠాన పద్ధతిగా నిర్దేశించిన గ్రంధము ఈ సిద్ధాంతమున ప్రముఖులైన శ్రీ భాగవత కృష్ణదేశికేంద్రుల వారు ఈ గీతాదర్మము యొక్క అవసరాన్ని

నొక్కి చెబుతూ, "గురుశిష్యుల లక్షణములు గురుశిష్యుల బోధరీతి గురుగీ తార్థము ఎరిగిన నరులకే మెప్పగు" అని పేర్కొన్నారు. అందులకే శ్రీ శివరామ దీక్షితీ పీఠ దర్మము నందు ఒక ప్రామాణిక పీఠ గ్రంథముగా అనుష్ఠాన రూపమై, ఉపదేశమార్గముగా శ్రీ కృష్ణ దేశికేంద్రుల వారి ప్రియ శిష్యులకు శ్రీ ఫిల్ఖానా శంకరరావు గారు 274 శ్లోకములతో 4 అధ్యాయములుగా అనుష్ఠాన రూప ప్రామాణిక పీఠ గ్రంథముగా పాఠక లోకమునకు అందించి యున్నారు. ఇందలి నిగూఢాంశములను బోధనా పద్ధతి యందలి నిర్దుష్టతను పాఠక లోకమునకు అందించుటకు పీఠాధ్యక్షులైన శ్రీ దయా నంద పొన్నాల రాజయోగీంద్రుల వారి ప్రియశిష్యులు. పరిపూర్ణ దర్శనాచార్య సదానంద శ్రీ యిలపకుర్తి వీర వెంకట రామచంద్రరావు రాజయోగి గారు 1965 జులై నుండి 1977 జూన్ వరకు తమ సంపాదకత్వములో నడుపబడిన రాజయోగి వేదాంత మాసపత్రిక యందు ప్రతినెల "గురు స్తోత్రమను" శీర్షికలో పాఠక లోకమునకు అందించియున్నారు. తద్వారా జనన మరణ రాహిత్యమునకై కృషిచేయు పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత పాఠకులకు ఎంతో విలువైన సహాయకారిగా ఉండి ఉత్తేజితులుగా చేసి సాంప్రదాయక పద్ధతి యందు జాగృతమొనర్చి నారు. వారి శిష్య ప్రశిష్యులు కోరికపై ఈ అంశములన్నీ క్రోడీకరించి 1988వ సం॥లో "గురుస్తోత్రము మొదటి భాగము" గాను 1990వ సం॥ మిగిలినవన్నీ క్రోడీకరించి "గురుస్తోత్రము రెండవ భాగము" గాను ప్రకటింపబడినవి. భక్తాదుల కోరికపై మరల ఈ రెండు భాగములు పునర్ ముద్రితము గావింపబడినవి. పాఠకులు గురుదర్మము యొక్క ఆధిక్యతను అవసరాన్ని గ్రహించి గురూపా సన విధానమును నిర్దుష్టముగా కృషి చేయుట ఏ వ్యక్తికి ఆ వ్యక్తి ప్రేరణ కల్గించు కొన్నచో ఈ గ్రంధ రచన సాఫల్యమైనట్లే, మిడి మిడి జ్ఞానపరులకు కనువిప్పు కల్గించి సంస్కరించుకొనుటకు దోహదపడగలిగి నచో ఈ పునర్ ముద్రణ కార్యక్రమము ఫలప్రదమైనట్లే.

ఇట్లు

**మంచిరాజు శ్రీనివాసమూర్తి**

ఓం
శ్రీ గురుభ్యోనమః

గ్రంథ పునర్ముద్రణ దాతలు



**శ్రీ దాసరి బుల్లి వెంకట్రాజు, శ్రీమతి వెంకటరమణమ్మ**

పాయకరావుపేట, విశాఖపట్నం జిల్లా.

శ్రీ గురుభ్యోనమః

ఈ గ్రంథమునకు ద్రవ్య సహాయముచేసిన శ్రీ దాసరి బుల్లి వెంకట్రాజు, వెంకట రమణమ్మగార్ల సంగ్రహ జీవిత చరిత్ర.

విశాఖ జిల్లా పాయకరావుపేట గ్రామ కాపురస్తులు శ్రీ దాసరి గవర్రాజు, మంగరాజు పుణ్య దంపతుల గర్భవాసమున ది. 1-5-1924వ సంవత్సరంలో శ్రీ బుల్లి వెంకట్రాజు గారు జన్మించి యున్నారు. వీరు చిన్న వయస్సులోనే తల్లిదండ్రులు పరమపదించుటచేత యస్.యస్.యల్.సి. వరకు చదువు పూర్తి చేసి స్వయంకృషితో వ్యాపారం ప్రారంభించి అంచెలంచెలుగా వ్యాపార రంగములో గణనీయమైన అభివృద్ధి సాధించిరి. సమీప గ్రామనివాసి శ్రీ వలిశెట్టి నూకరాజు, వీరరాఘవమ్మగార్ల ప్రధమ సంతానమైన వెంకట రమణమ్మగారిని వివాహము ఆడిరి. వీరికి ఐదుగురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు. వ్యాపార రంగములోనే కాక రాజకీయ, సాంఘిక, ధార్మిక రంగాలలో కూడా వీరు విశేషమైన అభివృద్ధి సాధించిరి. పాయకరావుపేట గ్రామ పంచాయితీ మెంబరుగా, సర్పంచిగా 14 సంవత్సరముల పాటు ఏకగ్రీవముగా పనిచేసి గ్రామాభివృద్ధికి విశేషమైన కృషిచేసి రాష్ట్రమందుగల ప్రముఖ రాజకీయవేత్తలతో మన్నలను పొందియున్నారు. గ్రామాభివృద్ధిలో ప్రముఖముగా పేర్కొనదగినవి. వీరు తండ్రిగారు పేరున శ్రీ దాసరి గవర్రాజు మెమోరియల్ పార్కును, తల్లిపేరున శ్రీమతి మంగరాజు మెమోరియల్ కమ్యూనిటీ హాలు, మాతామహులు చక్కా గవరయ్య గారి సూర్యనారాయణ స్మారక ఆరోగ్య కేంద్రము, రక్షిత మంచినీటి పధకము, బస్టాండ్, మార్కెట్టు నిర్మాణమునకు స్థలసేకరణ, కుష్టు రోగ చికిత్సా కేంద్రము, శ్రీ దాసరి గున్నయ్య శెట్టి (వీరి నాల్గవ కుమారుడు) జ్ఞాపకార్థము ట్రస్టు ఏర్పాటు చేసి ఆధునిక వసతి సదుపాయములో కళ్యాణమండపము, వసతి గృహములు మొదలగునవి ఏర్పాటు చేసియున్నారు. విద్యారంగములో కూడా గణనీయమైన సేవా కార్యక్రమములను నిర్వర్తించియున్నారు. వ్యాపార రంగములో కూడా అనేక వ్యాపారములలో ప్రముఖ పాత్ర వహించి ఆర్థిక రంగములో ఉన్నత శ్రేణికి చేరియున్నారు. ఇక ఆధ్యాత్మిక రంగములో కూడా వీరి దంపతులు భారత దేశములో గల పుణ్య స్థలములను సందర్శించి అన్నవరం, తిరుపతి, శ్రీశైలం శాంతి ఆశ్రమములలో నిత్యాన్నదాన పథకము నకు విరివిగా విరాళములు యిచ్చియున్నారు. స్వగ్రామములో రామమందిరం నిర్మించి యున్నారు. వీరి జీవిత కాలములో చేసిన సేవా కార్యక్రమములు దాన ధర్మములు గుర్తించి ఫెడరేషన్ ఆఫ్ స్టేట్ వైశ్య ఛాంబర్, ఆంధ్రప్రదేశ్ వారు 21-12-1986వ సంవత్సరములో విజయవాడలో ఘనమైన సన్మానము యేర్పాటు చేసి “దానశీల” అను బిరుదును ప్రధానము చేసినారు.

వీరి పూర్వ జన్మ సుక్రుతముచే శ్రీ విద్యా ప్రకాశానందస్వాములవారి భగవద్గీత ఉపాన్యాసములచే ఆకర్షింపబడి ఆధ్యాత్మిక జీవిత అవసరమును గుర్తించి అందుకు వలయు మార్గదర్శకత్వము ఈయగల సద్గురువుని

అన్వేషించుచుండిరి. అంతకు పూర్వమే వీరి ధర్మపత్ని వెంకట రమణమ్మగారు స్థానిక బంధు వర్గముల వారి ప్రోత్సాహముతో శ్రీ శివరామదీక్షిత సిద్ధాంతమందు విశేష కృషి సల్పిన పరిపూర్ణ దర్శనాచార్య సదానంద శ్రీ యిలపకుర్తి వీర వెంకట రామచంద్రరావుగారు, నర్సాపురం వారి చే ధర్మోపదేశము పొంది ధార్మిక జీవితమునందు కృషి చేయుచుండిరి. భర్తగారి జిజ్ఞాసని గ్రహించి యిరువురొకే ధర్మములో ప్రవేశించి కృషి చేయుట మంచిదని వీరిని నొప్పించి శ్రీరామచంద్ర రావు గారి శిష్యులైన శ్రీ విజ్ఞానానంద శ్రీమంచిరాజు శ్రీనివాసమూర్తి సుగుణావతి గార్ల ద్వారా 1988వ సంవత్సరములో ఉపదేశము యిప్పించి సాంప్రదాయక పద్ధతి యందు నిర్దేశించిన అనుష్టాన, ఆచరణ, విచారణల యందు విశేషమైన కృషి చేసియున్నారు. ఈయన మితభాషి, వినయశీలి, పట్టుదల గల వ్యక్తి. ఆధ్యాత్మిక రంగములో ఆరూఢ చెందవలెనన్నచో, గురువు యింటా వెంట వుండాలి అన్న సూత్రమును ఆదర్శముగా తీసుకొని సల్పవ్యవధిలోనే గూరూపదిష్ట మార్గములో విశేష కృషి సల్పి తన జిజ్ఞాసులు అందరికి తాను ఆచరించి అనుభవించిన ధార్మిక జీవితమును అందరికి అందుబాటులో వుండే విధముగా యోచించి శ్రీ గురు దేవుల ప్రేరణతో గుంటూరు జిల్లా మంగళగిరి మండలం, యర్రబాలెంలో శ్రీశ్రీశ్రీ సీతారామచంద్ర పరిపూర్ణ బోధోపదేశమందిరం యను సంస్థని ఏర్పాటు చేయుటలో ప్రధాన భూమిక వహించి, సంస్థకి చట్టబద్ధత కల్పించి సమాజమునకు మహోపకారముచేసి యున్నారు.

సంస్థ అభివృద్ధికి వలయు ఆర్థిక పరిపుష్టి కల్పించుటలో చొరవ చూపియున్నారు. ఇది అందరికి ఆదర్శప్రాయమైయున్నది.

గురుస్తోత్ర గ్రంధము మొదటి భాగము అందలి విషయ నిరూపణ అంతయూ గురుముఖతా విచారించి హృదయమందు యిమిడ్చికొని ఉత్తేజితులైరి. ప్రారబ్దకర్మము పూర్తి అయి ది. 14-1-1996 యువ నామ సంవత్సరములో బ్రహ్మైంక్యము చెందినారు. వీరి ద్వితీయ కుమారుడు చిరంజీవి గవర్రాజు కోడలు వీరరాఘువమ్మ ("కుమారి") లను కూడా ప్రోత్సహించి ఈ సాంప్రదాయమునందు ఉపదేశమిప్పించి కృషి చేయించి యున్నారు. యీ ధర్మమునకు వీరు చేసిన సేవ చిరస్మణీయము. ఆదర్శప్రాయము. గురు ఋణం తీర్చుకొనే పద్ధతిలో సేవా పద్ధతిగా ఈ గ్రంధమును పునర్ముద్రించుటకు వలయు ఆర్థిక సంపత్తిని అందిం చుటలో వీరి ధర్మపత్ని కుమారులు చొరవచూపి ధన్యులైరి. శ్రీ గురుమూర్తి కృప సర్వదా వీరి యందు ప్రసరించి ధన్యతను గాంచెదరుగాక.

ఇట్లు

**దాసరి నేస్తాలు**

# గురుగీతా ప్రయోజనము

గురుగీత యెట్లావిర్భవించెనో తెలుసుకొంటే గురుగీతా ప్రయోజనము తెలియగలదు. పార్వతీ పరమేశ్వరులు కైలాస శిఖరముపైన ఉపవిష్టులై యుండగా ప్రపంచమందలి జీవుల శ్రేయస్సు కోరి పరమేశ్వరుని పార్వతి కొన్ని ప్రశ్నలడుగ సాగెను. అందు ముఖ్యమగు ప్రశ్న యిది.

శ్లో॥ కేన మార్గేణ భో స్వామిన్
దేహీ బ్రహ్మమయోభవేత్?..........

ఓ పరమేశ్వరా, ఏ మార్గముచేత జీవుడు బ్రహ్మమయుడు కాగలడు? ఇందుకు సమాధానముగానే గురుగీత చెప్పబడినది. కనుక గురుగీత ప్రయోజనము జీవుడు బ్రహ్మ స్వరూపుడగుటయే అని వేరే చెప్పనక్కరలేదు. జీవుడు బ్రహ్మ స్వరూపుడగుట యనగా నేమి? యినుము పరుసవేది స్పర్శచే బంగారమగుట వంటిదా? కానే కాదు. తనకు తెలిసినా తెలియకపోయినా జీవుడు బ్రహ్మ స్వరూపుడయియే యున్నాడు. కాని జీవుడు అది మరచి తాను కర్తయూ భోక్త యూనై వివిధ కర్మలు చేయుచూ తత్ఫలితముగా జనన మరణరూప సంసార చక్రమున బద్ధుడగు చున్నాడు.

చక్రవర్తి పరుండి నిద్రపోతూ, కలలో తాను దరిద్ర స్థితిలో నున్నట్లునూ, అష్టకష్టములనుభవించుచు దుఃఖించు చున్నట్లునూ కలగని ఆ దుఃఖ మెట్లు పోవునని యాలోచించు చున్నట్లుగానే జీవుడు ఈ ప్రపంచమున అనుభవించు దుఃఖము యొక్క అత్యంత నివృత్తికి అనేక మార్గములను అన్వేషించు చున్నాడు. కలలోనున్న చక్రవర్తి దుఃఖ మెట్లు తొలగును? నీవు చక్రవర్తివి గాని దరిద్రుడవు కానే కావు. అని ఆ కలలోనే అతడాప్త వాక్యము విని ఆరూఢం చేసుకొంటే వెంటనే అతనికి దుఃఖ నివృత్తి గలుగును. అట్లే శిష్యుని కలలో దోచిన గురుని వాక్యశ్రవణము ద్వారా జీవుడు మరచి పోయిన స్వస్వరూపము మరల నెరిగి, తనకన్యంగా పరిపూర్ణ బ్రహ్మమున్నదని తెలిసి సర్వభ్రాంతి రహిత స్థితి చెంది జన్మ రాహిత్యము చెందు చున్నాడు.

గురుగీత ఏ సందర్భంలో ఆవిర్భావము చెందినదో ముందుగా గమనించ వలెను. పార్వతీదేవి పరమేశ్వరునికి మ్రొక్కి, 1) గురుమహాత్మ్యము యెట్టిదో

2) జీవుడు సంసారమునుండి యెట్లు విముక్తి చెందునో 3) జీవుడే మార్గముచే బ్రహ్మమయుడు కాగలడో వివరించి చెప్పడని తొలుదొల్త ప్రశ్నించెను. ఈ ప్రశ్నలన్నిటి సమాధానములు చాలా విపులముగా గురుగీతలో వివరింపబడియున్నవి. అంతియే గాక గురుగీతా జపము సకామముగా చేయు భక్తుడు ఏ కామ్యార్థసిద్ధికై చేయునో దానికి తగిన దేశ కాలములు నిర్ణయించి ఏ దిశకున్ముఖముగా ఎట్టి ఆసనముపై కూర్చొని జపము సలుపవలెనో గురుగీత యుపదేశించుచున్నది.

గురువు నరుడు అనే భావన యే మాత్రమున్నా శిష్యుని యాశయ సిద్ధి కాజాలదు. కనుక గురుమూర్తి, కేవలం పరమాత్మ స్వరూపుడే అను లక్ష్యము సిద్ధించుటకై గురుమూర్తికి శిష్యుడు వినయముతో శరణాగతుడై తను మన ధనము లేవిధంగా అర్పణ చేయవలెనో గురుగీత విధించు చున్నది. మానసిక పూజా విధానములో శిష్యుడు శరీర యింద్రియ మనఃప్రాణ ప్రత్యగాత్మలను మనోవాక్కాయ కర్మలచే ప్రతి నిత్యము గురునికి నివేదన చేయు విధానము గురుగీత పేర్కొనుచున్నది. "తస్మై శ్రీగురవేనమః" అనే మకుటంతో అనేక గురుస్తోత్ర శ్లోకములు గురుగీతయందు పొందుపరచబడియున్నవి. అంతఃకరణ పరిశుద్ధి కొరకును శిష్యుని మనో ఏకాగ్రతకును శిష్యుడవలంభించవలసిన కర్మాచరణ విధానము నిర్ణయింపబడినది.

గురుస్వరూప నిర్ణయము గావించుటయేగాక, కేవలాత్మనిర్ణయము గావించి పరిపూర్ణ బోధ దృఢమగుటకై గురుగీత తోడ్పడుచున్నది. ఇంతేకాక గురుగీత సద్గురు సచ్ఛిష్యుల అధికార లక్షణములు శుశ్రూషా విధానము ముక్తి లక్షణములు వివరింపుచున్నది. కనుక గురుగీత పఠించనివాడు, పఠించి యా నిర్ణయములను పాటించని వాడు,గురుభక్తుడు కాజాలడు గరూపాసన, గురుభక్తి, గురుసేవ, గురునిష్ఠ, పరిపూర్ణ రాజయోగమును అవలంభించిన వానికి యెంతో ముఖ్యము. గురుగీతా జపము యివి సిద్ధించుటకు ప్రధాన సాధనము.



# గురుస్తోత్రము

శ్లో॥ అచింత్యావ్యక్తరూపాయ నిర్గుణాయ గుణాత్మనే
సమస్త జగదాధారమూర్తయే బ్రహ్మణేనమః॥

తాత్పర్యము : చింతింపరానిదియు, ప్రకటముగాక గూఢముగా నున్నదియు, నిర్గుణమైనదియు, గుణములతో గూడుకొన్నదియు, యావత్ దృశాౖ దృశ్య ప్రపంచమునకు ఆధారముగా నున్నదియు అగు బ్రహ్మమునకు అనగా గురుస్వరూపమునకు నమస్కరించుచున్నాను అని భావము.

ఈ శ్లోకము గురుగీతా గ్రంథమునకు మొదటి శ్లోకము కనుక యిందు బ్రహ్మ (గురు) స్వరూపమునకు మంగళాచరణరూపముగా నమస్కరించి గ్రంథ ప్రారంభము చేయబడు చున్నది. గ్రంథస్థ విషయమగు గురు స్వరూపమున కా బ్రహ్మము భిన్నము కాదు. ఆ బ్రహ్మమెట్టిదో యీ శ్లోకము తెలుపుచున్నది. ఇందు వర్ణింపబడిన బ్రహ్మము జగత్కారణమైన సచ్చిదానంద పరబ్రహ్మమేగాని పరిపూర్ణ పరబ్రహ్మము కాదనియు తేటతెల్లమగుచున్నది.

విశేష వివరణము :- ఈ శ్లోకమునందలి యన్ని పదములును వేరువేరుగా విచారింప వలసియున్నది.

1) అచింత్యము అనగా చింతింపరానిది. చింతించునది అంతఃకరణ చతుష్టయము లోని చిత్తము. చిత్తేంద్రియమునకు చింతనమే ఆధిభౌతికమగు వ్యవహారము. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ విషయాత్మకమగు దృశ్య ప్రపంచమే తన కనుభవములో నున్నందున దానిని గూర్చియే మానవుడు చింతింపగలుగును. ఎంతో కృషిచేసిన గాని అనుభవమునకు రాని బ్రహ్మమును గూర్చి సహజముగా చింతింపలేడు. అది నిర్విషయము, చిత్తముకూడ నొక యింద్రియమే కనుక యింద్రియాతీతమగు వస్తువును గూర్చి అది చింతింపజాలదు. అది యింద్రియగోచరమగు విషయపంచకమును చింతించక అతీంద్రియ వ్యాపారముగా ఏకాగ్రత చెందునేని అపుడు మాత్రమే ఆ బ్రహ్మము తెలియనగును. అందుకే "బుద్ధి గ్రాహ్య మతీంద్రియమ్" అని ఆబ్రహ్మమును గూర్చి చెప్పబడినది. బుద్ధియే చింతనచేయునపుడు చిత్తమను పేరొందినది. కనుక యీ బ్రహ్మము కేవలము అచింత్యము కాదు అని తెలియనగును.

2) అవ్యక్తము:- అనగా వ్యక్తముగానిది తన నిజరూపములో ప్రకటముగానిది. కాని అదేవిశ్వరూపముగా ప్రకటమైయున్నది. అందుకే ముండకోపనిషత్ "బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్టమ్" అని చెప్పియున్నది. అనగా ఈ విశ్వరూపముగానున్నది శ్రేష్ఠమైన ఆ బ్రహ్మమేనని అర్థము. తన నిజరూపములో అది ప్రకటముగాక విశ్వరూపములో ప్రకటమైయున్నది అన్నమాట. విశ్వరూపములో ప్రకటమగుచు (వ్యక్తమగుచు) నిజరూపములో వ్యక్తమగుటలేదు. కనుక అది వ్యక్తాౖ వ్యక్త రూపములుగా ద్వంద్వ రూపముగా నున్నది అని తెలియనగును.

3) రూపాయ:- రూప తన్మాత్ర అగ్నిభూత సంబంధము. రూపమున కాధిభౌతికము వర్ణము. వర్ణము ఏడు విధములుగా నుండి సూర్యకాంతియందు (కిరణమును విశ్లేషింపగా) గోచరించుచున్నవి. బ్రహ్మమునకు యీ ఏడు వర్ణములు సంశ్లేషింపగా యేర్పడిన తెలుపు వర్ణముగాని, సూర్యకిరణమే లేనపుడుండే గాఢాంధకార రూపమగు నలుపువర్ణముగాని లేవు. తెలుపు నలుపు అను రెండున్ను సూర్యకిరణమందుగల యేడు వర్ణములున్ను మొత్తమీ తొమ్మిది

రూపములను నేత్రము గుర్తించుచున్నది. బ్రహ్మమునకే తొమ్మిది రంగులు లేనందున అది నేత్రగోచరముగాదు. కాని అది "మనసైవానుద్రష్టవ్యం" అని శ్రుతులచే అభివర్ణితమైయున్నది. అనగా మనస్సుచే మాత్రమే చూడదగినదని అర్థము అతీంద్రియమగు అనగా సంకల్ప వికల్పాత్మకముగాని శుద్ధ మనస్సునకే అది గోచరిస్తున్నది. అనగా సంకల్ప వికల్పాత్మకమగు మనసేంద్రియమునకును అది గోచరింపదన్నమాట అట్టి బ్రహ్మమున (పైన యుదహరించిన కారణ బ్రహ్మము) కు ఒక రూపమును వర్ణమును నిర్ణయించి చెప్పజాలక తటస్థ లక్షణమును, స్వరూపలక్షణమును అతద్వ్యావృత్తి లక్షణములను పురస్కరించుకొని దానిని గూర్చి భోదించుటకు పూనుకొన్నారు. తటస్థ లక్షణమునకు దృష్టాంతముగా "కాకతిష్ఠ దేవదత్త గృహవత్" అనగా కాకి వ్రాలినదే దేవదత్తుని యిల్లు అని చెప్పుట, వీధులు మళ్లి ఆ యింటిని చేరులోపల కాకి ఎగిరిపోతే ఆ యింటిని గుర్తించుట సాధ్యముకాదు. బ్రహ్మము విషయములో "యతో వా యిమాని భూతాని జాయంతే। యేనజాతాని జీవంతి యత్ప్రయం త్యభిసం విశంతి।త ద్విజిజ్ఞాసస్వ తద్బ్రహేతి" అనగా దేనియందు భూతములు పుట్టుచున్నవో, దేనిచేత పుట్టిన పిదప పెరుగు చున్నవో, చివరకు దేనియందు ప్రవేశించి లయమగుచున్నవో దానినే బ్రహ్మమని తెలుసుకో" అంటోంది తైత్తిరీయోపనిషత్తు. సృష్టిస్థితిలయములు దేనియందు, దేని శక్తిచేత జరుగుచున్నవో అదే బ్రహ్మమని చెప్పుటయే బ్రహ్మమునకు తటస్థ లక్షణము. సృష్టి స్థితి లయములు లేనపుడు యీ బ్రహ్మమును తటస్థ లక్షణములచే గుర్తించుట సాధ్యము కాదు. కనుక స్వరూపలక్షణము లచే గుర్తించుట సాధ్యముకాదు. కనుక నవి బ్రహ్మమునకు సహజలక్షణములుకావు. కనుక స్వరూపలక్షణము చెప్పినారు. రాత్రియందు నక్షత్రగ్రహాదులతో కూడియున్నపుడు చంద్రుని చూపుటకు, యుత్కృష్ట ప్రకాశముగల వాడే చంద్రుడు అని చూపిస్తే, ఆ ప్రకాశము చంద్రుని యే కాలమందూ విడువదు కనుక చంద్రుని తేలికగా గుర్తింపవచ్చును. యిట్లు చెప్పుటే స్వరూపలక్షణము. బ్రహ్మము విషయములో సచ్చిదానంద లక్షణములు గలది బ్రహ్మమనుట స్వరూప లక్షణము. ఏలననగా సచ్చిదానంద లక్షణములు బ్రహ్మమును ఏకాలమందును విడవబోవు మూడవలక్షణము అతద్వ్యా వృత్తి లక్షణము దీనిచే యీ బ్రహ్మమును చెప్పుటకు ప్రయత్నింతురు. "నేతి, నేతి, నేతీతి హోవాచ" అనగా ఇదికాదు, ఇదికాదు ఇదికాదు అని చెప్పుచు దృశ్యాఽదృశ్యములన్నిటిని నిషేధించుచూపోగా శేషించినదే బ్రహ్మమని చెప్పుట అతద్వ్యావృత్తి లక్షణము. ఈ లక్షణముచే బ్రహ్మమును నిర్ణయించుటకూడా సుసాధ్యముకాదు. "ఇది అని చెప్పబడేది నేత్రమునకు గోచరించేది మాత్రమేగాదు. ఆకాశావరణమునందనంత శక్తులుండి నేత్రగోచరములు కాకున్ననూ మనోనేత్రమునకు గోచరించుచున్నవి, ఆకర్షణశక్తి, విద్యుచ్ఛక్తి అని మనము పల్కుచు వానిని మనస్సుచే గుర్తించుచున్నాము. యీ విధముగా నానావిధ నామరూప నటనలుగల అనంతసంఖ్యానీకమగు నామరూపాలను మనము నిషేధించుచుపోవుట దుస్తరము. మరిన్ని మనస్సునకందే సమస్తమునూ కూడా నిషేధించాలి అని ఈ అతద్వ్యావృత్తి లక్షణము చెబుతోంది. యీ కారణ బ్రహ్మముశుద్ధ మనస్సునకు గోరించునని పైన తెలుసుకొన్నాము. కనుక దాని నిన్ని నిషేధించవలసినదే. కనుక యీవిధముగా విమర్శిస్తే యీఅతద్వ్యావృత్తిలక్షణముచే కారణ బ్రహ్మముకూడ తెలియరాదు.

ఈ శ్లోకములో "రూపాయ" అనుటలో అచింత్యము, అవ్యక్తమునై స్వరూపలక్షణముచే తెలియబడునది అని గ్రహించనగును. సత్, చిత్, ఆనందములే దాని స్వరూపము అన్నమాట.

ఇక్కడ రూపమంటే నేత్రగోచరమగు రూపము కాదనిన్ని, ఆ బ్రహ్మము యొక్క లక్షణములనిన్ని, వానిని గుణములనిగూడ వర్ణింపరాదనిన్ని చెప్పబడుచున్నది.

3) నిర్గుణాయ:- సత్వగుణము, రజోగుణము, తమోగుణములని మూడు గుణములు. ఈ త్రిగుణములతో కూడినదే ప్రకృతి అనియు, ఈ గుణములు మూడును లేనిది బ్రహ్మమనిన్నీ "కృతే పురా ప్రకృతి" అనగా వస్తువుయెక్క నామరూపాలు పుట్టుక పూర్వము వున్న వస్తువు ప్రకృతి, అనగా స్వభావమని అర్థము దేని స్వభావము, లేక యెవరి స్వభావముఅని ప్రశ్నవేస్తే బ్రహ్మముయెక్క స్వభావమే యని అనక తప్పదు. దేని స్వభావము దానిని విడిచి వేరొక వస్తువునందుండునా? స్వ + భావము= స్వభావము అనగా తనయెక్క భావము. తన్ను విడచివుండునా? కనుక బ్రహ్మము యొక్క ప్రకృతి బ్రహ్మమునందే యుండును. ప్రకృతి స్త్రీ వాచకములో నిర్దేశించుచూ దానిని పరాశక్తిగా అభివర్ణించినారు. అదే పరాప్రకృతి. పరాశక్తి లేక పరాప్రకృతి అనుటకు కారణము అదేశక్తియొక్క ప్రప్రథమ ఆవిర్భావము కనుకనే అన్నిటియొక్కయు అందరియొక్కయు ప్రకృతులకు అది ఆదిశక్తి లేక మూలమాయ. దాని యొక్క పరిణామములోనే అష్ట ప్రకృతులగు "భూమి రాపోఽనలో వాయుః ఖం మనోబుద్ధిరేవచ అహంకారం ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా" అని గీతాశ్లోకము" ఇతస్త్వన్యాంవిద్ధి మే పరాం........" అంటూ తర్వాత శ్లోకములో పరాప్రకృతిని అభివర్ణించినది. మే పరాం అనగా నాయెక్క పరాశక్తి, అని గీతలో భగవానుడంటున్నాడు. కనుక యీ త్రిగుణాత్మికమగు ప్రకృతి బ్రహ్మముయొక్క ప్రకృతి లేక స్వభావమగు శక్తి. ఈ శక్తి యాబ్రహ్మమునకంటె భిన్నమెట్లగును? కనుక బ్రహ్మమునందే త్రిగుణములున్ను యున్నవన్నమాట. కాని "సోఽకామయత, బహుస్యాం ప్రజాయేయ" నేను అనేకముగా నగుదునని, ఆతడు సంకల్పించెనని అర్థము. యిట్టి సృష్టికామనయే కలుగక పూర్వము యీ త్రిగుణములు ఆబ్రహ్మమునందు బీజరూపముగా సూక్ష్మాతిసూక్ష్మముగా నున్నవని చెప్పవలసివున్నది. కనుక అది కేవలము శుద్ధ నిర్గుణముగానున్న పరిపూర్ణముకాదని తెలియవలెను. కనుకనే ఆ వెనువెంటనే ఈ బ్రహ్మము గుణాత్మకం అయివున్నదని యీశ్లోకము లోనే చెప్పబడినది.

4) గుణాత్మనే:- గుణములు సూక్ష్మముగా గలిగియున్నట్టిది అని స్పష్టముగా చెప్పినారు. నిర్గుణ రూపముగానున్న వస్తువువలె తోచబడిననూ అందు గుణములు బీజావస్థలోనున్నవని గ్రహించవలెను. యీ గుణములు తనయందున్నందుననే అందుండి త్రిగుణాత్మికమగు జీవేశ్వర జగత్తునకు సృష్టికారణము కాగలిగినది. కనుకనే ఈ బ్రహ్మమునే సర్వశాస్త్రములు జగత్కారణముగా పేర్కొనియున్నవి. (ఈ విషయమును పూర్తిగా నెరుగగోరువారు పరిపూర్ణదర్శనములోని సృష్టి విజ్ఞాన ప్రకరణము చూడనగును) కనుకనే ఈ శ్లోకములో వెనువెంటనే సమస్త జగదాధారమూర్తయే అని వర్ణింపబడినది.

5) సమస్త జగదాధారమూర్తయే:- సమస్త జగత్తునకు ఆధారమైన మూర్తిమత్వముగలది అని అర్థము. సమస్తజగత్ అనగా దృశ్యాఽదృశ్యమగు సర్వసృష్టికి అని అర్థము. సృష్టి అంతయు మూడు భాగములుగా విభజించవచ్చును 1) ఈశ్వర, 2)జీవ,3) జగత్తులనునవే యీ మూడు విభాగములు ఇందు జీవేశ్వరులు అదృశ్యరూపమగు సృష్టి. అనగా కానరాని జగత్తునకు సంబంధించినవారు. 1) ఈశ్వరుడన్నపుడు= దేవతాసృష్టియంతయు ఆ శబ్దమునంది

మిడియున్నది. మరియు సర్వశక్తి సామర్థ్యములున్ను కూడ అందిమిడియున్నవి. ఈశ్వరుడు సర్వశక్తిమంతుడు గదా? ముప్పైమూడుకోట్ల దేవతలందరు యీశ్వర శబ్దమునందిమిడియే యున్నారు. 2) జీవ శబ్దమునందు స్థావర జంగమాత్మకమగు 84 లక్షల జీవోపాధులు అగు సర్వప్రాణులును చేరియున్నారు.3) జగత్ అన్నపుడు ఖగోళభూగోళములలో చేరిన పంచభూతాత్మికమగు సర్వప్రపంచము చేరియుండును. యీ బ్రహ్మమే సర్వసృష్టికి ఆధారము. అధిష్టానము మూలకారణమునైయున్నది. అట్లు జగత్తునంతటికి ఆధారముగానుండుట దీని వుపలక్షణములలో నొకటి. మరిన్ని సూక్ష్మాతి సూక్ష్మముగానున్న యీ బ్రహ్మమునకు సృష్టి కామనగల్గి స్థూలాతిస్థూలమగు బ్రహ్మాండపిండాండ రూపములుగా జగదాకారమగుచున్నది. అదియే విరాట్ స్వరూపము. కనుక జగత్తే బ్రహ్మము. బ్రహ్మమే జగత్తు. కనుక మూర్తిమత్వమును చెప్పవలసివచ్చినది.

6) బ్రహ్మణే: అనగా అన్నిటికంటె ఏది బృహత్ పదార్థమో అదే బ్రహ్మము లేక గొప్ప స్వరూపము(గురుస్వరూపము) కలదియే బ్రహ్మము, బృంహి= వృద్ధౌ అను ధాతువునుండి బ్రహ్మ శబ్దము ప్రవర్తించినది. "బ్రహ్మ బృంహణాత్ బృంహతి వర్ధతే" అని శబ్దకల్ప ద్రుమము నిర్వచించుచున్నది. ఏది వృద్ధిచెందునో లేక పెంపొందునో అట్టి వాస్తవిక తత్వమే బ్రహ్మ అని రాధాకృష్ణ పండితుడున్ను చెప్పినాడు. తన జ్ఞానావరణమును కొద్ది గొప్పలుగా అనంతముగా వ్యాపింపచేయు లక్షణము ప్రజ్ఞానబ్రహ్మమునకున్నది. కనుకనే "అణోరణీయాన్ మహతో మహీయాన్" అని అభివర్ణింపబడినది, ఇదే భూమాపదార్థము. అన్నిటికన్న పెద్దది. కనుకనే యిదే గురుస్వరూపము అనుటలో సందేహములేదు.

ఈ బ్రహ్మవస్తువు అచింత్యము, అవ్యక్తము, నిర్గుణము, జగత్తునకు మూలకారణ మూనైవున్నదనీ కాని అదే శుద్ధ చిత్తమునకు గోచరిస్తూ, జ్ఞాతవ్యమై త్రిగుణనిధానమై జగత్స్వరూపము గూడ అణుస్వరూపమూ విభుస్వరూపముగానూ ఏకానేకములు గూడ తానే అయి సర్వద్వంద్వ స్వరూపముగానూ ఏకానేకములుగానూ,తానై యున్నది. ఒక వంకమనో వాగగోచరమగు కేవల బ్రహ్మ లక్షణములూ ఒక వంకమాయా లక్షణములు అనగా వివేక చూడామణిలో చెప్పబడినట్లు, "సన్నాప్యసన్నా ప్యుభయాత్మికానో భిన్నాప్యభిన్నా ప్యుభయాత్మికానః సంగాన్యసంగా న్యుభయాత్మికానో మహాద్భుతాఽ నిర్వచనీయ రూపా" ఉభయాత్మికంగా నున్నది గనుక యిది మాయా బ్రహ్మమేగాని కేవల పరిపూర్ణ పరబ్రహ్మము కాదని తెలియనగును. వరములిచ్చినా శాపము లిచ్చినా మాయా బ్రహ్మకే తగును కనుక అభీష్ట సిద్ధికి ఆ మాయా స్వరూపమునకే యీ శ్లోకములో మంగళాచరణమున నమస్కారము చేయబడినది. యిట్టి పరమాత్మయే గురుస్వరూపము గూడనైయున్నది, అట్టి గురుస్వరూపమున కివే మా శతసహస్ర నమస్కారములు.

శ్లో॥ అయం మయాంజలిర్బద్ధో దయాసాగర సిద్ధయే।
యదనుగ్రహతో జంతుశ్చిత్ర సంసారముక్తిభాక్॥

తాత్పర్యము:- జీవు డెవని యనుగ్రహ విశేషమువలన ఆశ్చర్యకరమగు సంసారము నుండి విడుదల పొందగలుగుచున్నాడో అట్టి దయాసముద్రుడగు గురుదేవుని కృపాప్రసాద సిద్ధినిగోరి వారికిదే నా అంజలి ఘటించుచున్నాను.

విశేషవివరణము:- ఈ శ్లోకమునందలి 1) దయాసాగర 2) అనుగ్రహము 3) చిత్రసంసారము

అను విషయముల గూర్చి వివరణములు తెలుసుకొనవలసి వున్నది.

1. దయాసాగర:- స్వామీ! నీదయ మహాసముద్రము వంటిదని భక్తుడు కొనియాడు చున్నాడు. సముద్రమున కావలివడ్డు గానరాదు. అట్లే నీదయ అపారము. అంతేకాదు సముద్రమువలె మిక్కిలి లోతైనది. అట్లే నీదయగూడ మిక్కిలి అగాధమైనది. ఐతే ఇంతటితోనే సముద్రముతో పోలిక అంతమగుచున్నది. ఏలననగా 1) సముద్రము నోటబెట్టరాని క్షారోదకములతో నిండియున్నది. 2) పోటుపాటులతో గూడినది. 3) వుప్పెన లేచినచో పట్టణములను సహితము నేలమట్టము చేయునది. అపుడు లేచిన తన విషజ్వాలలవల్ల వృక్షాదులను సహితం మాడ్చివేయునది. 4) భయంకరవుత్తుంగతరంగపంక్తి చెలరేగు సముద్ర మధ్యమున పడిన వానికి మృత్యు వనివార్యము. ఎంతటి గజఈతగానికైన అందున ్తిమి. తిమింగలములు, మొసళ్ళు, సొరచేపలు మొదలగువానిచే మృత్యువు తప్పదు.

కాని గురుదేవుని దయాసముద్ర మందు కత్యంతమూ భిన్నమైనది. 1)గురుకృప అమృత స్వరూపము. కనుకనే "కృపా పీయూషసింధవే" అని గురునుూర్తి కీర్తింపబడుచున్నాడు. 2) గురుకృప సముద్రమునకువలె పాటూలేదు, పోటూలేదు.ఎల్లప్పుడు సర్వసంపూర్ణము. 3) గురుకృపావతరణము కలిగినచో ఆత్మయొక్కయు కేవలాత్మయొక్కయు (ఎరుక పరిపూర్ణముల) వస్తునిశ్చయ జ్ఞానము గలిగి భ్రాంతి రహితస్థితి చేకూరును. కనుకనే కృష్ణదేశికేంద్రులు "అపరోక్ష మౌను మనుజులకు పరోక్షంబైన బయలు గురుకృపకలుగా కీలిదేలేని యెరుక తా తోలుగా...అన్నారు 4) గురుకృప మృత్యుంజయ కారణముగదా! ఇక నాతనికి జనన మరణ భయభ్రాంతులులేమియు నుండజాలవు. 5) తిమి తిమింగలాది భయంకర జలచర సంకీర్ణమై సముద్రముండగా. గురుమూర్తి దయా సముద్రము శాంతమై సుప్రసన్నమై ఆనంద సాగరమై నలరారుచు శాంతి ప్రేమ దయా సత్య ధర్మముల కాలవాలమై యున్నది. ప్రహ్లాద కుమారునికి "సద్గుణంబులెల్ల సంఘుంబులై వచ్చి" అంతఃకరణ మందలము కొన్నట్లు గురుకృపాపాత్రుల అంతఃకరణము శుద్ధమై శాంతి ప్రేమ దయా సత్య ధర్మాది గుణముల కాలవాలము కాగలదు.

అన్యత్ర, సంసారముగూడ మహాఘోర వారాశిగా నభివర్ణింపబడినది. ఇచ్చట గురుదయ మహాసముద్రముతో పోల్చబడినది. రెండునూ పారములేనివి. అగాధములున్ను అగుట సత్యమే. ఐతే మొదటి పేరాలో వర్ణించిన సముద్ర వర్ణన, సంసారార్ణవమునకును, రెండవ పేరాలో చెప్పబడిన శుభసంపత్తి గురుకృపా పీయూష సింధువునకును చెప్పవలసియుండును. అంతేగాని రెండునూ సముద్రముతో పోల్చబడినవి. కనుక అమృత స్వరూపమగు గురుకృప. హాలాహలసన్నిభమగు సంసార సముద్రముతో సమానమేనని. విపరీత భావన చేయరాదు.

2. గ్రహము అను శబ్దమునకు గ్రహించుట, గైకొనుట, లేక స్వీకరించుట అర్థమైయున్నది. అను+గ్రహ=అనుగ్రహము అనగా తిరిగి స్వీకరించుట. గురుమూర్తి యోగ్యులగువారిని లేక అధికార సంపత్తిగలవారిని తొలుత శిష్యులుగా స్వీకరించును. అట్టి శిష్యమండలి నుండి తన శుశ్రూషల యందేమరక, తన ఆజ్ఞకు లోబడి వర్తించువారిని మాత్రమే యెన్నుకొనును. ఇదియే అను+గ్రహము తిరిగి స్వీకరించుట. ఇదియే గురుకృప.

ఈ గురుకృప ఏవిధముగా శిష్యునిపై ప్రసారమగును? తన వాక్కు, స్పర్శ, దృష్టి.

తలంపు అనువాని ద్వారా గురుమూర్తి శిష్యుని అనుగ్రహించును. ఇవి వుత్తరొత్రా ఒకదానికంటె యొకటి సూక్ష్మవిధానములై వున్నవి. ఈ మార్గములన్నిటికి శాస్త్రమునందు తగు దృష్టాంతము లీయబడియే యున్నవి. 1) భ్రమరము గ్రుడ్డుపెట్టి దాని చుట్టూ ఎడతెగక ఝుంకారముచేసి తన స్వరూప స్థితిని తన పిల్లకు ప్రసాదించినట్లు, గురుమూర్తి శిష్యునికి చెవి నిల్లు కట్టుకొని మరల మరల దృఢమగు వరకు బోధించి స్వస్వరూప సాక్షాత్కారము కలిగించును. ఇదే భ్రమరకీటక న్యాయము. ఏదో పచ్చపురుగును తెచ్చి దానిని పొడిచి చంపి దానికి ఝుంకార నాదముచే, తన రూపు నిచ్చునని చెప్పుట విజ్ఞాన శాస్త్రమునకు విరుద్ధము. చంపిన పచ్చపురుగుపై గ్రుడ్డుపెట్టి ఆగ్రుడ్డును తన నాదముచే వృద్ధి నొందించుననుట జీవశాస్త్ర నిర్ణయ పద్ధతియని తెలియవలెను.

2)స్పర్శ:- పక్షి గ్రుడ్డును పెట్టి రెక్కలచే గప్పి తన శరీరోష్ణమును దానికి సంక్రమింప చేయును. దానిని విహంగమ వృత్తి లేక పక్షిస్పర్శ యందురు. అట్లే గురుమూర్తి శిష్యునికి తన పాదస్పర్శ నిచ్చుటయేగాక శిష్యుని శిరోభాగమున తన శ్రీహస్త ముంచి తన శక్తిని శిష్యునియందు ప్రవేశపెట్టును.

3) దృష్టి:- చేప జలోపరిభాగమున గ్రుడ్లుపెట్టి అవి నీటిలొ తేలియాడుచుండగా వానివైపు నకే చూచుచూ వానిచుట్టూ ప్రదక్షిణము రూపముగా తిరుగుచుండును. ఆ చూపువల్లనే ఆ గ్రుడ్డునందలి జీవత్వము వృద్ధిచెంది చేపపిల్లలు బయల్వెడలును. దీనినే మత్స్యవృత్తి లేక చేపచూపు యందురు. అట్లే గురుమూర్తి తన కరుణామృతదృష్టి శిష్యునిపై సారించిన మాత్రముననే శిష్యునికి జ్ఞానాభివృద్ధియగును.

4) తలంపు:- తాబేలు యెచ్చటనో పిల్లలను పెట్టి, తన క్షుద్బాధానివృత్తికై యెందెందో తిరుగుచుండును. ఆకస్మికముగ దానికి తన పిల్లల స్మృతి కల్గును. ఆ వెంటనే ఆ పిల్లల కాకలి నివృత్తి యగును. దీనినే కూర్మవృత్తి. అట్లే గురుమూర్తి తన సంకల్ప బలముచే తన అంతఃకరణము నందు శిష్యుని అభివృద్ధి నాకాంక్షించినంత మాత్రమున శిష్యుడు సర్వసందేహ నివృత్తి గాంచగలడు.

5) చిత్రసంసారము:- భార్యాబిడ్డలు, అస్తిపాస్తులతో గూడినది సంసారముకాదనీ, జనన మరణములతో గూడినదే సంసారమని తెలియజేసియున్నాము. చిత్ర సంసార మనగా ఏదో తెలియవలసి వున్నది. అశ్రేష్ఠపదార్ధ అసారమనీ, శ్రేష్ఠపదార్థము సారమనీ చెప్పబడుతోంది. సంసారం అనగా సం+సారము= సంసారము అత్యంతసారభూతమైనదే సంసారం. సర్వసృష్టికి కారణమైన ఆత్మ (లేకయెరుక)యే సంసారము. కనుకనే కృష్ణదేశికేంద్రులు. "ఆగమ నిగమోపనిషత్సాగర మధితార్థము" అనగా అనంతములైన ఆగమములు, నిగమములు, వుపనిషత్తులు అన్నియు సాగరముగా చేసి మధించినచో తేలిన సారభూతమగు పదార్థము ఏది? నిగమ ప్రసిద్ధిగాంచిన ఆత్మయే (యెరుకయే) దానిని చిత్రసంసారమని వర్ణింపనేల ? వివేకచూడామణిలో

శ్లో॥ సన్నా ప్యసన్నా ప్యుభయాత్మి కానో, భిన్నా ప్యభిన్నా ప్యుభయాత్మికానో
సంగాన్యసంగాన్యుభయాత్మికానో, మహాద్భుతాఽ నిర్వచనీయరూపా॥

మాయ, సత్తు, అసత్తు, సదసత్తు-భిన్నము, అభిన్నము భిన్నాభిన్నము సావయవము, నిరవయవము, వుభయాత్మికము అన్నియు అయివుండి యిదమిద్ధమని నిర్ణయించరానిదై

మహాద్భుదమై యున్నదన్న మాటలు అక్షరాలా ఆత్మకున్ను వర్తించును. కనుక ఆత్మ (యెరుక) మహాద్భుతమైనది. కనుకనే భగవద్గీతలో సాక్షాత్తుగా

శ్లో॥ ఆశ్చర్యవత్పశ్యతికశ్చి దేవ
మాశ్చర్యపద్వదతి తథైవచాన్యః
ఆశ్చర్యవచ్చైన మన్యశ్శృణోతి
శ్రుత్వా ఽ ప్యేనం వేద నచైవ కశ్చిత్॥

ఈ ఆత్మను ఆశ్చర్యమైనదానిగా కొందరు చూతురు. కొందరు ఆత్మనుగూర్చి ఆశ్చర్యమైన దానిగా వాక్రుక్కుత్తురు. మరికొందరు దానినిగూర్చి ఆశ్చర్యముతో విందురు అని భావము. అనగా చూచుటకు, వినుటకు, వచించుటకుగూడ ఆత్మఆశ్చర్యమైనదిగా నున్నదని తెలియవలెను. "ఎన్నో విచిత్రాలు, యీ యెరుక చేతలు" అనిన్ని "వింతల పుట్టిల్లు" అనిన్నీ దాన్ని కృష్ణదేశికేంద్రులు అభివర్ణించినారు.

ఈ పరమాత్మయే (ఎరుకయే) చిత్రసంసారమని తేలినది. ఎందుకు దానిని పెద్దలంతా చిత్రమైనదిగా చెప్పినారు? యోచించవలసి వున్నది. 1. ఈ యెరుకకు మూలం లేదు. విత్తనములేని చెట్టువంటిది.

శ్లో॥ అబీజం వృక్షసంపన్నం శాఖా పల్లవ వర్జితం
పుష్పంనాస్తి ఫలంనాస్తికో వృక్షఃపండితోత్తమ॥

అనే ప్రశ్నకు పండితుడు, "పుట్టకొక్కు" (కుక్కగొడుగు) ఒక్కటే అటువంటి వృక్షమని సమాధానము చెప్పినాడు. అలంకారికంగా చూస్తే యెరుక కూడ అటువంటి విచిత్రవృక్షమే. ఇది బీజము లేని వృక్షమెట్లయినది? అంటే యెరుకకు మూలం యెరుకేగాని అన్యకారణములేదు. బీజ వృక్ష న్యాయమందు బీజమునందు వృక్షము వృక్షమునందు బీజముకానరాకున్ననూ సూక్ష్మముగా అణగిమణిగి ఉన్నవి. అట్లే యెరుక బీజముగానూ విశ్వంవృక్షంగానూ తోచబడుచు ఎరుకయందు విశ్వము, విశ్వమునందు యెరుక సూక్ష్మాతిసూక్ష రూపముగా నుంటూనే యున్నవి. కార్యమునంధు దాని కారణ వస్తువు కూడా సూక్ష్మముగా వుండనే వున్నది. "బ్రహ్మై వేదం విశ్వమిదం వరిష్ఠం" ఈ విశ్వమంతయు కారణరూపమైన బ్రహ్మమే. సృష్టికి పూర్వము యీ విశ్వమంతయు ఆ బ్రహ్మమునందు బీజరూపముగా నున్నది. అది యెట్లు ప్రకటనమైది? అదేవిచిత్రం. ఆ బ్రహ్మ నిర్గుణమనుకొన్నాము. కాని దాని గర్భమందు అనంతకోటి బ్రహ్మండ భాండములు దాగియున్నట్లు యెరుగకపోతిమి. ఇది మహా విచిత్రమే గదా! ఎంతటి గారడి యీ బ్రహ్మండసృష్టి!!!

2) "అసదేవ సో మ్యేదమగ్ర ఆసీత్! తతో వై సదజాయిత" అని కూడ చెప్పబడినది. అసత్తునుండి సత్తుగలుగుట ఎంత విచిత్రము! యిసుకలో లేని నూనె, యిసుకనుండే బైటకు వచ్చుట యెంత చిత్రము!!

3) "ఆకాశం గగనం శూన్యం" అని శ్రుతియు, ఆకాశము శూన్యంబని లోకులు మొరబెట్టి దానిలో పవనాదుల్ ప్రాకటముగల్గిన" వనుట చిత్రమే గదా?

4) "అన్నాత్పురుషః" అన్నము నుండి పురుషుడుత్పత్తి యగుటయు మహా చోద్యమే గదా! అందుకే కృష్ణదేశికేంద్రులవారు "పెనుమాయను చూడుము యిదె" అని స్థూలదేహమును చూపిస్తున్నారు. నోటి వెంట లోనికిపోయిన గడ్డిగాదము చివరకు బిడ్డరూపమున పశుగర్భము

నుండి వెలువడుచున్నది. అంతేగాదు. మానవుడైతే ఇంద్రియముల ద్వారా సర్వమును గుర్తెరిగి చంద్ర మండలానికి నిచ్చెన లేసే తెలివి యీ అన్నంలో యెట్లుత్పత్తి యైనదో? యిది మరీ చిత్రాతి చిత్రము గదా!

5) "ఊర్ధ్వమూల మధశ్శాఖా అశ్వత్థం ప్రాహురవ్యయం" అంటోంది గీత.

6) ఈ చిత్ర సంసారము (యెరుక)ను గూర్చి పెద్దలేమన్నారు? సర్వభ్రాంతులకు మూలము యీ మూలంలేని గుర్తెరిగే శరీరమేనన్నారు. "అన్నియు తానై, తన కవి పన్నుగ వేరనుచు నోట పలుకుచు మరి తానన్నిటి నెరిగే యెరుకై యున్నానని యెరుక కెరుకే నూహింపుచుండూ తనలో తానే మోహింపుచుండు. యెన్నో విచిత్రాలు యెరుక చేతలుకంటే, వున్నది లేదు, లేకున్నది కలదాని యూహింపుచుండూ తనలో తానే మోహింపుచుండూ" నన్నారు కృష్ణదేశికులు.

కనుక యెరుక కంటె చిత్రమే లోకమునాలేదు అనుట సిద్ధాంతము. కనుక దానిని చిత్రసంసారమని ఈ గురు గీతా శ్లోకము వచించుచున్నది. "ఉపాసకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా" అన్నట్లు రూపుదాల్చి వచ్చిన దయాసాగరుడైన ఆ సద్గురుమూర్తికి అంజలి ఘటించి, యీ చిత్రసంసారము నుండి (యెరుక నుండి) విడువడకోరి అహరహము భజించెదముగాక!

శ్లో॥ గూఢా విద్యా, జగన్మాయా, దేహశ్చాజ్ఞానసంభవః
విజ్ఞానం తత్ప్రసాదేన గురుశబ్దేన కథ్యతే॥

తాత్పర్యము : అవిద్య అతి రహస్యముగా నున్నది. జగత్తు మాయాస్వరూపమై యున్నది. దేహములు అజ్ఞానము వలన కలుగు చున్నవి. యెవరి కృపవలన నీకీ విజ్ఞానమంతయు తెలియబడుచున్నదో అతడే గురుశబ్దముచే చెప్పబడుచున్నాడు.

విశేష వివరణము : అవిద్య, మాయ, అజ్ఞానము, విజ్ఞానం అను వానియొక్క వివరణను విమర్శించి తెలుసుకొనవలసియున్నది.

1) అవిద్య : అనగా విద్యకానిది, విద్య అనగా తెలివి, లేక జ్ఞానము కనుక అట్టి తెలివిలేని అవిద్య మరుపు రూపమైనది. అఖండ చిద్ఘనరూపముగా నున్న సచ్చిదానంద పరబ్రహ్మము విద్యారూపము. దానియందే గూఢముగా, త్రిగుణాత్మికమై, దాని శక్తి అణగిమణిగి, బీజ రూపముగా నుండి, ఆ పరబ్రహ్మ సాన్నిధ్య బలముచే సృష్టికి హేతుభూతమైన వస్తువు, మూల ప్రకృతియనీ, అవ్యక్తమనీ, ప్రధానమనీ, అవిద్యయనీ నానా నామములు వహించియున్నది. అదియే యీ శ్లోకమున గూఢావిద్యయని అభివర్ణింపబడినది. ఐనను దీనికి యెంత మాత్రము స్వతంత్ర సత్తా లేదు.

2) జగన్మాయా అనగా జగత్తు మాయాస్వరూపముగా లేక మిథ్యాస్వరూపముగా చెప్పబడినది.

"యా, మా, సా మాయ" అని మాయ కొక నిర్వచనము. అనగా ఏది లేనిదో అది మాయ అని అర్థము. సృష్టికి పూర్వము ఎట్టి నామరూపములు లేవు. కాని సృష్ట్యనంతరము అనేక నామరూపాలు తోచుచున్నవి. అంటే నామరూపములకు పారమార్థిక సత్యత్వము లేదు. వ్యవహారికంగా సత్యత్వస్ఫూర్తియున్ననూ పరమాత్మయందలి తోచబడక లేనేలేవన్నట్లుగా గోచరించుచున్నందువల్ల వానికి పారమార్థిక సత్తా లేదని అన్నారు. మిథ్య అనగా అంతే అర్థము గాని అవి కేవలము అలీక పదార్థములు అనగా అసలే లేనివికావు. ఏలననగా జగత్తు మాయా

పరిణామమని చెప్పబడినది. ఏది పరిణమించినదో, అది కేవలం లేనిదే అగుచో లేనిది పరిణమించి నది అనవలసియే వుంటుంది. పాలు లేనిచో పెరుగు కాగలదా? ఇట్లనుట అసంగతము గదా! మరిన్ని మాయకు స్థానము లేక ఆశ్రయము, సత్యమని చెప్పబడే పరమాత్మయే అయివున్నది. లేనిదానికి ఆశ్రయము, ఆధారము, అధిష్ఠానము నిర్ణయించుట ఏమి? అంటే రజ్జు సర్పమునకు రజ్జువు ఆధారము అధిష్ఠానముగా వుండలేదా? అని దృష్టాంతము చెప్పవచ్చును. కాని ఆ రజ్జుసర్పము పులిగా, సింహముగా, మేకగా ఏమైన పరిణమించినదా? మాయ నానా రూపములుగా పరిణమించి నదే! కనుక మాయ కేవలము అళీక పదార్థము కాదు. అంతే కాదు, మాయ పరబ్రహ్మ శక్తిగా చెప్పబడుచున్నది. మాయ లేనిదే అంటే, సర్వశక్తిమంతుడనే పరమేశ్వరునికి , శక్తియే లేదు అని అనవలసియుండును.

ఐతే, యిక మాయ అనే శబ్దానికి యేమి అర్థము చెప్పవలె? బంగారముచే చేయబడిన నగలయొక్క నామరూపాలు మిధ్యంటే అనవచ్చును గాని బంగారమే మిధ్యకాదు. అట్లే ఏ వస్తువునకు నామరూపాలు ఏర్పడినవో ఆ వస్తువు మిధ్యకాదు. మరి, మాయకు మరొక నిర్వచన మున్నదా? ఆహా! వున్నది. "మీయతే అనేన యితి మాయ" అనగా మాయ లేక ప్రకృతి పరిణామము చెంది జగద్రూపము వహించినపుడు, ఆ జగత్తుయందలి సర్వపదార్థములు, అణుప్రమాణము, మధ్యప్రమాణములేక మహత్ ప్రమాణము చెందుచున్నవి. ఇందే ప్రమాణములోనున్నా అదీ ఒక మితిలోనిదే. సృష్టికి పూర్వము మాయకే ప్రమాణమూ లేదు. కాని సృష్టి అనంతరము ఆ మాయయే. మితిగలిగిన అనేక రూపములు వహించుచున్నది. అమితము అని చెప్పబడే బ్రహ్మపదార్థమును మితిగలిగిన జగద్రూపములోనికి తెచ్చుచున్నది. "సర్వం ఖల్విదం బ్రహ్మ" "బ్రహ్మణోన్యం న కించన" అనగా బ్రహ్మకన్యమైనది యేమీలేదు. కనుక వస్తుతః జగత్తుకూడా బ్రహ్మస్వరూపమే. ఐతే ఆ బ్రహ్మ శక్తియగు మాయ బ్రహ్మమును ఒక ఆవరణ లోనికి దెచ్చి చూపుచున్నది.

కనుక మాయ అనగా యేమి తేలినది? సృష్టికి పూర్వము ఏది త్రిగుణాత్మికమై పరబ్రహ్మము నందు బీజరూపము వహించి యుండెనో అదే మాయ. ఆ మాయయే వికాసము చెంది, తన శక్తిచే, ఆ బ్రహ్మమును జీవేశ్వర జగత్తుగా ప్రదర్శించుచున్నది అనియే చెప్పవలసియుండును. కనుక జగన్మాయా అని యీ శ్లోకములో చెప్పబడినది.

3) అజ్ఞానము : అనగా జ్ఞానము లేకపోవుటయే అజ్ఞానమని కొందరంటున్నారు. కాని అజ్ఞానము అట్టి అభావరూప పదార్థము కాదనీ, అభావ పదార్థమే యగుచో దాని వల్ల యెవరికీ యెట్టి బాధా కలుగకూడదనీ, మరికొందరంటున్నారు. లేని రజ్జు సర్పము భయహేతువై బాధపెట్టుట లేదా? అని మొదటి వారు ప్రశ్నిస్తున్నారు. ఈ రెండు భావములకు పరిష్కారమేమి? యించుక విచారింతము.

గాఢాంధకారములో కన్నుమిన్ను కానరానపుడు చీకట్లోపడియున్న త్రాడువల్ల యెవరికి యే బాధాలేదు. అపుడు అజ్ఞానము బాధించలేదు. కాని మధాంధకారములో (అస్పష్టకాంతి యున్నపుడు) ఆ త్రాడునే చూచి అది నాగుబాము అని భయము కలిగినది. కనుక చీకటి దట్టముగా వుంటే బాధ లేదు కాని మందముగా వుంటేనే బాధ కలుగుచున్నది. అట్లే అజ్ఞానము నకున్న ఆవరణశక్తిచే యే బాధాలేదు. కాని ఆ అజ్ఞానమునకే విక్షేపమను మరియొక శక్తియున్నది. ఆవరణ శక్తి నిజరూపమును తోచనీయక మరొక రూపము దోపింపచేయును. అదే భయభ్రాంతు

లకు కారణమగుచున్నది. వస్తువు సంగతి ఏమీ తెలియకపోయినా బాధలేదు. లేక వున్నదున్నట్లుగా తెలిసినా బాధ లేదు. తెలిసీ తెలియని లక్షణమే బాధకారి. రెండూ అజ్ఞానలక్షణములే. ఒకటి తమోగుణ సంబంధము. వున్నదున్నట్లుగా తెలిపేది సత్వ గుణాంశము. కనుక ఒకే వస్తువు నందుండే సత్వగుణ లక్షణముచే "సత్వా త్సంజాయతే జ్ఞానం" జ్ఞానమున్ను రజస్తమోగుణాంశము లచే ఆవరణ విక్షేపశక్తులుగల అజ్ఞానమున్ను బహిర్గతములైనవి. జీవజగత్తులు ప్రకృతియందలి రజస్తమో గుణాం శములచేతనే సృష్టి ఆయెను గదా!

జ్ఞానాజ్ఞానములను ఐశ్వర్య దారిద్ర్యములో బోల్చవచ్చును. ఐశ్వర్యములేదు అంటే తనకు సరిపడిన దానికంటె ఎక్కువగా, సంపదలు లేవన్నమాట. దానిని దారిద్ర్యమనరాదు. దారిద్ర్యమంటే కావలసిన ముఖ్యావసరములుకూడా తేలేనిస్థితి. అట్లే జ్ఞానము లేక పోవుటే అజ్ఞానమని అనరాదు. దుఃఖహేతువైన లేమిరికమునే దారిద్ర్యము అన్న మాదిరిగానే దుఃఖహేతువైన జ్ఞాన దారిద్ర్యమునే అజ్ఞాన మనవలసియున్నది.

ఈ శ్లోకములో దుఃఖహేతువైన అజ్ఞాన విషయమే. (విక్షేప శక్తిరూపమగు అజ్ఞానము) చెప్పబడినది. యిట్టి అజ్ఞానమే దేహోత్పత్తి కారణమైనది. యెట్లనగా ఆదిలో కేవలం పరమాత్మ స్వరూపముగానున్న తాను తనయందేయున్న తమోగుణంయొక్క ఆవరణ దోషంచే తన స్వరూపము ను మరిచినాడు. అంతటితో ఆగలేదు. రజోగుణ సంబంధమగు విక్షేపశక్తి ప్రభావముచే తన ఆవరణమును చూచుకొని అదియే తానని అనుకొన్నాడు. ఈ దేహతాదాత్మ్యమే తన బంధకారణమై పోయెను. ఈ శ్లోకములో "దేహశ్చాஉ జ్ఞాన సంభవః" అనగా దేహములు (అవరణములు) అజ్ఞానముచే కలిగినవన్నారు, "అజ్ఞానేనా వృతం జ్ఞానం" అని గీత చెప్పుచున్నది. అజ్ఞాన కార్యమగు దేహము జ్ఞానరూపమగు తన నిజరూపమును గప్పివైచినదని అర్థము. ఇట్టి దేహమునేననుకొనుటే జన్మ పరంపరలకు కారణమగుచున్నది. ఎట్లనగా ఆదేహమేనేననుకొని ఆ దేహ సుఖమునకు తోడ్పడు ధన కనక వస్తు వాహనాదులయందు పుత్రమిత్ర కళత్రాదుల యందు మమకారము పెంచుకొని పాప పుణ్య కర్మలోనర్చి ఆగామి కర్మను ప్రోగుచేసుకొనుచు భావి జన్మలకు పునాదులు వేసుకొనుచున్నాడు. అట్లే మన పూర్వ జన్మమునందలి దేహతాదాత్మ్యమే వర్తమాన దేహమునకు కారణమైనది. యీ విధముగా పూర్వపూర్వ వుపాధులయందలి యజ్ఞానము వుత్తరోత్తర దేహోత్పత్తికి కారణమగుచున్నది. స్వస్వరూప విస్మృతియు, తదనంతర దేహతాదాత్మ్యమున్ను రెండునూ అజ్ఞాన కార్యము కనుక "దేహశ్చాஉ జ్ఞాన సంభవః" అని ఈ శ్లోకము చెప్పినది.

4) విజ్ఞానము : అజ్ఞానమునకు ప్రతియోగీ జ్ఞానము. విద్యాஉ విద్యలు, మాయా బ్రహ్మలు, జ్ఞానాజ్ఞానములు మొదలగు సర్వద్వంద్వములకు మూలకారణమైనది. సృష్టికి పూర్వమున్న బ్రహ్మమే అని తెలియుట జ్ఞానము. అట్టి బ్రహ్మముయొక్క స్థాన స్వరూపములు వస్తు నిశ్చయరూపముగా గురుముఖతః గుర్తెరిగి అనుభవములో సరిపుచ్చుకొని ఆత్మ దృష్టితో వర్తించగలిగినపుడే అది విజ్ఞానము కాగలదు. అట్టి విజ్ఞానము కాగలిగినపుడే సృష్టి కారణమగు బ్రహ్మమున కన్యంగా సర్వాతీతమై మనోవాక్కుల కందని పరిపూర్ణ పరబ్రహ్మమున్నట్లే గోచరించ గలదు. అట్టి విజ్ఞానసంపత్తి గల్గించు గురుమూర్తికివే మా ప్రణామములు.

శ్లో॥ జపస్తపో వ్రతం తీర్థం యజ్ఞోదానం, తథైవచ
గురుతత్వ మవిజ్ఞాయ సర్వం వ్యర్థం భవేత్ప్రియే

తాత్పర్యము : గురుతత్వము తెలియకచేయు జపము. తపము, వ్రతము. తీర్థస్నానాదికములు. యజ్ఞము, దానము మొదలగునవి యన్నియును వ్యర్థములేయగుచున్నవి.

విశేష వివరణములు : 1) గురుతత్వము 2) అవిజ్ఞాయ 3) జప, తప, వ్రత, తీర్థ, యజ్ఞా. దానాదులు 4) వ్యర్థము.

1) గురుతత్వము : అనగా గొప్పతత్వము, లఘు అనగా చిన్నది. పిండాండమునందు 25 తత్వములుగానూ, బ్రహ్మాండమందు 25 తత్వములుగానూ, లేక 36 తత్వములుగానూ లేక 96 తత్వములుగానూ తత్వ విభజన గావింపబడినది. అన్ని తత్వములకు మూలమై లేక స్థానమై ఆయా తత్వముల కన్నిటికి అధిష్ఠానమైయున్న పరమాత్మ వస్తువే గురుతత్వము పరతత్వమని పరబ్రహ్మమని భూమి అని అదియే కీర్తింపబడుచున్నది. అది సర్వతత్వముల సమిష్టి తత్వము. భూమ అనగా గొప్ప వస్తువు. శ్రుతిః "యత్ర నాన్యత్ పశ్యతి, నాన్య, చ్ఛృణోతి. నాన్యత్, విజానాతి సభూమా" అనగా ఎక్కడ అన్యమేమియు గనరాక, వినరాక, తెలియబడక ఏకైక వస్తువుగా నున్నదో అదియే భూమ యనబడును అదియే సృష్టికి పూర్వమున్న "ఏక మేవాఽ ద్వితీయం బ్రహ్మ" అని కొనియాడబడింది తత్వ విచారణ అన్నపుడు యీ పరమతత్వ విచారణ ముఖ్యమైయున్నది. ఈ ఏకైక తత్వమే అనేక తత్వములుగా మారి మరల ఏకత్వము చెందేది. "అణోరణీయాన్ మహతో మహీయాన్" అని చెప్పబడినది. అణువుగా వుండేది విభువుగా నుండేది" ఇదే గురుతత్వముగాని, పరిపూర్ణ పరబ్రహ్మము గురుతత్వము గాదు. ఏలనన ఆ పరిపూర్ణ పరబ్రహ్మము ఏకానేకములు గానిది. గొప్ప కురుచలు గానిది. అది గురుస్వరూపముగాదు. లఘు స్వరూపమూ గాదు. తత్పదార్థమూగాదూ? త్వం పదార్థముగాదు. తత్వమే కాదు. అఖండ యెరుక స్వరూపము మాత్రమే గురుతత్వము. "ఏక విజ్ఞానేన సర్వ విజ్ఞానం భవతి" దీన్ని తెలిసిన సర్వము తెలిసినట్లే, ఇది తెలియనిచో ఏదీ తెలియనట్లే.

2. అవిజ్ఞాయ : అనగా తెలుసుకొనకపోయినచో అని అర్థము. అయితే గురుతత్వము తెలియదగినదే నని స్పష్టపడుచున్నది. దేని చేత? అని ప్రశ్నించుకొంటే, జ్ఞానేంద్రియములగు శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వా ఘ్రాణములచే మాత్రము కాదు అంతరేంద్రియములచే తెలుసుకొనమని శ్రుతిస్మృతులు చెప్పు చున్నవి. "మనసై వానుద్రష్టవ్యం మనసైవాను శ్రోతవ్యం" అనిన్ని, "ఆత్మా వా ఽ రే ద్రష్టవ్యః" అనిన్ని ఆత్మ తెలుసుకొనదగినదనిన్ని శ్రుతుల తాత్పర్యము. మనస్సును, జ్ఞానేంద్రియ విషయము లగు శబ్దస్పర్శరూపరసగంధ విషయముల నుండి వేరుచేసి ఏకాగ్రము చేసినచో మనస్సు బ్రహ్మాకారవృత్తి బూనును అనగా, అపుడు మనస్సే బ్రహ్మాకారం పొందగలదు. దేనియందు లగ్నమైతే తద్రూపము చెందగల స్థితి మనస్సునకు గలదు కనుక "మనోహి జతువత్" అనగా కరగిన లక్కవంటిదని మనస్సభివర్ణింపబడినది. నిర్విషయమై బ్రహ్మాకారమగు ఆ మనస్సు అపుడు తన నామరూపాలను గోల్పోయి, తన నిజరూపమగు జ్ఞానస్థితిలో నుండును. జ్ఞానమునకు తన స్వరూపము సహా సర్వమును గుర్తించు శక్తిగలదు. కనుకనే జ్ఞానమునకు "ఎరుగుట" అనేది అధిభౌతిక క్రియగా చెప్పబడినది. జ్ఞానజ్ఞేయములు రెండూ (అనగా ఎరిగేది ఎరుగబడేది) యెరుకేగదా కనుకనే ఏరుగబడే గురుతత్వము విజ్ఞేయ బ్రహ్మమేగాని అవిజ్ఞేయమగు పరిపూర్ణము కాదు. ఈ విజ్ఞేయ బ్రహ్మము సూక్ష్మాతి సూక్ష్మ మహాసూక్ష్మమై యున్నదనియు దానినుండి క్రమశః స్థూలాతి స్థూలమైన యీ విశ్వ మావిర్భవించెననియు సృష్టముగా తెలియుచున్నది. స్థూల పదార్థములను తేలికగా గుర్తించగలము. కాని సూక్ష్మమగు

వస్తువును దానితో సమానమగు సూక్ష్మవస్తువు వలన మాత్రమే గుర్తింపగలము. మరిన్ని తెలియబడు దానియందు తెలుసుకొనే దాని లక్షణమున్నపుడే తెలియుట అనేది జరుగును. ఉదా: రూపమున్న వస్తువును మాత్రమే నేత్రము గుర్తించినట్లు. కనుకనే 25 యింద్రియములలో అత్యంత సూక్ష్మమగు జ్ఞానము లేక నిరింద్రియమగు (నిర్విషయక మగు) మనస్సుచే మాత్రమే గురుతత్వమును గుర్తింపగలమని చెప్పక తప్పదు. "వజ్రం వజ్రేణభిద్యతే" అనే న్యాయముగా కఠినాతి కఠినమగు వజ్రమును ఖండించుటకు మరొక వజ్రమే కావలసియున్నది. కనుక అఖండ జ్ఞానస్వరూపమగు పరమాత్మను (లేక గురుతత్వమును) కేవలము సూక్ష్మమగు మన జ్ఞానమను యింద్రియము చేతనే గుర్తింపగలమని తెలియవలెను కనుకనే "ఏషు భూతేషు సర్వేషు గూఢాత్మనః ప్రకాశతే దృశ్యతే త్వ్యగ్ర్యయాబుధ్యా సూక్ష్యయా సూక్ష్మదర్శిభిః" అనగా యీ విజ్ఞేయ బ్రహ్మమగు గురుతత్వము సర్వభూతములయందు సూక్ష్మముగా నిండియున్నప్పటికి ఏ యితరేంద్రియములకు తెలియబడుటలేదు గాని. సూక్ష్మదర్శులుగానున్నవారు ఏకాగ్రమగు బుద్ధీంద్రియముచే దానిని చూడగలుగుచున్నారు అని చెప్పబడినది. జ్ఞానము అన్నా మనస్సు అన్నా, బుద్ధియన్నా, అన్నీ అంతఃకరణకు మారురూపాలే. ఎంత గూఢముగానున్ననూ సద్గురువు సచ్ఛిష్యునికి ఆ గురుతత్వమును సాక్షాత్కరింపచేయగలడు. చెప్పి చూపించగలడు. "మీరు దేవుని చూచినారా ? నాకు చూపించగలరా?" అని అడిగిన వివేకానందునికి శ్రీరామకృష్ణ పరమహంస "నిన్నెంత ప్రత్యక్షముగా చూస్తున్నానో అంత స్పష్టంగానూ దేవుని నేను చూడగలుగుచున్నాను. నీకు చూపించనూగలను" అని సమాధాన మిచ్చి స్వరూప సాక్షాత్కారము కల్గించెనుగదా! "పరిపూర్ణ మిదిగో యిదిగో యెరెకని చూపించి లేని యెరుకను లేదని యెరిగించిన గురుడే సరి..." అని కందార్థములలోనూ "సదమల గురువెవరనినను, యిదిగో బయ లిదిగో లేని ఈ గుర్తెరిగేటి శరీరము... అని నీకు చెప్పవచ్చినవారే" అని కంద పద్యాలలోనూ ఉద్ఘాటించు చున్నారు. పరమాత్మ యన్నా, యెరుక యనినా గుర్తెరిగేటిదగు శరీరమన్నా గురుతత్వమన్నా యొకటేనని గుర్తించ వలయును. యెరుకనే సాక్షాత్కరిపంచేయని పరిపూర్ణ గురువు వలన ప్రయోజనమేమి? శిష్యులవలన సత్కార మాన పూజలందుకొంటూ ధనార్జన చేయుటకేనా? కనుక పరిపూర్ణ రాజయోగ మార్గమందు సద్గురువు యీ విజ్ఞేయ బ్రహ్మమును సచ్ఛిష్యునికి జ్ఞానగమ్య మొనరించగలడు.గురుతత్వము గురుముఖతః తెలుసుకొనే వారికే బహుసులభ సాధ్యము. యితరులకు బహుకష్టము. "గురోర్ముఖేన జ్ఞాతవ్యంనాన్యథా గ్రంథకోటిభిః" అని గుర్తెరుగవలెను. గురుతత్వమును తెలుసుకొనక ఏ సాధనలు జేసినా అవి వ్యర్థములగుచున్నవని యీ శ్లోకము చెప్పుచున్నది.

3) జపస్తపోవ్రత తీర్థ యజ్ఞ దానాదికములవంటి సాధనాలు అని యీశ్లోకము పేర్కొనుచున్నది.

ఎ) జపమనగా, ఏ మంత్రమైనను పదేపదే స్మరించుటయే జపమని సామాన్యార్థము. జపము మూడు విధములు.

1) వాచికము = వైఖరీ వాక్కుచే శబ్దమే పైకి వినబడులాగున పలుకుట

2) ఉపాంశువు = పైకి వినబడకుండా, పెదవులు, నాలుక కంఠనాళములు మెదలగువాని చలన మాత్రముతో చేయుట.

3) మానసికము= స్థూలశరీరమునందు యెట్టి చలనము లేకుండగనే కేవల మొక్క

మనస్సుచే మాత్రమే చేయుట. ఈ మూడింటిలోనూ మానసిక జపము మిక్కిలి శ్రేష్ఠము. ఏలననగా వుపాసన కాంక్షకు లక్ష్యమగు ఏకాగ్రతను యీ మానసిక జపము తొందరగా చేకూర్చును. అయినను యీ త్రివిధరూపములగు జపము మాత్రమే జపము కాదు. "తజ్జపస్తదర్థభావనం" అని సూత్రము. అర్థభావన వుంటేనే అది జపమని యనదగునని సూచింపబడుచున్నది. అర్థభావనయనగా మంత్రం యొక్క శబ్దార్థము మాత్రమేగాదు అర్థమనగా వస్తువు. మంత్రముచే ఏ మంత్రాధిష్ఠాన దేవత లేక తత్త్వము వుద్దేశింపబడినదో ఆ మంత్రాధిష్ఠాన దేవతారూపము లేక తత్త్వమును తెలుసుకొని చేసినపుడే ఆజపముయొక్క పూర్ణఫలము సిద్ధించునని తెలియవలెను. కనుక ఆత్మతత్త్వము లేక గురుతత్త్వ మును గురుముఖతః తెలుసుకొని గురు మంత్రోపాసన చేసిననాడే కృతార్థుడు కాగలడు.

4) తపస్సు. వ్రతము. యజ్ఞ. దానాది క్రియలను గూర్చి అన్యత్రా గురుస్తోత్రములో కొంత వివరించబడ్డెను. మానసిక జపమెట్లు శ్రేష్ఠతమో? అట్లే తపస్సులలో మానసిక తపస్సు శ్రేష్ఠతమమగునని చెప్పబడును. ఏలననగా మనస్సు పరిశుద్ధముచేసి శుద్ధాంతఃకరణ గలిగియున్నవాడు కాయిక వాచిక కర్మలు కూడా పరిశుద్ధముగానే వుండును. ఏలననగా మనస్సెరుగకుండా ఎవరున్నూ ఏ కర్మయున్ను చేయరు గదా! కనుక అంతఃకరణ శుద్ధి మానసిక తపస్సు ద్వారా సాధించిన వానికి శుద్ధవాక్కు శుద్ధమగు సత్ప్రవర్తన సహజ ప్రవృద్ధి గాంచును.

సి) వ్రతము : అనగా నియమ నిష్ఠలతో నిర్మిత విధానములో లోపము చేయకుండా చేయబడు దేవతారాధన. "నియమమునను నుండనిల్చును చిత్తంబు" అన్న రీతిగా నియమ పాలనము యిందు ముఖ్యము.

డి) తీర్థము : "తీర్థాని తోయ రూపాణి దేవాః మృణ్మయ సంభవాః" అనగా సకల తీర్థములు జలరూపములున్ను సర్వదేవతామూర్తులున్ను మట్టి యొక్క మార్పులే అనుభావనతో చేయు తీర్థ స్నానములు దేవతారాధనలు నిజంగా వ్యర్థములే. ఐనను దైవము. తీర్థము. ద్విజులు. మంత్రము. వైద్యుడు. గురువు మొదలగువారియందు విశ్వాసము లక్ష్యము లేనిచో అవి నిరుప యోగములే కాగలవు అని చెప్పబడుచున్నది. ఎట్టి లక్ష్యముండవలెను? అట్టి లక్ష్యసిద్ధి యెట్లు చేకూరును? సర్వమునందు ఆత్మ దృష్టిగలవాని కొక్కనికే అట్టి లక్ష్యము చేకూరగలదు. తనయందు నిఖిలభూతములయందు ప్రహ్లాదునివలె ఆత్మదర్శనముచేసిన వానికే సగుణమునందు పూర్ణ లక్ష్యము విశ్వాసము కుదరగలదు. గురుతత్త్వము తెలిసికొన్న వారికి విశ్వమంతయునూ ఆరాధ్య దైవమే యగును. తీర్థస్నానము బాహ్య పరిశుద్ధికి ఆరోగ్యమునకు ముఖ్యముగా విధింపబడినది. అంతశ్శౌచము ప్రధానముగాని బాహ్యశౌచము వల్ల పారమార్థిక ప్రయోజనము అంతగా లేదు. సరియగు దృఢ భావనయున్నచో బాహ్యాంతర శౌచములు రెండున్నూ తీర్థస్నానముచే సిద్ధించును.

శ్లో॥ ఉత్తమం తత్త్వ చింతాచ, మధ్యమం మంత్ర చింతనం
అధమం శాస్త్ర చింతాచ, తీర్థాటన మధమాధమం

అని చెప్పబడినది గదా యని కొందరు గురుపుత్రులు తీర్థస్నానమును నిందించుట దూష్యము. తాము గురుపాద తీర్థమును శిరమున ధరించుటలేదా? పృథ్వీ భూతసంబంధమైన గురుపాదుకలను ఛాయాచిత్రములను అర్చించుట లేదా? అట్లు చేయునపుడు మేము గురుపరమాత్మనే లక్ష్య మందుంచుకొన్నాము. యీ భౌతిక పదార్థములను కాదు అని

గురుపుత్రులన్నట్లే. తీర్థస్నానములందు అట్టి దృఢవిశ్వాసముతోనే మేమున్నూ జరుపుచున్నాము అని వారున్నూ అనగలరు. అట్టి దృఢ భావన లేనిచో వుభయుల సాధనము వ్యర్థమే. కనుకనే గురుతత్వమవిజ్ఞాయ సర్వం వ్యర్థం భవేత్ ప్రియే అంటోంది. యీ శ్లోకం

(ఇ) యజ్ఞదానముల యందు సాత్విక త్యాగబుద్ధియుండవలెనని గత గురుస్తోత్రములో వివరించినాము. శ్రుతి : "ఈశావాస్యమిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్ తేనత్యక్తేన భుంజీథావగృధః కస్యస్విద్ధనం" అని అనగా యీ విశ్వమంతయు బ్రహ్మమయము కనుక దేనియందునూ నాది అనే మమకార ముంచకనే అనుభవించుము. నేననే అహంకారము లేకుండా యితరులకు త్యాగము (దానము) చేయుము అని భావార్థము. గురుతత్వమును తెలియనివానికి ఇది సాధ్యముకాదని వేరే చెప్పనక్కరలేదు.

(4) సర్వం వ్యర్థం : గురుతత్వము తెలుసుకొనక ఏ సాధనలు చేసినా అవి యన్నియు వ్యర్థము అనగా నిష్ప్రయోజనమని అర్థము. వ్యర్థమనగా కేవలం వృథా అని అర్థముకాదు. పరమ పురుషార్థమగు మోక్షము సాధించుటపట్ల మాత్రమే వ్యర్థము అని తెలియదగును. ఏలననగా ఏ ఫలములేని కర్మ ఏదీ యుండజాలదు. దృష్టఫలమో? లేక అదృష్ట ఫలమో, యిప్పుడో మరొకప్పుడో కలిగియే తీరును కనుక భౌతికముగనో పారమార్థికముగనో, కొద్దియోగొప్పయో సత్ఫలితమో దుష్ఫలితమో చేకూరును. కనుక జనన మరణ భ్రాంతి రహితరూప మోక్షఫలమును ఆశించువారికి మాత్రం గురుతత్వమును వస్తునిశ్చయ పూర్వకముగా తెలుసుకొనుట అత్యంతావశ్యకము "అవిజ్ఞాతే పరేతత్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా?" అనగా పరతత్వమును తెలుసుకొనకున్నచో శాస్త్రజ్ఞానముకూడా నిష్ప్రయోజనమే అని చెప్పబడినది. ఆ గురుతత్వమే ఆత్మ తత్వము, స్వస్వరూపము, అనగా తన నిజరూపము. తానెవరో తెలియకనే తనకన్యమైనదానిని యెట్లు గ్రహించగలరు? తన నిజరూపమునే యెరుగనివాడు గురువై యితరులకు బోధింపజూచుట కడుంగడు సాహసము. "తన్ను తానెరుగడు.తానెవ్వనికి చెప్పు పాలుమాలిన యట్టి పశువు కొడుకు" అని వేమన అట్టి గురువులను చాలా తీవ్రంగా విమర్శించినాడు.

ఈ శ్లోకార్థమునే గురుగీత అన్యత్రా మరొక శ్లోకములో యీ క్రింది విధముగా నుద్ఘాటించుచున్నది.

శ్లో॥ స్వరూప జ్ఞాన శూన్యేన కృతమప్యకృతం భవేత్
తపో జాపాదికం దేవి సకలం బాలజల్పవత్॥

తాత్పర్యము : ఓ పార్వతీ! స్వరూప జ్ఞానము (గురుతత్వ జ్ఞానము) లేకుండా చేయబడిన జపతపాదులన్నియు చేసినా చేయనట్లే అగుచున్నవి. పసిబిడ్డ పలుకులకు విలువగాని కర్మఫలముగాని యుండనట్లే యని చెప్పబడినది. ఉదాహరణకు చిన్న పిల్లలు బొమ్మల పెండ్లి చేసి వాని నాశీర్వదిస్తే వానికి సంతాన ప్రాప్తియగునా? కాదు లేక కర్రముక్కనో రాతి ముక్కనో వారు పీటపై నుండి పాటలు పాడి పసుపు కుంకుమలతో పూజలుచేస్తే అవి వరములిచ్చు—? ఈయవు కారణమేమి? వారి అంతఃకరణములయందు యెట్టి భావనా బలంగాని శక్తి... లేదు. అదేవిధంగా గురుతత్వము తెలియనివారి కెట్టి భావనా బలమున్నా సిద్ధియూ గలుగజాలదు.

వస్తు నిశ్చయపూర్వకముగా గురుతత్వమును శిష్యులకు సాక్షాత్కరింపజేసి తదనంతరం

పరిపూర్ణ బోధ ప్రసాదించి కృతార్థులను చేయు మా సద్గురుదేవుల సగుణ నిర్గుణ రూపముల కివే మా నమస్సులు.

శ్లో॥ గురువక్త్రే స్థితం బ్రహ్మ ప్రాప్యతే తత్ప్రసాదతః
గురుధ్యానంతథా కుర్యాత్ పురుషం స్వైరిణీయధా॥

తాత్పర్యము : పరబ్రహ్మము గురువాక్యము చేత తెలియబడుచున్నది. కనుక గురువుయొక్క కృపావిశేషముచేతనే పొందదగియున్నది. పరపురుషానురక్తి గల స్త్రీ ఆ పరపురుషుని యేవిధంగా ఏకాగ్రమనస్సుతో చింతించుచుండునో, అట్లే పరబ్రహ్మమును పొందవలెననే ఆశయమున్న భక్తుడు గురుమూర్తిని క్షణమైననూ విడువక ధ్యానము చేయుచుండవలెను.

విశేష వివరణము : వక్త్రమనగా ముఖము లేక నోరు. ఉపదేశ ప్రభోధములు రెండునూ గూడ గురువాక్యమువల్లనే పొందబడును. గురుప్రబోధచేతనే స్వరూప సాక్షాత్కారము పొందు విధానము న్నూ శిష్యుడు తెలుసుకొనగల్గుచున్నాడు. ఐతే, నరుని నోట యెంగిలి గాని దొక్క పరబ్రహ్మమే గదా! "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసహా" అనిన్ని "నచక్షుర్గచ్ఛతి, నవాగ్గచ్ఛతి నోమనః" అనిన్ని శ్రుతులు కూడ చెప్పుచున్నవే! గురువాక్యముచేత పరబ్రహ్మ మెట్లు చెప్పబడును? అనుశంక తప్పక గల్గుచున్నది. దీని కొక్కటే జవాబు. గురువాక్యముద్వారా వుపదేశింపబడేది పరిపూర్ణ బ్రహ్మముకాదు. పైన వుదహరించిన శ్రుతి వాక్యములలో లక్షింపబడిన పరిపూర్ణ పరబ్రహ్మము. గురువు వుపదేశింపగలిగేది, కారణ స్వరూపమగు అధిష్ఠాన చేతన బ్రహ్మము. యిది నోటితో చెప్ప గలిగేదే, శ్రవణ మననాదులు చేయతగినదే. కనుక "ఆత్మావారే ద్రష్టవ్యః మంతవ్యో, శ్రోతవ్యో, నిధి ధ్యాసితవ్యః" అని బృహదారణ్యశ్రుతి చెప్పుచున్నది. మరి యా పరిపూర్ణ పరబ్రహ్మమెట్లు గురుమూర్తి చూపగల్గును? అన్న ప్రశ్న పరిపూర్ణ బోధకు సంబంధించినది. పరమాత్మ స్వరూపుడై నిలచిన శిష్యుని కన్యముగానున్నదేదో అదే పరిపూర్ణ పరబ్రహ్మము. అట్టి దానిని శిష్యుడెట్లు గ్రహించును అనే ప్రశ్నకు గురుగీతయే మరొకచోట సమాధానము చెప్పినది. ఎట్లన :

శ్లో॥ "స్వయంబ్రహ్మమయో భూత్వా
తత్పరం చావలోకయేత్"

అనగా శిష్యుడు బ్రహ్మమయుడై దాని కతీతమగు పరిపూర్ణ పరబ్రహ్మమును అవలోకనము చేయును అని తెలియవలెను. ఆ పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే నరుని నోట నుచ్ఛిష్టముగానిది.

"గురువక్త్రేస్థితం బ్రహ్మ" అని యీ శ్లోకమునందు చెప్పి, మరొక శ్లోకములో "గురువక్త్రేస్థితా విద్యా" అని గురుగీతయే చెప్పుచున్నది. కనుక బ్రహ్మశబ్దమునకు విద్యాస్వరూపమగు, అనగా చిద్ఘన స్వరూపమగు బ్రహ్మమే అర్థముగా గ్రహించవలెను. యీ శ్లోకములోని బ్రహ్మశబ్దమునకు అర్థముగా పరిపూర్ణ పరబ్రహ్మము చెప్పబడలేదని ఋజువు అగుచున్నది. అనగా గురువు నోటితో చెప్పేది జ్ఞానస్వరూపమగు బ్రహ్మము (ఎరుక)ను గురించియే అని తెలియవలెను.

"ప్రాప్యతే తత్ప్రసాదతః" అనగా ఆ గురుని యనుగ్రహ విశేషముచేతనే తెలియబడు చున్నది. అనుగ్రహము లేనిచో వుపదేశమెందుకు చేసెదరు? అనుగ్రహమున్నది కనుకనే వుపదేశముచేసినారు. బోధయున్ను చేయుచున్నారు. యింకేమి యనుగ్రహము కావలెను?

అనుప్రశ్న రావచ్చును. గురుమూర్తి యెప్పుడూ దయామయుడే. ప్రేమ స్వరూపుడే "సర్వభూతహితేరతః" అనగా సర్వభూతముల (జీవుల) శ్రేయస్సు కోరుటయే ఆయన సహజ స్వభావమూ, దీక్షయూనై యున్నది. ఆయన కెవరియందునూ యెట్టి పక్షపాతబుద్ధియునూ లేదు. కనుక గురుమూర్తికి అనుగ్రహముండుటలో ఏమీ సందేహము లేదు. శిష్యుడే అందుకు పాత్రుడు కావలసియున్నది. మేఘమంతటా పక్షపాతములేక వర్షించిపోతుంది. కాని మెట్టను (శిఖరము) నొక చుక్కైనను నిల్వదు గదా అనిన్ని, స్వాతికార్తెయందు కురియు వర్ష బిందువులు ముత్యపు చిప్పలయందు బడిననే అవి మంచి ముత్యములు కాగలవనిన్ని శ్రీకృష్ణదేశికేంద్రుల వారు శెలవిచ్చియున్నారు. కనుక శిష్యుని అంతఃకరణశుద్ధి ననుసరించి గురువాక్య మారుఢమగు చుండును కనుక తన అంతఃకరణను పవిత్రీభూతమొనర్చుకొనుటకై శిష్యుడు సత్కర్మానుష్ఠానము చేయుచు, అచంచల భక్తితో నాలుగు శుశ్రూషలూ చేసుకొనుచూ, సత్ప్రవర్తనాదుల యందు తనకుదార్ఢ్యము(శక్తి) గలుగుటకై గురుమంత్రానుష్ఠానము చేయుచుండవలెను. కనుకనే గురుగీత ప్రథమాధ్యాయము నందు "గురుకృపా ప్రసాద సిద్ధ్యర్థే" అని సంకల్ప విధానముగూడ చెప్పబడినది - ఆ గురుకృప తనకు సిద్ధించినదా లేదా? ఎట్లు తెలియును? సిద్ధించినదనుకొనుటకు నిదర్శన మేమి? అంటే ఆ గురుస్వరూపము తనకు ప్రత్యక్షమగుటయే ఇందుకు తార్కాణము. ప్రత్యక్షమనగా తాను వేరుగావుండి, తన కన్య స్థానమున తనకు వేరుగా ఏదో కనుపించుట, లేక తోచబడుట కాదు. తన మనస్సు తన్మయము కావలె ఆ స్వరూపముతో నిండిపోవలె. అంతేకాదు. ఆ స్వరూపమే కావలె. ఎట్లంటే పాకముబట్టి మూసలో బోసిన పంచదార అంతయూ మూసయొక్క నామరూపాలు వహించినట్లు, శిష్యుని మనస్సు గురుస్వరూపమే అయిపోవుటే ప్రత్యక్షము గాని అన్యముగాదు. అట్టి గురుకృపా ప్రసాదసిద్ధి అయినపుడే ఆ బ్రహ్మవస్తువు తనకు ప్రాప్తించినదన్నమాట.

ఆ గురుకృప పొందుట కేమిచేయవలెనో యెట్లు చేయవలెనో యీ శ్లోకమందలి రెండవపాదము విధించుచున్నది. గురుధ్యానము చేయవలెను. ఎట్లు చేయవలెను? స్వైరిణీ (భర్తగాక పరపురుషుని మరగిన స్త్రీ, తన ప్రియుని స్మరిస్తూ వున్నట్లు) తెంపులేకుండా అవిచ్ఛిన్న తైల ధారవత్తుగా ధ్యానించుచుండవలెను. యీ దిగువ పద్య మీ సందర్భమున పఠనీయము.

చ॥ పరపురుషానురక్తిగల భామిని యెల్లపనుల్ గృహంబునన్
బొరిబొరిచేయుచున్ ప్రియుని పొందుసుఖంబుగ చూచురీతి
భాస్వరపర తత్త్వవేది నిజవర్ణ నిజాశ్రమయోగ్య ధర్మముల్
నిరతముసల్పుచున్ పరమనిర్మలసౌఖ్యముగాంచు నెమ్మదిన్

గురువును ధ్యానించవలెను. అన్నప్పుడు గురువు యొక్క నామ రూపములను ధ్యానించమని అర్థముకాదు. పై పద్యములో గూడ "భాస్వర పరతత్త్వవేది" అనగా స్వయం ప్రకాశ పరబ్రహ్మతత్త్వమును దెలిసిన వాడు అని ప్రయోగించుట గమనార్హము. అట్టివాడా పరబ్రహ్మ తత్త్వమునే ధ్యానించును. ఆ పరబ్రహ్మతత్త్వమును యెరిగిన గురువు " బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి" అను ప్రకారము ఆ పరబ్రహ్మమేగాని అన్యుడు కాజాలడు కనుక గురువు యొక్క నామరూపాలను వదలి గురుతత్త్వమునే అంతఃకరణయందు ప్రతిష్ఠించుకొని క్షణమైననూ దానిని మరువక తన వర్ణాశ్రమోచిత కార్యకలాపములెల్ల చేయుచుండును అని పద్య భావము తెలుపు చున్నది.

ప్రస్తుత విచారణీయ శ్లోక భావమునకును యీ పద్యమందలి భావమునకున్ను కొంచెము భేదమున్నది. ఎట్లనగా శ్లోకమునందు విధించిన ధ్యానము సాధనకు సంబంధించినది. అనగా గురుకృపా సంసిద్ధికై శిష్యుడుచేసే వుపాసనా విధానమునకు చెందినది. పద్యమో సాధనానంతరము. ఆ భాస్వర పరతత్వము వేద్యమైన పిమ్మట దాని యందెల్ల సుప్రతిష్ఠితుడై స్థిమిత లక్షణము గల్గియుండునో వివరించు చున్నది. ఉభయత్ర స్వైరిణీ దృష్టాంత మీయబడీయున్నది.

స్వైరిణీ ప్రేమ అపవిత్రమైనదికదా! యిట్టి నీచోపమానమిచ్చుట తగునా? అంటే ప్రేమ యొక్క ప్రగాఢతను సాంద్రతను తెలియపరచుటకు మాత్రమే యీ దృష్టాంత మీయబడినదని తెలియదగును. భక్తియొక్క స్థాయీ భేదములలో మధురభక్తి కత్యంతోన్నత స్థాన మీయబడినది. రాధామాధవుల దివ్య ప్రణయములో మధురభక్తి పరాకాష్ఠ చెందినది. సాధారణ ప్రేయసీ ప్రియులు దేహసంబంధమైన పాశవిక ప్రేమవంటి తుచ్ఛప్రేమ కాదది. అది దివ్యము. కేవలము ఆత్మ సంబంధమైనది. మహా పవిత్రమైనది.

దృష్టాంతమందలి ఏదో యొక ప్రత్యేక లక్షణము మాత్రమే. ద్రాష్టాంతమునందలి మరియొక లక్షణములతో పోలియుండునుగాని . ఆ రెంటి యొక్క గుణదోషములన్నిటికి పోలిక యుండజాలదు. స్వైరిణీ ప్రియునియందుగల ప్రగాఢ ప్రేమచే మిగతా సర్వమును తృణప్రాయముగ త్యాగము చేయగలదు. అట్లే భక్తుడు భగవంతునికి (శిష్యుడు గురునికి) ఆత్మనివేదనాయుతమగు శరణాగతి చేయుపట్ల మిగతా సర్వస్వమును త్యాగము చేయగలడు. దృష్టద్రాష్టాంతములలో ఈ ప్రేమత్యాగముల రెంటి యౌన్నత్యమునకు మాత్రమే పోలిక మరియును నిరంతరావచ్ఛిన్న ధారావాహికముగా స్వైరిణి ప్రియుని ధ్యానములో నిమగ్నమై యుండును. అట్లే గురుపరమాత్మను శిష్యుడు ధ్యానించవలెను అనుటకు మాత్రమే యీ దృష్టాంత మీయబడినది.

నారదభక్తి సూత్రములలో - సూత్రము "యధావ్రజగోపికానాం" అని సూత్రీకరింప బడినది. నందవ్రజము (బృందావనము) నందలి గోపికాంగనలు, నందనందనుడు శైశవారభ్యా చేసిన బాల క్రీడలకు, కొంటెపనులకు, ముగ్ధలై బాల్యమాదిగా నాతనిని ప్రేమించుచూ గీతలో చెప్పబడనరీతిగా, "తద్బుద్ధయస్తదాత్మాన. స్తన్నిష్ఠాస్తత్పరాయణాః" అయి శ్రీకృష్ణునితోడిదే లోకమని, అతనితో వన క్రీడ జలక్రీడ రాసక్రీడ మహోత్సవములయందు తేలియాడుచు అతని నామ రూప గుణ చేష్టాదికము నుండి క్షణమైన మనస్సును మరల్చకుండిరిగదా! భక్తునికి భగవంతునికి మధ్య నుండవలసిన భక్తి యొక్క ఆదర్శమట్టిదేగదా!

పతిభక్తి పరాయణయగు పతివ్రతా తిలకమునకు భర్తయందుండు భక్తియు నట్టిదే కనుకనే "సతి. పొరుగూరికి పోయిన పతి రాకడగోరినట్లు" అని శ్రీకృష్ణదేశికేంద్రులవారు తమ కందార్థములలో శెలవిచ్చియున్నారు. గురుమూర్తిని ధ్యానించు పద్ధతి యా కందార్థములలో యెట్లు వివరించిరో తెలియదగును.

కంద : జలము నెడబాయనొల్లని
జలచరముల రీతిబూనిసచ్ఛిష్యుడు
హృజ్జలజంబను పీఠముపై
నిలిపి తరముమాని గురువునే కొల్చుసుమ్మీ!

తదూక్తులనే తలచునమ్మో
కలకాల మీరీతిగ గడపూచునే ప్రొద్దు
తలిదండ్రి దొరదాత దైవమనుచు
గురువునే కొల్చు సుమ్మో, తదూక్తుల నేతలచునమ్మో

గురుపుత్రులీ కందార్థమును గురుముఖతః చక్కగా విచారించి ఆచరణ యందుంచి జయమందెదరుగాక !

శ్లో॥ సంసార వృక్షమారూఢాః పతంతి నరకార్ణవే।
యస్మానుద్ధరంతే సర్వాన్ తస్మై శ్రీ గురువేనమః॥

తాత్పర్యము : సంసారమనే వృక్షము నధిరోహించి, నరకమనే మహాసముద్రములో పడిపోవుటకు సిద్ధముగానున్న సర్వులను ఉద్ధరించి రక్షించుటకు సమర్థుడైన గురుమూర్తికి నమస్కరించు చున్నాను.

విశేషవివరణ : ఈ శ్లోకములో సంసారము ఒక వృక్షముతో పోల్చబడినది. సంసారమొక మహారణ్యముగానూ, హాలాహలముగాను పోల్చబడిన శ్లోకముల తాత్పర్య విశేష వివరణము లను గతములోనూ చర్చించియున్నాము. వృక్షముల సమిష్టికే వనమని అరణ్యమని పేరుగదా! ఇప్పుడొక్క వృక్షముతో పోల్చుటలోగల విశేషమేమి? ఇందుకు సమాధానముగా యీ దిగువ శ్రుతిస్మృతులు విమర్శనీయములు.

శ్రుతి : కిం స్విద్వనం క ఉ స వృక్షమాసీత్ యతో ద్యావా పృథివా నిష్ట తక్షుః......" అనగా ఏవనమందలి యేచెట్టు యొక్క కర్రతో యీ దివీభువీ చెక్కబడినవి లేక సృష్టిగావింపబడినవి. శ్రుతి : "బ్రహ్మ సవనం, బ్రహ్మవృక్షమాసీత్। యతో ద్యావాపృథివీ నిష్టతక్షుః" అనగా బ్రహ్మమనే వనమందున్న బ్రహ్మమనే చెట్టుయొక్క కర్రతో ఈ దివీ భువీ చెక్కబడినవి, అని మహర్షి సమాధానము. "సర్వం ఖ ల్విదం బ్రహ్మ" అనగా అంతయూ బ్రహ్మమే గనుక, సమిష్టి రూపముగానున్నది. వనరూప బ్రహ్మ, ఒక్కొక్క వృక్షరూపబ్రహ్మ ఒక్కొక్క బ్రహ్మాండముగా పరిణమించి విశ్వరూప బ్రహ్మమయినది. సంసారమనే మాటలో సృష్టి కారణము, సృష్టి, యావత్పరిణామరూప విశ్వము దేహము మొదలగునవి అన్నియూ యిమిడియున్నట్లు యిది వరకే గుర్తించితిమి. కనుక సంసారమును మహారణ్యముతో పోల్చినా అందలి ఒక్క వృక్షముతో పోల్చినా విప్రతిపత్తి యేమియు నుండజాలదు. మరిన్ని సంసారమునుండి తనకు తాను బయటపడలేడని గురుమూర్తి మాత్రమే దారిచూపగలడనిన్నీ చెప్పుటకు అరణ్య దృష్టాంత మీయబడినది. అనాదిగానున్న సంసారము, చక్కగా వ్రేళ్ళుదన్ని "సువిరూఢమూలం" దృఢమైన మొదలు గల్గిన మహా వృక్షమువలె బలీయమైయున్నదనిన్నీ వృక్ష మధిరోహించినవాడు కాలుజారి క్రిందబడిపోయే ప్రమాదమున్నట్లే మానవుడు మనస్సు పాపకర్మలొనర్చి క్రిందనున్న అగాధమగు నరకమనే మహాసముద్రములో పడు ప్రమాదమున్నదని సూచించుటకు వృక్ష దృష్టాంత మీయబడినది.

ఈ సంసార వృక్షము భగవద్గీత 15వ అధ్యాయం (పురుషోత్తమ ప్రాప్తియోగం) 1,2 శ్లోకములలో వర్ణింపబడినది.

1. శ్లో॥ ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయం
ఛందాంసి యస్య పర్ణాని యస్తంవేద స వేదవిత్॥

2. శ్లో॥ అధశ్చోర్ధ్వంచ ప్రసృతాస్తస్యశాఖా
గుణప్రవృద్ధా విషయప్రవాళాః
అధశ్చమూలాన్యనుసంతతాని
కర్మానుబంధీని మనుష్యలోకే॥

సామాన్యార్థములో వృక్షమనగా చెట్టు. అశ్వత్థ వృక్షమనగా రావిచెట్టు. విశేషార్థములో వృక్షమనగా నశించకుండా వుండలేనిది. అశ్వత్థమనగా రేపుండనిది అనగా క్షణమైనను స్థిరముగా నుండనిది. అశ్వత్థమనే యీ పురాతన వృక్షము చాలా వింత అయినది. సృష్టియందలి సమస్త వృక్షములకు వేళ్ళూ మూలమూ దిగువ నుండుటయు శాఖోపశాఖలన్నియు పైకి విస్తరించుటయు జరుగుచున్నది.

కాని యీ సంసార వృక్షమో! దీనికి మూలము పైన వున్నది. వృక్షకాండము అందుండి వెడలిన శాఖోపశాఖలు దిగువకు వ్యాపించి యున్నవి.

"అశ్వత్థ స్సర్వవృక్షాణాం" అనగా వృక్షములలో నేను అశ్వత్థమునై యున్నానంటున్నాడు భగవానుడు. సృష్టిమూలకారణమైన యాతని నుండి యీ వింత అశ్వత్థవృక్షము ప్రసరించినది కనుక ఆ బ్రహ్మవస్తువే కూకుడు వేరు. ఆత్మనుంచి ఆకాశ వాయురగ్నీ జల పృధివులు ఒకదాని నుండి ఒకటి వరుసగా కలిగినవని తెత్తిరీయ శ్రుతి చెప్పుచున్నది. కనుక సూక్ష్మాతిసూక్ష్మముగానున్న ఆత్మాకాశములు ఎగువనున్నట్లుగానూ వానినుండి జగత్సృష్టి దిగువకు స్థూలాతి స్థూలముగా అవతరించి (దిగి) విజృంభించినట్లున్ను భావింపబడినది. ఊర్ధ్వమందే సృష్టికారణమగు బ్రహ్మమున్నదంటే దాని సర్వవ్యాపకత్వమునకు భంగముకాదా? దాని కొమ్మలు క్రిందకు మాత్రమేగాక పైకిన్ని వ్యాపించి యున్నవి అనిన్ని కూడా చెప్పబడుతోంది. మరిన్ని,

సర్వతఃపాణిపాదం తత్సర్వతోఽ క్షి శిరోముఖమ్
సర్వత్రశ్రుతిముల్లోకే సర్వమావృత్య తిష్ఠతి".

అనగా అంతటా కాళ్లు, చేతులు, కన్నులు, తలలు, ముఖములు, చెవులు గలిగి సర్వమునూ ఆవరించియున్నదని తెలియదగును. అంతేకాకుండా పంచభూతములవరకూ గల సృష్టి ఈశ్వర సృష్టి యని, పృధ్వి నుండి వుత్పత్తి చెందిన 84 లక్షల జీవోపాధులు జీవసృష్టియనీ, ఈశ్వర సృష్టిపై నుంచి దిగువకు విస్తరించినట్లు గాన వచ్చుచున్నదనీ జీవసృష్టి పృథ్వీ వుపరితలమునుండి వూర్ధ్వ భాగమునకు విస్తరించుచున్నట్లున్నూ తోచుచునే యున్నది. పృథ్వి నుంచి ఓషధులు, ఓషధులనుండి యన్నము, అన్నము నుండి పురుషులు (జీవులు) కలుగుచున్నట్లు చెప్పుచున్నది. అదే శ్రుతి భవమూలమగు (సంసార కారణమగు) బ్రహ్మము నుండి బలము స్వీకరించి అనగా సత్తాస్ఫూర్తులు గ్రహించి, క్రింది భాగమున అనేక మూలములు కల్పితమగుచున్నవి. జీవుల నేకులు గనుక యీ వృక్షమునకు దిగువనేక మూలములు ఐననూ ఊర్ధ్వమున నున్నది బ్రహ్మ మొక్కటియే.

అనంతకోటి బ్రహ్మాండములున్నూ బ్రహ్మమున్నూ కలసి బ్రహ్మవనమైతే ఒక బ్రహ్మాండమును బ్రహ్మవృక్షముగాపేర్కొనవచ్చును. ఒక్క బ్రహ్మాండమూ బ్రహ్మమూగలసి బ్రహ్మవనం అనే కల్పములో ప్రతి జీవోపాధియూ నొక బ్రహ్మవృక్షమగుచున్నది. అపుడు దేహమేఅశ్వత్థ వృక్షము కాగలదు. దేహమున ఊర్ధ్వభాగముననున్న సహస్రారమే బ్రహ్మస్థానముగానూ

జ్ఞానకర్మేంద్రియాదు లకు వుత్పత్తి స్థానముగానూ యుండి ఆయా గోళకములందు స్థానము లేర్పరచుకొన్నది. మరియు దిగువ నాభీస్థానము నుండి ఎగువకు దిగవకూ కూడా 101 నాడులు శాఖోపశాఖలుగా వ్యాపించియున్నవి. కనుక అశ్వత్థమను మాట వ్యష్టిదేహములకు కూడా వర్తించుచునేయున్నది. "ఏ వస్తువు చేతను తానావిర్భవమొందు దేహమను తరువరయన్" అని శ్రీకృష్ణ దేశికేంద్రులవారు కూడ సమిష్టి వ్యష్ట్యాత్మకమగు బ్రహ్మాండ పిండాండములను వృక్షములుగా పోల్చియున్నారు.

ఈ అశ్వత్థవృక్షమును క్షణక్షణ పరివర్తన శీలముగలదని అశ్వత్థ శబ్దముచే ఒకప్రక్క వుటంకించుచూ ఆ శ్లోకములోనే "అవ్యయం" అని వర్ణించుటకు కారణమేమి? అవ్యయమనగా క్షీణింపనిది లేక తరుగనిది అని అర్థము. మార్పుచెందుచున్నదేగాని తరుగుట లేదు. సృష్టి స్థితి లయములలో అనేక మార్పులు చెందుచున్నది. లేక జీవలక్షణము చూచినచో జనన మరణములలో అనేక మార్పులు పొందుచూ జన్మనుంచి కర్మ, కర్మనుంచి జన్మ, కార్యకారణరూపముగా ప్రవర్తిల్లుచున్నది. తరగడమనే ప్రశ్నలేదు. మూలనాశనమైనపుడు మాత్రమే జనన మరణ రూప సంసారము శాశ్వతముగా నశించుచున్నది. కాని ప్రారబ్ధరూపముగా కొంతకర్మ నశించినప్పటికిఆగామీ రూపముగా కర్మను తిరిగి భర్తీ చేసుకొనుచున్నాడు. కనుక సంసార వృక్షము క్షణక్షణము మార్పుచెందేదైనా అవ్యయం అని వర్ణింపబడినది.

ఈ అశ్వత్థవృక్షమునకు వేదములే ఆకులుగా వర్ణింపబడుటకు కారణమేమంటే ఆ ఆత్మ నుంచి శబ్దమే గుణముగాగల ఆకాశము గలిగినది. ఆ శబ్దమే వర్ణాత్మకమై, శబ్దరూపములై వాక్యములుగా మంత్రములుగా, వేదశాస్త్రములుగా, పరిణతి చెందినది. గనుక ఛందాంసియస్య పర్ణాని అని చెప్పబడినది. త్రిగుణ ప్రవృద్ధములైన కొమ్మలూ, శబ్దస్పర్శాది విషయ వాంఛలనే చిగుళ్ళు కలిగినది. యిదియే విశ్వకారణమైయున్నది. కర్మపరతంత్రులను జేసి శుభాశుభకర్మఫలప్రాప్తిని కలిగించి సంసారమున శాశ్వతముగా జీవులను బంధించుచున్నది. ఈ అశ్వత్థము బ్రహ్మాశ్వత్థము కర్మాశ్వత్థము అను రెండు రూపములు కల్గినది. యిట్టి వృక్షమును జీవుడధిరోహించియున్నాడు. బ్రహ్మాశ్వత్థము బ్రహ్మాండము. కర్మాశ్వత్థము కర్మ శరీరము లేక పిండాండము అని చెప్పబడినది. ఈ శ్లోకమును యీ క్రింద పద్యము చక్కగా ననువదించుచున్నది.

సీ॥ మూల ప్రకృతి యాల వాలంబు, సుఖ దుఃఖ
ములు బీజములు గుణంబులును వేళ్ళు
పురుషార్థములు రసంబులు, నింద్రియములూడ,
లూర్ముల్స్వభావంబు, లొనర ధాతు
వులు పొరల్, ప్రకృతులు పురులైన శాఖలు
మేటి రంధ్రమ్ములు కొటరములు
ప్రాణంబు లాకులు బలు విషయంబు, లి
గుళ్ళు రాగాదులు, కురుచ కొమ్మ

తే॥ లెలమిక్రియ లెల్ల విరులు, జీవేశులందు
పక్షులును గల్గు, సంసారవృక్ష, మెక్కి
నరక కూపంబులోబడు నరుని నెవ్వ
డుద్ధరించును వాడె గురూత్తముండు

తాత్పర్యము . ఈ వ్యష్టి సమిష్టిరూప జగద్వృక్షమునకు మూల ప్రకృతియే మొదలు. ఆప్రకృతి జడము గనుక బ్రహ్మముతో గూడిన మూల ప్రకృతి అని గ్రహించవలెను. సుఖదుఃఖములు రెండును బీజములు అనగా ఫలములు. సత్వరజస్తమస్సులు మూడును వేళ్లు. ధర్మార్థకామ మోక్షములను నాలుగు పురుషార్థములు. జ్ఞానేంద్రియములు అను 5 వూడలు. క్షుత్పిపాసలు. శోకమోహములు. జనన మరణములు అను ఆరున్నూ స్వభావములు. రసరుధిరమేదొ మాంస మజ్జాస్థి రేతస్సులను యేడున్ను పొరలు. పంచభూతములు మనోబుధ్యహంకారములు అను యెనిమిది ప్రకృతులే పెద్ద కొమ్మలు. నవరంధ్రంబులే తొర్రలు. ప్రాణంబులు పదిన్ని ఆకులు. అనేకములగు విషయవాసనలేచిగుళ్ళు. రాగద్వేషాదులు అన్నీ చిన్న కొమ్మలు. ననావిధములగు కర్మలే పువ్వులు. యీ విధముగానున్న సంసార వృక్షమును జీవేశ్వరులను పక్షు లిద్ధరు యెక్కి ఆశ్రయించికొనియున్నారు. అందు అజ్ఞానియగు జీవుడను పక్షి నరకకూపంలో పడిపోవుటకు సిద్ధముగానున్నాడు. అట్లు పడనీయకుండా రక్షించగలిగిన మహామహితాత్ముడే సద్గురువు అని ఈ గురుగీతా శ్లోకమునకీపద్యము చక్కని వివరణమై వున్నది. జీవరూప పక్షి మాత్రమే నరక రూపములో పడనున్నదంటే అందుకు యీ దిగువ శ్రుతులను అవలోకించవలయును.

1. ద్వాసుపర్ణా సయుజా సఖాయా.
ఏకం వృక్షం పరిషస్వజాతే
తయోరన్యః పిప్పలంస్వాద్వత్తి
అనశన్నన్యోఽ భి చాకశీతి॥

2. సమానే వృక్షే పురుషో నిమగ్నో ఽ నీశయా
శోచతి ముహ్య మానః
జుషం యదా పశ్యత్యన్య మీశం
అస్య మహిమానమితి వీతశోకః॥

సుపర్ణుడనగా పక్షి. రెండు పక్షులు సమానాకార లక్షణములు గలవి ఒక వృక్షము నధిరోహించియున్నవి. అవియే జీవేశ్వరులు. వీరిద్దరూ చిదాభాసులే అయినా అందు జీవరూపమగు పక్షిదిగువనున్న కొమ్మల యందు సంచరించుచు ఆ చెట్టు యొక్క పండ్లను తిని రసము నాస్వాదించుచున్నది. అనగా కర్మ ఫలములను అనుభవించుచు సుఖదుఃఖము లను పొందుచున్నవి. రెండవ పక్షియగు ఈశ్వరుడు యిట్టి సుఖదుఃఖకారకములగు ఫలములు ననుభవించని పూరక (సాక్షిగా) చూచు చుండును. జీవుడునప్పుడు ఈశ్వరాంశమే అయినను మాయయందుండుటచే నిత్యుడని గుర్తించక మోహితుడై దుఃఖము పొందుచున్నాడు. ఈశ్వర పక్షిని చేరుటకై ప్రయత్నించి పై కొమ్మల వైపు పయనించిన యెడల తానే ఆ యీశ్వరపక్షిగా రూపొందుచున్నాడు. అప్పుడే అతడు శోక విముక్తుడు కాగలడని చెప్పబడినది. కనుక అజ్ఞానియగు జీవునకే నరకకూపమున బడే భయమున్నది.

"తత్సృష్ట్వా తదేవాఽను ప్రావిశత్" అని చెప్పటలో జీవోపాధులను కల్పించి తానుకూడా అను ప్రవేశము గావించెను. అను ప్రవేశ మనగా జీవరూపముగా ముందు ప్రవేశించి పిదప తానును వెనువెంటనే ప్రవేశించెను అని అర్థము" "ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽ

ర్జున తిష్ఠతి" సర్వభూతముల హృదయములయందుండి వారిని భ్రమింపచేయుచున్నాడు. కనుక జీవేశ్వరులను రెండు పక్షులు శరీరమను వృక్షమును అధిరోహించియే యున్నవి.

"యస్తానుద్ధరతే సర్వాన్" అన్నారు గదా సర్వులను పుద్ధరించునా? అంటే తన్నాశ్రయించిన సర్వులు అని అర్థము.అయితే సర్వ మానవులకు మోక్షమందు జాతి మత కుల విభేదము లేక సమాన ప్రతిపత్తి కలదని సూచింపబడినది. అట్టి అభేద దృష్టితో సర్వులను రక్షించు గురుమూర్తికి నమస్కారమని భావము.

శ్లో॥ గురుర్బ్రహ్మా. గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః॥

తాత్పర్యము : గురువే బ్రహ్మ స్వరూపుడు. ఎట్లనగా 1) శిష్యుల యొక్క అంతఃకరణములయందు జ్ఞాన బీజమును నాటి మొలకెత్తించి బ్రహ్మవలె సృష్టికర్త యగుచున్నాడు. 2) బ్రహ్మ యొక్క నాలుగు ముఖములనుండి నాలుగు వేదములు బహిర్గతములైనవి. అనాల్గు వేదములనుండి గైకొనబడిన 4 మహావాక్యముల లక్ష్యార్థమైన ప్రత్యగ్బ్రహ్మైక్య రూపమగు అధిష్ఠాన చేతన బ్రహ్మస్వరూపమును దర్శింపచేయు గురువు బ్రహ్మస్వరూపుడే.

గురువే విష్ణు స్వరూపుడు : ఎట్లన? శ్రీమహావిష్ణువు పోషణ కర్తయై సకల జీవోపాధులను పోషించి రక్షించుచున్న విధముగానే సద్గురువు తాను నాటిన జ్ఞాన వృక్షమును బోధామృతరసముచే నిత్యము పోషించుచూ. శిష్యు డజ్ఞానావరణములో తిరిగి పడకుండా కాపాడుచున్నాడు. 3) "సర్వ వ్యాపకోవిష్ణుః" అని విష్ణు శబ్దమునకు నిర్వచనమున్నది. గురువు అనగా గొప్పదగు స్వరూపము అంటే. అంతకంటె పెద్దది లేదన్నమాట.గురుస్వరూపమే సర్వవ్యాపకముగా నుండి గొప్పదై యున్నది. కనుక "గురుర్విష్ణుః" అని. శబ్దార్థములచే కూడా సిద్ధించుచున్నది.

గురువే మహేశ్వరుడు : ఎట్లనగా? 1) ఒకప్పుడు జ్ఞానరూపంగానూ, మరొకప్పుడు దానిని ఆవరించియున్న అజ్ఞానరూపముగానూ. ప్రకటమగు సహజ స్వభావముగల అధిష్టానచేతన బ్రహ్మమునందలి అజ్ఞానావరణమును గురువు నాశనముచేయగల సమర్థుడగుచున్నాడు. 2) జీవేశ్వర జగత్తుగా దోచబడు నామరూపాత్మకమగు సమస్తము బ్రహ్మము యొక్క సాకారరూపమే కనుక. నామరూపాలు మిథ్యయని బోధించి. సాకార వస్తువులయందుగూడ ఆత్మదృష్టి పెంపొందించి. ఆ విధముగా నామరూపాత్మకనానాత్వమును లయపరచుచున్నాడు కనుక గురువే లయకారుడగు మహేశ్వరుడు.

గురువు సాక్షాత్తుగా పరబ్రహ్మమే : ఎట్లనగా? త్రిగుణ స్వరూపిణియగు మాయను తనయందు గర్భీకృతంగావించుకొని స్వయంప్రకాశుడై వెలుగొందు బ్రహ్మమును అపరోక్ష సాక్షాత్కారము గావించుకొన్నవాడై నందున "బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి" అను శ్రుతి న్యాయముగా గురువే పరబ్రహ్మము అనదగియున్నాడు. "ఏకో దేవ స్త్రీధాభిన్నా బ్రహ్మ విష్ణు మహేశ్వరా" (ఒక్కటైన స్వయంప్రకాశ వస్తువే బ్రహ్మ విష్ణు మహేశ్వర రూపములుగా నైనది) ఎందులకావిధముగా నిర్గుణ పరబ్రహ్మము సగుణరూపము వహించినది? "ఉపాసకానాం. హితార్థాయ. బ్రహ్మణో రూపకల్పనా" అనగా భక్తుల సౌలభ్యం సౌఖ్యముల కొరకు బ్రహ్మమునకు రూపకల్పన జరిగెనని సమాధానము.

గురుస్సత్వమయో విష్ణుః రాజసశ్చతురాననః।
తామసో రుద్రరూపేణ. సృజత్యవతిహంతించ॥ (గురుగీత)

సత్వగుణవిశిష్ఠమై విష్ణువనియు. రజోగుణముతో గూడి బ్రహ్మమనియు. తమోగుణము పూని రుద్రుడనియు. పేర్లతో ఒక్క బ్రహ్మమే సృష్టి స్థితి లయములను జరుపుచున్నది.

శ్లో॥ పొన్నాల వంశ కలశాంబుధి కైరవాప్తం
పూర్ణం దయానిధి మనంత గుణైకధిష్ణ్యం
రాజాధిరాజమకుటాంచిత రత్న సేవ్యం
శ్రీ రాజయోగి గురుమంతరతో నమామి॥

తాత్పర్యము : పాలసముద్రమున బొడమిన చంద్రునివలె. పొన్నాలవారను వంశమునందు. జన్మించినవాడును. అఖండైక పూర్ణ స్వరూపుడును. అపార కృపానిధియును. సకల కళ్యాణ గుణశోభితుడును. పాదకమలములకు మ్రొక్కులిడు రాజాధిరాజుల కిరీటముల యందలి మణుల కాంతులనే నీరాజనముగా స్వీకరించువాడును. అయివున్న "రాజయోగి" అను సార్ధక దివ్యనామమును ధరించిన నా సద్గురు మూర్తిని నా హృదయాంతరాళమున ప్రతిష్ఠించుకొని నమస్కరించు కొనుచున్నాను.

శ్లో॥ యంబ్రహ్మ వేదాంతవిదోవదంతి
పరంప్రధానం పురుషం తధాన్యే
విశ్వోద్గతేః కారణమీశ్వరంవా
తస్మైనమో విఘ్ననివారణాయః॥

తాత్పర్యము : "బ్రహ్మము' అనీ, "పరము" అనీ . "ప్రధానము" అనీ, "పురుషుడు" అనీ, "విశ్వాతీతం గా నిలిచిన కారణ స్వరూపుడు" అనీ, "విశ్వగతమై, అంతర్యామిగా కూడనున్నవాడు" అనీ, ఏబ్రహ్మమును గూర్చి పలువురు పలువిధములుగా భావించి సేవించుచున్నారో, అట్టి అంఖడైక బ్రహ్మ స్వరూపుడగు సద్గురు మూర్తికి సకల విఘ్న నివారణమునకై నమస్కరించుచున్నాను.



శ్లో॥ గురుమంత్రం ముఖేయస్య తస్య సిద్ధ్యంతి నాన్యాధా।
దీక్షయా సర్వకర్మాణి సిద్ధ్యంతి గురుపుత్రకే॥

తాత్పర్యము : గురుమంత్ర మెవని జిహ్వాగ్రమున యెల్లపుడుండునో, అట్టి గురుపుత్రునికి మాత్రమే ఆ మంత్రసిద్ధియగుచున్నది. దీక్షవహించెనేని సకల కార్యములు కూడా సిద్ధించుచున్నవి.

విశేష వివరణ : 1) గురుమంత్రం ముఖే యస్య 2) తస్య సిద్ధ్యంతి నాన్యధా 3) దీక్షయా సర్వకర్మాణి సిద్ధ్యంతి అను వానిని గూర్చి చర్చించదగును.

1) గురుమంత్రం ముఖే యస్య. అనగా ఎవని ముఖమునందు అనగా నోటయందు అనగా వాక్కుయందు గురుమంత్రముంటున్నదో అని అర్ధము.

గురుమంత్రమేది? : ఉపదేశకాలమున గురువు శిష్యునికి ఉపదేశించు మంత్రమే గురుమంత్రము అని స్థూలముగా చెప్పవచ్చును కాని గురువు ఒకటికంటె ఎక్కువ మంత్రములుపదేశించినచో అందేది గురుమంత్రమగును? అంటే. ఏది గొప్ప మంత్రమో అది గురుమంత్రమగును. గురు అనగా గొప్ప అని అర్ధమున్నది. మంత్రమగుటకు దానికి మంత్ర

లక్షణములున్నగాని దానిని మంత్రమనుటకే వీలులేదు కదా! కనుక మంత్రమనగా అర్థమేమో. మంత్రమునకుండవలసిన లక్షణములేమో తెలియవలసియున్నది. ``మననాత్ త్రాయతీతి మంత్రః`` అనగా మనస్సుచే ప్రసంఖ్యానము చేయుటవలన ఏది తన్ను రక్షించ సమర్థవంతమై యుండునో అదే మంత్రము అన చెల్లును. అది బీజాక్షరములతో నిర్మాణమై యున్నపుడే దానికాశక్తి గలుగ గలదు. పృథివ్యాధి పంచభూత బీజములకు వరుసగా స్తంభన, మోహన, మారణ, ఉచ్చాటన, వశీకరణమను శక్తులుండును. వాయు బీజములు కీడును వెడలుగొట్టుట యందును ఆకాశ బీజములు యిష్టదేవతా వశీకరణముగావించి తద్రీత్యా కామ్యార్థసిద్ధిని కలిగించుటకును సమర్థవంతములగును. అట్టి మంత్రములే మహామంత్రము లనబడును. వానియందు యిష్టదేవతా స్తోత్రము కామ్యార్థ సూచనయు నుండవచ్చును. ఆ మంత్రములకు ఋషి, ఛందస్సు, దేవతా బీజ, శక్తి, కీలక, అంగన్యాస, కరన్యాస, కవచ, హృదయ మాలాపంజర, ఆర్గళ, స్తోత్ర, దిగ్బంధన దిగ్విమోకప్రాణ ప్రతిష్ఠలును, గల్గియుండును. అట్టి లక్షణములు లేని వుపదేశవాక్యములు సిద్ధాంత వాక్యములగునే కాని మంత్రములు కాజాలవు. కనుక పరిపూర్ణ బోధసిద్ధాంతమును తెలియజేయుటకు గురువులు పదేశించు ద్వాదశాక్షరములతోనూ, షోడశాక్షరములతోనువున్న సూత్రప్రాయమగు వాక్యములు మంత్రములు కాజాలవు. 15 అక్షరములతో గూడినది. మంత్రం కాదు సరిగదా వాక్యమే గాదు. దానియందు క్రియారూప శబ్దమే లేనందున వాక్యము పూర్తియే కాలేదు. అది కేవలము దృష్టాంతము మాత్రమే అగును. మరియును యీ ద్వాదశాక్షరి షోడశాక్షరి వాక్యములయందుగాని పంచదశాక్షరి దృష్టాంతమునందుగాని ఆదిలో ప్రణవముగాని యితర బీజాక్షరములతో శ్రీకారముగాని ప్రార్థనా పూర్వకమగు నమస్కారము గాని స్వాహా, హుం, ఫట్, వౌషట్, వషట్, ఖేట, స్వధ మొదలగు శబ్దములుగాని లేవు. కనుక ఆ వాక్యములెంతమాత్రము మంత్రములు కాజాలవు. రామమంత్రము, శివమంత్రమనునపుడు, రాముడు శివుడు ఎట్లు ఆ మంత్రాధిష్ఠాన దైవతములో అట్లే గురుమంత్రమన్నపుడు గురువే మంత్రమున కధిష్ఠానదైవతమై నుండవలెగదా? ఏ మంత్రముచే గురుకృప ప్రాప్తించగలదో అదే గురుమంత్ర మనజెల్లును. గురుకృపలేక పరిపూర్ణ పరబ్రహ్మము తెలియబడదు. ``అపరోక్షమౌనె మనుజులకు పరోక్షంబైన బయలు గురుకృపలేకన్`` అని శ్రీకృష్ణదేశికేంద్రులు ప్రశ్నిస్తున్నారు. అట్టి గురుమంత్రము నుపదేశము పొందినవాడే గురుపుత్రుడు. సిద్ధాంత వాక్యములు మాత్రమే వుపదేశంపొంది గురుమంత్రోపదేశము పొందనివారు తక్షణమే అట్టి గురుమంత్రసిద్ధి పొందిన మహాత్ములవద్ద ఏతన్మంత్రోపదేశము పొందుట ప్రధమ కర్తవ్యము అని తెలియదగును. అట్టి గురుమంత్రమవ్వనని జిహ్వాగ్రమున ఎల్లపుడు వసించి యుండునో అట్టి గురుపుత్రునికే ఆ మంత్రము సిద్ధించుచున్నది. వ్యవహారకాలమున మాత్రము మంత్రమునుండి వారి మనస్సులను మరలించి మిగతా జాగ్రత్కాలమంతయు మంత్రమునందే వర్తింపచేయుటచే మాత్రమే గురుమంత్రం సిద్ధించగలదు.

2) తస్యసిద్ధ్యంతి నాన్యధా : మంత్రసిద్ధి అనగా నేమి? ఆ మంత్రాధిష్ఠాన దైవమీయగల సమస్తము, ఏమీ మిగుల్చుకొనకుండా యిచ్చుటయే మంత్రసిద్ధి. సాలోక్య సామీప్య సారూప్యములు కంటెను, సాయుజ్యము గొప్పది గదా! భక్తుడు భగవంతుడేయగుట సాయుజ్యము యిదియే భక్తికి పరాకాష్ఠ. కనుక గురుపుత్రునికి తానే ఆ గురుపరమాత్మననే అఖండ జ్ఞానము కలుగుటే గురుమంత్రసిద్ధి.

ఇట్టి ఆరూఢ జ్ఞానము గురుమంత్రాను ష్ఠానముపలన గాక "నాన్యథా" అనగా యితర విధముగా కలుగజాలదని. యీ గురుగీతా శ్లోకముద్ఘాటించుచున్నది.

ఐతే, గురువు మంత్రోపదేశము మాత్రము జేసి యూరుకొనునా? ఆ మంత్రార్థమును తెలియచేసి, మంత్రాధిష్ఠాన దేవతయొక్క స్థాన స్వరూప స్వభావములున్ను తెలియచేయును. గురుమంత్ర మొక్కటే గ్రుడ్డిగా నోటితో అనుకొన్నచో ప్రయోజనమంతగా నుండదు. "తజ్జపస్తదర్థ భావనం" అనగా మంత్ర అర్థమును (అనగా మంత్రాధిష్ఠాన దైవతము యొక్క స్వరూపమే మంత్రార్థము) భావించుటయే జపము. మరియును ఆ మంత్రానుష్ఠాన విధానమంతయు గురువు శిష్యునికి సాంగోపాంగముగా తెలియజేయును. ఆ మంత్రముపదేశించు గురువునకు ఆ మంత్రము సిద్ధించియుండిననే తప్ప ఆ మంత్రమునకు పటుత్వమున్నూ యుండజాలదు. కనుక ఏ గ్రంథమునుండియో ఆ మంత్రమును గ్రహించి పునశ్చరణ చేసినను ఏమియు ప్రయోజనకారి కాదని గ్రహించవలెను.

3) దీక్షయా సర్వ కర్మాణి సిద్ధ్యంతి : దీక్ష యనగా నియమోల్లంఘనము గావింపనని పట్టుదల వహించుటే దీక్ష. సర్వకర్మాణి అనగా సకల కార్యములు సిద్ధించునన్న మాట అనగా ఏకార్యసిద్ధినాసించి లేక సంకల్పించి మంత్రానుష్ఠానముగావించునో ఆయా కార్యములన్నియు సిద్ధించును. సర్వ కార్యాణి అనుటలో మరియొక అర్థముగూడ నున్నది. ఎట్లనగా తానుచేయు సర్వకర్మలు సఫలీకృతములై జయము గాంచుట "జపన్ జయమవాప్నోతి" అని గురుగీత అన్యత్రా చెప్పుచున్నది. కనుక సర్వకార్య జయము అనగా పూనిన అన్ని కార్యములయందు జయమే గాని అపజయము లేదన్నమాట ఐతే దీక్షలేనిచో కామ్యజపము సిద్ధించజాలదు. ఈ కామ్యజపమునకు, దేశము, కాలము, దిక్కులు, ఆసనము మొదలగునవి యన్నియు గురుగీత నిర్ణయించి చెప్పుచున్నది. ఏ నియమములు పాటింతునని దీక్షవహించునో అక్షరాలా ఆ నియమపాలన గావింపవలెను. అట్టి దీక్షయందు నియమ భంగము కలిగినచో జయము గలుగదు సరిగదా ప్రత్యవాయము అనగా కీడుకూడ గలుగును. కామ్య జపమునందేగాక, గురుమంత్రసిద్ధియగుటకు కూడ దీక్ష వహించి గురూపాసన గావించినచో అచిరకాలముననే ఆది ఫలకారి కాగలదు. గురుకృపా సంసిద్ధి తప్ప యితర సంకల్పము లేని గురుభక్తునికి దీక్షలో నియమోల్లంఘనజరిగినను ప్రత్యవాయము కలుగదు. శిష్యుని దీక్ష ఫలప్రదము కావలెనన్న గురుని ఆశీర్వచన బలమున్నూ యుండవలెను. గురునియొక్క పవిత్రాంతఃకరణ మున శిష్యుడు తరించవలెననే శుభసంకల్పము కలిగించుటకై చతుర్విధ శుశ్రూషారూపమైన తన సత్ప్రవర్తనచే శిష్యుడు గురుని మెప్పించవలెను. అపుడు మత్స్యః కూర్మ విహంగములపలె, వీక్షణ, ధ్యాన స్పర్శలచే గురుమూర్తి శిష్యుని అనుగ్రహించును.

"శిష్యతారణకై తానుగూడ నిట్టి దీక్షలు వహించు కరుణామయుడగు గురుపరమాత్మ యొక్క సగుణ నిర్గుణ రూపముల కివే మా ప్రణామములు.

1) శ్లో॥ స్థావరం జంగమం వ్యాప్తం
యత్కించి త్సచరాచరం
త్వంపదం దర్శితం యేవ
తస్మై శ్రీగురవేనమః॥

తాత్పర్యము : స్థావరములు (పుట్టిన స్థానమునుండి తమంతట తాముగా వేరొకస్థానమునకు

కదలజాలక వున్నచోటనే వుండునవి) జంగమములు ఒక స్థానము నుండి మరొక స్థానమునకు గమనాగమనములు చేయునవి అను రెండు రూపములుగా గానవచ్చే సకల జీవోపాధులయందు. సూక్ష్మరూపముగా వ్యాపించియున్న "త్వం" పదము అని చెప్పబడిన వస్తువును యెవరు దర్శింపచేయగలుగు చున్నారో అట్టి గురుమూర్తికి నమస్కారము.

2) శ్లో॥ అఖండ మండలాకారం వ్యాప్తం యేన చరాచరం
తత్పదం దర్శితంయేన తస్మై శ్రీగురవేనమః॥

తాత్పర్యము : అఖండము అనగా ఖండఖండములుగాకుండా యే పరమాత్మ వస్తువు, సమస్తము సృష్టి యొక్క బాహ్యాభ్యంతరములయందు నిండి సంపూర్ణమైన మండలాకారముగా నున్నదో, అట్టి "తత్" అను వస్తువును యెవరు దర్శింపజేయుచున్నారో అట్టి గురుమూర్తికి నమస్కారము.

3) శ్లో॥ చిన్మయంవ్యాపితం సర్వంత్రైలోక్యం సచరాచరం
అసిత్వం దర్శితం యేన తస్మై శ్రీ గురవేనమః

తాత్పర్యము : ముల్లోకములయందలి చరాచరములన్నింటి యందు వ్యాపించియుండునది. తత్, త్వం అను భిన్న భావములు లేక, పాలలో పాలు, నీళ్ళలో నీళ్ళు, కలసిన రీతిగా, ఐక్యరూపముగా నుండు "అసి" అనుదానిని గూడ యెవరు దర్శింపచేయగలుగుచున్నారో అట్టి గురుమూర్తికి నమస్కారము.

ఈ మూడు శ్లోకములకు విశేషవివరణము : ఈ శ్లోకముల యందుపయోగింపబడిన, ముఖ్యమగు శబ్దములకు ప్రత్యేకార్థమును సూటిగా మున్ముందు తెలుసుకొనవలసియున్నది. తరు లతా గుల్మాదులు స్థావరములు, మానవ, పశు పక్షి క్రిమి కీటకాదులు జంగమములు.

1) వ్యాప్తం (వ్యాపితం) అను శబ్దములు నుదాహరణచే సువ్యక్తములు అగును. బెల్లము నందు తీపి, కాష్టము (కర్ర) యందు సామాన్యాగ్ని యేరూపముగా వ్యాపకముచెంది సూక్ష్మరూపముగా నున్నదో అట్లు వ్యాపించినది అని అర్థము. యీ సందర్భములో

సీ॥ ధరణిలో తిలలందు తైలముండిన రీతి
దారువయందున్న దహనురీతి
నాణెమౌదధి యందు నవనీత మున్నట్లు
పుష్పమందున గంధమున్నయట్లు
రంజిల్లు ఫలమందు రసము కల్గిన భంగి
చేలమందున్నట్టి నూలు భంగి
తారహారాదుల దారముండినరీతి
యిసుకరాళ్ళందున్న యినుముతీరు

తే॥గీ॥ నఖిలజగముల సకల దేహంబులందు
నిండియుంటవి యీ రీతి నిజముగాను
రమ్యగుణధామ భద్రాద్రిరామ పరశు
రామ నరసింహదాసు సంరక్షితాహ్వ॥

అను భద్రాది రామ శతకములోని పద్యమును గమనించదగును.

2) పదము = శబ్దము. స్థానము. చిహ్నము అను అర్థములు మాత్రమే యిట్ల న్వయమగును. పదార్థము అను మాటకు పదముచే (అనగా శబ్దముచే) సూచింపబడు వస్తువు అనియు, శబ్దమునకుగల అర్థము అనియు రెండర్థములు గలవు.

3) దర్శితం = చూపబడినది. యీ శబ్దార్థములను మనసునందుంచుకొని యీ శ్లోక విశేషములను గమనించవలసియున్నది.

ఈ శ్లోకములలో "త్వం, తత్, అసి" అను పదములు (శబ్దములు) వాడబడినవి. సామవేదీయ ఛాందోగ్యోపనిషత్తులోని "తత్వమసి, శ్వేతకేతో. త్వమేవ తదసి" అను వాక్యమునగల "తత్వమసి" అనునదే స్వరూప సాక్షాత్కారమాసించిన సచ్ఛిష్యునకు గురువు ఉపదేశించు మహా వాక్యము గనుక దానికి యుపదేశవాక్యమని పేరువచ్చినది. తత్=అది. త్వం = నీవు. అసి= అయితివి అని శబ్దార్థములు. అది నీవైతివి. అని దండాన్వయరూపముగా అర్థము సిద్ధించుచున్నది.ఈ వాక్యమునకే, వాచ్యార్థము (లేక ముఖ్యార్థము) చే జీవేశ్వరైక్యమును. లక్ష్యార్థముచే ప్రత్యగ్బ్రహ్మైక్యమును ప్రతిపాదింపబడినవి. అట్లు ప్రతిపాదించుటపట్ల కేవలము పదములకు (శబ్దములకు) గల అర్థమునే స్వీకరించుట చాలదు. పదములచేత సూచింపబడిన అర్థములను (వస్తువులను) గ్రహించవలసియుండును. అవియే పదార్థములుగాని కేవల శబ్దార్థములే పదార్థములు గావు. మహావాక్యమునందలి పదపదార్థములను అన్వయ వ్యతిరేక యుక్తులచే శోధించినయెడల మాత్రమే మహావాక్యార్థము అవగతమగునని శాస్త్రములు చెప్పుచున్నవి. వాక్యార్థమును భాషా పరిజ్ఞానముచేతను, దృష్ట ద్రాష్టాంతములచేతను అన్వయ వ్యతిరేకయుక్తుల చేతను. యెట్లు సిద్ధాంతము చేసినారో పరిపూర్ణ దర్శనము మహావాక్య ప్రకరణములో వివరింప బడినది. కాని తర్కవితర్కములచేతను యుక్తి ప్రయుక్తులచేతను బుద్ధి నిశ్చయమే కలుగ గలదు గాని ఆత్మ నిశ్చయము (సాక్షాత్కారానుభవము) కలుగ జాలదు. కలిగినట్లు సంతోషించుట తన్నుతాను మోసగించుకొనుట మాత్రమే కాగలదు. ఏలననగా, ద్వైతాద్వైత, విశిష్టాద్వైతాది మత వాదములు మహావాక్యములకు భిన్న భిన్న అర్థములు చెప్పుచున్నారేగాని ఏకాభిప్రాయమునకు రాలేకపోయిరి. కారణము? భిన్నభిన్న దృక్పథములు బూని దానికి సరిపడునట్లు వాదనా చాతుర్యముచే వాక్యార్థమును మలచుకొనుటకు ప్రయత్నించినారు. టోపీ నొకదానిని తెచ్చి అది తలకు సరిపోకపోతే తలనే చెక్కివేసినట్లుగా తమతమ సిద్ధాంతములకు సరిపడునట్లుగా వాక్యార్థమును చిందర వందర గావించిరి. అందుకే శ్రీకృష్ణదేశిక ప్రభువరులు "మతములవారలు తమ సమ్మతమైనటువంటి శాస్త్రమర్యాదలచే. మిత మేరుపరచుకొని బహుగతులను కలహింతు రట్టి గతి నీ కేమిటికీ, చపలత చెందే స్థితి నీ కేమిటికీ." అన్నారు.

కనుక శాస్త్రవ్యాసంగముచే మహావాక్యార్థ జ్ఞాన మారూఢము కాజాలదు. కనుకనే

శ్లో॥ శాస్త్రజ్ఞానం బహుక్లేశం, బుద్ధేశ్చలన కారణం
ఉపదేశాద్ధరే ద్బుధ్యా రమతే సర్వకర్మసు॥

శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
వుపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్వ దర్శినః॥

అని భగవద్గీత యున్ను చెప్పుచున్నవి. సద్గురువులు "సాక్షాత్కృత ధర్మాణః" ధర్మమును సాక్షాత్కరింప చేసుకొన్నవారు. తమతమ గురువులచే వస్తునిశ్చయముగా (తత్వమును)

పదార్థములను దర్శించిన వారూ గనుకనే తమ శిష్యులనుగూడ దర్శింపచేయగలరు.

దర్శితం యేన- ఎవరిచే చూపబడినదో అని శ్లోకములందు చెప్పబడినది గదా! నిరాకార వస్తువును యెట్లు గురుమూర్తి చూపగలడు? చర్మచక్షువులకు గోచరింపచేయునని ఎవరైనా అంటే అది పొరపాటే అవుతుంది. అట్లా దృశ్యరూపముగా కనవచ్చినదేదో అది భ్రాంతి రూపము మాత్రమేనని చెప్పక తప్పదు. నేత్రము రూపమున్న దానినే గుర్తించును. పంచవిషయములగు శబ్ద స్పర్శ రూప రస గంధములులేని పరమాత్మను యే యింద్రియముతో గుర్తించగలడు? ఆయా విషయములను గుర్తించు శ్రోత్ర త్వక్చక్షు ర్జిహ్వా ఘ్రాణములచే గుర్తించ లేడు గాని "మనస్సృష్టాణీంద్రియాణి" అని చెప్పబడిన మనస్సుచే అది గుర్తించ తగినదైయున్నది. కనుకనే "మనసై వానుద్రష్టవ్యం" అని "ఆత్మావారేద్రష్టవ్యం" అనీశ్రుతులు గూడ చెప్పుచున్నవి. మనస్సుచే గూడ గుర్తింపరాని దొక్క పరిపూర్ణ పరబ్రహ్మము అని తెలియవలెను. కాని మనస్సు కూడా ఇంద్రియ రూపముగానేవుండి ఆత్మను దర్శింపజాలదు. అది అతీంద్రియ స్థితిలోనే గుర్తించవలసి ఉంటుంది. అనగా తన కాధిభౌతికములుగానున్న సంకల్ప వికల్పములను వదలితాను నిరీంద్రియమై ఆత్మ స్వరూపస్థితి తాను చెందుట రీత్యానే దానిని తెలియవలసియున్నది. ఇందులకు

"ఏషు భూతేషు సర్వేషు
గూఢాత్మాన ప్రకాశతే
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా
సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః"

అనిన్నీ "బుద్ధిగ్రాహ్య మతీంద్రియం" అనిన్ని శ్రుతిస్మృతులలో చెప్పబడినది. నిశితమైన సూక్ష్మబుద్ధి, లేక అతీంద్రియమైన బుద్ధిచే అది గ్రహింపవలసియున్నది. మనస్సు పరిణామమే బుద్ధిన్ని కనుక "మనసైవానుద్రష్టవ్యం" అని చెప్పబడినది.

ఈ మూడు శ్లోకార్థములను ఒక్క కందార్థములో శ్రీకృష్ణదేశిక ప్రభువులు యెట్లు సూటిగా చెప్పినారో గమనించదగును.

కం॥ "పిండబ్రహ్మాండంబులు రెండును
యీ రెంటిలోను రెండహములు
యాఖండములు నాల్గుగూడి
అఖండంబగు ఎరుకరూపుగనరా మాతండ్రీ
యిది దెల్పిన ఘనుడే తల్లిదండ్రీ"

అన్నారు. పిండాండములయందలి అహమే "త్వం" పదార్థము (శబ్దముచే సూచింపబడిన వస్తువు) బ్రహ్మాండమందలి అహమే "తత్" పదార్థము. అఖండంబగు యెరుకరూపే "అసి" పదార్థము. అనిన్ని అట్టి అఖండ రూపమగు ఎరుక గనరా అనిన్ని అట్టి వీనిని వస్తు నిశ్చయరూపముగా నీకు తెల్పిన గురుడే తల్లిదండ్రి అనిన్ని తెలియచేయబడినది. "తత్త్వమసి" వాక్యములో చెప్పబడిన అర్థము మాత్రమే గాకయింకనూ విశేషరూపమగు అఖండార్థమే కందార్థములో చెప్పబడినది. ఎట్లనగా మహావాక్యవిచారణలో, జహదజహల్లక్షణచే (భాగత్యాగ పద్ధతిచే) తత్, త్వం అను పదములయందలి విరుద్ధాంశములను త్యాగముచేస్తేనే మహావాక్యార్థ మవగత మగునన్నారు. ఆవిధముగా యే విరుద్ధాంశములను గాని యే భాగములనుగాని త్యాగము చేయకుండానే

శ్రీకృష్ణదేశిక ప్రభువులు అఖండార్థమును ప్రతిపాదించిరి. పైగా పిండబ్రహ్మాండములు అనే రెండు ఖండములులుగూడా గూడితేనేగాని అఖండంబగు యెరుకరూపుగాదని ప్రతిపాదించిరి. యిది యెట్లో ఆ రహస్యమును దెల్పిన గురువే నీకు తల్లి దండ్రి సుమా అని హెచ్చరించినారు.

"సర్వం ఖ ల్విదం బ్రహ్మ." అని, "బ్రహ్మణోన్యం న కించనం" అనీ, శ్రుతులు ఘోషించు చుండగా, మహావాక్యార్థజ్ఞానము కలుగుటకై విరుద్ధాంశ పరిత్యాగము చేయుమని చెప్పుట పై శ్రుతులకు కొన్ని మినహాయింపులు చెప్పినట్లే కాగలదు. విరుద్ధాంశములను సమన్వయించి పిండ బ్రహ్మాండంబులు వానియందలి అహములు యీ నాలుగూ చేరితేనే అఖండమగు ఎరుక రూపమగునవి అచల ఋషులు సాధించినారు. కనుక అట్టి గురుగోప్య విషయములను తెలియపరచి, త్వం, తత్, అసి, పదపదార్థములను వివరించి, దర్శింపజేయుగల సద్గురుమూర్తి కివే నా అంజలులు.

శ్లో॥ చైతన్యం, శాశ్వతం, శాంతం, వ్యోమాతీతం, నిరంజనం
నాదబిందు కళాతీతం, తస్మై శ్రీగురవేనమః

తాత్పర్యము : చైతన్యవంతమున్నూ, శాశ్వతమున్నూ, శాంత స్వరూపమైనదియు ఆకాశమునకు గూడ నతీతమైయున్నదిన్నీ అజ్ఞానములేనిదిన్నీ, నాదబిందు కళలనన్నిటినీ మీరియున్నదిన్ని అగు గురుతత్వమునకు నమస్కరించుచున్నాను.

విశేష వివరణము : యీ శ్లోకమునందలి ప్రతి శబ్దమును వివరించి తెలుసుకొనవలసినది.

1) చైతన్యము అనగా కదలికకు కారణమైనది అని సామాన్యార్థము. దీనికి ప్రతియోగి శబ్దము జడము అనగా కదలికలేనిది. చిజ్జడములు ద్వంద్వములు. చిత్తు అనగా జ్ఞానము. జడము అనగా జ్ఞానము లేనిది. కనుక చైతన్యమను శబ్దమునకు జ్ఞానము అను అర్థము గూడ చెప్పనగును.

కదలికలలో శక్తి గలుగుచున్నది.శక్తిలేనిచో కదలికయున్నూ వుండజాలదు. కనుక చైతన్యమే శక్తి, ప్రాణము చలన స్వరూపము, మరిన్ని కదలికకు కారణమైయున్నది. కనుక చైతన్య మనగా ప్రాణమని అర్థమున్ను చెప్పనగును. చైతన్య మనగా యీ నానార్థములు సిద్ధించుచున్నపుడు యిందే అర్థము గ్రహించవలసియున్నది? అనుశంక కలుగుచున్నది కాని యీ అన్ని లక్షణములు గూడ వుపలక్షించియే చైతన్యమను శబ్దము యిందు ప్రయోగించప బడినదని చెప్పనొప్పును.

కనుక జ్ఞానము, ప్రాణము, శక్తి, కదలిక అను వానియన్నిటికి మూలకారణముగా నున్నదే పరబ్రహ్మతత్వము అని చైతన్య శబ్దముచే గ్రహింపవలెను.

2) శాశ్వతం : ఆ పరబ్రహ్మ తత్వము మూడుకాలముల యందునుండి కాలముచే బాధనొందని సత్పదార్థమైయున్నది. కార్యరూపములైన జీవేశ్వర జగత్తులు ఉత్పత్తి, స్థితి లయములు చెందుచున్నను కారణరూపముగానుండి అధోరూప వూర్ధ్వరూప పరిణామములు చెందుచుండు యీ పరబ్రహ్మతత్వము శాశ్వతముగానున్నదిఅని చెప్పబడినది. కాని మార్పు చెందునది ఎల్లమాయపయనియే చెప్పవలెను. కనుక యిది మాయాశబళిత బ్రహ్మమేగాని పరిపూర్ణ పరబ్రహ్మముగాదు. త్రికాలాబాధ్యమైనదని యిది అభివర్ణింపబడుచున్నది. ఏలననగా, అది సృష్టి కారణమగు వస్తువు గనక సృష్టికి పూర్వము వున్నది తానే నా నామరూపాత్మకముగానూ సర్వస్వరూపములుగానూ ప్రకటనమైనది గనుక సృష్టి యున్నప్పుడున్నూ యున్నది.

ఆభరణములు చెడిపోయినను. బంగారము నిలచియే యుండునటుల నామరూపాత్మక విశ్వము ప్రళయము చెందిననూ కారణ రూపముగా ఈ పరబ్రహ్మ వస్తువు శేషించుచునేయున్నది. నశించుచున్నవి నామరూపాలేగాని. వస్తువుకాదు. వస్తువు క్రొత్త నామ రూపాలను పొందుచున్నది. వస్తువు శాశ్వతం. వస్తువునకు నాశనములేదు.అని చెప్పబడినది. వస్తువు శాశ్వతము దాని నామరూపాలు అశాశ్వతము అన్నపుడు ఆ వస్తువునకు శాశ్వతాశాశ్వ లక్షణములు రెండున్నూ యున్నట్లే కేవల శాశ్వత లక్షణముగల పరిపూర్ణ పరబ్రహ్మ మిందు చెప్పబడలేదని గుర్తించవలెను.

3) శాంతం : కోపము లేకుండట శాంతమని సామాన్యార్థము. కోపలక్షణములు పైకి తోచబడకుండా జాగ్రత్త పడినంతమాత్రమున అది శాంత మనరాదు. అది బలాత్కారముగా అణగద్రొక్కుటయే యగును. లోలోపలగూడ యెట్టిమార్పు కలుగకుండవలెను. అనగా అంతఃకరణమునందు యెట్టి వికారము కలుగరాదు. ఒక్క కోపమే గాక, కామ, క్రోధ. లోభ. మోహ భయాది దుర్వికారములుగాని సుఖసంతోష, ఆనందోత్సాహ ద్యుద్రేకములుగాని లేకయుండుటయే నిజముగా శాంతము. అనగా అంతఃకరణ ధర్మములగు శుభాశుభ లక్షణములు ఏమిన్ని లేకున్ననే శాంతి లేక శాంతము. యిట్టి ప్రశాంతి అంతఃకరణ రహితము నందుగాని సాధ్యముగాదు. వ్యష్టి సమిష్టిరూప అంతఃకరణములుగా పరిణమించక పూర్వము అనగా సృష్టికి పూర్వము తాను తానుగా నున్న నిస్సంకల్ప స్థితియొక్కటే నిజమగు శాంత స్థితి అనిచెప్పనగును.

4) వ్యోమాతీతం : వ్యోమ మనగా ఆకాశము, "ఆత్మనః ఆకాశ స్సంభూతః" ఆత్మనుండి ఆకాశము పుట్టుచున్నది. కనుక ఆకాశమున కతీతముగానున్న దాత్మయే, అంతకన్న గొప్పదగు స్వరూపము లేదు. కనుక అదియే గురుస్వరూపము. అంతేకాని. పిండాండము నందున్న ప్రత్యగాత్మ వ్యోమాతీతముగాదు. కనుక వ్యోమాతీత మనగా సర్వాధిష్ఠానమగు పరమాత్మనే చెప్పవలెను.

5) నిరంజనం : మలినమగు అజ్ఞానముగాని అజ్ఞానకార్యములుగాని లేక అఖండ జ్ఞానస్వరూపము నిరంజనమని చెప్పబడుచున్నది. అందు అజ్ఞాన లక్షణములు తోచబడక పోవుటచే నిరంజన మన్నారుకాని అది అజ్ఞానమున కాశ్రయమైయున్నదనే విషయము మరువరాదు.

నాదబిందు కళాతీతం : ఎ) నాదము అనగా ధ్వని, యోగాభ్యాసమునందు కుంభించబడిన ప్రాణము నాడులందు వేగముగా సంచరించుటలో కలిగిన ధ్వనులే దశవిధ నాదములుగా తెలియబడుచున్నవి. ఇవి అనాహత శబ్దములు. అనగా దేనిచేతను కొట్టబడకనే కలుగు శబ్దములు. ఇది విని బ్రహ్మమునందు ధ్వన్యాత్మకముగానున్న ప్రణవనాదము వింటిమనుకొనుట సరిగాదు ఈ అనాహత శబ్దరూపమగు నాదమునకు బ్రహ్మము అతీతముగా నున్నదని చెప్పబడినది.

బి) బిందువు : నిశ్చలమై నివాత దీపమువలె యెట్టి సంకల్పాదులు లేనిదగుటచే అతీంద్రియమై నిలచిన బుద్ధిబిందువు అని చెప్పబడినది. యిదికూడా యోగమునందు అరికట్టబడుట మూలముగా ప్రాణము మనస్సుతో సంయోగ పడకపోవుటచే మనస్సునకు సంకల్ప వృత్తులేమియూ నుండవు. బ్రహ్మాకార వృత్తియున్ను వుండదు కనుక బ్రహ్మము యీ బిందువునకు గూడ నతీతమైయున్నది.

సి) కళ : అనగా వివిధములగు చిత్రవిచిత్రదృశ్యములు చిత్కళలుగా వర్ణింపబడినవి. అపోజ్యోతియు. దానిపండువెన్నెల కాంతియూ యీ దృశ్యముల కంత్యమున కానవగును. పంచముద్రలలో యే ముద్ర నభ్యసించినా దృష్టినిలచిపోవును. అట్లు నిలచిపోయిన దృష్టికి గోచరమగు భావనారూప దృశ్యములే చిత్కళలు. బ్రహ్మమున కేవర్ణమూలేదు. అది దృశ్యవస్తువేకాదు కదా!

కనుక బ్రహ్మము నాదబిందు కళలకు అతీతమని చెప్పబడినది. తారకయోగమున యీ నాదబిందు కళానుభవము కలుగును. మనస్సునకు ఏకాగ్రత చేకూరును. అంతేగాని అఖండ సాక్షాత్కారము సిద్ధించదు.

గురుముఖతః ఆత్మవస్తునిశ్చయ జ్ఞానము పొందినవానికే స్వరూప సాక్షాత్కారము కలుగును గాని యితరులకు సాధ్యముగాదు. కనుకనే "గురోర్ముఖేన జ్ఞాతస్యం నాన్యధా గ్రంథకోటిభిః" అని పెద్ద లన్నారు. కనుకనే "తస్మై శ్రీగురవేనమః" అని ఆ గురుమూర్తి యొక్క సగుణ నిర్గుణ రూపములను నిత్యము స్మరించు కొంటూనే వుందాము.

శ్లో॥ నిర్గుణం, నిర్మలం, శాంతం. జంగమంస్థిర మేవచ
వ్యాప్తం యేన జగత్సర్వం. తస్మై శ్రీగురవేనమః॥

తాత్పర్యము : నిర్గుణము, నిర్మలము, శాంతమూర్తినై యుండదేనిచే జగత్తంతయు వ్యాపింప బడియున్నదో అట్టి గురుతత్వమునకు నమస్కరించుచున్నాను.

విశేష వివరణములు : 1) నిర్గుణము 2) నిర్మలము 3) శాంతము 4) జంగమస్థిరములు 5) వ్యాప్తము.

1) నిర్గుణము = నిర్ + గుణము = అనగా గుణములు ప్రకటము కానిది. గుణములు మూడు 1) సత్వగుణము 2) రజోగుణము. 3) తమోగుణము. సృష్టి కారణమగు బ్రహ్మమునందు యీ త్రిగుణములు గర్భీకృతమై మహా సూక్ష్మముగా బీజరూపములో నున్నవి. కనుకనే సత్వగుణ ప్రధానమగు మాయాశక్తియు దేవతా గుణములున్ను, రజోగుణ ప్రధానమగు ప్రాణశక్తియు జీవసృష్టియు తమోగుణ ప్రధానమగు జగత్సృష్టియు దానినుండి ప్రకటితమైనవి. కారణమునుందు త్రిగుణములుండుటచేతనే కార్యరూపమునందవి కానవచ్చుచున్నవి. త్రిగుణములు లేశమైనను లేని దొక్క పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే. అది కార్యాకారణముల రెండూగానిది అందుచేత నది శుద్ధ నిర్గుణమని చెప్పబడినది. నిర్గుణ మనగా త్రిగుణ లక్షణములు కానరానిది మాత్రమేగాని గుణములు అసలే లేనిదిగాదు అని గుర్తించవలెను. ఈ శ్లోకములో గురుతత్వము (గురుస్వరూపము) నిర్గుణమని వివరింపబడినది.

శ్లో॥ "గుకారశ్చ. గుణాతీతో. రూపాతీతో రుకారకః
గుణరూప విహీనత్వా ద్గురురిత్యబిధీయతే"

అని గురుగీత అన్యత్రా గురుశబ్దమును వివరించినది. గురుతత్వము గుణముల నతిక్రమించు టచే గుణాతీతము మాత్రమేగాని గుణరహితముకాదు. త్రిగుణములున్నా వానిలక్షణములచే అది బాధింపబడుటలేదు. కనుక అతీతము అన్నారు. కాని సృష్టికి పూనుకొన్నపుడు అది త్రిగుణాత్మకమై గుణత్రయ సృష్టికి హేతుర్భూత మగుచున్నది. గురుస్వరూపము గుణాతీతము పరిపూర్ణము గుణరహితమూ అయివున్నవి.

2) నిర్మలం : నిర్మలము అనగా మలములేనిది. మలము అనగా మలినము. వేదాంత

శాస్త్రమునందు మలములు మూడుగాను. కొన్ని యెడల అయిదుగాను నిర్ణయింపబడినవి. మూడు మలములు చెప్పినపుడు 1) అణవమలము 2) మాయామలము 3) కార్మికమలము అని విభజన చేయబడినది. తిరోధానమలము మాయేయమలము అను రెండునూ అదనముగాచేర్చి అయిదు మలములుగా నిర్ణయింపబడినవి. ఎన్ని మలములు చెప్పినా ఈ మలములన్నియూ వ్యష్టిరూపమైన అంతఃకరణకు చెప్పబడినవి. వ్యష్టి సమిష్టిరూపమైన అంతఃకరణగా పరమాత్మ పరిణమింపక పూర్వము ఈ మలములు వుండుటకు తావులేదు. అనేక పూర్వజన్మ కర్మవాసనలు అంతఃకరణలో క్రమశఃఘనీభవించి ప్రాణుల యొక్క శీలసంపదయు వారి ప్రవృత్తియు నేర్పడి జీవులను నూతన కర్మలకు ప్రేరేపించుచున్నవి. ఈ ప్రేరణకు పై విధముగా పరమాత్మయొక్క బాధ్యత ఏమీలేదు. "బుద్ధిః కర్మానుసారిణి" అనున్యాయముగా ఈ ప్రేరణలకు జీవుల వ్యష్టి అంతఃకరణలే కారణము. కనుక ప్రళయకాలమందు సకల జీవోపాధుల యొక్క కర్మవాసనలు పరమాత్మ స్థానమునందే బీజరూపముగా వుండుటవలన వానికి పరమాత్మయే కట్టకడపటి శరణాలయమై యున్నది. అయిననూ తనయందే వున్నప్పటికీ పరమాత్మ వానిని అంటక వానివల్ల బాధింపబడక నిర్వికారముగా నుండును. కనుక పరమాత్మ "నిత్య శుద్ధ పవిత్రోసౌ" అని కీర్తింపబడుచున్నాడు.

సృష్టికి పూర్వము, పూర్వపూర్వ సృష్టులయందలి జీవ సంస్కారములన్నియూ పరమాత్మ యందే నిక్షిప్తమైయుండి ఉత్తరోత్తర సృష్టుల యందు ఎవరి సంస్కారములు వారు గైకొని జీవులు మరల జన్మించుచుందురు. సృష్టియందు తోచు వైవిధ్యమంతయూ పరమాత్మయందే అణిగిమణిగి యుండి సృష్టిలో రూపనామములు దాల్చుచుండును. ఈ విధముగా చూచినచో పరమాత్మ కేవలము నిర్మలుడు కాడు. సృష్టిలోనున్న సమస్తమునకు ఆ పరమాత్మయే బీజరూపుడుగా నున్నాడు. బీజమునందు వృక్షమంతయూ ఇమిడి యున్నట్లే కార్యరూపమగు సృష్టియంతయూ పరమాత్మ యందు ఇమిడి యున్నందున పరమాత్మ శుద్ధ నిర్మలుడని చెప్పుటకు వీలులేదు. శుద్ధ నిర్మలమై యున్నది ఒక్క పరిపూర్ణ పరబ్రహ్మమే పరమాత్మయందు కేవల నిర్మలత్వము లేదు. సాపేక్షికముగా మాత్రమే సృష్టియందలి మలినాంతఃకరణములతో పోల్చినపుడు మాత్రమే పరమాత్మ నిర్మలమని చెప్పదగియున్నది.

3) శాంతం:- అంతఃకరణ వృత్తులు ఉపశమనము పొందిన స్థితి అంతఃకరణ స్థూలధర్మములగు కామక్రోధాదులు యేమియూ లేకుండుటయే శాంతముగాని క్రోధ మొక్కటియే లేకుండుట శాంతము కాదు. అంతఃకరణములో ఒకప్పుడు తాత్కాలికముగా మాత్రమే ఇట్టి శాంతస్థితి ద్యోతకమగుచున్నది. సాధనలచేత బలాత్కారముగా అణచిపెట్టననూ కామాదులు పూర్తిగా నశించక పైకి పొడచూపుటకు అనువైనసమయము కొరకై నిరీక్షించుచుండును. పరిపూర్ణబోధ ఆరూఢమై పరిపూర్ణపరబ్రహ్మమునందు అంతఃకరణగాని దాని వృత్తులు లేనేలేవని స్థిరపరచుకొని అశరీరస్థితియందున్న మహాత్మునికిగాని శాంత స్థితిలేదు. అట్టి అశరీర స్థితిలో అంతఃకరణమున్ననూ అది నిర్వీర్యమై వుండును. గనుక ఏవిధముగాను అట్టిస్థితిపరుణ్ని బాధింపనేరదు. సృష్టికారణమైన పరమాత్మ సృష్టికి పూర్వము తాను తానై ఉన్నప్పుడు నిస్తరంగ సముద్రమువలె నుండును. అపుడు త్రిగుణములు కార్యరూపము వహించని స్థితి అగుటచే వ్యష్టి సమష్టి అంతఃకరణములుగాని, వాని వృత్తులుగాని లేవు. అపుడు మాత్రమే పరమాత్మ శాంత రూపస్థితిలోనున్నదిగాని ఆబ్రహ్మమునకు అహం స్ఫురణగలిగి నేను

అనేకముగుదునుగాక అను సంకల్ప రూప ప్రథమ చలనము కలిగినవెంటనె త్రిగుణములు విజృంభణై గుణసృష్టికి కర్తృత్వ. భోక్తృత్వములు గలుగుచున్నవి.

గనుక సృష్టికారణమగు పరమాత్మస్వరూపము "శుద్ధేసుషుప్తి దృష్టాంతం" అనిచెప్పబడిన రీతిగా సుషుప్తాఅవస్థలో నున్నపుడు మాత్రమే నిర్గుణము. నిర్మలము. శాంతము అయివున్నది. జీవేశ్వర జగత్తుగా పరిణామము చెందినపుడు ఆ పరమాత్మయే సగుణముగాను. మరల సంయుక్తముగానూ. అశాంతస్థితిలోనికిని మార్పు చెందుచున్నది..

ఆ విధముగా సర్వద్వంద్వములుగాను తానే అగుచున్నది. అంతఃకరణమే లేని కేవల పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే కేవలము నిర్గుణముగాను. నిర్మలముగాను. శాంతముగాను యున్నది గాని పలుకున పలుకగరాని పరిపూర్ణ పరబ్రహ్మమును యే పలుకుల చేతను వర్ణింపరాదు కనుక దానిని యేమనీ అనరాదు.

4) జంగమం స్థిర మేవచ:- జంగమములనగా కదిలే ప్రాణులు. కదలని ప్రాణులు. స్థిరములని. స్థావరములని పిలవబడుచున్నవి. ఈ వివిధ రూపములగు ప్రాణులలోనూ. పరమాత్మయే వ్యాపక రూపముగా నిండియున్నది. దేహి సత్యం. దేహమసత్యం. సూక్ష్మం సత్యం. స్థూల మసత్యం అనుటకే మాత్రము వీలులేదు. ఒక్క పరమాత్మయే విశ్వగతమును. విశ్వాతీతమును కూడా అయివున్నది. అంతయూ పరమాత్మయేగాని అన్యమేమీ లేదని శ్రుతిస్మృతులు ఉద్ఘోషించుచున్నవి.

శ్లో॥ "బ్రహ్మై వేదం విశ్వమిదం వరిష్టం" "బ్రహ్మణోన్యం"
న కించ న "సర్వం ఖ ల్విదంబ్రహ్మ"

ఇత్యాది శ్రుతులన్నియూ ఈ సత్యమునే పలుకుచున్నవి. ఇందుకు విరుద్ధముగా చెప్పినయెడల "ఏక మేవ అద్వితీయం బ్రహ్మ" అను శ్రుతి భంగమై అద్వైతహాని వాటిల్లుచున్నది. అద్వైతమత ప్రతిష్ఠాపనాచార్యులగు ఆది శంకరులవారు ఆదిలో దేహమే నేననుకున్న వానిని చూస్తే సచేల స్నాన మాచరించవలె నని చెప్పినప్పటికి చివరకు "యధా మృణ్మయో కుంభం తద్వత్ దేహోపి చిన్మయః" అంటూ దేహము కూడా చిన్మయ స్వరూపమగు ఆత్మస్వరూపమే అని ఒప్పుకొనకతప్పలేదు. ఇదే అద్వైతమునకు పరాకాష్ట అయియున్నది. పరిపూర్ణభావమందు ఉన్నవి రెండే వస్తువులు 1) పరిపూర్ణము 2) లేనెరుక "పరిపూర్ణ మొకటి దక్క ఇతరమైన ప్రపంచమెల్ల తగ తెలియము నీ వెరుకేనని మదిలోపల" అని శ్రీకృష్ణదేశికేంద్రులవారన్నారు. గనుక ఉపాధిగాను. నిరుపాధికముగాను ఎరుకే వ్యాపకమైయున్నది. అని చెప్పబడెను.

5) వ్యాప్తము:- అనగా వస్తువునందు అణువణువున. అణువు లోపల. బయట కూడా నిండియుండుట. ఉదాహరణకు బెల్లమునందు సర్వత్రా తీపి వ్యాపించియున్నది మరిన్ని ఆకాశమునందు శబ్దము వాయువునందు స్పర్శ. అగ్నియందు రూపము. జలమునందు రసము. పృథివియందు గంధము అట్లే వ్యాపించియున్నవి. అట్లే ఈ పంచభూతములకంటే సూక్ష్మమగు ఆత్మ ఈ పంచభూతములయందు వ్యాపించియున్నది. కనుకనే శ్రుతి "అణో రణీయాన్మహతో. మహీయాన్ అనగా ఆత్మ అణువుకంటె చిన్నది, మహత్తుకంటె పెద్దది అయియున్నది. అనుటలో ఆ పరమాణువులోనూ. మహత్తుకు బయటనున్నూ. కూడా ఆత్మ వున్నదని అర్థము కనుక "సర్వభూత స్థమాత్మానం. సర్వభూతాని చాత్మని" అని గీత చెప్పుచున్నది. అనగా సర్వభూతము

లలోనూ. ఆత్మయున్నది ఆత్మలో సర్వభూతములు యున్నవి. అని అర్థము. మహా సూక్ష్మాతి సూక్ష్మమగు ఆత్మయందు స్థూలమగు ఏ వస్తుజాతము కలదో ఆ వస్తువు నందు కూడా ఆత్మ వ్యాపకమై యుండు నన్నమాట అంటే ఆత్మ ఆ వస్తువునకు కాళీ యిచ్చుటకై ఏదీ ఇటు. అటు కదల నవసరంలేదు. ఇట్లు ఆత్మసర్వవ్యాపకమైనా దానికొక ఆవరణము కలదు. ఆకాశము ఆవరణము కలిగియున్నదని సూదిమోపటానికి కూడా సందులేని పరిపూర్ణమందు ఆకాశముండు టకు స్థానమే లేదనిన్ని సిద్ధాంతం. ఆకాశమనగా దేశము లేక ప్రదేశము దేశకాలాతీతమైనది పరిపూర్ణం. ఆకాశముకంటె సూక్ష్మమగు ఆత్మఆకాశ ఆవరణమునందే వుండగలదుగాని దానిని మీరి యుండజాలదు. బెల్లమునందుగల తీపిబెల్లము యొక్క ఆవరణమునకు బయట వుండజాలనట్లే అని తెలియవలెను. ఆత్మ ఆకాశాలు రెండునూ తీపి బెల్లములవలె ఉన్నందుననే" ఆకాశశ్శరీరం బ్రహ్మ" అనిశ్రుతి చెప్పినది. ఏ శరీరము చూచినా దాని తెలివి ఆ శరీర ప్రమాణము నకు పరిమితమై యున్నది కాని దాని నతిక్రమించి యుండజాలదు. తెలివియందు దేహము. దేహము నందు తెలివి ఓతప్రోతమై సమాన ప్రమాణములో నున్నవి. ఈ దృష్టితోనే దేహిదేహములు రెండూ ఒక్కటే అని సిద్ధాంతీకరించబడియున్నది. శ్రీకృష్ణదేశి కేంద్రులు తమ కందార్థములో "అంతట కలదీ ఎరుకని ఎంతో వాదింపుచుందురెరుగని వారల్, అంతట నింతట కనబడునంతటిదే కాని ఎరుక అంతట కలదా!.......అని ప్రశ్నిస్తున్నారు. అంటే వస్తువులున్న చోట ఆ వస్తువు పెద్దదైనా చిన్నదైనా వస్తువుయొక్క ఆవరణ మందంతట ఎరుక వ్యాపకమై యున్నది. ఆత్మకు శరీరభూతమై, ఆవరణమైయున్న ఆకాశమునందే అది వుండగలదు కాని. ఆవరణరహితమగు పరిపూర్ణ పరబ్రహ్మమునందు వుండజాలదు. అని అర్థము గ్రహించవలెను. ఆవరణము ఎంతపెద్దదైనా దానికి ఒక మితివుండక తప్పదు. అమితమగు (మితిలేనిదగు) పరిపూర్ణ పరబ్రహ్మమునకు మాత్రము ఆవరణములేదు. కనుక ఆవరణమును ఆవరణమందుండు ఆత్మయును పరిపూర్ణమందుండుట అసంభవము అని తెలుసుకొనవలెను. కనుక ఆవరణ రహితమగు ప్రతి వస్తువునందు ఆత్మ వ్యాపకమైయున్నది. కాని ఆవరణరహితమగు పరిపూర్ణమునందు మాత్రము ఎరుకగాని, ఎరుకయొక్క వ్యాపకముగాని ఏమీలేవు. ఇట్టి పరిపూర్ణ మెరుకలను బోధించు గురుమూర్తికివే మా నమోవాకములు.

శ్లో॥ యత్సత్వేన జగత్సత్వం. యత్ప్రకాశేన భాతితత్
యదానం దేన నందన్తి తస్మైశ్రీ గురవేనమః॥



తాత్పర్యము : ఏ పరబ్రహ్మమున్నందువలననే. యీ సర్వ జగత్తు యుండియున్నదో. ఏ పరబ్రహ్మము ప్రకాశించుటచేతనే యీ సర్వ జగత్తు ప్రకాశించుచున్నదో. ఏ పరబ్రహ్మము ఆనందమే రూపముగా గలిగియుండుటచేతనే యీ జగత్తునందానందమున్నదో. అట్టి పరబ్రహ్మ స్వరూపుడగు సద్గురుమూర్తికి నమస్కరించుచున్నాను.

విశేషార్థము : త్రికాలములయందు వునికిగలిగి అనగా భూత భవిష్యద్వర్తమాన కాలములయందు ఎడతెరిపి లేకుండా యున్నటు వంటి వస్తువేదో అది "సత్" అని చెప్పబడును. నాశనము లేనిదై అఖండ జ్ఞానస్వరూపమై యున్నదానికి "చిత్" అని పేరు అఖండానంద స్వరూపమై యుండుటయే "ఆనందము". బ్రహ్మమునకే సల్లక్షణ, చిల్లక్షణ, ఆనందలక్షణములు స్వరూప లక్షణముగా నిర్ణయించబడినవి. కనుక యీ బ్రహ్మమునకు సచ్చిదానంద బ్రహ్మమని పేరున్నూ వచ్చినది.

శ్రుతి : "యతో వా యామాని భూతాని జాయంం. యేన జాతాని జీవతి. యత్ప్రయం త్యభిసనంవిశంతి. తద్విజిజ్ఞాసర్వ తద్బ్రహ్మేతి" అనగా, దేనినుండి సర్వభూతములు పుట్టు చున్నవో, పుట్టి దేనియందుండి పెరుగుచున్నవో, రూపముల మార్చుకొని తిరిగి దేనియందు ప్రవేశించుచున్నవో, అదియే బ్రహ్మమని తైత్తిరీయోపనిషత్ చెప్పుచున్నది అనగా సృష్టిస్థితి లయములకు కారణమైనదే బ్రహ్మమని తాత్పర్యము. కారణస్వరూపమైన బ్రహ్మముయొక్క లక్షణములు, కార్యరూపములగు ఈశ్వర, జీవ, జగత్తులయం దుండక తప్పదు. సచ్చిదానంద లక్షణములు జగజ్జీవేశ్వరులయందునూ గానవచ్చునా? ఎట్లు? అంటే, అసలు వస్తువుండుటయే సల్లక్షణము. ఆకార, వికార, రూప, పరిమాణాదులచే నది తోచబడుటయే చిల్లక్షణము. ఆ వస్తువు యొక్క ప్రయోజనమును పురస్కరించుకొని దాని యందేర్పడు ప్రియ, మోద, ప్రమోదములే ఆనంద లక్షణము. మానవుని యందీ సచ్చిదానంద లక్షణములు మరీ ప్రస్ఫుటముగా ప్రకాశించుచున్నవి. ఎట్లనగా , తన పరిసరములయందు సర్వత్ర, సర్వులూ, జాతి, మత, కుల, ధన, విద్యా, వయో, రూప, నీచోత్తమాది తారతమ్యములేమియు లేక, మరణము పాలగుచున్ననూ తానుమాత్ర మింతలో చనిపోదునేమోయను భయలేశమైనను, ఏ మాత్రము తనకు తోచబడకపోవుటయేగాక యింకా యెంతో కాలము తాను బ్రతుకగలనని భ్రాంతి పొందుచుండుటకు కారణమేమని యోచిస్తే, తన స్వరూపలక్షణమందు తాను త్రికాల బాధ్యుడగు సత్స్వరూపుడుగా నుండుటయే కారణము అని అనవలసియున్నది.

"నీ కేమీ తెలియదు" అని పరులు తనకజ్ఞానమారోపించితే, తానేమాత్రమూ సహించక పోవుటయేగాక, తన్నెంతో అవమానించి నట్లు భావించుటకు, మరియు తనకు తెలియనదంటూ యేదీ వుండరాదని సర్వమూ తాను తెలిసికొనవలెనని, ఆకాంక్షిస్తూ వుండుటకు, స్వరూపస్థితియందు తా నఖండ జ్ఞానస్వరూపుడగు చిత్స్వరూపుడై యుండుటయే కారణము.

సర్వకాల సర్వావస్థలయందూ ఆనందము మాత్రమే కోరుకొంటూ అందు నిమిత్తమై యెట్టి పాపకార్యము లాచరించుటకున్ను వెనుకాడకపోవుటకు కారణము స్వస్వరూప స్థితియందు తానానంద స్వరూపుడై యుండుటయే. యీ విధముగా మానవుని యందు సచ్చిదానంద లక్షణములు ద్యోతకములగుచున్నవి.

అట్లే ప్రాణభీతి, ఆహార సముపార్జనా విషయములలో తల్లివలన తెలివి సంపాదించు. శరీర సుఖమునకై ప్రాకులాడుటబట్టి పశుపక్ష్యాదులయందునూ సచ్చిదానందము లేదోరీతిగా భాసిస్తూనేయున్నవి. సచ్చిదానంద స్వరూపమగు బ్రహ్మమే సగుణరూపములో ఈశ్వరుడనిపించు కొనుచున్నందున ఈశ్వరునియందలి సచ్చిదానంద ప్రతీతిని గురించి అభివర్ణించవలసిన పనియే లేదు. యీ విధముగా జీవేశ్వర జగత్తంతయు సచ్చిదానంద మయమైయున్నది.

ఐతే .జగత్తు అనృత జడ దుఃఖాత్మకముగదా! దానిని గూడ సచ్చిదానందాత్మకమని యనజల్లునా? అనజెల్లును ఏలననగా జగత్తు రెంటి యొక్క ద్వంద్వ స్వరూపమైయున్నది. సత్య, అనృతములు, చిత్, జడములు, ఆనంద దుఃఖములు అను ద్వంద్వ లక్షణములు గానవచ్చు చున్నవి. సత్ చిత్ ఆనందములు మాత్రమే ప్రకాశించునపుడు దానిని బ్రహ్మమన్నారు. అనృత జడ దుఃఖాత్మకముగా ఒక దృక్కోణములో గానవచ్చు జగత్తునందు సచ్చిదానంద లక్షణములు గర్భీకృతములై యున్నవి.

శ్లో॥ అస్తి. భాతి. ప్రియం రూపం నామచేత్యంశ పంచకం
ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతోద్వయం॥

అస్తి, భాతి, ప్రియము.రూపము, నామము అను ఐదంశములలో అస్తి, భాతి, ప్రియములు (సచ్చిదానందములు) మూడూ బ్రహ్మలక్షణములనిన్ని నామరూపములు రెండూ జగల్లక్షణము లనిన్ని చెప్పబడినవి. అయితే నామరూపాత్మకమగు జగత్తునందు యీ అయిదు అంశములు కానవచ్చుచున్నవి. నామరూపాదులు భ్రాంతికారకములై నందున, అనృత, జడ, దుఃఖ స్వరూపముగా కూడా జగత్తు దోచబడుచున్నది. ఏరూపముగా ఏనామముతో దోచబడినా మొత్తమంతయు బ్రహ్మస్వరూపమే. కనుకనే "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను శ్రుతి ప్రవర్తిల్లినది.

కనుక జీవేశ్వర జగత్తునందు తోచబడు సచ్చిదానందములకు, సృష్టికారణమగు బ్రహ్మమునందుగల సచ్చిదానందములే మూలము. మూలమనుకుంటె ఆ సచ్చిదానందములే అనుట లెస్స. ఏలనన ఎక్కడ దోచినా వునికి అంతయూ ఆ బ్రహ్మముదే, జ్ఞానమంతయూ ఆ బ్రహ్మముదే, ఆనందమంతయు ఆ బ్రహ్మముదే. ఆ బ్రహ్మమే జీవేశ్వర జగత్తుల కాధారముగా అధిష్ఠానముగా మూలకారణముగా నున్నది. అదియే స్వయం ప్రకాశము, అదియే సర్వమును ప్రకాశింపజేయును. దానిని ప్రకాశింపజేయు యన్యవస్తువు లేదు. "తేన వినా తృణాగ్రమపి న చలతి" అదియే గొప్ప వస్తువు, అంతకంటె గొప్పదేదీ లేదు, కనుకనే అది గురుస్వరూపమని అభివర్ణింపబడినది. అట్టి గురుస్వరూపమునకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ యేన చేతయతా హీదం చిత్తం చేతయతే నరః
జాగత్స్వప్న సుషుప్త్యాది, తస్మై శ్రీ గురవేనమః॥

తాత్పర్యము : ఏ పరమాత్మ యొక్క చైతన్యశక్తిచే, ఈ విశ్వము ప్రవర్తిల్లుచున్నదో, ఆ పరమాత్మ చైతన్యమే మానవుని చిత్తాది యింద్రియములనున్ను అవస్థాత్రయములనున్ను నడుపుచున్నది అట్టి గురుపరమాత్మకు నమస్కారము.

విశేషవివరణములు : 1) యేన 2) చిత్తము 3) జాగ్రత్స్వప్న సుషుప్త్యాది

1) యేన అనగా ఎవరిచేత అని అర్థము. అది పరమాత్మ లేక పరమాత్మశక్తియై యున్నది. రెండును ఒకటే.

శ్లో॥ న తస్య కార్యం కరణంచ విద్యతే. నతత్సమ శ్చాభ్యధికశ్చ దృశ్యతే
పరాస్య శక్తి ర్వివిధైవశ్రూయతే. స్వాభావికీ జ్ఞాన బలక్రియాచ॥

అనగా జ్ఞానబలక్రియలు బ్రహ్మము యొక్క సహజ ధర్మములు. జ్ఞానమునకు సర్వమును తెలియు శక్తి యున్నది బలమనగా చలనాత్మక మైన ప్రాణశక్తి ఈ ప్రాణశక్తిచేతనే సకల క్రియలు జరుగుచున్నవి. కనుక జ్ఞానబలక్రియలు మూడున్ను శక్తియొక్క నామాంతరములేయనదగును. ఈ బ్రాహ్మీశక్తినే ప్రకృతియనీ మాయా శక్తియనీ ప్రాణమనీ నామాంతరములుచే పిలుచుచున్నారు. యీ శక్తి ఎవరిది? బ్రహ్మముదేకదా? అగ్నికంటే అగ్నియొక్క వుష్ణశక్తి లేకదాహకశక్తి వేరుకాదో. అట్లే బ్రహ్మముయొక్క శక్తి బ్రహ్మముకంటె వేరుకాదు. కనుక బ్రహ్మమే శక్తి ఈ శక్తి ఒకటేయయ్యును, పరాప్రకృతియనీ, అపరాప్రకృతియనీ పరాశక్తియనీ. ఆదిశక్తియనీ, జ్ఞానశక్తియనీ, ఇచ్ఛాశక్తియని, క్రియాశక్తియనీ. చేయుపనిని బట్టి నామాంతరములచే వ్యవహరింపబడుచున్నది. బ్రహ్మము వేరనీ శక్తి వేరని అంటే అద్వైతహానిన్ని "ఏకమేవాఽ ద్వితీయం బ్రహ్మ" అని శ్రుతి భంగమున్ను సంభవించుచున్నవి. మరిన్ని పైన పేర్కొన్న "న

తస్య కార్యం..... అనే శ్రుతి. బ్రహ్మమునకు కార్య కారణములుగాని, దాని కంటె అధికమైనదిగాని దానితో సమానమైనది గాని వస్తువులేదనీ. జ్ఞాన బలక్రియలు దానికి స్వాభావికములనీ, ఘోషించుచున్నవి. "తేన వినా తృణాగ్రమపి న చలతి" అనగా దాని శక్తిచే గాక మరొక విధముగా గడ్డిపరకగూడ కదలజాలదు. కనుక యీ బ్రహ్మమే సర్వమూ తానేయై సర్వమును నడిపించుచున్నది. చలించుచున్నదీ చలింపజేయునదీ ఆ బ్రహ్మమే.

2) చిత్తము:- జ్ఞాన మనోబుద్ధి చిత్తాహంకారములను అంతరేంద్రియపంచకములో చింతనాకార్యము చేయునది చిత్తము. మరిన్ని చిత్తమునకు అంతఃకరణము స్మరణముచేసెడి అంతఃకరణవృత్తి, మనస్సు, తెలుసుకొనునది. అను అర్థములు కలవు కనుక చిత్తమనగా అంతరింద్రియములన్ని యు పరమాత్మ ప్రకాశము (లేక చైతన్యము) చేతనే వ్యవహరించు చున్నవి. ఇవన్నియు కరణములు లేక పనిముట్లు మాత్రమే అయివున్నవి. యివేమియు స్వతంత్రముగా ఏపని చేయజాలవు కనుక స్థూలదేహముతోపాటు వీటినన్నటిని జడములన్నారు. ఆ బ్రహ్మములేక పరమాత్మ సమస్త స్థూల సూక్ష్మశరీరములుగా అయినప్పటికి వానిని నడిపించు లేక కదలించు నా పరమాత్మ శక్తి యింకనూ సూక్ష్మాతిసూక్ష్మముగా నున్నది. ఈ పరమాత్మ బ్రహ్మాండ పిండాడముల యందున్నదా? అంటే బ్రహ్మాండమందు పరమాత్మగాను పిండాండమందు ప్రత్యగాత్మగాను రెంటికీ బైట అధిష్టానచేత బ్రహ్మముగానూ నామాంతరము లచే వ్యవహరింపబడుచూ సర్వమునూ క్రియావంతముగా చేయుచున్నది. యింజనునడిపించు వాడు.ఆవిరి సహాయముతో యింజను పని చేయించునట్లు బ్రహ్మమే తెలివి రూపములో కర్తయై ప్రాణరూపములో శక్తియై సర్వబ్రహ్మాండ భాండములకు సర్వజీవోపాధులను నడిపించుచున్నది. జ్ఞానము విశేషముగా గల మనవోపాధియందు ప్రధానేంద్రియమైన చిత్తమున క్రియావంతము చేయుచున్నది. ఈ బ్రాహ్మీశక్తి బ్రహ్మమునకంటె అనన్యమై చిత్తమును క్షేత్రమునందు క్షేత్రజ్ఞుడను పేరుతో సకల వ్యాపారములు చేయుచూ ఏమియు చేయనిదానివలె నున్నందున" తస్య కర్తారమపి విద్యకర్తార మవ్యయం" అని భగవద్గీతయందు కీర్తింపబడుచున్నాడు.

3) జాగ్రత్స్వప్న సుషుప్త్యాది:- జాగ్రత స్వప్న సుషుప్తులను మూడవస్థలు సకల ప్రాణులకు సమానమైయున్నవి. జాగ్రతయందు జ్ఞానముగా స్వప్నమున మనస్సురూపముగా సుషుప్తియందు అజ్ఞానరూపముగానుండి ఒక ఆత్మయే పనిచేయుచున్నది. జాగ్రతయందు ఇరువదియైదింద్రియములతోను స్వప్నావస్థలయందు17 యింద్రియములతోను, సుషుప్తి యందు రెండింద్రియములతోను వ్యవహారము జరుపుచున్నది. జాగ్రతయందు క్రియారూపము గానూ స్వప్నమునుందు భావనా రూపముగాను సుషుప్తియందు క్రియారహితముగాను జరుపుచున్నది. ఈ విధముగా అవస్థలు పరస్పరము భేదించుచున్నవి. కాని మూడవస్థలయందు ఆత్మప్రకాశము మాత్రము సమానధర్మమై అనుస్యూతమై యున్నది. అట్లే ప్రాణము మూడవస్థలయందు ఒకేరీతిగా ఉచ్ఛ్వాస నిశ్వాసలు జరుపుచున్నది కనుక మూడవస్థలయందు మార్పులేని ఆత్మప్రాణములు అనృతార్థములని చెప్పబడుచున్నవి. ప్రతి అవస్థ మిగతా అవస్థలతో భేదించుచున్నది. ఒక అవస్థయందుండి మిగతా అవస్థలలో లేనివి వ్యావృత్త వస్తువులని పేర్కొనబడుచున్నవి. యీ అనువృత్తవ్యావృత్తార్థములతో యీ అవస్థాత్రయములను అన్ని ప్రాణులకు కలిగించి ప్రవర్తింపచేయునది ఏది ? ఆ పరమాత్మ చైతన్యమే.

జాగ్రత్స్వప్న సుషుప్త్యాది అనుటలో, కాలత్రయములు, బాల్యయవ్వన కౌమార వార్ధక్యములు, మొదలగు సమస్త వైవిధ్యములు సూచింపబడినవి. వీని యన్నిటిని నియమించి సృష్టిని మహోత్సవముగా నడిపించునదిగూడ ఆ పరమాత్మ చైతన్యమే. ఒక్క ఆవిరియే అనేకరకములగు యంత్రములను నడిపించునట్లుగా ఒకే విద్యుచ్ఛక్తి అనేక ఉపకరణముల యందు ప్రసరించి వివిధకార్యములను చేయుచున్నట్లు ఒకే ఆత్మ చైతన్యము విశ్వమంతటిని నడిపించుచున్నది. ప్రాణము వ్యష్టిసమష్టి రూపములలో పిండాండ బ్రహ్మాండములను ధరించి భరించుచున్నదిగదా! ఆ ప్రాణశక్తియున్నూ యీ ఆత్మప్రకాశమున్నూ (చైతన్యము) భిన్నములా? అభిన్నములా? అంటే చైతన్యమే శక్తియని చెప్పవలెను.

కనుక జ్ఞానరూపముగా, ప్రాణరూపముగా యీ ఆత్మయే భాసిల్లుచున్నది. యీ ఆత్మయే సృష్టికారణము. దీని సత్తా లేక తృణమైన కదలజాలదు ఇది సమస్త వస్తువులకంటె పెద్దదై మహతో మహీయాన్ అని కొనియాడబడుచు భూమాపదార్థమని గురుస్వరూపమని చెప్పబడుచున్నది.

శ్లో॥ యేనేదం దర్శితం తత్వం చిత్తచైత్యాదికం తథా
జాగత్స్వప్నసుషుప్త్యాది తస్మై శ్రీ గురవేనమః

తాత్పర్యం:- ఏ గురుపరమాత్మశక్తిచే మనస్సునకు సంకల్ప వికల్పములు కలుగు చున్నవో, ఎవని కృపచే తత్వదర్శనము కలుగుచున్నదో ఆగురుపరమాత్మశక్తిచేతనే అవస్థాత్రయములు మొదలైన సమస్త విశ్వవ్యాపారము జరుగుచున్నది. అట్టి గురుపరమాత్మకు నమస్కారము, ఆ గురుపరమాత్మయే వుపాసింపదగినవాడు అని తెలుసుకొని ఆయననే అహరము సేవింతుముగాక!

శ్లో॥ యస్య జ్ఞాన మిదం విశ్వం నదృశ్యం భిన్నభేదతః
సదైకరూప రూపాయతస్మై శ్రీ గురవేనమః

తాత్పర్యము:- ఈ జగత్తంతయు జ్ఞానస్వరూపుడగు పరమాత్మ జ్ఞానముయొక్క రూపాంతరము లేక మారురూపము అయివున్నది. కాని వస్తునిర్ణయములేనివారికి గురుస్వరూపము మరుగుపడి దాని స్థూలరూపమగు బ్రహ్మాండ పిండాండములు మాత్రము కన్పడుచున్నవి. ఎరుక వేరువిశ్వం వేరు అనుభేదభావనము నశించగా విశ్వవ్యాపకమగు అఖండాత్మ స్వరూపమేభాసించును. చూచువాని దోషమే కాని యెరుక జగములు రెండూ ఎల్లప్పుడూ ఏకరూపముగానేయున్నవి. అట్టి అఖండరూపుడగు సద్గురుపరమాత్మకు నేను నమస్కరించుచున్నాను.

విశేషవివరణ :- ఆత్మ చిద్రూపము అనగా, కేవల జ్ఞానరూపము జగత్తు మిథ్యా భూతము, జడరూపము అని కొందరంటారు. ఇది సరికాదు. "తస్మాద్వా ఏతస్మాదాత్మాన ఆకాశ స్సంభూతః..."
(ఆత్మనుంచి ఆకాశము, ఆకాశమునుంచి వాయువు) అను శ్రుతి విరుద్ధమున్ను కాగలదు. ఏలననగా ఆత్మ కేవలము చిద్రూపము. ఆకాశము కేవలము జడరూపమే. అయితే ఆత్మనుంచి ఆకాశము ఎట్లు కలుగును?

పులికి పులిపిల్లయే కలుగును కాని పిల్లిపిల్లి కలుగరాదుగదా! కనుక చిద్రూపమగు ఆత్మయందు జడము అని చెప్పబడే జగత్తుకూడా గర్భీకృతమై బీజరూపముగా ఉంటేనే తప్ప ఇది సాధ్యముకాదు. గర్భీకృతమనగా ఆత్మయొక్క అంతరమందు ఎదో ఒకానొక నిర్దేశమగు

ప్రదేశమందు ఆకాశాదులు నిలచి ఉన్నవని అనుకొనరాదు. బెల్లమునందు తీపి ఏ ఒక్క ప్రదేశమునందోగాక సర్వత్ర ఎట్లు వ్యాపించియుండునో అట్లే ఆకాశాదికమున్ను అని చెప్పాలి. అంటే సూక్ష్మరూపములో నున్నవన్నమాట. చిత్తునందు జడ మీ విధముగా ఇమిడియున్నట్లే జడమునందు చిల్లక్షణమున్ను సూక్ష్మముగా ఇమిడియే యున్నది. ఇట్లగుచో చిజ్జడములు రెండు అన్ని వస్తువులయందు ఓత ప్రోతముగా కలసిపోయి వున్నవన్నమాట. అందు చిత్ లక్షణము అనగా జ్ఞానలక్షణము ఎక్కువగా తోచబడినపుడు దానిని చిత్ అన్నారు జడరూపము ఎక్కువగా కానవస్తే దానిని జడమన్నారు. ఒక రూపాయ నాణెములో ఉన్న బొమ్మ, బొరుసుల వలె ఒకటి కానవచ్చినప్పుడు రెండవదీ మరుగుపడి ఉంటుంది.

"యస్య జ్ఞాన మిదం విశ్వం" = ఆ గురుపరమాత్మయొక్క జ్ఞానమే ఈ విశ్వ రూపము అంటే విశ్వము వేరుకాదు. ఆ జ్ఞానము యొక్క పరిణామమే. కాని జడమనునది లేనేలేదు అని అనవలసినదే పంచదారతో తయారైన అన్ని బొమ్మలు పంచదారే. బొమ్మలయొక్క నామరూపములతో నిమిత్తము లేదు. కనుకనే

శ్లో॥ ఆత్మనోన్యత్తుయన్నాస్తి సర్వమాత్మమయం జగత్
సర్వమాత్మైవశుద్ధాత్మసర్వంచిన్మాత్రమద్వయం తేజోబిందు॥

తాత్పర్యము : ఆత్మకన్న ఇతరములేదు. జగత్తంతయు ఆత్మమయమై ఉన్నది. సర్వమున్నూ ఆత్మయే చిన్మాత్రమే.

శ్రీ భాగవత కృష్ణదేశికేంద్రులవారీ భావమునే కందార్థములలో "ఆకాశాదిక భూతానీకాత్మకమగుచు ఎరుక ఈ జగమయ్యేన్" అనిన్ని, "ఎరుకైన భూతముల నీ వెరుగము ఆకసము గాడ్పు ఇంగలము నీళ్ళు ఇరవంద నేల" అనిన్ని "ఎరుకైన భూతపంచక" మనిన్ని "ఎరుకకు జన్మించినట్టి ఈ విశ్వమంతా" అనిన్ని, "అహమే ఈ విశ్వమైనిల్చిందిగదా" అనిన్ని అభివర్ణిస్తూ వచ్చినారు. గురుగీతలో కూడ ఈ భావమే "గురుమధ్యే స్థితం విశ్వం" అనే శ్లోకములో చెప్పబడియున్నది.

"జగత్తు మిథ్యాభూతవస్తువు అజ్ఞానముచే దోచుచున్నది. దృశ్యవస్తువు. "యత్ దృశ్యం తన్నశ్యం" అనే న్యాయమున నాశన శీలమైనది పరమాత్మ సత్పదార్థము. దృగ్రూపము కేవలం జ్ఞానరూపము ఆ పరమాత్మను ఎరిగినచో దృశ్య రూపమగు జగత్తు రజ్జుసర్పమువలె అంతర్హితమగును. లేని జగత్తు బ్రహ్మస్వరూపమని చెప్పరాదు. అది అజ్ఞానకార్యము. రెండు వస్తువులని లేనేలేవు. కనుక భేదమున్నూ లేదు" అనే వాదముకూడా ఈ శ్లోకములో "యస్య జ్ఞాన మిదం విశ్వం" అనే మాటచే పరాస్తమగుచున్నది. జ్ఞానరూప పరమాత్మ ఎంత సత్యమో జగత్తుకూడా అంతే సత్యముకాని మిథ్యావస్తువు కాదు అని శ్రుతియుక్తి అనుభవముల రీత్యా ఋజువగుచున్నది జగత్తు మిథ్య అంటే దానికి కారణరూపమగు వస్తువే ఉండరాదు. కాని పరమాత్మ సర్వకారణముగా నున్నది కదా! "సదృశ్యం భిన్నభేదతః" రెండు వస్తువు లనేవి పారమార్థికముగా లేనేలేవు. కనుక భేద మనేది ఉండనే ఉండదు అంటారు. జగత్తు జీవుడు ఈశ్వరుడు అను వానిలో జగజ్జీవ భేదము. ఈశ్వరజగద్భేధము. జీవేశ్వర భేదము, జడాజడభేదము, జీవజీవ పరస్పర భేదము. ఈ భేదమంతయు మిథ్య అని అంటారు. రెండు వస్తువులుంటేనే కాని భేదమనేది చెప్పటానికి వీలులేదు. అన్నప్పుడు ప్రత్యక్షముగా కానవచ్చు

ఆ భేదము నశించపలెనన్న అందొక వస్తువును సత్యమనీ, మిగిలినవన్నీ అసత్యమనీ లేక మిథ్యయనీ చెప్పకపొతె భేదము నశించదా ఏమి? పంచదార కరిగించి వేరు వేరు మూసలలో పోసి వివిధ నామరూపాలను కల్పించి తెచ్చి వానిలో వానికి పరస్పరము బేదములేదని చెప్పుటకై పంచదార మాత్రము సత్యమని, దానితో తయారైన వస్తువులన్నీ మిథ్యమనీ, అసత్యములని చెప్పవలెనా! లేక మొత్తము అంతా పంచదారే కనక భేదము లేదని చెప్పవలెనా? ఏది సమంజసమో? యోచింపుడు. తీపి ఇష్టములేనివాడు పంచదార చిలుకనిచ్చినా పంచదార ఏనుగునిచ్చినా పంచదార రథమునిచ్చినా వద్దనే అంటాడు. ఇష్టమున్నవాడు అందేదిచ్చినా ఆప్యాయతగా ఆరగిస్తాడు. చిన్నపిల్లలైతేనో, అందేదో వస్తువు తనకు కావాలనీ, మరేం వద్దనీ మారాం చేస్తారు. ఎందుకనగా వారికావస్తురూప యదార్థ జ్ఞానము తెలియదు. కారణమును గుర్తించినచో కార్యభేదముండజాలదు.

అట్లే ప్రసిద్ధ సినిమా నటుడు ఎన్ని వేషములు వేసినా ప్రేక్షకులు కేవలం చిన్న పిల్లలు సహితము ఆ నటుని గుర్తించుచునేయున్నారు. అంతేకాదు ఆ వేషము యొక్క నామరూపాలనే విస్మరించి అసలు పాత్రధారి నామముతోనే పిల్లలు ఆ పాత్రను వ్యవహరించుట మనము ప్రత్యక్షముగా చూస్తున్నాము. అదేవిధముగా పరమాత్మను గుర్తించినవారికి దృశ్యమానమగు సర్వము నందు పరమాత్మయే ప్రకాశించును. అపుడే నిజముగా భేదమును పరిహసించుటయు నగును.

"సదైక రూప రూపాయ" = ఆ గురుపరమాత్మ ఏకమాత్రమగు సత్‌స్వరూపుడు. వివిధాత్మకంగా తోచబడు సర్వవస్తువుల యందు ఆ సత్ స్వరూపము భాసించుచున్నది. సర్వ వస్తువులు ఉండుటకు ఆ సద్రూప బ్రహ్మమే కారణము. ఉనికి అనేది అంతయు ఆ పరమాత్మ సంబంధమే. తద్భిన్నముగా ఏమియూ లేనేలేదు కనుకనే గురుగీత

శ్లో॥ నానారూప మిద విశ్వం న కేనా ప్యస్థి భిన్నతా ।
కార్యకారణ రూపాయ తస్మై శ్రీ గురవేనమః ॥

అని చాటుచున్నది. నానా రూపాత్మకంగా గానవచ్చిన పరమాత్మకంటె వేరుగా ప్రపంచమేమీ లేదు. కార్యకారణ రూపముగా యున్నదా పరమాత్మ యొక్కటే. కనుక అంతయూ చిద్రూపమే.

శ్లో॥ చిదేవదేవ, చిదిమేవలోకాచి దేవభూతాని చిదింద్రియాణి ।
కర్తా చిదంతః కరణంచి దేవచిదేవ సర్వం పరమార్థ రూపం ॥

కనుక జడమనబడే విశ్వమంతయు జ్ఞానస్వరూపమే. అటువంటి సత్ చిత్స్వరూపుడగు గురుపరమాత్మకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ యస్యజ్ఞాతం మతం తస్య మతం యస్య న వేదసః ।
అనన్య భావ భావాయ తస్మై శ్రీ గురవేనమః ॥

తాత్పర్యం : జ్ఞానరూపముగానున్న పరమాత్మకు జ్ఞేయరూపముగా తెలియవచ్చెడి సమస్తము ఆ పరమాత్మ స్వరూపము యొక్క మారు రూపముగాని తదన్యముగాదు. కనుక తనకంటె వేరుగా చూచి తెలుసుకొనుట లేదు.

విశేష వివరణము : జ్ఞాతృ జ్ఞానజ్ఞేయములను శబ్దములుమూడింటి త్రిపుటిలో ప్రతి ఒక్కదానియొక్క ఉనికి మిగతా రెంటియొక్క ఉనికిపైన ఆధారపడియున్నది. జ్ఞాతలేనిచో జ్ఞానజ్ఞేయ శబ్దములుగాని జ్ఞానము లేనిచో జ్ఞాతృజ్ఞేయ శబ్దములుగాని జ్ఞేయములేనిచో

జ్ఞాతృజ్ఞాన శబ్దములుగాని ఉండుటకు సావకాశములేదు. కనుక మూడు శబ్దములున్నూ కలసియే వర్తిల్లుచున్నది. ఒకటి లేనప్పుడు మిగిలినవి అర్థహీనము లగుచున్నవి. అయినను "జ్ఞానా దేవతు కైవల్యం" అన్నప్పుడు కేవలమైన జ్ఞానమే బ్రహ్మము అను అర్థము కలుగుచున్నది. కాని అపుడు ఆ జ్ఞానము యొక్క అంతరమందు జ్ఞాతృరూపకమైన కర్తయు జ్ఞేయరూపకమైన కర్మయు జ్ఞానరూపమైన క్రియతోపాటు మరుగై ఉండనే ఉండును. కర్త, కర్మ, క్రియలను శబ్దములలో ఒక శబ్దము మిగతా రెండు శబ్దములను అపేక్షించినట్లే అని తెలియవలెను. కనుక పై శ్లోకార్థమునందు జ్ఞానరూపమగు బ్రహ్మమూ తన స్వసంకల్పవశాత్తు తానే జ్ఞేయరూపముగా నుండి తన జ్ఞానముచేతనే దానిని తెలుసుకొనుచున్నది. ఈ జ్ఞాతృజ్ఞాన జ్ఞేయములలో జ్ఞానమే బ్రహ్మమని కొందరు జ్ఞేయమే బ్రహ్మమని కొందరు సిద్ధాంతీకరించుటలో మతభేదములు ప్రవర్తిల్లినవి. సత్యాన్వేషణ దృష్టితో విమర్శించువారికి ఇందు నిజముగా ఎట్టి విభేదము గోచరించదు.

కలగనువాడు, తన మనస్సు చేతనే మనోరూప ప్రపంచమునొక దానిని నిర్మించుకొని తన మనస్సు ద్వారానే చూచుచున్నాడు. ఇందు (ద్రష్ట) ధృక్, దర్శనములు మూడుగా ఒక్క మనస్సే పరిణమించినట్లే ఒక్క పరమాత్మయే తనయందు నిగూఢమైయున్న దైవాత్మక శక్తి (పరాశక్తి) ప్రభావముచే ప్రభావితుడై "పరాశక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియాచ" అని చెప్పబడినరీతిగా తానే జీవేశ్వరజగద్రూపంగా పరిణామ వికాసము చెందుచున్నాడు. తొలుత నిస్సంకల్పస్థితి (అచలస్థితి) లో నుండియు ఒక్కడైన తాను అనేకము కావలెనని సంకల్పించెను. ఈ విషయమునే "సోఽకా మయత బాహుస్యాం ప్రజామేయ" "సోఽమన్యత స ఐక్షత" అను శ్రుతులు పేర్కొన్న విధముగా తన్ను తానే వికాసము చెందించుకొనెను. ఆ విధముగా వికాసము చెందిన సర్వము "బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠం" "సత్యం, శివం, సుందరం"గా ఉండి ఆ పరమాత్మ కానందము కలిగించెను.

కాని ఈ జీవేశ్వర జగద్రచన ఎంత శృంగారము, సౌందర్యము ఆనందము లొలుకపోసు కొనుచున్నను ఆ పరమాత్మ కంటె భిన్నము కాదుగదా? ఎంత మనోహర వేషమును ధరించినను నటుడు తన రూప లావణ్యములను అద్దము నందు చూచుకొని ఎంత మురిసిపోయినను ఆ వ్యక్తిని తనకంటె భిన్నమైన వ్యక్తిగా భావించగలడా? అది పురుషుడు ధరించిన స్త్రీ వేషమే అగుగాక! చక్రవర్తి వేషమగుగాక! లేక రోత కలిగించు క్షుద్రభైక్షుక వేషమగుగాక! ఏమైనను తానే కదా! ఇదియే అద్వైత దృష్టి అఖండ చిద్ఘనస్వరూపుడగు పరమాత్మకిట్టి అఖండమైన దృష్టితప్ప అన్యదృష్టి ఎట్లుండగలదు? ఈ జీవేశ్వర జగత్తునందలి నానావిధ నామ, రూప, నటనలన్నియు విస్మరించి వానియన్నిటియందునున్న తన్ను తానే చూచుకొనుచున్నాడు.

అయితే - శ్రీకృష్ణదేశికేంద్రులవారు ఈ పరమాత్మయే -

కం॥ "అన్నియు తానై తన కవి పన్నుగ వేరనును
నోట బల్కుచు మరి తానన్నిటనెరిగే ఎరుకై
యున్నాని ఎరుక కెరుకే నూహింపుచుండు
తనలో తానే మోహింపుచుండు"

అని అన్నారు కదా! పరమాత్మ స్వరూపమగు ఆ అఖండ జ్ఞానము (ఎరుక)నకు ఈ ఆ

యదార్థమగు భ్రాంతి జ్ఞానమెట్లు కలిగినది? ఆ అఖండ జ్ఞానమునకు ఈ అజ్ఞానమెక్కడ నుండి వచ్చినది? అను శంక కలుగక తప్పదు. ఏలననగా జ్ఞానస్వరూపమగు తానే తప్ప అన్యము లేనేలేదు. ఈ అజ్ఞానము ఎక్కడ నుండి వచ్చినది? ఇందుకొక్కటే జవాబు, ఈ జ్ఞానమునకే స్థితి భేదము చేత జ్ఞానాజ్ఞానములను రెండు లక్షణములూ ఉండి తీరవలె వెలుగున్నచోట నీడ యుండకతప్పదు కదా! ఎరుకకు - మరుపు (జ్ఞానమునకు - అజ్ఞానము) కూడా సహజము కనుకనే శ్రీకృష్ణదేశికేంద్రులవారు "ఎరుకనగా ఎరిగేటిది, మరుపు అనగా ఎరుక తనను మరుచటము" అని కందార్థములలోనూ "జ్ఞానా జ్ఞానంబులు ఈ జ్ఞానానివేకాని వేరుగా వెన్నటికి" అని కందపద్యములలోనూ సెలవిచ్చియున్నారు. కనుక "ఏకమేవాఽ ద్వితీయం బ్రహ్మ" అని చెప్పబడిన బ్రహ్మమే ఒకప్పుడు జ్ఞానరూపంగాను, ఒకప్పుడు అజ్ఞానరూపంగాను మార్పు చెందుతూ ఉందని చెప్పక తప్పదు. కనుక ఈ జ్ఞానజ్ఞేయ రూపమగు బ్రహ్మము - సర్వద్విపుటీ త్రిపుటలకు అతీతమై జ్ఞానాజ్ఞానములలో నేదియుగాక ఏదియు లేక ఏ మార్పు ఎరుగక ఎప్పటికి ఏకరీతిగా నుండు పరిపూర్ణ పరబ్రహ్మము కాగలదా? కాజాలదని అచల ఋషుల సిద్ధాంతము ఇందుకు పాఠాంతర శ్లోకమొకటి కలదు.

శ్లో॥ య దజ్ఞాన మతం భూయాన్న మతం యస్యవేదనాత్ ।
తద్బ్రహ్మ దర్శితం యేన తస్మై శ్రీ గురవేనమః ॥

తాత్పర్యం : బ్రహ్మస్వరూపము కలుగక పూర్వము జగత్తు నందు గానవచ్చు శబ్దాది విషయపంచకము నన్నెంతగానో ఆకర్షించెడిది వానికి లోలుండనై రాగద్వేషాదులకులోనై ఈ సంసారములో బద్ధుడనైతిని. నీ స్వరూప యదార్ధ జ్ఞానము కలుగుటతోనే వివిధ నామరూపాత్మక మగు యీ జగత్తునందలి నానాత్వము నశించినది. ఎక్కడ చూచినా ఎందు చూచినా నీ స్వరూపమే అయినప్పుడు ఏది నన్ను వ్యామోహపరచగలదు? నీ స్వరూపమేదక్క అన్యమేదియూ గానరాకనే పోయెను. అట్టి నీ స్వరూపమును దర్శింపజేసిన ఓ ప్రభూ నీ కివే నా నమస్కృతులు.

శ్లో॥ యస్మై కారణరూపాయ,కార్యరూపేణ భాతియత్ ।
కార్యకారణ రూపాయ, తస్మైశ్రీ గురవేనమః ॥

తాత్పర్యం : ఏది కారణరూపముగ నున్నదో, మరియు కార్యముగాకూడ భాసించుచున్నదో, అట్టి కార్యకారణరూపమగు గురుతత్వమునకు నమస్కారము.

విశేష వివరణము : ఏ వస్తువు లేనిచో మరియొక వస్తువు తోచబడజాలదో, అది కారణ వస్తువు అనిన్ని, అట్టి కారణ వస్తువు యొక్క నామరూపములకంటె, భిన్నమగు నామరూపములుగలదై, కాని విచారించగా కారణవస్తువు యొక్క మూలద్రవ్యమునకు మాత్రము భిన్నము కానిదై యున్న వస్తువు కార్యమనిన్ని చెప్పబడును. ఉదాహరణకు - మట్టి లేనిచో, మట్టితో చేయబడె ఘటశరావాదు లుత్పత్తి కాజాలవు. కనుక మట్టి కారణవస్తువు. కుండలు, ముంతగలు మొదలగునవి కార్యరూప వస్తువులు, నామరూపములే వేరుగాని వానికి మట్టియే మూల ద్రవ్యముగానున్నది. కనుక అవి మృత్కార్యములు. కార్యకారణ వస్తువులు వేర్వేరు నామరూపా లతో గానవచ్చినను తత్వతః ఆ రెండున్ను మూలద్రవ్యమగు మట్టికంటె భిన్నములుగావు. రెండున్నూ మట్టే, ఘటాదులనే నామములున్ను, అయా వస్తువుల యొక్క రూపములున్ను ఆ మృత్తికయందు ఆరోపితములైనవి. కార్యరూపముగానున్న ఘటము యొక్క నామరూపాలు మాత్రమే నశించును కాని కారణమగు మృత్తిక రూపములో నిలచుచున్నవి. నామరూపాది

వికారములు అసత్యములని, మృత్తికే సత్యమని శ్రుతి - "వాచారంభణం వికారో నామధేయం మృత్తి కేత్యేవ సత్యం" అంటూ చెప్పినది. అయితే కారణరూపమగు మృత్తిక వున్నంతవరకు కార్యరూపమగు ఘటాదులు తిరిగి తిరిగి యుత్పత్తి చేయబడుచునేయుండును. అంటే కార్యరూపమునందలి నామరూపాలు కారణవస్తువునందు దాగియుండునన్నమాట. కనుక కార్యకారణ రూపముగా రెండు రీతులుగా తోచబడినా, రెండూ కలసి ఒకే వస్తువు. అందు కారణము శాశ్వతమని భ్రాంతి కలిగించుచున్నది.కాని నామరూపాత్మకమగు మార్పులు, లేక వికారములు దానియందు తోచబడుచున్నంతకాలము అది మార్పులు చెందే లక్షణము గలిగియున్నందున దానియందు కూడా కేవల శాశ్వత లక్షణములున్నట్లు చెప్పుటకు వీలులేదు. కార్య వస్తువునకు కారణ వస్తువు దృష్ట్యా అశాశ్వత లక్షణము చెప్పబడినది. అట్లే కారణ వస్తువునకు కార్యవస్తువు దృష్ట్యా శాశ్వత లక్షణము చెప్పబడినది. కనుక కార్య కారణ రూపముగానుండు మూలద్రవ్యమునకు శాశ్వత, అశాశ్వత, ద్వంద్వ లక్షణములు రెండున్ను చెప్పవలసిఉండును. కార్యకారణములుగా తోచబడు నానాత్వము నందు, మూలకారణ రూపమగు ఏకవస్తు సందర్శనము గావించి ఆ మూల వస్తువునే సత్యము, మిగతా నామరూపాత్మకమగు సర్వము మిధ్యయని అద్వైతులు ప్రతిపాదించినారు. మొత్తమంతా ఏకవస్తువు మాత్రమే అయినా అదెంత సత్యమో దానియందున్న వైవిధ్యమున్ను అంతే సత్యమని విశిష్టాద్వైతులు చెప్పుచున్నారు. మూలకారణ వస్తువు మార్పులేక అట్లేయున్నది. దానియందున్న వస్తువులు దానికంటె వేరుగా దాని సంబంధమే లేకుండా స్వతంత్ర సత్తా కలిగియున్నవని ద్వైతులు ప్రతిపాదిస్తున్నారు. "ఏకం అనేకం భవతి. అనేకం ఏకం భవతి" అనే రీతిగా ఏకానేకములుగానుంటూ కారణ కార్యరూపముగా అధోర్ధ్వ పరిణామములు చెందుచూ వుండు అఖండ వస్తువే యెరుక, యుత్పత్తి స్థితిలయములన్ని దానియందే జరుగుచున్నవి. దానికదే కారణముగాని దాని కన్యకారణము లేదు. అదే స్థూల సూక్ష్మములుగానుంటూ జీవేశ్వర జగత్తున కంతకూ ఆధారమూ, అధిష్ఠానమూ అయివున్నది. ఈ ఏకానేకముల కత్యంత విభిన్నమై, నిజంగా మనో వాగగోచరమై ఎప్పుడూ ఎట్టి మార్పులూ, ఎట్టి చలనము లేనిదై సర్వత్ర నిండి నిబిడీకృతమైయున్నదని అచల ఋషులు ప్రతిపాదించుచున్న పరిపూర్ణ పరబ్రహ్మ మొక్కటి మాత్రమే "కార్యకారణ విరాహిత్యం తల్లింగ మచలం ధృవం" అని చెప్పబడి కార్యకారణ రూపములను మీరియున్నది. అదొక్కటే నిరపేక్ష శాశ్వతత్వము కలిగియున్నది.

పృధివికి కారణమైన జలము పృధివి దృష్ట్యా శాశ్వతము. అట్లే జలదృష్ట్యా అగ్ని శాశ్వతము, అగ్ని దృష్ట్యా వాయువు, వాయు దృష్ట్యా ఆకాశము. ఆకాశ దృష్ట్యా ఆత్మయున్నూ సాపేక్షికంగా శాశ్వతములుగా తోచబడుచున్నవేగాని యీ ఆరింటియందు దేనికిన్ని నిరపేక్షక శాశ్వతత్వము లేదు. కనుక కార్యకారణ వస్తువులు అన్నీ సాపేక్షిక శ్రేణిలోనికే చేరుచున్నవి.

ఆత్మ కూడా కార్యకారణ రూప ద్వంద్వములోనిదే కనుక దానికిన్ని నిరపేక్షక శాశ్వతత్వము లేదంటే - ఆత్మకు కూడా వుత్పత్తి చెప్పవచ్చునా? చెప్పవచ్చును అంటే ఆత్మకు కారణ వస్తువు ఏది? అది మూలం లేనిదని మీరే చెప్పుచున్నారు. మూలములేని ద్రవ్యమంటూ అసలు యుంటుందా? ఆత్మ కూడా ద్రవ్యమేనంటున్నారు. మరి పరిపూర్ణ పరబ్రహ్మము దేనికిన్ని మూలముకాదని మీరే అంటున్నారే? వీనికన్నిటికి సమన్వయ మెట్లు కుదరగలదు అని శంకింపవచ్చును. ఐతే, కారణము లేని కార్యముండదు అనుట నిజమే. పుట్టుక వున్న దానినుంచే

మరొకటి పుట్టునుగాని, పుట్టుకయే లేనిదాని నుండి మరొకటి పుట్టజాలదు అను సిద్ధాంతమున్ను విస్మరించరాదు. పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రము నిజముగా అజము, అమరమూ అయివున్నది. కనుక దాని నుండి యేదియూ పుట్టజాలదు. ఆత్మయే జగద్కారణమని, ఆ ఆత్మనుంచియే సర్వముయుత్పత్తి అయినవని శ్రుతిస్మృతులు చెప్పుచున్నవి. (విపులంగా తెలియగోరువారు పరిపూర్ణ దర్శనములోని సృష్టి విజ్ఞాన ప్రకరణమును చూడవలెను.)

కనుక పై సిద్ధాంత ప్రకారము ఆత్మ నుంచి అన్నీ పుట్టినవి కనుక ఆత్మకు కూడా పుట్టుక అంగీకరించవలసినదే. ఐతే, అంతా ఆత్మే, ఆత్మ కన్యమైనది కేవలాత్మ అని చెప్పబడినది. అజమూ, అమరమూ (పుట్టనిదీ, చావనిదీ) కనుక దాని నుంచి ఆత్మ పుట్టలేదు. పోతే తన నుంచే తాను పుట్టినది అని చెప్పకతప్పదు. ఈ విషయమునే శ్రీకృష్ణదాసు గారు -

"జగము వలన సంకల్పము
జగమూ సంకల్పమునను జనియించును
వేరగపడదు జన్మమందిర,
మగుపడదెడబాసి నిల్వ వారెందెన్నటికీ" అనీ -

"మేనెరుకలు రెండింటిలో దానిని ఇది దీని నదియు దగసృజియించున్' అనియు, "మేను మజ్జనని నేనే మేనికి జనకుడను" అనిన్ని "యెరుకోద్భవ మెట్లన్నను సరళంబగు నారికేళ సలిలముభంగిన్" అనిన్ని శెలవిచ్చినారు, కనుక ఎరుక జగములు రెండూ ఏకవస్తువుగా నుండి ఒకదానికొకటి మూలమైయున్నవి. ఇది యెట్లు? అనుదాని రహస్యము వస్తు నిశ్చయరూపముగా ఎరుకయొక్క స్థానస్వరూప స్వభావములు గురుమూర్తి వలన తెలిసికొన్నవారికే తేటతెల్లము కాగలదు.

కార్యకారణ రూపముగానున్నది గురుతత్వమని ఈ శ్లోకముద్ఘాటించుచున్నది. కార్యకారణరహితమైనదియే పరిపూర్ణ పరబ్రహ్మము. కనుక గురుతత్వమే పరిపూర్ణ పరబ్రహ్మము కాదని తెలుసుకోవలెను. గురూపాసన వలన ఐహికాముష్మికరూపమగు సర్వార్థసిద్ధి చేకూరగలదు. కాని పరిపూర్ణ పరబ్రహ్మమో -

దానము, ధర్మము, సగుణ ధ్యానము,
ప్రతిమార్చనంబు తజ్జపతీర్థస్నానములివి ముక్తిదమని
మానవులొనరించ బయలు మాటాడదేమీ,
ఎరుకేలేదు మాటాడేదేమీ,
ఔను కాదనకా, నీవనక, నేననకొక్క
మేనైనతాగాక మితిమీరి యున్నది మాటాడదేమీ,
యెరుకేలేదు మాటాడెదేమీ" -

అని శ్రీకృష్ణదేశికేంద్రులవారు శెలవిచ్చినారు. కనుక యిహపరములలో దేనినిగాని, రెంటినీగాని సాధించవలెనన్న వారికి గురువే ఉపాస్య దైవ్యము. కనుకనే నిరాలంబోపనిషత్ "ఉపాస్య ఇతిచ, సర్వశరీరస్థ చైతన్య బ్రహ్మ ప్రాపకో గురూరుపాస్యః" అనగా సకల దేహములందు వ్యాపించిన చైతన్య బ్రహ్మమును ప్రాప్తింపచేసిన గురువే ఉపాసింపదిగినవాడు. విశేషించి "తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిద ముపాసతే" అనగా ఏది ఉపాసింపబడుచున్నదో అది పరిపూర్ణ పరబ్రహ్మము కాజాలదు అని కేనోపనిషత్తు వుద్ఘాటించుచున్నది.

కనుక యే సాధన సిద్ధించవలెనన్నా ఏ కోరిక ఫలించవలెనన్నా లేక ఆయాథ జ్ఞానము సిద్ధించవలెనన్నా గురుకృపా ప్రసాదమువల్లనే సిద్ధించగలదు.

కం॥ లోకంబులు, లోకేశులు,
లోకస్థులు తెగిన తుది నలోకంబగు
బెంజీకటి కవ్వల నెవ్వండే
కాకృతి న్వెల్గు నతని నే సేవింతున్ ॥

అని చెప్పబడినదే గురుతత్వము. కనుకనే -

శ్లో॥ శ్రీమత్పరం బ్రహ్మగురుం స్మరామి
శ్రీమత్పరం బ్రహ్మగురుం భజామి
శ్రీమత్పరం బ్రహ్మగురుం వదామి
శ్రీమత్పరం బ్రహ్మగురుం నమామి॥

శ్లో॥ ధ్యానమూలం గురోర్మూర్తిః
పూజామూలం గురోః పదం
మంత్రమూలం గురుర్వాక్యం
ముక్తిమూలం గురుకృపా॥

అనిన్నీ గురుగీతలో చెప్పబడినది. అట్టి గురుమూర్తికివే నమస్సులు.

శ్లో॥ జ్ఞానశక్తి సమారూఢ, తత్వమాలా విభూషిణే
భుక్తి ముక్తి ప్రదాత్రేచ, తస్మై శ్రీ గురవేనమః

తాత్పర్యము : జ్ఞానశక్తిని అధిష్టించి యున్నవాడును. తత్వములచే గూర్చబడిన కంఠహారముచే శోభిల్లువాడును, భోగ మోక్షములను భక్తుల కనుగ్రహించువాడును అగు శ్రీ గురుమూర్తికి నమస్కరించుచున్నాను.

విశేష వివరణములు : 1) జ్ఞానశక్తి 2) సమరూఢ 3) తత్వమాల 4) భుక్తి ముక్తులు - అనువానిని గూర్చి విమర్శించి తెలుసుకొననగును.

1) జ్ఞానశక్తి : "శక్తి" అనుసరికి అనంతశక్తులుగా పరిణమించిన మూలప్రకృతియే ముందుగా వూహాపధములోని కేతెంచును. పురుష ప్రకృతులలో పురుషుడు రసస్వరూపుడుగా లేక అఖండ జ్ఞానస్వరూపుడుగాను, ప్రకృతి బలము, ప్రాణము, శక్తి అను నామాంతరములు గలదిగాను అభివర్ణింపబడినవి. ఈ ద్వంద్వములు రసగా రసబలములు, జ్ఞాన ప్రాణములు, చిజ్జడములు రెండుగా వర్ణింపబడినను (ఇవి) ద్వంద్వరూప ఏకవస్తువేగాని అన్యోన్య భిన్నములుగావు. ఐనను విచారణా సౌలభ్యము కొరకు నామాంతరములు ప్రచారములోనికి వచ్చినవి. పంచభూతములు మనోబుద్ధ్యహంకారములు యీ అష్టవిధ ప్రకృతులు తన అపరా ప్రకృతియనియు దీని కన్యమై వుత్తమమై జీవేశ్వర జగత్తును ధరించి భరించునది తన పరాప్రకృతియనియు గీతలో భగవంతుడు శెలవిచ్చియున్నాడు. అగ్నియొక్క ఉష్ణశక్తి అగ్నికంటె అభిన్నమైనట్లుగానే పరమాత్మయొక్క యీ పరా-అపరాప్రకృతులు పరమాత్మ కంటె భిన్నములు గావు.

శ్లో॥ న తస్య కార్యంకరణం చ విద తే
న త స్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే
పరాస్యశక్తి ర్వివిధైవ శ్రూయతే
స్వాభావికీ, జ్ఞానబల క్రియాచ" శ్వేతాశ్వతరోపనిషత్ - 6 ॥ 8 శ్లో॥

తాత్పర్యము : బ్రహ్మము నందు కార్యకరణములు తెలియరావు. దానితో సమమైనదిగాని. మించినదిగాని లేదు. దాని యొక్క పరాశక్తి స్వాభావికములగు జ్ఞానబలక్రియలచే నానా నామరూపములను సృష్టించుచున్నది.

పరమాత్మ యొక్క పరాశక్తియే ఆదిశక్తి. అదియే జ్ఞాన యిచ్ఛా క్రియాశక్తులుగా విశ్వ వ్యవహారమంతయు గావించుచున్నది. జ్ఞానశక్తి రూపముతో, నిరవయవము నిరాకారమునకు బ్రహ్మము నందు సావయవము సాకారమునగు నానాత్వమును ఆవిర్భవింపచేయుచున్నది.

"ఇచ్ఛామాత్ర ప్రభుసృష్టిః" "సోఽ కామయత బాహుస్యాం ప్రజాయే యేతి" యిత్యాది శ్రుతులలో చెప్పబడినట్లు ఆ బ్రహ్మమునకు తొలుత సృష్టికామన, పిదప సంకల్పము తుదకు క్రియ జరిగి రూపకల్పన జరిగినది. ఈ యిచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తులు పరమాత్మకంటె అభిన్నములు. ఇవన్ని ప్రకృతి శక్తులు అవి పరమాత్మవి కావనీ అనరాదు. ప్రకృతి యనగా స్వభావము. ఎవరి స్వభావము? అంటే ఆ పరమాత్మయొక్క స్వభావమే. కనుక పురుష ప్రకృతుల కభేదమే చెప్పవలెను. లేనిచో అద్వైతహానిగూడ సంభవించును. ఇచ్ఛాజ్ఞాన క్రియలన్నియు ఆ పరమాత్మ వికారములేగాని అవి వేరు వేరు శక్తులు గావు. పరమాత్మ కంటె భిన్నములున్ను గావు. "నిన్ను కొట్టుటకు నేను కారణముగాదు. నా చేతియందలి బలమే కారణము" అంటే యెంత సమంజసమో, అట్లే సృష్టికి పరమాత్మ కారణముగాదు శక్తియే కారణమనుట కూడ నంతే సమంజసము.

పరమాత్మ స్వరూపము చేతనే జ్ఞానమయుడు "సత్య జ్ఞానమనంతం బ్రహ్మ"యని శ్రుతి పల్కుచున్నది. కనుక ఆయన జ్ఞానశక్తి ఆయనకంటె విభిన్నముగాదు. ఈ జ్ఞానమాయనకు స్వాభావికము. అందుకే ఆయన స్వయంప్రకాశ స్వరూపుడు. ఆయనకు ప్రకాశము, లేక జ్ఞానము కలుగచేయునది మరియొకటి లేదు. ఆయనయే సర్వమును ప్రకాశింపజేసి సర్వమునకు బలమొసంగెను. ఆ జ్ఞానబలము చేతనే యింత సౌష్టవముగా సుందరముగా విశ్వరచన తనయందు గావించినాడు, "బ్రహ్మై వేదం విశ్వమిదం వరిష్టం" అని చెప్పబడినట్టుగా అతడే విశ్వము, విశ్వమే యాతడు. అందుకే రూపము లేని వాడయ్యును "సత్యం శివం సుందరం" అని వర్ణింపబడు చున్నాడు. నా తెలివి నాయధీనములోనే యుండి నాయిచ్ఛవచ్చినట్లు వినియోగించు కొనుటకు నా కధికారమున్నట్లే పరమాత్మ తన జ్ఞానశక్తిని (లేక జ్ఞాన బలమును) తన యధీనము నందుంచుకొని సృష్టి స్థితి లయములను గావించుచున్నాడు.

2) సమంరూఢ : అనగా చక్కగా అధిష్ఠించి, అధిరోహించి, పూని అని అన్వయము. అయితే జ్ఞానశక్తి యొకటి, దాని నధిష్ఠించునది అధిరోహించునది మరియొకటి కాదని పైన వివరించుకొన్నాము. కనుక సమరూఢ అనగా తనకుగల అనంత అద్భుత శక్తులలో జ్ఞానశక్తిచే అనగా తత్కాలమున ఆ జ్ఞానమే తానై, తెలివి రూప వ్యవహారము చేయును. తాను స్వయముగా తెలుసుకొని వ్యవహించుటయే గాక సర్వమునకు తెలిసికొను శక్తిని ప్రసాదించును.

3) తత్వమాల విభూషిణే : సృష్టికి పూర్వము నామరూప క్రియా నటనలు లేక

యేకరూపముగా తాను తానై యున్నదే "తత్" శబ్దముచే చెప్పబడినది. అదియే వివిధ దశలలో వివిధ నామ రూప భేదములు చెందినది. వీనికే తత్వములు అని పేరు. అవ్యక్తమూ, మహత్తు మహదహంకారము, పంచతన్మాత్రలు, పంచభూతములు, ఈశ్వరజీవతను విశేషములు, యింద్రియములు మొదలగునవన్నియు తత్వములే. ఈ తత్వము లా యాదితత్వముకంటె భిన్నములు గావు. ఆదితత్వము చెడకనే దానియందు యీ వివిధ తత్వములన్నియు తోచినవి. దీనికే అవికృత పరిణామవాదమని పేరు. పిండ, బ్రహ్మాండ, అధిష్ఠాన స్థానములయందు గాననగు యీ తత్వములు అన్నియు తత్ పదార్థమగు నా యాది తత్వమునకు అలంకార ప్రాయములు. ఆయాదితత్వమునకు యీ తత్వములన్నియూ సర్వాభరణ భూషణములన్నమాట. ఇవి ద్వివచన బహువచనములలో అనేక విధములుగా వర్ణింపబడినవి.

ద్వయం నా యిదగ్ం సర్వం త్రివృత్ త్రివృత్
చతుష్టయం వా యిదగ్ం సర్వం
పాంక్తం వా యిదగ్ం సర్వం
షట్కోశిక మిదం సర్వమ్

అంటూ ఒకటి, రెండై, మూడై, నాలుగై, అయిదై, యిరువదియయిదై 25 తత్వముల వరకు, 36 తత్వముల వరకు, 96 తత్వముల వరకు వర్గీకరణము గావింపబడినది. చివరకీ సంఖ్యానకమునంతటినీ దాటి అనంతతత్వములై అనిర్వచనీయ స్థితి నందుకొన్నది. శివలింగమువలె నిరవయవమైయున్న దాదితత్వము. సర్వావయవ సంశోభితమై సుందర విగ్రహ స్వరూపమై యున్నది విశ్వరూపము. కనుక తత్వ సముదాయమంతయు ఆ పరమాత్మకు అలంకారప్రాయము. సర్వాలంకారములలో విశేష సౌందర్యమును గూర్చునవి కంఠాభరణములు. కనుక తత్వము లన్నియు హారముగా లేక మాలగా ఆయనకు సౌందర్యము గూర్చునవిగా వర్ణింపబడినవి.

4. భుక్తి ముక్తులు : శరీరధారులైన సమస్త జీవులకు భుక్తిక్రియ ప్రధానము. "శరీరమాద్యం ఖలు ధర్మసాధనం" స్థూల సూక్ష్మ శరీరములు రెండునూ అస్తవ్యస్తములుగాక సుఖముగా నున్నప్పుడే అనగా యిహమందు దుఃఖము లేనపుడే పారమార్థిక సుఖమునకై మానవుడు కృషిచేయగలుగునుగాని ప్రాణధర్మమైన ఆకలిదప్పులు మనోధర్మములగు శోకమోహంబులు ఒక అశాంతిలో జీవుని ముంచియుండగా దేహ ధర్మములగు జనన మరణంబుల నతిక్రమించు సాధన యాతనికి లభ్యము గాదు. కనుక ప్రాణ మనోధర్మములను అధిగమించుశక్తి యాతనికి గలుగవలెను. ఆకలి దప్పులయొక్కయూ శోకమోహముల యొక్కయు బాధ ప్రారబ్ధానుసారము జీవుడనుభవించి తీరవలసినదే. కాని వానిని అనుభవించుపట్ల వుండవలసిన మానసిక స్థితిని అనగా తితీక్షను (ఓర్పును) గురుపరమాత్మ యాతని కనుగ్రహింప గలుగును. అట్టి ఓర్పు తనంత తనకుగా చేకూరజాలదు. గురుమంత్రాను ష్ఠాపరులకు అవలీలగా సిద్ధింపగలదు. భుక్తి = భోగము = అనుభవము ఇది దుఃఖానుభవము కావచ్చును లేక సుఖానుభవము కావచ్చును. సుఖము నందాసక్తియే రాగము, దుఃఖము నందు విరక్తియే ద్వేషము, గురుకృప శిష్యుని యంతఃకరణము నందలి యీ రాగద్వేషములను నివర్తించుట ద్వారా శిష్యుని శోకమోహములను తొలగద్రోయ గలుగును. ఆకలి దప్పుల వలనగాని శోకమోహముల వలనగాని కలుగు అశాంతి ఆ విధముగా గురుకృపచే నివారణ

కాగలదు. భుక్తిని ప్రసాదించుట యనగా సుఖదుఃఖాదుల ననుభవించుటలో శాంతి సహనములను ప్రసాదించుటయే, భుక్తిని ప్రసాదించుట "సుఖదుఃఖే సమంకృత్వా" అనియు "సమత్వం యోగముచ్యతే" అనియు గీత ప్రతిపాదించుచున్నది. ఇట్టి సమత్వము గురుకృప లేక సిద్ధించదు.

అట్లే "ముక్తి" క్రియయందు కూడ గురుమూర్తి యొక్క అనుగ్రహ విశేషమే ప్రధానమై యున్నది. ముక్తియనగా విడుదల, దేని నుండి? కర్మబంధము నుండి. కర్మత్రివిధము, సంచితము, ప్రారబ్ధము, ఆగామి అనువానిలో అనేక జన్మార్జిత రూపమగు కర్మఫలరాశి తత్వజ్ఞానముచేతను, ప్రారబ్ధము (యీ జీవితమందు అనుభవించుటకు నిర్ణయమైన కర్మఫలములు) అనుభవించుట తోను, కర్తృత్వరహిత కర్మాచరణ విధానముచే ఆగామి కర్మఫలము (అనగా యీ జీవితములో క్రొత్తగా చేయుచున్న కర్మల ఫలము)ను రహితమగును. ఇందు ప్రారబ్దానుభవములో శాంతి సహనములను గ్రహించుట ద్వారా యెట్లు గురుపరమాత్మ శిష్యునికి తోడ్పడుచున్నాడో పై పేరాలో తెలుపబడినది. ఆత్మ స్వరూప నిశ్చయ జ్ఞానము గలిగించుట ద్వారా గురుమూర్తి సంచిత కర్మరాశి భస్మీపటలము చేయుచున్నాడు. "యోగః కర్మసు కౌశలం" కర్తృత్వ రహిత కర్మాచరణ విధానమును శిష్యుని కలవరించుట ద్వారా గురుమూర్తి కర్మకౌశలమును శిష్యునికి ప్రసాదించి తద్వారా ఆగామీ రహిత అస్పర్శయోగ సిద్ధిని గురుమూర్తి శిష్యునికి చేకూర్చుచున్నాడు. యీ విధముగా కర్మత్రయము నాశనము కాగా పునర్జన్మ బీజము నిశ్శేషముగా నశించి శిష్యుడు జనన మరణ భ్రాంతి రహితము సాధించుచున్నాడు. కనుక గురుమూర్తి భుక్తిముక్తుల రెంటిని ప్రసాదించువాడుగా యీ శ్లోకము నందభివర్ణింపబడియున్నాడు.

ఈ విధముగా సగుణ నిర్గుణ రూపములలో భుక్తి ముక్తులను ప్రసాదించు సద్గురుమూర్తిని అహరహము, గురుసేవ, గురుమంత్ర గురు నిష్టలయం దేమరక భజించు శక్తియుక్తుల కొరకు ధ్యానించుచుందుము గాక !

శ్లో ॥ అనేక జన్మసంప్రాప్త కర్మ బంధ (ధర్మ) విదాహినే ।
జ్ఞానానల ప్రభావేన తస్మైశ్రీ గురవేనమః ॥

తాత్పర్యము : అనంతకోటి జన్మలనుంచి సంతరించుకొన్న సమస్త కర్మఫలములను జ్ఞానాగ్ని ప్రభావముచే దహించు సామర్థ్యము గల గురుమూర్తికి నమస్కారము.

విశేష వివరణము : క్రైస్తవ మహమ్మదీయ మతములు తప్ప ప్రపంచములో కొంచ మించుమించుగా అన్ని మతములు పునర్జన్మ సిద్ధాంతమును అంగీకరించుచున్నవి. బుద్ధిపూర్వకముగా సుకర్మయో, లేక దుష్కర్మయో ఆచరించి, తత్కర్మ సంస్కారములను అంతఃకరణము నందు ముద్రించుకొని, అందుకు తగిన పుణ్య పాపములను అదృష్ట రూపముగా నిలువచేసుకొని, తత్ఫలములగు సుఖదుఃఖములను అనుభవించుటకై పునః పునః మానవుడు జన్మలెత్తుచుండును. స్వర్గాదుల యందు దేవతాది జన్మలెత్తుటకు తగినంత పుణ్యముగాని నరకప్రాప్తి పొందుటకు లేదా నీచజన్మ లెత్తుటకు సరిపడినంత పాపముగాని చేయక పుణ్యపాపరూపమగు మిశ్రమ కర్మ చేసిన జీవి తిరిగి మానవోపాధి యందు జన్మించి పుణ్యపాప కర్మలను ఆచరించి తిరిగి జన్మించుచున్నాడు. ఇదియే కర్మబంధము.

ఇట్టి కర్మబంధము నుండి విమోచనమెట్లు ప్రాప్తించును? అట్లు విముక్తి కలిగించుటకు

సహాయపడువారెవరు? అను ప్రశ్నలకీ గురుగీతా శ్లోకము సమాధానమిచ్చుచున్నది. అయితే, యీ కర్మబంధమునకు మూలకారణమేదియో ముందుగా గుర్తెరిగి, అనంతర మా మూలకారణమును శాశ్వతముగ రహిత పరచుటెట్లో తెలియవలెను.

"ఆత్మయందున మాయయారోపితంబయ్యె
మాయయం దజ్ఞాన మపుడు గల్గె
నజ్ఞానమునదోచె నవివేక,
మవివేకమందున యభిమాన మమరబుట్టె
నభిమానమందు రాగాదులుద్భవమయ్యె
రాగాదులందు కర్మంబుబొడమె" -

అంటూ జన్మ హేతు లక్షణము చెప్పబడినది. ఆత్మయందారోపితంబైనదనే మాయయే కర్మబంధమునకు మూలకారణమని చెప్పబడినది. "మాయయొక్కయు దాని కధిష్ఠానమగు ఆత్మయొక్కయు స్థాన స్వరూప స్వభావములు తెలియుటయే జ్ఞానము.

శ్లో॥ యథైధాంసి సమిద్ధోగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున ।
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥

అని భగవద్గీత విధించుచున్నది. ఇందు కూడా జ్ఞానాగ్ని అని పదప్రయోగము గావింపబడినది. కనుక జ్ఞానము, జ్ఞానాగ్ని అను పద పదార్థములను పూర్తిగా విచారించవలసియున్నది.

మాయావరణ నాశనమగుచో కర్మబంధము కాలిపోవునని ఇతరులందరు. ఎట్లనగా - అధిష్టానమగు రజ్జు జ్ఞానముచే ఆరోపిత మిథ్యా సర్పము నశించినట్లే, అధిష్ఠాన బ్రహ్మము యొక్క జ్ఞానముచే దాని యందారోపితమగు భ్రాంతిరూపమగు మాయయు తత్కార్యములును నశించునని అందురు. యిది సరిగాదు. యిందుకు చెప్పబడిన పై దృష్టాంతమున్ను సరిగాదు. అధిష్ఠాన రజ్జుజ్ఞానముచే తాత్కాలికముగా సర్పభ్రాంతి తొలగిననూ, రజ్జువే శేషించియున్నచో, కాలాంతరమున తిరిగి సర్పభ్రాంతికి కారణమగుచునేయుండును. కనుక అధిష్ఠాన బ్రహ్మము నెరుంగుట వలన మాయావరణము శాశ్వతముగ తొలగజాలదు. మరియును మాయయొక్క వస్తు నిశ్చయ జ్ఞానము లేకపోవుటయే నిజముగా అనేక అపోహలకు కారణమగుచున్నది. ఎట్లనగా మాయా బ్రహ్మలు రెండున్నూ ఒకే వస్తువు యొక్క బొరుసు బొమ్మల వంటివేగాని అందొకటి సత్యమూ ఒకటి మిథ్యా కావు. బ్రహ్మమే ఆశ్రయముగా గల్గి, బ్రహ్మము యొక్క చేతన సత్తా చేతనే తప్ప చలించుటకు కూడ సామర్థ్యము లేక, బ్రహ్మము యొక్క శక్తియే అని చెప్పబడుచూ వుండే మాయ, బ్రహ్మమే అగునుగాని అన్యము కాజాలదు. అన్యమంటే స్వసిద్ధాంతముననే విరుద్ధమై అద్వైతహాని ఘటిల్లును. పరిపూర్ణ బోధయందు సాంప్రదాయక పద్ధతిగా విచారణ చేసినవారికి మాయా బ్రహ్మల వస్తు నిర్ణయము సులభగ్రాహ్యము. మాయా బ్రహ్మల రెంటియొక్క అఖండత్వ దర్శనమే జ్ఞానము. అట్టి అఖండ జ్ఞానరూపమైన వస్తువుకు (అఖండ యెరుకకు) పరిపూర్ణ పరబ్రహ్మము నందు మూలముగాని కొనకు ప్రవేశించుటకు స్థానముగాని లేదని అనగా మూలము లేని ఈ గుర్తెరిగే శరీరమేమీ లేదు అని తెలియుటయే జ్ఞానాగ్ని. యీ భావము త్రికరణముల యందు ఆరూఢమైనపుడే కర్మబంధమును కాల్చివేయు శక్తివంతమగును. ఈ భావ మావిధముగా యెట్లా రూఢము కావలెనో అది అంతయు పరిపూర్ణ బోధకు సంబంధించినది.

అట్టి జ్ఞానాగ్నిని తనయందు గల్గియున్న వారెవరు? గురుమూర్తియే అని యీ శ్లోకము చెప్పుచున్నది. మూడవ నేత్రమందు జ్ఞానాగ్ని ప్రజ్వలింపచేసుకొన్నవాడై ఆ జ్ఞానాగ్నిచే శిష్యుల మాయావరణమును శాశ్వతముగా దగ్ధము చేయగలవాడగుటచేతనే గురువు లయకారుడగు మహేశ్వరుడు (గురుర్దేవో మహేశ్వరః) అని కొనియాడబడుచున్నాడు. అయితే, సాధకుని యొక్క జ్ఞానాగ్నిచే దగ్ధమగునేకాని గురువు దహింపగలడని చెప్పవచ్చునా? ''ఉద్ధరేదాత్మనాత్మానం'' అని భగవద్గీత చెప్పుచున్నది గదా! ''జ్ఞానానల ప్రభావేన'' అంటే గురుని జ్ఞానానలమా? లేక శిష్యుని జ్ఞానానలమా? అని శంకిస్తే - శిష్యుని యందు జ్ఞానాగ్ని నుత్పత్తి చేసి పోషించుటకును దానిచే శిష్యుని అజ్ఞానమును లయపరచురీతిగా దానిని ప్రభావితము చేయుటకును గురుని జ్ఞానానలమే కారణము గదా? అయినను ఒకానొక లక్షణయుతుడగు శిష్యుని యందు జ్ఞానాగ్నిని ప్రజ్వలింపచేయుట అసాధ్యమని గురుడెంచినచో ''అతనికి దయవస్తే అరనిముసమునసే'' శక్తిపాతముచే బోధస్థితి అతనికి చేకూర్చగలడు. కనుక గురుదేవుని జ్ఞానానల ప్రభావముచే కర్మబంధములు కాలిపోవునని చెప్పుటలో యెట్టి విప్రతిపత్తిన్ని లేదు. ఒక్క పరిపూర్ణ బోధజ్ఞుడైన గురువే యిందుకు సమర్ధుడని వేరే చెప్ప పనిలేదు.

గీతా శ్లోకములో సర్వకర్మలను జ్ఞానాగ్నిచే దగ్ధము చేయవలెనని చెప్పబడినది. ఆగామి - సంచిత - ప్రారబ్ధములని కర్మ మూడు విధములు. ఆగామి అనగా ఈ జన్మలో చేసిన కర్మ వలన వుత్పత్తి చేయబడిన అదృష్టరూపమగు కర్మఫలము. సంచితమనగా, గడచిన అన్ని జన్మల యొక్క కర్మఫల సమూహములో అనుభవించి వేయబడినది గాక శేషించిన కర్మఫల రాశి. ప్రారబ్దమనగా యీ జన్మలో అనుభవించుటకై నిర్ణీతమైయున్న కర్మవిశేషము. ఇందు జ్ఞానాగ్నిచే దహింపబడు కర్మయేది? శ్లో॥ ప్రారబ్ధం భోగతే నశ్యేత్ తత్వజ్ఞానేన సంచితం... అని చెప్పుచున్నారు. సంచితము తత్వజ్ఞానముచే యెట్లు నశించును? అంటే, జ్ఞానస్వరూపమగు బ్రహ్మము సత్యము, కర్మకు మూలకారణ స్వరూపమగు మాయ అసత్యము అని తెలిసి దృఢముగా భావించిన యెడల మాయా, మాయా కార్యములగు కర్మ విశేషములు నశించునని చెప్పెదరు. ఇది సరిగాదు. జ్ఞానములేనిచో కర్మయేలేదు. ఏలననగా గుర్తెరిగిగాని ఎవరున్ను ఏ కర్మయు చేయరు. కనుక కర్మకు జ్ఞానము కారణముగానున్నది. కారణము సత్యము, కార్యమసత్యము కాజాలదు. ''ఎరుగుట జ్ఞానము, దానను జరిగేపని కర్మయనుచు జనులెన్నిరి...'' బ్రహ్మము యొక్క జ్ఞానరూపమగు సంకల్పముచేతనే సృష్టికర్మ జరిగినదని 'సోఽకామయత, బహుస్యాం, ప్రజాయేయేతి'' అను శ్రుతి స్పష్టము చేయుచున్నది. కనుక జ్ఞానమే కర్మ. కర్మయే జ్ఞానము. జ్ఞానకర్మలు రెండూ ఒకే వస్తువు యొక్క భిన్నరూపములు అని వస్తు నిర్ణయ మెరిగినవారికి స్పష్టమే. కనుక జ్ఞానకర్మలు రెండున్నూ కలిసియే నశించును. గాని ఒకదానిచే నొకటి నిర్మూలించవచ్చుననీ నిర్మూలించిన జ్ఞానమును నిల్పుకొనవచ్చుననీ భావించుట సమంజసము కాదు. జ్ఞానకర్మల బంధ మనాది. కనుకనే శ్రీకృష్ణదేశికేంద్రుల వారు తమ కంద పద్యములలో -

కం॥ ముడిబడి కర్మము జ్ఞానము,
విడువకనా రెండు వెలసె విశ్వమున
నదే కడువేడ్క బయలుగనెనా,
ఘడియైనను నిల్వలేక కల్లై పోవున్

అని సెలవిచ్చినారు. ఈ రెండు రీతులుగా కనబడుచుండే మేను పరిపూర్ణ పరబ్రహ్మము నందు

లేనే లేదని ఆరూఢమగుటయే జ్ఞానాగ్ని. ఆ జ్ఞానాగ్నిచేగాని జ్ఞానకర్మల బంధము (ముడి - యిదే హృదయ గ్రంధి) కాలిపోదు. ఈ గురుగీతా శ్లోకములో "కర్మబంధ విదాహినే" అనుటకు "కర్మ ధర్మ విదాహినే" అను పాఠాంతరముగలదు. అందు ధర్మ శబ్దమునకు జ్ఞానమనిన్ని అర్థము చెప్పవచ్చును. ఈ కర్మ ధర్మములు రెండు ఒకే వస్తువుకు సంబంధించినవే అని గుర్తించితిమి గదా! అందు కర్మము నశించితే ఆ వస్తువున్ను ఆ వస్తువు యొక్క ధర్మమున్ను రెండూ నశించునుగాని కర్మమును మాత్రము కాల్చివేసి ధర్మరూపమైన జ్ఞానమును మిగుల్చుకొనజూచుట వెఱ్ఱితనము. అగ్నితో కట్టెలను కాల్చివేస్తే కట్టెలతోనే ఆ యగ్నియు నశించునుగాని అగ్ని మిగులునా? కర్పూరమును, కళికయున్నూ (అగ్నిజ్వాలయున్ను) ఏకకాలమందే నశించునుగాని కర్పూరము కాలిపోతే అగ్నిజ్వాల మిగులదు కదా! అట్లే జ్ఞానాగ్నిచే కర్మము దగ్ధమై యింకను జ్ఞానాగ్ని మిగులజాలదు. "చక్కని బోధాగ్ని చేత చాలించుకోరా" అన్నారు శ్రీకృష్ణదేశికేంద్రులు. ఇందు చాలించుకోరా" అని ఎందుకన్నారంటే - బోధాగ్నిచే ఎరుక భ్రాంతులన్నియు దగ్ధమై వానితోబాటు బోగి ధ్యాయున్ను చల్లారిపోవును. ఈ భావము కందార్థములలో అనేకచోట్ల తొణికిసలాడుచున్నది. గ్రంథ విస్తరభీతిని విరమించినాము.

సాధకుడు తన కర్మబంధమును తన జ్ఞానాగ్నిచేతనే దహించవలసియున్నది. కాని గురుకృపావిహీనులకు ఎంతటి జ్ఞానమున్నా కర్మబంధమును కాల్చివేయునంతటి జ్ఞానాగ్ని ప్రజ్వలింపజాలదు. కనుకనే "ఎరుక తనకు తావీడిపోదు, ఎరుకను విడిపించలేరు ఎవ్వరు ధాత్రిన్, గురుడొకడు దప్ప. గురునకు పరిచర్యయొనర్చి బోధపద్ధతి వినినన్! తిరిగిరాని పద్ధతిగనినన్! పరిపూర్ణ మెరుక యేర్పరచ నెరుకలేక, హరిని స్వప్నముగన్న కరి భ్రమ్గినట్లొ, యీ పద్ధతి వినినన్ తిరిగిరాని పద్ధతి గనినన్" అని కందార్థము చెప్పబడినది.

కర్మయనగా దుష్కృత, సుకృతములు రెండునూ అని గుర్తెరుగవలెను. దుష్టకర్మ యినుప సంకెళ్ళయితే సుకర్మ బంగారు సంకెళ్ళు. స్వాతంత్ర్యము హరించి, బంధించుటకు రెంటికీ సామర్థ్యము గలదు. కనుక పుణ్యపాపముల రెంటి బంధము నుంచీ విముక్తి కావలసియున్నది. పైన చెప్పబడిన జ్ఞానాగ్ని, సంచిత కర్మరాశినేగాక బోధ ఆరూఢమయ్యేనాటివరకు ఈ జన్మయందు చేసిన ఆగామీ రూప కర్మఫలములను గూడ దహించగలదు. ప్రారబ్ధరూపకర్మ అనుభవము చేతనేగాని రహితము కాజాలదు. శేషజీవితములో జరుపు కర్మల యొక్క సంస్కారములు అంతఃకరణమందంటనీవిధముగా అస్పర్శ యోగం (యోగః కర్మసు కౌశలం) బూని పరిపూర్ణ భావజ్ఞు డశరీరియై సంచరించును. యిట్టి ఆరూఢ స్థితి కుదురుట సాధ్యము కాదు. గురుకృపా ప్రసాద సంసిద్ధి కలిగినవారికే సాధ్యము. అట్టి సర్వసామర్థ్యములు ప్రసాదించగల సద్గురు పరమాత్మ కివే మా ప్రణుతులు.

శ్లో॥ శోషణం భవసింధోశ్చ,
దీపనం క్షర సంపదాం
గురోః పాదోదకం యస్య
తస్మై శ్రీ గురవేనమః

తాత్పర్యము : ఏ గురుదేవుని పాదోదకము సంసార సాగరమును యింకింపచేయుగలదో, మరియు నాశనశీలమగు ఐహికాముష్మిక సంపదను ప్రకాశింపచేయగలదో, (అభివృద్ధి పరచగలదో) అట్టి మహామహిమాన్వితుడగు గురుమూర్తికి నమస్కారము.

విశేష వివరణము : 1) శోషణ దీపనములు 2) క్షరాక్షర సంపత్తులు 3) గురుపాదోదకము. ముఖ్యముగా యీ మూడింటిని గూర్చి వివరించి తెలుసుకొనవలసియున్నది.

1) శోషణదీపనములు = శోషణమనగా యెండించుట లేక యింకింపజేయుట. దీపనము : ప్రకాశింపచేయుట లేక ప్రజ్వలింపచేయుట. ఈ రెండు కార్యములు అగ్నిభూతము యొక్క కార్యములై యున్నవి.

సృష్టి విధానమునందు అగ్ని నుండి జలముత్పత్తియగుచున్నది. చివరకు అగ్నియందు లయమగుచున్నది. అగ్ని కారణము. జలము కార్యము. కారణము నుంచి కలిగిన కార్యవస్తువు కారణము నందు పర్యవశించుట న్యాయమే.

అగ్నికి వేడియు వెలుగు అని రెండు లక్షణములున్నవి. సింధువనగా జలరాశి కనుక దానిని యింకింపచేయవలెనంటే దానికి కారణమగు అగ్ని అవసరం. ఇది సాధారణమగు జలరాశి కాదు, జన్మస్థితి లయరూపమగునదే భవసింధువు.

ఈ భవసాగరమును యింకింప చేయునగ్ని ఏది? ఈ సంసార సముద్రమున మునకలిడు జీవుడు అజ్ఞానముచే యందుగల కించిత్సౌఖ్యములకే యాశపడి అందుకై చేయరాని పనులు చేయుచు పరమార్ధమునకు దూరస్తుడై పోవుచున్నాడు. ఆ అల్పసుఖములనే జీవితాశయముగా నెంచి వాని యభివృద్ధికై వేయి దేవుళ్ళకు మ్రొక్కులిడుచున్నాడు. ఏది భవసాగరమును యింకింప చేయునని చెప్పబడినదో అదే సర్వసంపదలను ప్రకాశింపజేసి అభివృద్ధిపరచునని యీ శ్లోకములో చెప్పబడినది. ఆ యగ్ని ఏది? ఆ అగ్ని గురుపాద తీర్ధము నందున్నట్లుగా యీ శ్లోకము అభివర్ణించుచున్నది.

2) క్షరాక్షర సంపత్తులు : క్షరమనగా నశించునది అని శబ్దార్ధము. అపుడు అక్షరము అనగా నశించనిది అని అర్ధము వచ్చుచున్నది. ఈ లోకము నందు మానవునికి సౌఖ్యమొసంగు స్రక్చందన వనితాదులు ధన కనక వస్తు వాహనము అయివున్నది. ఊర్ధ్వ లోకముల యందు ఆనందము విశేషముగానూ, విశేషకాలమునుండునదియునై యుండవచ్చునేగాని అదియు నశ్వరమే. అనగా అశాశ్వతమే. ఇదంతయు క్షరసంపద క్రిందనే జమకట్టవలెను. ఇక అక్షర సంపదయేది? అనగా అఖండమగు జ్ఞానసంపత్తియే చిత్ప్రకాశము. అది సచ్చిదానంద స్వరూపమగు పరమాత్మ స్థానీయమైయున్నది. ఇదియే అక్షర సంపద.

ఇక్కడనొక్క విశేషము గమనించదగియున్నది. క్షరాక్షర సంపత్తులు రెండు నశ్వరములే అని తెలియవలెను. జ్ఞానము కూడా అశాశ్వతమేనా? ఎట్లు? అని సందేహము కలుగవచ్చును. కాని సృష్టికి పూర్వము ఒకరీతిగాను సృష్టికాలమందొకరీతిగాను సృష్టి అనంతరము జీవోపాధులలో న్యూనాధిక్యతలతో మరొకరీతిగానూ జ్ఞానము మారును. మరియు నా వుపాధులలో జాగ్రదా ద్యవస్థలలో వేరు వేరు రీతులుగా మారుచుండెడి జ్ఞానము శాశ్వత మనరాదు. ఎప్పటికీ ఏ మార్పు లేకుండా వుంటే శాశ్వత మనవచ్చును. అజ్ఞానము జ్ఞానమువల్ల నశించును కనుక అజ్ఞానము అశాశ్వతమన్నారు. జ్ఞానము జ్ఞానాతీతమగు పరిపూర్ణ పరబ్రహ్మమునందు లేదు కనుక దాని దృష్ట్యా అశాశ్వతముగానే చెప్పవలసియున్నది. యీ జ్ఞానాజ్ఞానములు పరస్పర సాపేక్షికములు. మరియు నివి ఏకవస్తువుయొక్క మారురూపములు. "జ్ఞానాజ్ఞానంబులు యీ జ్ఞానానివేగాని వేరుగా వెన్నటికీ" "జ్ఞానము వచ్చును. పోవును జ్ఞానాతీతమును దాను గాంచిన దాకన్" అనిన్ని శ్రీ కృష్ణదేశికులు అభివర్ణించినారు. కనుక జ్ఞానము క్షర సంపదలోనే చేరును.

గురుగీతలోనెయున్న యీ క్రింద శ్లోకము గూడా యీ భావనను యెట్లు స్థిరపరచుచున్నదో విచారించి చూడుడు.

శ్లో॥ శోషణం పాపపంకస్య దీపనం జ్ఞాన తేజసాం
గురోఃపాదోదకం సమ్యక్ సంసారార్ణవతారకం॥

ఈ శ్లోకము గూడా గురుపాద తీర్థముయొక్క మహిమనే వర్ణించు చున్నది. ఈ రెండు శ్లోకములను ఒకదానితో నొకటి పోల్చి, తారతమ్యములను సాదృశ్యములను విచారణ చేయవలసియున్నది.

1) "శోషణం భవసింధోశ్చ" అని మన మెత్తుకున్న గురుగీతా శ్లోకములో వుండగా "సంసారార్ణవ తారకం" అని రెండవ శ్లోకములో యున్నది. అనగా సంసార సముద్రమును దాటించును అని అర్థము. సముద్రమును దాటినవాడు మరల సముద్రములో పడుట కవకాశమున్నది. సముద్రమే యింకిపోయినచో ఆ ప్రమాద ముండదు. ఆ సముద్రమేది? అజ్ఞానమే సంసార సముద్రమని యితరులంటారు. జ్ఞానాజ్ఞానరూపమైన (యెరుక మరుపుల రూపములో వుండే యెరుకద జ్ఞానమే ఆ సంసార మహా సముద్రము అని అచల ఋషులంటారు.

2) రెండవ శ్లోకములో శోషణం పాప పంకస్య అన్నారు. మొదటి శ్లోకములోని భవసింధువు నకు, పాపమే బురద లేక వూబియై యున్నది. ఆ వూబిలో దిగబడిన జీవుడు మరల పైకి తేలుట దుస్తరము. ఈ పాపమే దోషస్వరూపము. క్షరాక్షరోపాది ద్వయదోషమని కృష్ణ దేశికేంద్రులవారన్నారు. కనుకనే ఓ పాపరూపా! అని సంభోదించినారు. ఐతే ద్వయ దోషమేది? పాపపుణ్యములనే రెండు రూపాలు దోషస్వరూపాలే. ఒకటి యినుప సంకెలగా బంధిస్తే, మరొకటి హిరణ్య శృంఖలంగా బంధిస్తుంది. ఇందు క్షరోపాధి పాపమని చెపితే అక్షరోపాధి పుణ్యలక్షణమని చెప్పవచ్చును.

3) "దీపనం క్షరసంపదాం" అని మన మొదటి శ్లోకములో వుంటే "దీపనం జ్ఞాన తేజసాం" అని రెండవ శ్లోకములో కలదు. అంటే రెండవ శ్లోకములో పాపపంకమునుండి జీవుని లేవనెత్తి పుణ్యరూపమైన, జ్ఞానతేజస్సుతో గూడిన అక్షర సంపదను గురుపాదొదకం కలిగించును అని అర్థం. ఈ అక్షర సంపద్రూపమగు జ్ఞానము హిరణ్య శృంఖములవలె బంధకారణమని యిదివరకే చెప్పుకొనుటే అయింది.

పర్యవసాన మేమనగా

4) "శోషణం పాపపంకస్య" అను శ్లోకములో గురుపాద తీర్థము పాపమును నాశనము చేసే పుణ్యఫలరూపమగు జ్ఞానసంపత్తి చేకూర్చుట ద్వారా జన్మకారణమగు అజ్ఞానమనే భవసాగరమును దాటింపచేయును అని సామాన్యముగా యితరులు చెప్పే అర్థము. "శోషణం భవసింధోశ్చ" యను శ్లోకార్థము అతీత భావమునే అనువదించుచున్నది. శాశ్వతముగా భవసాగరము యింకిపోవలెనంటే, అనగా శాశ్వత జన్మరాహిత్యము సిద్ధించవలెనంటే, అందుకు గురుపాద తీర్థమే కారణమై యున్నది. యెట్లనగా భవసాగరమునకు మూల కారణము అజ్ఞానముకాదు. జ్ఞానాజ్ఞానములుగా ఏ జ్ఞానమే అభివ్యక్తమై జీవేశ్వర జగత్తుకు కారణమైనదో అదే భవసాగరము. దాని నింకింప చేయుటకు జ్ఞానాజ్ఞాన రహితమును ప్రభోదించు పూర్ణబోధయే ఆవశ్యకము. పరిపూర్ణ బోధాగ్నియే భవసాగరమును యింకింపచేయు నగ్ని కనుకనే

కృష్ణదేశికేంద్రులు "మక్కువనే బోధించిన చక్కని బోధాగ్ని చేత సాధించుకోరా" అని హెచ్చరించినారు.

3) గురుపాద తీర్థము : సముద్ర గర్భమునందు బడబాగ్ని యున్న రీతిగా, గురు పాదోదకములయందు బోధాగ్ని యిమిడి యున్నది. అందుకే గురుగీతలోనే

శ్లో॥ ప్రసన్న వదనాక్షంచ సర్వదేవ స్వరూపిణం
తత్పాదోదకజా ధారా నిపతంతీ స్వమూర్ధని
తయా సంక్షాళయే దేహ బ్యాంతర్బాహ్యగతం మలం
తక్షణా ద్విరజో భూత్వా జాయతే స్ఫటికోపమః

అను శ్లోకమున్నూ

"వందే గురుపద ద్వంద్వం, వాఙ్మనోతీతగోచరం
శ్వేతరక్తం ప్రభాబిన్నం శివశక్త్యాత్మకంపరం"

అను శ్లోకమున్ను గురుముఖతః విచారిస్తే నిర్గుణమగు గురుపరమాత్మ యొక్క పాద ద్వంద్వ మేదియో, గురుపాదోదకముయొక్క వాక్యార్థ లక్ష్యార్థములేదియో తెలియబడును. గురుపాదోదక స్నానపానములచే శిష్యుని స్థూల సూక్ష్మ శరీరము లెట్లు పవిత్రీ భూతము లగుచున్నవో తెలియనగును.

అట్టి సద్గురు పరమాత్మయొక్క సగుణ నిర్గుణ రూపములను అహరహము భజించు శక్తి గురుపరమాత్మ అనుగ్రహ విశేషముచే మనకు సిద్ధించునుగాక!

వ్యాఖ్యాన శ్లోకము :

శ్లో॥ న గురో రధికం తత్త్వం, నగురోరధికం తపః
న గురో రధికం జ్ఞానం, తస్మై శ్రీ గురవే నమః

తాత్పర్యం : గురువును మించిన తత్త్వముగాని, తపస్సుగాని జ్ఞానముగాని లేదు కనుక శ్రీగురుదేవులకే నమస్కార మర్పించు చున్నాను.

విశేష వివరణము : 1) శ్రీ గురువు 2) తత్త్వము 3) తపస్సు 4) జ్ఞానము అనువాని విశేష వివరణము తెలియుట అవసరం.

1) శ్రీ గురువు : ఏ విద్య నేర్పినవాడైనను గురువే యగును. ఆ గురువునందు గురి, విశ్వాసము, లక్ష్యము యున్నపుడే ఆ విద్యార్థి నేర్చుకునే విద్య యాతనికబ్బి సార్థకములోనికి రాగలదు. జీత భత్యములిచ్చి గురువు వద్ద విద్య నేర్చిన యెడల ఆ గురువునంతదాతనికి గౌరవ భావమే అంతగా నుండజాలదు. ఏలననగా ఆ గురువున్ను ఒక జీతగాడే యగును. అతని యెడల గురి లేక లక్ష్యము వుండదని వేరే చెప్పపనిలేదు. ఆ గురువునకున్ను శిష్యుని యందు వాత్సల్యము, కరుణ యుండజాలవు. శిష్యుడిచ్చు ధనమందే అతనికి ప్రేమయుండును. తాను శిష్యుని ధన మాశించి విద్య గరుపుచున్నాడు. కనుక శిష్యుని యభీష్టము మేరకే విద్య నేర్పవలెను. అట్టి గురువు శిష్యునికి క్రమశిక్షణ నేర్పుటకే వెనుకాడుచుండును. శిష్యుని శ్రేయోభివృద్ధియే గురుని ఏకైక లక్ష్యముగా నుండక తన స్వార్థము కొరకే అతడు విద్యగరపుచున్నాడు. కనుక తానే ఆ శిష్యునికి విశపర్తియై యుండవలెననే భావము గురువును

దిగజార్చుచుండును. గురుని అంతఃకరణ స్వార్థపూరితమైయుండునేగాని శిష్యుని యెడల ప్రేమతో తొణికిసలాడదు.

గురువులు అష్ట విధములుగా విభజింపబడినారు. అందు మొదటి యేడుగురు గురువులు యిట్టి స్వార్థ గురువులే, ఎనిమిదవవాడుగా చెప్పబడిన విహిత గురువు లేక పరమ గురువు ఒక్కడే నిస్వార్థగురువు. అతడే బ్రహ్మవిద్యా గురువుగా నుండ యోగ్యుడు. అతడు శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడు. అనగా తాను స్వయముగా బ్రహ్మసాక్షాత్కారము తన గురుకృపా విశేషమున అదివరకు పొందియున్నాడు. అంతేగాక తన గురుబోధచేతను, స్వయంగా శాస్త్రపరిశోధన చేసినవాడూనై యుండి, శ్రుతి యుక్తి అనుభవములచేత శిష్యునికి బోధింప సమర్థుడై యుండుటయేగాక శిష్యునికి తనకు కలిగిన అనుభవమును కలిగింపగలిగి యుండును. శిష్యునికి అపరోక్షానుభూతినిచ్చుట కాతడే సమర్థుడు. "స్వయంతీర్ణః పరాన్ స్తారయతి" యనియు "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి" అనియు అతడుకీర్తింపబడినాడు. అతడే కృతకృత్యుడు. ఆప్తకాముడు. భగవద్గీతలో చెప్పిన కర్మకౌశలరూపమైన యోగ యుక్తుడు. తానాచరించి శిష్యులచే నాచరింపచేయును గనుక "ఆచార్య" సార్థక నామధేయుడు. ఈ శ్లోకమున చెప్పబడిన శ్రీగురువు అతడేనా లేక కేవలం పరిపూర్ణ గురువా? పరిపూర్ణగురు వింకనూ విలక్షణుడు. అతడు బ్రహ్మస్వరూపుడై యుండుటయేగాక "తత్పరం చ అవలోక యేత్" అని గురుగీతలో చెప్పబడిన రీతిగా ఆత్మాతీతమగు కేవలాత్మను (పరిపూర్ణ పరబ్రహ్మ మును) యెరిగి లేని యెరుక లేనేలేదని స్థిరపరచుకొని అశరీర స్థితిలో నున్నవాడు

అశరీరం సర్వదాస్తి ఉ శరీర రహితం సదా
అయమేవ సద్యోముక్తి రస్యధా భ్రమకారణం॥

అను శ్లోక భావముగా నాతడు శరీర రహిత స్థిత్యానుభవంలో సర్వ భ్రాంతి రాహిత్యమును సాధించినవాడు. అతడే అచల పరిపూర్ణుడని అనదగినవాడు, అతడే శ్రీ గురువు. గురు వట్టివాడేయైయుండినను, శిష్యుడాయన యుత్కృష్ట స్థితిని తెలుసుకొన్నవాడై, ఆయన యెడల భయభక్తి వినయవిధేయతలు గల్గియున్నపుడే, ఆయన బోధవలన ఆరూఢస్థితి తాను గూడా సాధించగలుగును. సాధారణముగా గురుని నామరూపములు మాత్రమే స్ఫురించుచు అతని మానవాకృతి మాత్రమే గోచరించుచుండును గాని అతడశరీర అచల పరిపూర్ణుడు అనేవివేక జ్ఞానము దృఢమైయుండుట అరుదు కనుక గురుప్రభావమును వర్ణించు గురుగీత పఠనపాఠనశ్రుతములచే గురుడు నరుడనే భావమునుండి శిష్యుడు సంపూర్ణముగ విముక్తుడు కావలెను. గురువు కంటె గొప్ప తత్వం లేనేలేదు. సర్వ తపస్సులకు అవధి భూత మౌనట్టియు, అఖండ జ్ఞానమునకు పరాకాష్ఠ యగునట్టియు ఆ పరిపూర్ణ గురుస్వరూప మును యీ శ్లోకం సూచించుచున్నది.

2) తత్వం : అనగా స్వభావము, యధార్థస్థితి, బ్రహ్మము, అధిష్ఠానం, నిజరూపం అను అర్థములున్నవి. విశ్వమందున్న పదార్థముల నన్నింటిని విమర్శించి, 25 తత్వములుగా కొందరు, 36 తత్వములుగా కొందరు, 96 తత్వములుగా కొందరు విభజించి వీని కన్నింటికి మూలకారణమైన అధిష్టాన చేతన బ్రహ్మమే పరమతత్వముగా నిర్ణయించినారు, అదియే తత్, త్వం పదార్థముల కైక్యరూపమగు 'అసి' పదార్థమన్నారు. కనుక సర్వకారణమైన బ్రహ్మమే మొదటి తత్వము "న గురో రధికంతత్వం" అనగా ఆ బ్రహ్మతత్వము గురువు కంటె (అధికం)

గొప్పదికాదుఅంటే ఆ బ్రహ్మతత్వము గురువు కంటె తక్కువదో లేక గురువతో సమానమైనదో కావలెను. సమానమైన రెండు మూలతత్వములుండుటకే వీలులేదు కనుక గురుతత్వమే బ్రహ్మతత్వము, బ్రహ్మతత్వమే గురుతత్వము మాటల భేదము, మాత్రమే అని అనవలసి యుండును. ఈ అర్థమును స్వీకరించి "గురు సాక్షాత్ పరబ్రహ్మ "లేక " గురురేకం పరబ్రహ్మ" అన్నారు. ఇక బ్రహ్మతత్వముకంటె గురుతత్వం గొప్పది. బ్రహ్మతత్వం తక్కువది అనే అర్థమును స్వీకరించి "యస్యాంతర్నాది మధ్యం" అన్న శ్లోకంలో "నోతత్వం తత్వమేకం " అను మాటలీ భావమును సమర్థించును. గురుతత్వ మొక తత్వముకాదు. కాని ఏకమైన ఒకానొక విలక్షణతత్వం, ఏకానేకములుగానిది. ద్వంద్వాతీత మైనది కనుక మూలతత్వమైన పరమాత్మ తత్వముకన్ననూ విలక్షణమై దానికంటె గొప్ప దైయున్నది. రెండురూపుల గనబడేది పరమాత్మ ద్వంద్వాతీతమైనది. గురుతత్వం, కనుక గురుతత్వం బ్రహ్మతత్వం కంటె గొప్పది. బ్రహ్మతత్వము న్యూనమైనదే అనే భావమునకు యెడ మిచ్చుచున్నది. యీ అర్థమునే "గురునామ సమస్వామి సదృశం పరమంపదం" అనే గురుగీతా వాక్యము సమర్థించుచున్నది. పరమపదముకూడ గురుస్వామితో ఏల సమంకాదు? అంటే గురుస్వామి సాకారరూపంలో తన స్వరూప స్థితిని భక్తులకు ప్రసాదించగలడు. పరమపద మట్లు చేయజాలదుగదా! ఎట్లు చెప్పకొన్నను గురుతత్వమును మీరిన తత్వం లేనేలేదు. మరి పరిపూర్ణమో! అంటే, అది తత్వమేకాదు దాని కెట్టి స్వభావం లేనేలేదు. కనుకనే "గురువుకంటె గొప్పదేదిరా" అంటూ గొప్పది లేదనే భావంతో కవి గానము చేశాడు. మరి, పరిపూర్ణమో అది, కొద్ది గొప్పలనే సాపేక్షిక పదజాలంతో నిర్ణయించరానిది.

3)తపః- తప అనగా తపించుట లేక దహించుట అని అర్థం. దేనిని అని ప్రశ్నిస్తే, శరీర, వాఙ్మనస్సులను తపింపచేయును లేక శుష్కింపచేయును. కాయిక వాచిక మానసిక తపస్సులని తపస్సు ముఖ్యముగా మూడు తరగతులుగా విభజింపబడినది. ఆసన ముద్ర లక్ష్యది అభ్యాసములచేతను కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతములచేతను ఉపవాసాది నియములచేతను శరీరమును తపింపచేసి మదుపుటేనుగును మావటివాడు స్వాధీనం చేసుకొన్న రీతిని శరీరమును స్వాధీనము చేసుకొనుట కాయక తపస్సు. వాక్కును బంధించి మౌనవ్రతం లేదా అనుద్వేగకరమై, ప్రియమైన సంభాషణచేయుటరీత్యా వాక్కును నియమించుకొనుట వాచిక తపస్సు, తారక అమనస్కాది యోగములచే మనస్సున కేకాగ్రత సాధించుట మానసిక తపస్సు యీ త్రివిధ తపస్సులచే సాధించదగు వుత్తమ ఫలమేది? అంటే, సాధకునికి బాహ్యాంతరశుద్ధి చేకూరగలదే కాని, బ్రహ్మస్వరూప సాక్షాత్కార రూపమగు పరమ పురుషార్థము సిద్ధింపదు. జనన మరణ భ్రాంతి రహిత స్థితి అసలే చేకూరదు. గురుసేవ గురుభక్తి గురునిష్ఠలతో గూడిన గురూపాసనయే యిందుల కేకైక మార్గం. గురుతత్వమును తెలియుటకు, దాని కతీతమైన పరిపూర్ణపరబ్రహ్మ యవలోకనము సిద్ధించుటకున్ను, ఆపైన సర్వభ్రాంతి రహితస్థితి కలుగుటకున్ను గురూపాసన ఫలితమగు గురుకృపా సంసిద్ధి సాధించవలసివున్నది. "గురుతత్వమ విజ్ఞాయ సర్వం వ్యర్థం భవేత్ ప్రియే" అని పరమశివుడు పార్వతిని గురుగీతలో హెచ్చరించుచున్నాడు. "గురూపదిష్ట మార్గేణ మన శ్శుద్ధింతు కారయేత్" అనగా గురువు చెప్పిన మార్గముచేత త్రివిధ తపస్సుల ఫలరూపమగు అంతఃకరణ శుద్ధి చేకూరుచున్నది, గురుమార్గమునందు చెప్పబడిన అనుష్ఠాన జప, ధ్యాన, ఆచరణాదులకంటె ఉత్తమ తపస్సేదియులేదు, వుపాస్య మేది! అంటే "సర్వశరీరస్థ చైతన్య ప్రాపకో గురురుపాస్యః" అని

నిరాలంబోపనిషత్తు నిర్ణయించినది. "యత్రనాన్య త్పశ్యతి నాన్యః చ్ఛృణోతి. నాన్య ద్విజానాతి సభూమా" అనిభూమా పదార్థమును శ్రుతి నిర్ణయించినది. గురుతత్వమే భూమ "భూమాస మిత్యుపాస్య" ఆ గురుతత్వమునే వుపాసింపుమని శ్రుతి నిర్దేశించుచున్నది. కనుక యీ శ్లోకములో "నగురో రధికం తపః" అని వుల్లేఖింపబడినది. "నాన్యత్ సాధనం గురుమార్గిణాం" గురుభక్తులకు గురుపాసనకంటె మరొక సాధనంలేదు. యితర సాధనలు పనికిరావు. యితర సాధనలు చేయు చున్నచో ఆ సాధనలచేత తన ఆశయసిద్ధి చేకూరదు సరిగదా, ఈ సాధనలు అందుకు ఆవరోధములు కాగలవు అని తెలియవలెను.

4) జ్ఞానం:- అనగా సామాన్యార్ధంలో తెలివి. ఈ తెలివితోనే మానవుడు శాస్త్రజానము, వస్తుజ్ఞానము సంపాదించును. బ్రహ్మచైతన్యము, బ్రహ్మకారవృతి, స్వరూపస్ఫూర్తి, సృష్ట్యాదులే స్ఫురింపని తాను తానై వున్న స్థితి, అను విశేషార్ధములున్నవి. సామాన్యార్ధములో యీజ్ఞానం సకల ప్రాణులయందు మాత్రమేగాక జడములని నిర్ణయించిన పదార్థములయందు గూడ నేదో రూపమున యున్నది. యీ జ్ఞానం శబ్ద తన్మాత్రయొక్క పరిణామమే. శబ్దము వాక్ అని వ్యవహరింపబడుచూ, పర, పశ్యంతి, మధ్యమ, వైఖరి అని చతుర్విధములుగా చెప్పబడిన సకలమునందు ఏదో రూపంలో వుండియేవున్నది. జడములని చెప్పబడే రాళ్ళయందు పరావాగ్రూపంలోనుండియున్నది. పరమాత్మయందు లేశరూపముగా ఘనీభవించియున్నది. కనుక అది కేవలం నిశబ్ద బ్రహ్మమైన పరిపూర్ణ బ్రహ్మముగాదు. ఏలననగా ఒకప్పుడు నిశ్శబ్దముగాను, ఒకప్పుడు శబ్దరూపపరిణామము పొందినదిగాను యుంటున్నది. కనుక శబ్దరూపమగు యీ సామన్య జ్ఞానము ఏదో రూపములో సర్వమునందు యిమిడియున్నది. జ్ఞానరూపమగు బ్రహ్మము అణువణువున యిట్లిమిడి యున్నందున "ఆబ్రహ్మ స్తంభపర్యంతం పరమాత్మ స్వరూపకం" అని చెప్పబడినది చేతనములందు అనగా ప్రాణులయందు యీ సామన్యజ్ఞానము అంతఃకరణముతోగూడి, భూతద్దమునందు ప్రవేశించిన సూర్యరశ్మి దాహకశక్తిని పొందిన రీతిగా జ్ఞానాజ్ఞానరూపములచెంది సర్వమునూ గుర్తించుచూ క్రియాకారకమైన కర్మ సంస్కారములను ప్రోగుచేసుకొని బంధకారణమగుచున్నది. అట్లుగాక తన సంగతి, తన మూలము సంగతి, విచారించి వివేక జ్ఞానముతో కృషిచేసినచో తన స్వస్వరూపసాక్షాత్కారము పొందగలడు. తన స్వరూపజ్ఞానమే యీ శ్లోకమునం దుపయోగించిన జ్ఞానశబ్దమునకు అర్థముగా గుర్తించవలెను. భగవద్గీతలో చెప్పబడిన అమానిత్వాది చతుర్వింశతి శుభలక్షణములతో కూడియున్నప్పటికి అది గురుతత్వముకంటె మీరినదికాదు. "నగురో రధికం జ్ఞానం" అన్నపుడట్టి అఖండజ్ఞానము కూడా గురుతత్వముకంటె నూన్యమే అయివున్నది. కనుక గురుభక్తులమగు మన మందరము "తస్మా త్సర్వ ప్రకారేణ గురుభక్తిం సమాచరేత్" అను విధిననుసరించి అన్ని తత్వములకంటెను, తపస్సులకంటెను అఖండ జ్ఞానముకంటెను గొప్పదగు శ్రీగురుతత్వమునే త్రికరణశుద్ధి గలిగి అనన్య భక్తితో యుపాసన గావించి సర్వభ్రాంతి రహిత స్థితిని చేకూర్చకొందుము గాక!

శ్లో॥ గురురాదిరనాదిత్వం, గురుఃపరమదైవతమ్
గురుమంత్రసమోనాస్తి, తస్మైశ్రీగురవేనమః॥

తాత్పర్యం : శ్రీ గురుపరమాత్మ మొట్టమొదటి వాడును మరియు ఆదియే లేనివాడును

గూడనైయున్నాడు. గురువే వుత్కృష్టమైన దైవము. గురుమంత్రమునకు సాటియైన మంత్రవ లేదు. కనుక అట్టి గురుస్వరూపమునకు నమస్కరించుచున్నాను.

విశేష వివరణములు : 1) ఆది 2) అనాది) 3) పరమదైవతమ్ 4) గురుమంత్రం

1) ఆది : అనగా మొదటిది అనీ కారణవస్తువు అనీ అర్థము. గురుపరమా మొట్టమొదటదై సృష్టికంతకు కారణవస్తువై యున్నది. కొలతకు లోబడు వస్తువునకు, ఆ మధ్య, అంతములుండు గురుస్వరూపమనగా గొప్ప లేక పెద్ద స్వరూపము. గొప్ప పెద్ద అ శబ్దములు సాపేక్షిక పదములు అవి కొద్ది చిన్న అను పదములను పురస్కరించుకొని ప్రవర్తిల్లును. అణోరణీయాన్ మహతో మహీయన్ అని చెప్పబడే ఆత్మస్వరూపము ఎం మహత్ప్రమాణమైనా అదియు నొక ప్రమాణము కలిగియున్నది. అది అంతట నింత నుండునదేగాని అంతటాలేదు. ఎంత పెద్ద ఆవరణమైనా దానికి మితి అంటూ వుండ వుండును గనుక దానికి మొదలు తుది వున్నవి. ఆది అనేది వుంటే, అంతమున్నూ వుండును ఆద్యంతములుంటే మధ్య భాగమున్ను వుండును. ఆది మధ్యాంతరములున్న వస్తువు శాశ్వతమ కాజాలదు. ఆది మధ్యాంత రహితమైనదొక్క పరిపూర్ణ పరబ్రహ్మ మొక్కటే. మిగిలినవన్నియు గురుస్వరూపముతో సహా ఆది మధ్యాంతములు కలవై అశాశ్వతములై యున్నవి. పరిపూ పరబ్రహ్మము నందు గురుస్వరూపముగాని, మరే యితరమున్నూ గాని లేదు. పరిపూ పరబ్రహ్మము ఎప్పటికీ వున్నది. లేనికాలము లేనేలేదు. అహం పదార్థములేని పరిపూర్ణమునంద ఒకప్పుడు తోచి మరొకప్పుడు ఆ అహం లేకుండా పోవుచున్నది. కనుక దాని కాది మధ్యాంతముల కలవు అనియే చెప్పక తప్పదు. ఆ విధంగా దానికి ప్రాగభావప్రధ్వంసా భావములున్నపుడ దానిని కాలత్రయాబాధ్యమని చెప్పరాదు. కనుక గురుస్వరూపమునకు ఆది యున్నద చెప్పబడినది. కాని దానికి ఆది ఎప్పుడు ఎంతకాలము క్రితము? అని దాని కాలనిర్ణయమ మాత్రం మనం చేయలేము.

అది సర్వసృష్టికి పూర్వము తోచినది అనిమాత్రం మనము నిరాటకంగా చెప్పవచ్చును కాని అహముదయించేటి వరకే అది (పరిపూర్ణపరబ్రహ్మము) వున్నదికదా అనియు "నే దీ వెనుక కాదా" అనియు శ్రీకృష్ణదేశికేంద్రు లన్నారు. కనుక యెరుక (గురుపరమాత్మ) మధ్యలో తోచినది మరియు మధ్యలోనే పోవుచున్నది. వస్తు మద్రహితమగు పరిపూర్ణబ్రహ్మమునందు తోచబడిన ఆది (మొదటి), వస్తువు యెరుకే అది ఏకవస్తువై "ఏకం అనేకం భవతి" అనేక మార్పులు చెంది నానాత్వమునకు కారణమై నామరూపాత్మక విశ్వరూపము వహించినది. కనుక గురుస్వరూపమగు యెరుక ఆది అని శ్లోకములో చెప్పబడినది.

2) అనాది అనే పదమునకు ఆదిలేనిది అని అర్థము. 1) మూలము (కారణము) లేనిది 2) ఆరంభం అంటూ లేనిది అనగా పుట్టుక లేనిది అని రెండర్థములు. శాశ్వతమైనది అని సామాన్య అర్థము మూలము లేనిదనుటలో దానికి మాతృస్థానము ఏదీ లేదనిన్ని, దానికి ఆధారము అధిష్ఠానము మరేదీ లేదనిన్ని స్పష్టము, అన్యమైన, దొక్క పరిపూర్ణ పరబ్రహ్మమే. అది కారణ కార్యపరంపరలో చేరదు. మరిన్ని అది కార్యకారణములలో యేదిన్ని కాదన్నమాట అయితే యెరుక ఎందుపుట్టినది? లేక యెందు తోచినది? యెట్లు తోచినది? ఎవరికి తోచినది?

అంటే వీటన్నిటికి శ్రీకృష్ణదేశికు లొక్కమాటలో సమాధానమిచ్చినారు. "కల దోచదె తనకై తా నెచటా" స్వప్నంలో ఒక్క మనస్సే, మనస్సుచేతనే మనస్సునే చూచుకొని భ్రాంతి

నానారీతులుగా చెంది సకల సుఖదుఃఖములు చెందినట్లుగానే "యెరుకను కలల్లో పురుషుని కెరుకే యీ విశ్వమగుచు నేర్పడు కలగా" "పరిపూర్ణములో దోచిన యెరుకే కల" ఎరుకే కల, ఆ కలలో పురుషుడూ కలే, ఎరుకే ఆ పురుషునకు దృశ్యమానమగు విశ్వమూ కలే. యెరుకే కనుక ఎరుక ఆ కారణంగానే (తనంత తానే) తనయందే, తాను తోచిన పిదప వున్నట్టు తోచినంతకాలము తనయందే తాను వుండి, తన సర్వస్వము తనతో సహా దీసుకొని, తానున్న చోటనే తానే లేకపోవుచున్నది, ద్రష్ట దర్శనములు, దృక్కు అన్నియు తానే అయి అన్య ప్రసక్తి లేక పరిపూర్ణ పరబ్రహ్మముతో ఎలాంటి సంబంధము లేకయున్నది. యీ విధముగా పుట్టుట గిట్టుట యెరుకకు సహజమైయున్నది.

కనుక యీ విధంగా గురుస్వరూపము ఆదియు, ననాదియు గూడనై ద్వంద్వ రూపము లలో గానవస్తూ వున్నది. పరిపూర్ణమో, ఏదియుగానిది. అది ఏకానేకములు గానిది, ఏమనీ యన రానిది, ఏ ద్వంద్వములూ లేనిది. ద్వైతాద్వైతములుగానిది, ఏమనీ యనరానిది. ఇట్టిదట్టిని యనరా నిది. కనుక అది కేవలము నిరపేక్షకము అయివున్నది.

2) పరమదైవతం : అత్యుత్కృష్టమైన ప్రకాశము కలది దివ్ అను ధాతువునకు ప్రకాశము అని అర్థము. ప్రకాశమనుటలో వెలుగు అని అర్థం తీసుకొనరాదు. అట్టి అర్థమును గైకొని ఆత్మకోటి సూర్యప్రకాశవంతం అని అభివర్ణించుచున్నారు. ఆ వర్ణన కేవలము అలంకారరూపమే అని యెరుగక, తమ సాధనాబలముచే దానిని తాము దర్శించితిమని కొందరు గొప్పలు చెప్పుకుంటున్నారు. ఒక్క సూర్యుని యెదుట నిల్చి క్షణమైన చూడజాలని తాము కోటి సూర్యుల యొక్క ప్రకాశమును దర్శించగలరా? ఆత్మకు భౌతిక ప్రకాశముండునా? ప్రకాశమను శబ్దమునకు జ్ఞానమను అర్థము మాత్రమే గ్రహించనగును. ఆత్మ చిద్ఘనము ప్రజ్ఞానఘనము అని చెప్పబడుచున్నది గదా! కంటితో చూడబడు ప్రకాశము గలదని అర్థము చెప్పుట యెంత మాత్రము తగదు. కనుక పరమదైవతం అన్నప్పుడు శ్రేష్టమైన లేక ఉత్కృష్టమైన జ్ఞాన ప్రకాశము గలవాడని అర్థము. లేదా సామాన్యార్థములో దైవమని యుపాసింపబడు త్రిమూర్తులకంటెను, దేవతల కంటెను గొప్పవాడనిన్ని మాత్రమే అర్థము గైకొనవలెను.

3) గురుమంత్రము : గురు అను రెండక్షరములు కలసి యొక మంత్రమా? లేక గురుస్వరూపమును లేక ఆపరోక్ష మొనర్చునది గురుమంత్రమా? ఎరుక రహితమును గావించునది గురుమంత్రమా?

గురువే వుపాసింపదగినవాడు. అతడే పరమదైవతము. ఆయన కంటే గొప్పదైవము లేడు. అతడే త్రిమూర్త్యాత్మకుడు. సాక్షాత్తు పరబ్రహ్మస్వరూపుడు అని గురుభక్తి యొక్క శ్రేష్ఠత్వమును నిరూపించుటకుగాను గురు అను రెండక్షరములకు అర్థములను సమకూర్చి గురు శబ్దమునకు గురుగీత అర్థములను చెప్పినది. ఎట్లనగా 1) గు - అంధకారం (అజ్ఞానం). రు - తేజస్సు (జ్ఞానం) గురు - అజ్ఞానాంధకారమును నశింపచేయు జ్ఞానప్రకాశం గలవాడు కనుక గురువు. 2) గు - మాయ, రు - పరబ్రహ్మం గురు - మాయాభ్రాంతులను పోగొట్టు పరబ్రహ్మ స్వరూపుడు గనుక గురువు. 3) గు - గుణాతీతము, రు - రూపవర్జితం - గుణములకు అతీతుడును రూపం లేనివాడును కనుక గురువు.

ఈ అర్థములను మనస్సు నందు నిల్పుకొని గురుశబ్దమును స్మరించుకొంటే అదియే మంత్రమగుచున్నది.

ఉపాసింపదగినదేది అని ప్రశ్నించి "సర్వశరీరస్థ చైతన్య ప్రాపకో గురురుపాస్యః" అనగా అంతర్యామిగా సర్వప్రాణులయందు నెలకొనియున్న చైతన్యమేదో ఆ చైతన్యమే నీవని నీ నిజరూపమును నీకనుగ్రహించి అపరోక్షము గావించు గురుమూర్త్యిఏ వుపాసింపదగినవాడు. ఆ విధముగా అపరోక్ష సాక్షాత్కారము గావించునదేదో అదే గురుమంత్రం.

"మరుపు, సుషుప్తి, మరణములో పరిపూర్ణంబునకు సాటిపరచి యెరుకకున్ మరి యాది మేల్కపుట్టువు నిరుదెరగుల నెరిగి యెరుక నెగుర జిమ్మోయీ ఆపై నుండే దెరిగేదెట్లోయి గురుమంత్రమిదెసుమ్మి మరువాక యే ప్రొద్దు స్మరణ చేసితివేని తిరిగి పుట్టవు నీవిట్లు యెగురజిమ్మోయీ! ఆపై నుండే దెరిగేదెటోయీ!! అన్నారు శ్రీకృష్ణదేశికేంద్రులవారు తమ కందార్థములలో అనగా పరిపూర్ణ మెరుకలనెరగి యెరుకను లేదని యెగురజిమ్ముటే గురుమంత్రమని చెప్పినారు. యీ గురుమంత్రమున కేదీ సాటి రాదు గనుకనే గురుమంత్ర సమోనాస్తి అని యీ శ్లోకము నందు ఉద్ఘాటింపబడినది.

"గురు" అను శబ్దమే మంత్రమని జపించినవానికి గురువు నరుడనే భావనపోయి గురువు పరబ్రహ్మ స్వరూపుడనే భావన అరూఢమగును. రెండవ మంత్రము ద్వారా తన నిజస్వరూపమే గురుస్వరూపమను అఖండ జ్ఞానసంపత్తి గలుగును. అనగా యెరుకను వస్తు నిర్ణయరూపంగా తెలుసుకొన్నవాడగును. మూడవ పద్ధతిలో పరిపూర్ణమునుగూడా యెరిగి యెరుక రాహిత్యమును సాధించును. కనుక యీ మూడు విధములుగానూ కూడా గురుమంత్రమును జపించినపుడే తప్పక మానవుడు కృతార్థుడు కాగలడు.కనుకనే గురుమంత్రసమోనాస్తి అని యీ శ్లోకములో చెప్పబడినది.

అట్టి గురుమంత్రమును ప్రసాదించి లోకకల్యాణము గావించు మా గురుమూర్తికివే మా అనంతకోటి నమస్కారములు.

శ్లో॥ భవారణ్య ప్రవిష్టస్య, దిఙ్మోహ భ్రాంతచేతనః ।
యేన సందర్శితః పంథా తస్మై శ్రీ గురువేనమః ॥

తాత్పర్యం : సంసారమనే ఘోరారణ్యములో ప్రవేశించియుండి దిగ్భ్రమజెంది (దిక్కులు గుర్తించలేక) దారిగానజాలక నానావిధములుగా భ్రాంతిచెందు చిత్తముగల పాంధునివంటి అనాదిజీవునికి దారిజూపించి సంసారారణ్యమును దాటించు సద్గురుమూర్తికి నమస్కరించు చున్నాను.

విశేష వివరణము : భవమనగా - పుట్టుక, సంసారం, ప్రపంచం, శరీరం యిత్యాది నానార్థములు గలవు. యీ శ్లోకమందలి భవ శబ్దమునకు సంసారమనే అర్థం గ్రహణీయం. సంసారం మూడు రీతులు (1) బాహ్య సంసారం (2) అంతస్సంసారం (3) అనాది సంసారం (భవమూలము).

1. బాహ్య సంసారం : భార్యాపుత్ర బంధుమిత్ర ధన కనక వస్తు వాహన గృహారామాది సంపత్తితో గూడిన కాపురం. దీనిని దాటుటకై విశేష శ్రమ యేమియు లేదు. గురుడు దాటించవలసిన అవసరమున్నూ లేదు. ప్రయత్నములు భగ్నమై ఆశించిన ఫలములందక పోవుట వలన నిస్పృహ నిరాశాదులకు లోనైగాని భార్యాపుత్రాదులపైన జనించిన తాత్కాలికా వేశోద్రేకములకు మానవుడలోనైగాని సంసార పరిత్యాగం చేయవచ్చును.

శిరోముండనం గావించుకొని కాషాయము ధరించవచ్చును. అతడు దారను, ధనమును, పుత్రుని వదలివేయగల్గినాడేగాని వానిపైగల ఆశయమున్నూ అనగా ఈషణను

(దారేషణ ధనేషణ పుత్రేషణలు) మాత్రము వదలలేదు. నిలకడ పైన నిదానంగా యోచించి, "అయ్యో పండంటి కాపురమును పాడుచేసుకొంటినే!" అని పశ్చాత్తాపముతో బాధపడుట కెంతో కాలం పట్టదు. తిరిగి సంసారమును పూనినవారున్నూయున్నారు. ఒకవేళ యధావిధిగా సన్యాసాశ్రమ స్వీకారము చేసియున్నచో, విధి నిషేధాదులను పాటించి, ఆశ్రమ విద్యుక్త ధర్మములను సక్రమముగా నిర్వర్తించలేక తిరిగి సంసారమునందు ప్రవేశించుట రౌరవాది నరకహేతువని భయపడుచు విషయ వాసనల ఆకర్షణ వేగమునకు తట్టుకొనజాలక, శ్లేష్మములోబడినయీగవలె బాధపడుచూ, "ఇతోభ్రష్ట స్తతో భ్రష్టః" అన్నట్లు ఐహికాముష్మికము లరెంటికీ భ్రష్టత్వము చెందినవాడగుచున్నాడు. తన నిర్వేదమును, నిస్పృహను తనయందు యిముడ్చుకొనలేడు. యితరులకు చెప్పుకొనలేడు. సోమరియై, పొట్టకూటికిగాని యిష్టకామ్యార్థ సిద్ధికిగాని సామాన్య ప్రజానీకమును మోసగించుట కనువుగా -

శ్లో॥ జటిలో ముండీ లుంచిత కేశః
కాషాయాంబర బహుకృత వేషః
పస్యన్నపిచ నపస్యతి మూఢో,
హ్యుదరనిమిత్తో బహుకృత వేషః

అని చెప్పబడినట్లు సన్యాసి వేషము ధరించి చోరత్వజారత్వములుగూడ సాగించుచూ నరక ద్వారము దెస పరుగులిడుచున్నాడు.

2) అంతస్సంసారము : పూర్వజన్మార్జిత పుణ్యపాప సంస్కార పరిపూరితమగు అంతఃకరణ కలిగి, ప్రత్యేకమగు ఒకానొక విశిష్ట సహజస్వభావ సంపత్తితో, నైజశీలమున కనుగుణ్యమగు ప్రవృత్తి నివృత్తి రూపములగు కర్మలు చేయుటయందభినివేశము గల్గి ప్రతి మానవుడు జీవితము సాగించు చుండును. అంతఃకరణమందు బీజరూపముగా నణగిమణిగిని యుండి కాలానుసారముగా పైకివచ్చి మానవునికి సుఖదుఃఖములను కలిగించు కర్మవాసనలే అంతస్సంసారము. కర్మవాసనలు ప్రేరేపింపగా యింద్రియముల ద్వారా అంతఃకరణ వృత్తి శబ్దస్పర్శాది విషయములందు ప్రవేశించి తత్తద్విషయానందమునకై యువ్విళ్ళూరుచుండును. యిట్టి అంతస్సంసారమును పరిత్యజించుట దుస్సాధ్యం. "బలవా నింద్రియ గ్రామోవిద్వాంస మపి కర్షతి" = ఎంతటి విద్వాంసుడైనను కర్మ వాసనా బలముచే యింద్రియ విషయములకు లోలత్వము చెందక తప్పదు. సర్వసంగ పరిత్యాగము చేసి కాశికి పోయినా కారడవుల కరిగినా యీ అంతస్సంసారము వారిని వదలదు అని వేరే చెప్పవలసిన పనిలేదు. రాగద్వేషములుగా కామక్రోధాది దుష్టవృత్తుల రూపంగా యీ అంతస్సంసారము విజృంభించి మానవుని జన్మాంతరములకు గొనిపోవుచున్నది.

3) అనాది సంసారము (లేక, భవమూలము) అనగా మొదలు లేదని యర్థము. అంటే కాల నిర్ణయరీత్యా సంసారము ప్రారంభమైన సమయం తెలియరాదని మాత్రమే అర్థమా? లేక సంసారమనేది కలుగుటకు హేతువే లేదని అర్థమా? విచారించవలసియున్నది. కారణము లేని కార్యముండుటకు వీలులేదు. కనుక సంసారమే లేదా? లేనేలేదంటే నివారణోపాయముగాని గురుశాస్త్రాదుల అవసర [illegible] గాని లేనేలేదని సిద్ధించును. లేని సంసారము లేదని ధృవపడుటకే ఆరూఢమగుటకే గురు[illegible]దులు ఏమైనను సంసారమునకు ఎంత వరకు మూలకారణ మన్వేషింపగలమో, అం[illegible]కు అన్వేషింపవలసినదే. ఆపైన అట్టి అత్యంత మూలకారణమగు

వస్తువునకు మూలమున్నదో లేదో విచారింపవలెను. కనుక సంసారము నందు ప్రవేశించి జన్మజన్మాంతరములందునూ ఈ జన్మమందునూ సుఖదుఃఖములను పొందు సంసారి యెకడుండవలె. అతడెవడు? వానికే జీవుడని శాస్త్రాలు చెపుతున్నాయి. ఈ సంసారీ, వాని సంసారమూ యేకకాలమందే ప్రవర్తిల్లవలెను. ఏలననగా సంసారము లేని సంసారిగాని, సంసారిలేని సంసారము గాని యుండుటకే వీలులేదు.

జ్ఞానమే సంసారి, ధర్మక్షేత్రము, కర్మయే సంసారము, కురుక్షేత్రము.

కం॥ ముడిబడి కర్మము జ్ఞానము
విడువక నా రెండు వెలసె విశ్వమన నదే
కడువేడ్క బయలుగలనెనా!
ఘడియైనను నిల్వలేక కల్లె పోవున్

అన్నారు శ్రీకృష్ణదేశిక ప్రభువరులు ఈ జ్ఞానకర్మముల ముడియే హృదయగ్రంధి, పరిపూ బోధచే తప్ప యిది ముడివడదు. ఏలననగా అదియే యెరుకకు కూకుడు వేరు. దానిని యెr త్రవ్వవలెనన్నారు పూర్ణబోధలో. యెరుగుట అనగా వినుట కాదు. గురుమూర్తి చూపగా వః నిశ్చయపూర్వకముగా గుర్తెరుగవలెను. జ్ఞానకర్మ స్వరూపమగు నిట్టి సంసారమెం ప్రవర్తించుచున్నదనగా - తెలివి (జ్ఞానము లేక మనస్సు) తనయందలి సంస్కారానుభవము కనుగుణ్యమగు శరీరమును ధరించుట? ఆ శరీరముతో ఫలోన్ముఖములైన పూర్వ సంస్కా జనిత సుఖదుఃఖాదులననుభవించుటతోపాటు వర్తమాన శరీరముతో కర్మచేసి నూత సంస్కారముల నుత్పత్తి గావించుకొనుచుండుట. మరణించి, ఫలోన్ముఖములగు నూతన క సంస్కారమును తిరిగి ప్రారబ్ధరూపంగా అనుభవించుటకొరకై కూడా తెచ్చుకొని మరొక శరీరము ధరించుట. యిట్లే "పునరపి జననం పునరపి మరణం"గా ప్రవర్తించుటయే సంసారము. తెం లేకుండా జనన మరణములు పునః పునః కలుగుటచే యీ సంసారమునే సంసార చక్రమన్నా ఎందుకనగా చక్రమున కాద్యంతములు గానరావు. అట్లే సంసారమునకున్ను ఆద్యంతము లేవు కనుక దానిని అనాది అనీ, అనంత సంసారము కూడ అంటున్నారు. అయితే అనంతమ అంతమే లేదా? అంతమే లేకుంటే గురుశాస్త్రములు, బోధ శ్రవణమననాదుల ఆచారానుష్ఠానాదులూ అన్నియు నిష్ఫలమేనా? అనే సంశయము కలుగుచున్నది. దీని కచ ఋషుల సమాధానమేమి? అంటే, యితరమైన ఏ బోధలచేతనూ సంసార నాశనము కాద సంసార చక్రమందే మీదనో, క్రిందనో పరిభ్రమింతురు. పరిపూర్ణ బోధచేతనే, చక్రము అధిగమింతురు. కనుక సంసారముండుటకే వీలులేదు. ఉదాహరణకు : రంగులరాట్నము గుర్రమెక్కినా, ఏనుగునెక్కినా, రథమెక్కినా, తొట్టిలో కూర్చున్నా, సింహాసనముపై కూర్చు రాట్నం తిరుగుడులోని వాడే అగుచున్నాడు. అట్లే జీవియే బొమ్మరూపంలో ఏ లోకము వున్నా సంసార చక్రము లోపలివాడే, వానికి సంసారమ నంతమే. తిరుగుట యిక విసుగెత్తి బాలుడు ఏమి చేయవలె? రంగులరాట్నములో ఏ బొమ్మనూ ఎక్కక ఏ స్థానమందూ కూర్చొన పూర్తిగా రాట్నమునే దిగిపోవలెను. వాడు దిగిపోయినా రాట్నము తిరుగుచునే యుండున అట్లే జన్మపరంపరలెత్తుటకు విసుగెత్తిపోయిన జీవి ఏమిచేయవలె? సంసార చక్రం తిరుగుడు పైకివచ్చినపుడు వుత్తమజన్మము. యిదే బంగారు సంకెళ్లు. దిగువనో, నీచయోనిప్రాప్తి, యిను సంకెళ్లు. ఏదైననూ చక్రమును మాత్రం విడువలేదు. చక్రమును విడువనంతవరకును సంసా

రహితం కాదు. కనుక ముముక్షువు ఐహికాముష్మిక సుఖములను రోసి జన్మరాహిత్యమే కోరి సద్గురువుల నాశ్రయించి సంసార చక్రమునే పరిత్యాగం చేయుటకై కృషిచేయవలెను.

సంసారమనాది అంటే సంసారియు అనాదేకాక తప్పదు. పూర్వ పూర్వ సృష్టుల యందలి జీవసంస్కారములు, ఉత్తరోత్తర సృష్టుల యందలి జీవోపాధుల యుత్పత్తికి హేతువులై యుంటున్నవి. అనగా వర్తమాన సృష్టి యందు కర్మత్రయా విధ్వంసం గావించుకొని జన్మరాహిత్యము సాధించుకున్న జీవులు పండిపోగా (సంసార చక్రమునే దాటిపోగా) ప్రళయకాలమున మిగిలియున్న జీవుల కర్మసంసారములన్నీ బీజరూపముగా పరమాత్మయందు దాగియుండి పునఃసృష్టికి హేతువులగా వుంటున్నవి. యిట్లనంతంగా ప్రవాహరూప నిత్యత్వముతో యీ సంసారము సాగిపోవుచున్నది. ప్రవాహరూప సత్యత్వమనగా, జీవనదిలో నీరు నిరంతరంగా ప్రవహించిపోతుండగా పాతనీరు సముద్రము చేరుచుండును.

క్రొత్త నీరు వచ్చుచునే యుండును. క్షణం క్రింద చూచిన నీరు యిపుడు లేదు. కనుక ఆ నీటితో కూడిన ఆనదియున్నూ లేదు. ఐననూ ఆ ప్రవాహం, వెనుకటి నామంతోనే వ్యవహరింపబడి సత్యత్వనిత్యత్వములు గలదిగా దోచుచుండును. అట్లే సంసార చక్రమున యీ జీవుడు భిన్న భిన్న శరీరములనుదాల్చి జన్మజన్మాంతరములకు పోవుచునేయున్నాడు.

క్లుప్తంగా చెప్పాలంటే పుట్టుచావులు పొందుటయే సంసారము. పుట్టినవాడు చచ్చుట తప్పదు. కనుక పుట్టుటయే సంసారమన్నా బాధ లేదు, లేక శరీరధారణమే సంసారమనవచ్చును. మరణ జననముల మధ్య కాలంలో జీవునికి స్థూలశరీరం వుండదు గదా! కనుక అపుడాతనికి సంసారం లేదనవచ్చునా? అని అడుగవచ్చును. ఐతే అపుడాతనికి మనస్సుతో గూడిన సూక్ష్మ శరీరావరణ మున్నది. ఆ సూక్ష్మ శరీరముతో సుఖదుఃఖములను లోకలోకాంతరములలో పొందుచు నూయుండును. కర్మవాసనకు స్థానమైన మనస్సు యున్నంతవరకు వుపాధి యున్నట్లే. సంసారము న్నట్లే. ప్రకారాంతముగజెప్పాలంటే, కార్యకారణరూపంగానున్న పిండ బ్రహ్మాండము లకు రాకపోకలు సాగించుచుండుటయే సంసారము. పిండ బ్రహ్మాండముల రెంటిరూపంలో నున్న విశ్వోత్పత్తికి ఆత్మయే వుత్పత్తి స్థానమున్ను అత్యంతమూలకారణమున్ను కూడా అయివున్నది. కనుక ఆత్మయే భవమూలం లేక అనాది సంసార కారణమున్నూ అయివున్నది. కార్యము కారణానన్యము,కనుక ఆత్మయే సంసారం, ఆత్మయే సంసారి అయివున్నాడు. కనుకనే కందార్థం'' ఆటాడి, యూడకుండును, ఆటాడిన మేనిబొమ్మ ఆటాడకనే ఆటాడు, ఎరుకయనియెడు ఆటాడించేటివాడు అతడే కర్తా చేటుపాటుల రెంటిచే వచ్చు ఫలము, ముమ్మాటికనుభవించి, మరణ జననములొంద నతడేరకర్తా॥'' అన్నాడు శ్రీకృష్ణదేశికులవారు.

ఈ త్రివిధరూపముగానున్న సంసారమును అరణ్యముతో నేలబోల్చిరి? అంటే : సేద్యమనేది యెన్నడూయెరుగక తుప్పలతోనూ, తుమ్మలతోనూ వున్న మాత్రమున అది అడవియగునేమోగాని అరణ్యమనరాదు. అరణ్యమనగా జనసంసారమునకే మాత్రమును తావీయక, సూర్యరశ్మి లోనికి చొరక పోవుట వలన, దిక్కులు కూడా తెలియరాని, కాకులు దూరని కారడవినే, లక్షించి యీ శ్లోకమున అరణ్య శబ్ద ప్రయోగము చేయబడినది. అరణ్యమున అల్లిబిల్లిగా తరులతా గుల్మాదులు వొండొంటితో పెనవేసుకొని గొడుగువలె అచ్ఛాదన యున్నందువల్ల సూర్యరశ్మియే చొరదు. దిక్కులు తెలియబడవు. అట్లే అనంతకోటి పూర్వజన్మల

యొక్క శుభాశుభకర్మవాసనలతో నిండి నిబిడీకృతమై అజ్ఞానాంధకార పరివ్యాప్తమైన అంతఃకరణము యుక్తా యుక్త వివేకం లేక, చిత్త విభ్రమం చెంది యుండును. సింహశార్దూల శరభాదిక్రూర మృగసంకులమై యుండు అరణ్యం వలెనే అంతఃకరణం, కామక్రోధాది దుష్టవృత్తుల కాలవాలమైన క్షేత్రంగానున్నది. కీకారణ్య మందు ప్రవేశించియున్న పాంథుడు దాని నుండి బయటపడు మార్గమును స్వయంగా తెలుసుకొనలేక యెట్లు తల్లడిల్లుచుండునో సంసారణ్యమున ప్రవేశించిన జీవుడు బయటపడు మార్గమును స్వయంగా గుర్తించలేకున్నాడు. అరణ్యమున కనేకములగు కాలిబాటలు లీలగా తోచుచునే యుండును. కాని అవియన్నియు ఆ అడవియందు క్రూరమృగములతో పాటే నివసించుట కలవాటుపడిన చెంచులు, యెరుకలు మొదలగు నాటవికులు ఆ యడవియందేగల ఒక ప్రదేశం నుండి మరొక ప్రదేశంనకు సంచారము చేయుటలో యేర్పడిన బాటలే గాని అడవిని దాటించు మార్గం మాత్రముండదు. అట్లే పురుష ప్రకృతులతో గూడిన యీ అనాది సంసారం నందు జన్మాంతరములు, లోకలోకాంతరములు, లేక సాలోక్యాదిపంచ ముక్తులున్నూ జీవుని చేర్చగల మార్గములు మాత్రమే అయివున్నవి. అఘోరారణ్యంలో దిరుగుచుండు కోయలు,బోయలు, చెంచులు వలెనే, జీవులుగూడా యీ ఘోర సంసారముననే తిరుగుచుందురు. అడవి కావలికి వారు పోనేపోరు. పోవు మార్గమున్నూ యెఱుగరు. కాని వారిలోనే బుట్టిబెరిగిన కొందరాటవికులకు మాత్రం ఆ అరణ్యం నుండి బయటకు పోవు మార్గము సుపరిచయమై యుండునట్లే, "పుట్టుట గిట్టుట లేకను, పుట్టెగిట్టెడి యెరుకపొడి యెరుగకన్॥ చట్టువలె కదలకుండు" బట్టబయలును యెరుకచేత భావించి యెరుకలేక సేవించిన అచల ఋషులు బహుకొద్ది మంది మాత్రమే గలరు. తమ్మాశ్రయించిన వారియందలి జ్ఞానాగ్నిని మహోజ్వలంగా ప్రజ్వలింపచేసి సంసార ఘోరారణ్యమును జ్ఞానదావానలముచే భస్మీపటలం గావించువారే సమర్థులు. దావాగ్నిచే కీకారణ్యము దగ్ధమైన పిదప అరణ్యమును దాటుబాటయు దృగ్గోచరం కాగలదు. అట్లే అనాది సంసార రూపమగు అఖండపుటెరుకనే విడువగల్గిన గురుకృపాసంసిద్ధి వారికి కలుగును. కనుకనే

"ఎరుక దనకుదా వీడిపోదు,
యెరుకను విడిపించలేరు, యెవ్వరు ధాత్రిన్॥
గురుడొకడుదప్ప గురునకు
పరిచర్యయొనర్చి బోధపద్ధతివినన్ -
తిరిగి రాని పద్ధతి గనినన్ ॥
పరిపూర్ణమెరుక నేర్పరచలెరుక లేక
హరిని స్వప్నముగన్న కరిమ్రగ్గినట్లే
యీపద్ధతి వినినన్ తిరిగిరాని పద్ధతి గనినన్ ॥"

అన్నారు శ్రీకృష్ణదేశికేంద్రులవారు. కనుకనే సద్గురుమూర్తిని "భవమూల వినాశాయ" అని మరొకచో గురుగీతస్తుతించుచున్నది. అట్టి గురుమూర్తికి నా నమస్కారము.

శ్లో॥ తాపత్రయాగ్ని తప్తానా మశాంత ప్రాణినాం ముదే ।
గురు రేవపరాగంగా, తస్మై శ్రీ గురవేనమః ॥

తాత్పర్యము : (1) తాపత్రయములు (2) అగ్నితప్తానాం (3) అశాంత ప్రాణినాంముదే (4) పరాగంగ అను శబ్దములను వివరించి తెలుసుకొనవలసియున్నది.

1. తాపత్రయము : తాపము అనగా వేడి, దుఃఖము, బాధ, అశాంతి రూపమగు హృదయాందోళన మొదలగు నానార్థములు గలవు. తాపత్రయము అనగా మూడు విధములగు దుఃఖములని అర్థము. కాని వ్యావహారిక భాషారంగమున తాపత్రయపడుట అనేదానికి "వున్న వస్తువులు కాపాడుకొనుటకున్ను (అనగా క్షేమము కొరకున్ను) లేని వస్తువును ప్రాప్తింప చేసుకొనుటకున్ను (అనగా యోగము కొరకున్ను) అవసరమగు దానికంటె విశేషముగా ప్రాకులాడుచు పరిశ్రమ చేయువానిని జూచి వీనికి తాపత్రయ మెక్కువ అని లోకులు పల్కుచున్నారు. అటుగాక నిత్యజీవిత రంగమున మానవుడు ఎప్పటికప్పుడు తనకు జీవితమందే నిరాశ గల్గించు గొప్ప దుఃఖములకు లోనై అలమటించుచున్నాడు. "జన్మ దుఃఖం జరా దుఃఖం జాయా దుఃఖం పునః పునః సంసార సాగరం దుఃఖం" అని శరీర పరిగ్రహమే ఒక మహాదుఃఖంగా భావించి జిజ్ఞాసి జన్మరాహిత్యమునే కోరుకొనవలసినవాడగుచున్నాడు. అట్టి దుఃఖపరంపర కాలవాలమగు మానవ జీవితమందు కల్గు దుఃఖములను స్థూలముగా మూడు తరగతులుగా శాస్త్రములు విభజించియున్నవి. అవియే "తాపత్రయము" అను పేర వ్యాప్తిలోనికి వచ్చినవి.

1) ఆధ్యాత్మిక తాపము 2) ఆధిభౌతిక తాపము 3) ఆధిదైవిక తాపము అను మూడున్ను తాపత్రయముగా అభివర్ణింపబడియున్నవి.

1) స్థూల శరీర సంబంధమగు దుఃఖములు : స్థూల శరీరమునందు, వాత, పిత్త శ్లేష్మములను మూడు ధాతువులున్నవి. అవి సమానముగా నడచిన శరీరము స్వస్థతగలిగి ఆరోగ్యముగా నుండును. అందొకటి రెండు ప్రకోపించినచో శరీర స్వాస్థ్యము చెడి తత్సంబంధ మగు వ్యాధులు పొడచూపును. ఈ వాతపిత్త శ్లేష్మ వ్యాధులే ఆధ్యాత్మిక తాపమని పిలువబడినది. తన కన్యమగు దుష్టప్రాణికోటి వలన అనగా చోరుల వలన శత్రువుల వలన లేక వ్యాఘ్ర, వృశ్చిక, శార్దూలాది ప్రాణుల వలన కలుగు దుఃఖము ఆదిభౌతికమని పేరు పొందినది. అతివృష్టి, అనావృష్టుల వలనగాని వుప్పెన, భూకంపము, అగ్నిపర్వతములు, మహామారి మొదలగు అరిష్టములు, మొదలగువానివలన కలుగు దుఃఖము ఆది దైవికము. యీ మూడు దుఃఖములూ స్థూల శరీరమునకే కలుగుచున్నవి. అయినను స్థూల శరీరము సప్తధాతుమయమై జడమని వర్ణింపబడుచున్నది. ఏలననగా యీ దుఃఖములు స్థూల శరీర స్థానము నందే తోచబడినను వానిని యీ శరీరము గుర్తించునదీ, ఆయా దుఃఖములనుభవించునదీ, సూక్ష్మ శరీర సంబంధమగు మనస్సే. కనుకనే మనస్సు మగ్నత చెంది సుషుప్తిసమాధ్యాది అవస్థల యందు ఏ తాపములున్ను ఆ జీవి అనుభవించుట లేదు.

2) సూక్ష్మ శరీర సంబంధమగు దుఃఖములు : ప్రాణేంద్రియములగు సమాన, వ్యాన, వుదాన, ప్రాణాపానములు అయిదున్ను జ్ఞానేంద్రియములగు శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వా ఘ్రాణము లయిదున్ను కర్మేంద్రియములగు వాక్పాణి గుహ్యాగుదము లైదున్ను అంతరేంద్రియములలో మనోబుద్ధులు రెండున్ను మొత్తము యీ 17 యింద్రియములతో కూడినది సూక్ష్మశరీరము. ఇంద్రియములు ఆధ్యాత్మికములని, అవి చేయు పనులు ఆదిభౌతికములనీ, వానికి శక్తినిచ్చు చేతనమునకు ఆధజ దైవికమనీ పేర్లు గలవు. ఇందు ఆధ్యాత్మికములగు యింద్రియ మేదైన, కొరతగా నుండినచో అది దుఃఖహేతువగుచున్నది. ఉదా - మూకాంధ బధిరాదులు, కర్మేంద్రియములలో, వాక్కు, పాణిపాదము లేని మూగవారు, కుంటివారు, లేక జ్ఞానేంద్రియము

లలో నేత్ర శ్రోత్రములు లేని గ్రుడ్డివారు చెవిటివారు పడు బాధలు మనము గుర్తించుచునే యున్నాము. అంతేకాక యింద్రియములలో యేది సరిగా పనిచేయకపోయినా దుఃఖమే కలుగుచున్నది. మరిన్ని ఆ దైవతానుగ్రహలోపమున్నా దుఃఖమే కదా! ఉదాహరణకు త్వగేంద్రియాధిష్ఠాన దేవతానుగ్రహము లేనిచో వాయువు స్తంభించియు నేత్రేంద్రియాధిష్ఠాన దేవత (సూర్యుడు) అస్తమించినచో వెలుగు లేకను మనం బాధపడుట స్పష్టమే.

సూక్ష్మ శరీరము నందలి యింద్రియములలో రాజు వంటిది మనస్సు. ఏలననగా మనస్సే మిగతా యింద్రియములతో జతపడి ఆయా యింద్రియవ్యవహారము జరుపుచున్నది. మనస్సు మగ్నత చెందినచో సమాన ప్రాణములుగాక మరే యింద్రిములున్ను స్వయంగా పనిచేయజాలవు. అట్టి మనస్సు వాయుభూత సంబంధము గనుక దానికి సహజముగా చలన దోషమున్నది. ఒక్క క్షణమైనను స్థిరముగా నిలువజాలదు. ఏవియో సంకల్ప వికల్పములు చేయుచునే వుండును. మరియు దాని ధర్మములగు శోక మోహముల కది ఆలవాలమే అయివున్నది. ఇంకనూ ఆగంతుకముగా మనస్సునకు కలుగు విస్మృతి., మూర్ఛ. వున్మాద్యాది రోగములున్ను సంభవించి దుఃఖకారణములే యగుచున్నవి.

3) కారణ శరీర సంబంధమగు దుఃఖములు : త్రిగుణాత్మకమై. అవిద్య విద్యా కామ కర్మల కావాసమై యుండు జీవుని అంతఃకరణమే కారణ శరీరము, జీవుని విద్యా విద్యలకు, మలవిక్షేప ఆవరణ దోషములకు, గుణత్రయ వాసనాత్రయ. ఈషణత్రయ, కర్మత్రయముల కన్నిటికినిది ఆశ్రయమైయున్నది అంతఃకరణమే, సర్వదుఃఖ ఫలములను పండించుకొనుటకు కర్మక్షేత్రమున్ను కేంద్ర కార్యాలయమునై యున్నది - స్థూల సూక్ష్మ శరీర నిర్మాణ విధానము మాత్రమందరికీ ఏకరూపమే. కాని కారణ శరీర నిర్మాణము మాత్రము భిన్న భిన్నములుగనున్నది. సత్వరజస్తమో గుణముల పాళ్ళు వేరువేరుగా నుండును. అందుచేతనే ఎవరి ప్రవృత్తి వారిదే. పూర్వజన్మ కర్మార్జిత పుణ్య పాప విశేషములచే వారి వారి అంతఃకరణములు భిన్న భిన్నములగు వాసనావాసితములై వుండును. ఒకని అంతఃకరణము శమాది షట్కసంపన్నమై శుద్ధమై యుండగా వేరొకని అంతఃకరణము మల విక్షేప ఆవరణ దోషముల కాలవాలమై మలినమై యుండును. కనుకనే యొకానొకడు పుట్టుకతోనే మహాజ్ఞానిగానున్నాడు. వేరొకడు ఈషణత్రయములకు బద్ధుడై పరమార్ధమును పూర్తిగా విస్మరించుచున్నాడు. మరియు జీవుడు వర్తమాన శరీరముతో ననుభవించు ప్రారబ్ధనామక కర్మఫలములు తనతో కూడా తెచ్చుకొనుచున్నాడు. అట్టి సుఖదుఃఖములు అన్నియు అవశ్య మాతనికి భోక్తవ్యములే అయివున్నవి. మానవుడై పుట్టిన ప్రతివానికీ (చక్రవర్తులకూ. జ్ఞానులకూ. యోగులకూ. సర్వులకూ) దుఃఖము తప్పదు అనుట నిర్వివాదాంశము.

2) అగ్నితప్తానాం : అనగా అగ్నిచే కాల్చబడినవారు. శరీర బాధలన్నిటిలో, అగ్నితప్తులకు గలిగే బాధకన్న గొప్ప బాధ మరొకటి యుండదు, అగ్ని స్థూల శరీరమునే గాయపరచును. కాని దుఃఖము స్థూల శరీర సంబంధముగాకున్ననూ మనస్సునే గాయపరచి కలుషితమొనచ్చి మానవుని అధఃపతనమొనర్చును. కనుకనే గీతలో శ్రీకృష్ణభగవానుడీ దుఃఖమును. అనార్యజుష్టం = అజ్ఞానులకు మాత్రమే దగినట్టిదిగాను. అస్వర్గం = స్వర్గమున కనర్హమైనదిగాను నిందించి క్షుద్రమైన హృదయ దౌర్బల్యమును విడనాడుమని అర్జునుని హెచ్చరించినాడు. కాని దుఃఖమంత

తేలికగా నివారణ కాదు కనుకనే మిగతా 17 అధ్యాయములలో అర్జునకు ధర్మోపదేశము చేసి సర్వసంశయరాహిత్యం గావించినాడు.

2)అశాంతప్రాణినాంముదే : తల్లి గర్భమున పడినదాది శరీర పతన పర్యంతం మానవుడనుభవించు దుఃఖముల కంతులేదు. శరీరం పోయినంత మాత్రమున కూడా దుఃఖమున కంతులేదు. పునరపి జన్మించి మరల మరల దుఃఖము లనుభవించవలసినదే. సముద్ర కెరటముల వలె ఒకదాని వెనుక నొకటిగా ప్రాప్తించు దుఃఖపరంపరలను తట్టుకొనలేక. అగ్నికాల్చుచున్నపుడు ప్రాణి యెంతగా ఆవేదనపడునో జీవుడట్లె ధారావాహికమైన అశాంతికి గురియగుచున్నాడు. "పూర్వజన్మకృతం పాపం వ్యాధి రూపేణ పీడితం" అను రీతిగా వ్యాధిగ్రస్తుడగుచున్నాడు. "బుద్ధిః కర్మానుసారిణీ" అన్న రీతిగా యతని యందు ప్రవృత్తి యుదయించి కర్మ చేయించి దుఃఖరూపమైన దృష్టఫలము వెంటనే కలిగించుచున్నది. ఇదియే యిచ్ఛాప్రారబ్దము. తాను యిచ్ఛ యింపకున్ననూ తన యిచ్ఛకు వ్యతిరేకంగా సుఖదుఃఖాదులు కలుగుట అనిచ్ఛాప్రారబ్ధము, తన యిచ్ఛానిచ్ఛలతో నిమిత్తం లేకుండ కళత్ర పుత్ర మిత్ర బంధువుల వత్తిడి కాదనలేక చేయు కర్మకలాపముల వలన సంభవించు సుఖదుఃఖములు పరేచ్ఛా ప్రారబ్ధము. "ఋణానుబంధ రూపేణ పశు పత్ని సుతాలయాః" అన్నట్లు పూర్వ పూర్వ జన్మములలో యెపుడో ఋణపడియుండుటచేతనే ఆ ఋణము తీర్మానమగుటకే యీ జన్మలో పశు, పత్ని, సుత, ఆలయములు తనకు తటస్థపడినవి. వాని వలన కలుగు సుఖదుఃఖములు ఆ ఋణక్షయమైనగాని వదలవు. పురుషకారము బూని ఎట్టి కర్మాచరణ చేయుటకైనను స్వేచ్ఛా స్వాతంత్ర్యములు కలవాడయ్యునూ మానవుడు కింకర్తవ్యతామూఢుడై తనకు కలుగు దుఃఖమునధిగమించుటకు అశక్తుడగుచున్నాడు.

4) గురురేవ పరాగంగా: అట్టి అశాంతిలోనున్న మానవులకు సంతోషము గూర్చుటకు గురువే శరణ్యమని యీ గురుగీతా శ్లోక ముద్ఘాటించుచున్నది - శరీరము వేడెక్కి బాధపడువారికి గంగా శీతలోదకములు తాపముబోకార్చి సుఖ సంతోషములు గలిగించును. అట్లె గురుమూర్తి తాపత్రయాగ్ని తప్తులకు శాంత్యానందములు ప్రసాదించు సామర్థ్యము కలిగియున్నాడు. కనుక గంగానదితో పోల్చబడినాడు. అంతేగాదు అంతకన్న పరమశాంతిని ప్రసాదించెడు వాడు కనుకనే పరాగంగాయని కీర్తింపబడినాడు. ఎట్లనగా శరీరము వేడెక్కిన పిదప గంగోదకము తాపోపశమనము గావించుచున్నది. కాని గురువు దుఃఖానుభవ కాలమందు దుఃఖము గానరాకుండా చేయుటయేగాక సుఖానుభూతీ కాలమందుండు మానసిక స్థాయిని కలిగింపచేసి సుఖ దుఃఖ తారతమ్యము నుపహరించుచున్నాడు. సుఖ దుఃఖఖానుభవ కాలముల మనస్సు యందు అనుకూల ప్రతికూల వేదనలు లేక సమాన స్థాయిలో నుండునట్లు గురువు అనుగ్రహించును. "సుఖదుఃఖే సమేకృత్వా లాభా లాభౌ జయా జయౌ" అని గీత శాసించుచున్నది. ఇట్టి శక్తి యెట్లు లభించగలదు? గురుకృప వలననే యని యీ శ్లోక తాత్పర్యం. "సమత్వం యోగముచ్యతే" అని గీత చాటుచున్నది. అట్టి సమత్వం సాధించవలెనని వేసవిలో పంచాగ్ని హోత్రమందునూ హేమంతములో హిమాలయము లందునూ తపస్సు చేసిన వారికిగూడా సమత్వయోగము దూరస్తముగానే యుండునని చెప్పక తప్పదు. అట్టి బలాత్కార పద్ధతుల వలన త్వగింద్రియమునకు శీతోష్ణములు భరించు శక్తి కలుగవచ్చునేగాని. అంతఃకరణకు సమత్వయోగ మెట్లు సిద్ధించును?

త్వగింద్రియమునకు హాయిని చేకూర్చి తాపోపశమనము గావించునది గంగ. అంతఃకరణమందలి సర్వదుఃఖములను పరిహరించి అతీంద్రియ సుఖమును సమత్వయోగమును ప్రసాదించుట వలననే గురువు పరాగంగాయని అభివర్ణించబడినాడు. ఆ సద్గురుమూర్తికివే మా నమస్కారములు.

1) శ్లో॥ అజ్ఞానేనా హినాగ్రస్తాః, ప్రాణినస్తాన్ చికిత్సకః ।
విద్యాస్వరూపోభగవాన్ తస్మై శ్రీ గురవేనమః ॥

తాత్పర్యం : అజ్ఞానమను గొప్ప సర్పముచే మ్రింగబడియున్న జీవులకు చికిత్స చేసి రక్షించు జ్ఞానస్వరూపుడును షడ్గుణైశ్వర్యయుక్తుడగు భగవానుడును అగు సద్గురుమూర్తికి నమస్కరించుచున్నాను.

2) శ్లో॥ వందే గురూణాం చరణారవింద !
సందర్శిత స్వాత్మ సుఖాంబుధీనాం !
జనస్య యేషాంగులికాయమానాం !
సంసార హాలాహల మోహ శాంత్యైః ॥

తాత్పర్యం : ఆత్మానందసాగరమును దర్శింపజేసి హాలాహలము (కాలకూట విషము) వంటి సంసార మోహమును శాంతింపజేయుటకు ఏ పాద పద్మము అమృత గుళికలవలె నున్నదో అట్టి సద్గురు చరణారవిందమునకు నమస్కరించుచున్నాను.

3) శ్లో॥ నమోస్తుగురవేతుభ్యం సహజానంద రూపిణే ।
యస్య వాగమృతంహన్తివిషం సంసార సంజ్ఞికం ॥

తాత్పర్యం : ఎవని వాక్యామృతము సంసార విషమును హరించుచున్నదో అట్టి సహజానంద స్వరూపుడవగు గురుమూర్తీ నీకు నమస్కారము

విశేష వివరణం : (కారణ కార్యరూపములుగానున్న సంసారము అనగా) సంసార కారణమగు అజ్ఞానమున్ను, జనన మరణ ప్రవాహ రూపముగానున్న కార్యరూప సంసారమున్ను ఈ శ్లోకములలో విషముతో పోల్చబడినది. విషము తాచుపాము నందున్నది. అట్టి విష సర్పము కాటువేయుట మాత్రమేగాక చంద్రుని రాహువు గ్రసించినట్లు జీవులను అజ్ఞానము పూర్తిగా ఆవరించియున్నది. నాగుపాము విషము శరీరమున వ్యాపించినపుడు దానికి ప్రత్యేక చికిత్సకుడెట్లు అవసరమో, అట్లే అజ్ఞాన విషము తలకెక్కిన భవరోగికి (సంసారికి) గురువనే ప్రత్యేక భిషగ్వరుడవసరమైయున్నాడు. సర్పదష్టుడు చికిత్స పొందనిచో మరణించుటెట్లనివార్యమో అట్లే అజ్ఞాన విషము సంసారికి మృత్యు పదమై యున్నది. అట్టి జీవుడు "మృత్యోస్సమృత్యు మాప్నోతి" అనగా మరల మరలా మృత్యువు పాల్పడుచున్నాడు అని శ్రుతి చెప్పుచున్నది. జ్ఞానికి మరణం రాదా? అని శంక చేయవచ్చును. జ్ఞాని శరీర పతనమును మరణమని యనరాదు. దానిని బ్రహ్మైక్యమనియే యనవలెను. కారణము? పునర్జన్మ బీజమును అతడు జీవించియున్నపుడే నాశనము చేసుకొన్నాడు, జనన మరణములు సాపేక్షికములు. జన్మించిన వాడు మరణించక తప్పదు. మరణించినవాడు జన్మించక తప్పదు. అయితే శరీర పతనమైన జ్ఞాని తిరిగి పుట్టడు కనుక దానిని మరణమనే అనరాదు.

అజ్ఞానమే జీవునికి సంసార కారణమని చెప్పబడినది. తన స్వరూపమును మరచుట లేక తెలియకుండుటయే అజ్ఞానము. అయితే యీ అజ్ఞానము సంసార కారణమెట్లగుచున్నది? స్వరూపమెరుంగని వాడు దేహతాదాత్మ్యము జెంది దుఃఖనివృత్తిని సుఖప్రాప్తిని కోరి చేయరాని పనులు చేస్తూ, దారాపుత్ర ధనాదికమువల్ల సుఖము లభ్యమగునని భ్రాంతి చెంది వారి యందు రాగముతో (విపరీత ప్రేమతో) సంసారమున బద్ధుడగుచున్నాడు. జిహ్వోపస్థ విషయములకు దాసుడగుచున్నాడు. లేదా యిహలోక సౌఖ్యములు శాశ్వతమని వానియందు వైరాగ్యం కలిగి స్వర్గాది భోగము లాసించుచున్నాడు. యీ విధముగా దుష్కృత సుకృతకర్మలొనర్చి జన్మపరంపరను పొడుగించుకొనుచున్నాడు.

మరియు అజ్ఞానమెట్లు సంసారమునందు బడద్రోయుచున్నదో దెలియుటకు సాంఖ్యయోగమందలి యీ దిగువ గీతాశ్లోకములను గమనించదగును.

1) శ్లో॥ ధ్యాయతో విషయాన్ పుంస
స్సంగస్తే షూపజాయతే ।
సంగాత్సంజాయతే కామః
కామాత్ క్రోధోఽభిజాయతే ॥

2) శ్లో॥ క్రోధాద్భవతి సంమ్మోహ
స్సంమ్మోహాత్ స్మృతివిభ్రమః ।
స్మృతి భ్రంశాద్బుద్ధి నాశో
బుద్ధినాశాత్ ప్రణశ్యతి ॥

అనగా మానవుడేయే విషయములందు లక్ష్యముగలిగియుండునో ఆయా విషయములందు యింద్రియములు సంగమును పొందును. అందువలన కోరికయు, కోరిక ఫలించనిచో క్రోధమును, క్రోధము వలన అవివేకమున్ను, అందువలన మరుపును, మరుపు వలన బుద్ధినాశమును, బుద్ధినాశము వలన సర్వనాశమును అనగా శాశ్వత సంసారమును వానికి ప్రాప్తించుచున్నది.

స్వస్వరూపజ్ఞానము పొంది యీ అజ్ఞాననాశనము గావించుకొన్నచో జన్మరాహిత్యం కాగలదా? అంటే కాజాలదు. ఏలననగా జ్ఞానరూపంగాను. అజ్ఞానరూపముగానూ మార్పు చెందు వస్తువు యొక్క రహితము నందుగాని జన్మరాహిత్యం కాజాలదు. జ్ఞానాజ్ఞాన ద్వంద్వ స్వరూపముగానున్న వస్తువే యెరుకనీ, దానికి పరిపూర్ణ బ్రహ్మము నందు మూలంగాని, స్థానంగాని లేదని తెలిసి దానిని విడచిననాడే జన్మకత్యంత మూలకారణము నశించి శాశ్వత జన్మరాహిత్యము చేకూరగలదని సిద్ధాంతము.

ఇట్టి పరిపూర్ణ భావజ్ఞుడు షడ్గుణైశ్వర్య యుక్తుడగు భగవానుడు అగుచున్నాడు. జ్ఞానము, వైరాగ్యము, ఈశ్వరత్వము, యశస్సు, సంపద, నిత్య సంతోషములనునవే, షడ్గుణైశ్వర్యములు. అట్టి షడ్గుణైశ్వర్యములనొసగు శ్రీ గురుమూర్తికి నమస్కరించుచున్నాను.

రెండవ శ్లోకములో కార్యరూపమగు సంసారము ఘోరమగు హాలాహలముతో పోల్చబడినది అది సరియగునా?

శ్లో॥ సానందం సదనం. సుతాస్తుసుధియః
కాంతా ప్రియిలాపినీ
ఇచ్ఛా పూర్తి ధనం, స్వయోషి తరతి
స్సంజ్ఞాః పరాః సేవకా
ఆతిథ్యం గురుపూజనం, ప్రతిదినం
యిష్టాన్నవాసం గృహే
సాధోస్సంగ ముపాసతే చసతతం
ధన్యోగృహస్థాశ్రమః

తాత్పర్యం : ఆనందప్రదమగు యిల్లు, పండితులగు కుమాళ్లు,ప్రేమాలాపములతో సంతోషము కల్గించు భార్య, కోరికలన్నియు దీర్చగలిగినంత ధనము, ధర్మపత్నియందు పొందు రతిసుఖము సౌజ్ఞా మాత్రముచే సకల కార్యములు చేయు పరిచారకులు, గురుదైవముల యొక్క ఆరాధనము, అతిధి అభ్యాగతులతో గూడి మృష్టాన్న భోజనము, సాధుసత్సంగ సత్కాలక్షేపముగల గృహస్తు సంసారమెంతో ధన్యమని కొనియాడబడినదే! అంటే 1) అన్ని ఆశ్రములలో గృహస్థాశ్రమ ముత్తమమైనదని చెప్పుటయే యీ శ్లోకము యొక్క వుద్దేశ్యము. 2) విషముగా వర్ణింపబడినది. బాహ్యారూపముగానున్న గృహస్తు యొక్క సంసారము కాదు. జన్మ నుంచి కర్మా, కర్మ నుంచి జన్మా తప్పదు. కనుక అనంతమగు విషవలయంగానున్న సంసార చక్రము విషప్రాయమే కదా!

ఈ రెండవ శ్లోకమున సంసారము, క్షీరసాగరమున అమృతము కంటే ముందు పొడమిన హాలాహలముతో పోల్చబడినది. హాలాహలం లోకములను లోకస్తులను లోకేశ్వరులను గూడా నాశనము చేయగల విషాగ్ని కీలలతో గూడిన మహామృత్యు స్వరూపము. తదనంతరం పుట్టినది మృత్యుంజయ రూపమగు అమృతము. అమృత మృత్యువులు రెండూ ఒకే క్షీరవారాసి పొడమినవి. అట్లే జ్ఞానాజ్ఞానములు రెండూ ఒకే జ్ఞానానికి (ఎరుకకు) సంబంధించినవి. ఒకటి విద్యాపాదం, రెండవది అవిద్యాపాదం. మోక్ష స్వరూపమొకటి, బంధ స్వరూప మొకటి, బంధ మోక్షములు రెండూ పారమార్థికముగ (పరిపూర్ణ బోధ దృష్ట్యా) మిధ్యా స్వరూపములే. అమృతస్వరూప మొకటి, మృతస్వరూపమొకటి, సద్రూపమొకటి,అసద్రూపమొకటి. కనుకనే "అమృతంచైవ మృత్యుశ్చ సదసచ్ఛాహా మర్జున" అని గీతలో శ్రీకృష్ణభగవానుడుపదేశించు చున్నాడు.

కనుక "బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి" "గురుస్సాక్షాత్ పరబ్రహ్మ" అని చెప్పబడే గురుమూర్తి, "ఉపాసకానాం హితార్థాయ బ్రహ్మణోరూపకల్పనా" అని జీవులనుద్ధరించుటకై రూపుదాల్చిన బ్రహ్మవస్తువే కాని అన్యముఖు కాదు. అందుకే

శ్లో॥ నమస్తే నాథ భగవా ఽ శివాయ గురురూపిణే
విద్యావతారసంసిద్ధ్యై స్వీకృతానేక విగ్రహ॥

అనగా జ్ఞాన ప్రబోధకై శివుడు గురురూపమున అనేక అవతారములెత్తునని గురుగీతలో గురుస్తోత్రము చేయబడినది. అట్టి మంగళ స్వరూపుడగు సద్గురువునకు దక్షిణపాదము, విద్యాపాదము. "తీర్థాని దక్షిణేపాదే వేదా స్తన్ముఖమాశ్రితాః" అని వర్ణింపబడినది. అట్టి దివ్య శ్రీచరణసరోజము సంసారహాలాహలవినాశనమునకు అమృత గుళికవంటిదని చెప్పబడినది.

3) మూడవ శ్లోకములో సంసార హాలాహలము ప్రశాంతి పొందుటకు గురుపాద మెట్లు సమర్థకమగుచున్నదో వివరింపబడినది. ఎట్లనగా, "గురోర్ముఖేనజ్ఞాతవ్యం నాన్యథా గ్రంథకోటిభిః" అనగా గురుబోధరీత్యా తప్ప కోటి గ్రంథములచేతగూడా తెలియబడదని చెప్పబడుతూంది.

కాని గురుబోధ ఎవర్కిలభించును? గురుపాద మాశ్రయించి ఆగురుకటాక్షమునకు పాత్రుడైన పూర్ణాధికారికేగదా! మేమున్నూ గురుపుత్రులమే గురుస్వరూపమున్నూ ఏకరూపమే కనుక మా కేల చెప్పరాదని ఎవరైనను మరొక గురువును ప్రశ్నించవచ్చునా? గోవులన్నియు ఏకజాతికి చెందినవేయైనను తన లేగ కుడువ వచ్చినపుడే తల్లికి చేపువచ్చును. యితర లేగలు ఆశ్రయించినా ప్రయోజనముండజాలదు. గురుశిష్యన్యాయము కూడ యీ గోవత్సన్యాయము వంటిదే. గురువులకుకూడా యింత పక్షపాత ముండవచ్చునా? అంటే గోవత్సవమునందు గోవుకుండే వాత్సల్యము తెచ్చిపెట్టుకొన్నదా? లేక సహజప్రవృద్ధమా? అట్లే జలము నెడబాయనొల్లని జలచరముల తీవిబూనిసచ్ఛిష్యుడు హృజ్జలజంబను పీఠముపై నిలిపి, ఇతరముమాని గురువునే కొల్చు "సచ్ఛిష్యుని "హృదయగ్రంధి విడుటకై సదయత యీ బోధ దెల్పజనదా" గురుడు? "శిష్యస్తేహంశాధి మాం త్వాం ప్రపన్నం" అన్న పిదపనే అర్జునునకు గీత ప్రబోధించబడెను. కనుక ధర్మయుతముగా తాన్నాశ్రయించిన వానికే గురుబోధ లభ్యమగును. "ప్రేమాతిశయమునన్ గని వేమారిదీ గురునినోట వినవలెనుమీ" లేకున్న బోధ ఫలప్రాప్తి చెందనేరదు కారణమేమనగా గురువాక్యమందే శిష్యునికి లక్ష్యము, గురి, యుండ గలదు గాని యితరుల వాక్యమందుండజాలదు. శుశ్రూషా చతుష్టయముచే గురుని మెప్పుబడసి గురుకృపకు పాత్రుడైన సచ్ఛిష్యునికి బోధచెప్పవలెనని గురుని అంతఃకరణ తహతహలాడును. కనుకనే "తనకు దావచ్చి సద్బోధను దెల్పుమటంచు మ్రొక్కు తన శిష్యునికి వినజెప్పదొడగె నొకగురుడనుమానించకను వాని కతిదయతోడన్ "అని శ్రీకృష్ణదేశికేంద్రుల కందపద్యమీ సందర్భమున గమనించదగినది.

గురుబోధామృతమే శిష్యుని సంసార విషయమును హరించగలదని యీ శ్లోక తాత్పర్యము. "రసోవైసః" అని వర్ణింపబడినది. పరమాత్మయే గురువు కనుక ఈ శ్లోకమునందు గురువు సహజానంద స్వరూపుడుగా వర్ణింపబడినాడు. అతడు స్వయంగా ఆనందస్వరూపుడు గనుకనే అగ్ని సాన్నిధ్యమున వస్తువులకు ఉష్ణము సంక్రమించినట్లే "యస్య సన్నిధిమాత్రేణ చిదానందాయతే నమః" గురుసన్నిధానమందుండు శిష్యుని గూడా చిదానందస్వరూపునిగా చేయగలడని గురుగీత అతనిని కీర్తించుచున్నది. అట్టి పరమానందవిగ్రహుడవగు గురుమూర్తికివే మా నమస్సులు.

శ్లో॥ వందే గురూణాం చరణారవిందం
సందర్శితస్వాత్మ సుఖాంబుధీనాం
జనస్య ఏషాం గులికాయమానం
సంసారహాలాహల మోహశాంత్యై॥

తాత్పర్యము : ఆనందసాగరమువలెనున్న, ఆత్మసందర్శనము చేయించుటకును, హాలాహల విషముతో సమానమగు సంసారము నందలి మోహమును నశింపచేయుటకును, జనులకు

ఏగురుమూర్తి పాదపద్మము అమృతపుగుళిక (మాత్ర) వలెనున్నదో, అట్టి గురుపాదమునకు నమస్కరించుచున్నాను.

విశేష వివరణము : పశువులకు నాలుగూ, మానవులకు రెండూ పాదములున్నవి గదా! ఇక్కడ ఏకపాదమే చెప్పబడినదంటే, అది దక్షిణపాదమా? లేక వామపాదమా? లేకుంటే, పాదమనగా నాల్గవ భాగమనే అర్థములో చెప్పబడినదా? అంటే, అదేమీ కాదు. గురుపాదమే గురుపాదము. అది ద్వంద్వస్వరూపముగా గానవచ్చినా, ఆ గురుతత్వము "ఏకమేవ" అని వేద ప్రసిద్ధిము. గురుగీతయందలి మరొక శ్లోకములో "వందే గురుపదద్వంద్వం, వాఙ్మనోతీతగోచరం, శ్వేతరక్త ప్రభాభిన్నం శివశక్త్యాత్మకం పరం॥ అని ఆపాదద్వంద్వ మభివర్ణింపబడినది. శివశక్తులే (పురుష ప్రకృతులే) ఆపాదద్వంద్వమని చెప్పినది. శివుడు (పురుషుడు) తెలుపు, శక్తి (ప్రకృతి) యెరుపు, గురుముఖతః వస్తునిశ్చయము చేసుకొన్నవారికి ఆపాదద్వంద్వ విషయమంతయు కరతలామలకమే. అట్టి ద్వంద్వరూప యేకవస్తువే చరణారవిందం అని యీ శ్లోకములో చెప్పబడినది. దానినే, గురువర్యుని శ్రీపాదమని శ్రీకృష్ణదేశికేంద్రులు వాడినారు.

తత్, త్వం, పదములచే లక్షింపబడిన వస్తువులను వేర్వేరుగా జూపి, అసిపదముచే లక్షింపబడిన, అఖండాత్మస్వరూపమును చూపించగల గురువునకే నమస్కరించుచున్నానని గురుగీతలో చెప్పబడిన శ్లోకత్రయమును యిదివరకే వివరించియున్నాము. ఆత్మవస్తువు నేత్ర గోచరమగునా? కాదుకాని మనోనేత్రముచే జ్ఞేయుబ్రహ్మము తెలియబడగలదు. "ఆత్మవారేద్రష్టవ్యో" "మన సైవానుద్రష్టవ్యం" "బుద్ధి గ్రాహ్మ మతీంద్రియం" అని శ్రుతిస్మృతులు ఘోషించుచున్నవి. ఆయాత్మ స్వాతిరిక్తంగాదని గుర్తించి, నరుడానందసముద్రమున నోలలాడును. ఆనందసముద్రము లన్నీ గలసిన మహోదధిగా అది, "స్వాత్మసుఖాంబుధీనాం" అని బహువచన ప్రయోగముచే కీర్తింపబడినది.

సంసారమనగా భార్యాపుత్రాదులతో గూడిన గృహస్థుయొక్క సంసారముగాదు. ఈ సంసారబాధ తొలగించుకొనుటకు గురుచరణముబట్టనక్కరలేదు. ఇది హాలాహల సన్నిభమైనది గాదు. దీనియందు సుఖసంతోషములు లేకుండానూ పోలేదు. "దమ్మిడీకీ గుడిసె, దెబ్బ కొడితే వడిసె" నన్న సామెతగా నిముషములో యీ సంసారమును పరిత్యజించనూవచ్చును. కనుక యీ శ్లోకమందలి సంసార శబ్దమునకు బాహ్యసంసారమే అర్థమని గ్రహించరాదనుట స్పష్టమే. ఐతే అంతస్సంసారమేది? అంతఃకరణమందు తిష్ఠవేసుకొనియున్న సంస్కారములే. ఇవియే మాటిమాటికి జీవునికి దేహధారణకల్పించి, జనన మరణములమధ్య యుయ్యాల లూపుచుండును. ఈ అంతఃకరణము సమిష్టి వ్యష్ట్యాత్మకంబై " మృత్యోస్సమృత్యు మాప్నోతి" అని చెప్పబడినరీతిగా, అనాదియై, జన్మపరం పరలకు మూలకారణమైయున్నది. కనుక యిది హాలాహలమువంటి మహాభయంకరమైనదనుటలో అతిశయోక్తిలేదు. ఈ అంతఃస్సంసార మెంత భయంకరమైనదో ఆదిశంకరులు రచించిన లక్ష్మీనృశింహ స్తోత్రమునందు చూడనగును.

తొల్లి దేవాసురులు క్షీరసాగరమును అమృతము కొరకై మథించగా అందుండి తొలుదొల్త భయంకరమగు విషవహ్నులను విరజిమ్ముచు జనించిన మహా విషమునకే హాలాహలమనిపేరు. అది చతుర్దశభువనములను భస్మీపటలంగావించునని భయపడి దేవదానవులందరూ ముక్తకంఠము తో రక్షింపుడని ఈశ్వరుని ప్రార్థించిరి. బాహ్యమునందుంటే యీ బ్రహ్మాండమును గాల్చివేయును. లోనికి మ్రింగితే లోనున్న బ్రహ్మాండభాండములన్నీ ఆ విషాగ్నికీలల కాహుతియై

పోవును. కనుక బయటనుంచక, లోనికి మ్రింగక, కంఠస్థానమునందే దానిని నిల్పి శంకరుడు గరళకంఠుడని నాటినుండి కీర్తి పొందెను. ఇదీ కథ.

అంతఃకరణమే జన్మబంధముగానుంటే దానియందు మోహమెందుకుండవలెను? అంటే "నేను, నేను" అనే అహంవృత్తితో అదే వ్యవహరించుచూ జీవేశ్వర జగద్రూపములుగా అదే ప్రకాశము జెంది తనరూపములకు తానే ముగ్ధుడై మోహవాగురులలో జిక్కుచుండును. కనుకనే, కృష్ణదేశికులు కందార్థములలో "అన్నియుతానై తనకవి పన్ను గవేరనుచు నోటబల్కుచు, మరి తానన్నిటి నెరిగేయెరుకై యున్నానని యెరుక కెరుకే యూహింపుచుండూ, తనకుతానే మోహింపు చుండూ....." అన్నారు. అఖండరూపముగాను ఏకమాత్రం గాను యున్న ఈ యెరుక తన యిచ్చే తనే తననుండి తానే జీవేశ్వర జగద్రూపములను ఆవిష్కరించుకొనెను. సృష్టి సామర్థ్య రూపశక్తియూ, సృష్టియూ కూడా తానే ద్వైత దృష్టితో చూచినచో తోచిన వన్నియుతనవే. "దేహీ దేహములనే తెరగున ప్రసరించి దేహముగాని విదేహిగ తనను తానుచూచుట" మాత్రమే గాని అంతయుతానే. "ఆత్మనోన్యంన కించన" అనగా ఆత్మకన్యంగా ఏమీలేదు. కనీసం అంతయూ తనదే ఈ అహంకారమమకారములే యెరుక జగత్తులయందలి మోహమునకు కారణమయ్యెను. "దేహాకారము గానిది, మోహము చెందనిది" ఒక్క పరిపూర్ణ పరబాహ్మమే. తనయందలి ప్రేమచేతనే తనదనుకొన్న సర్వమునందు ప్రేమ కల్గుచున్నదని "ఆత్మవస్తు కామాయ సర్వం ప్రియం భవతి" అంటూ బృహదారణ్యకోపనిషత్తు సిద్ధాంతము చేసినది. నాయందు నాకున్న ప్రేమ నాది అనుకొన్న వస్తువుల యందు కూడా సంక్రమించుటయే మమకారము. ఒక గ్రీకు శిల్పి ప్రపంచమునందలి సౌందర్య సౌకుమార్యము లన్నియు నొకచో చేర్చి రాశిపోసినట్లుగా ఒక స్త్రీ మూర్తిని చెక్కి, అశిల్పసుందరి, మోహనాకారమునకు తానే ముగ్ధుడై తనివిదీరక నట్లే చూచుచు, అహోరాత్రములు నిద్రాహారస్ఫురణయేలేక కొన్ని దినములు గడిపి, చివరకా విగ్రహము యొక్క పాదములచెంతనే ప్రాణములు బాసెనట! ఆహా!! మోహము (లేక మమకారము) ఎంత దుష్టమైనది!!! అహంకార మమకారములే (నేను, నాది అను భావనలే) మోహబీజములు. హాలాహలప్రాయమై జన్మాది దుఃఖపరంపరకు హేతువైనప్పటికి యీ అనాదిసంసారమునందు మోహమీవిధముగా పాతుకొనిపోయియున్నది. ఈ మోహనివారణమే నిజమగు ముక్తి.

ఇట్టి మోహశాంతి ఎట్లు చేకూరును? మోహమనగా అజ్ఞాన జనితమైన అంతఃకరణ వృత్తి రూపమైన ప్రేమభావము మాత్రమే గదా! అజ్ఞానజనితము కనుక జ్ఞానముచేత పోవును అని కొందరంటారు. కాని అది తాత్కాలికము మాత్రమేనని తెలియవలెను. జ్ఞానాజ్ఞానవృత్తులు రెండున్నూగూడా అంతఃకరణధర్మములే. నేను బ్రహ్మమనుకొన్నా, లేక కించిజ్ఞుడనగు జీవుడనుకొన్నా, రెండూ అంతఃకరణవృత్తులే. అంతఃకరణమునకు గుర్తెరిగే తెలివియున్నంత వరకూ జ్ఞానాజ్ఞాన రూపమగు సకలవృత్తులు వచ్చిపోవుచునే యుండును. "సంతోషాసంతోషము లంతలో గనవచ్చి పిదప నరుగు నెచటికో" అన్నారు కృష్ణదేశికేంద్రులవారు. అంటే ఎక్కడనుండి వచ్చినవి? ఎచ్చటికి పోగలవు? ఎచ్చట సంతోషం కల్గినదో అచ్చటనే అట్టి సంతోషమును మరుగుపరచగల అసంతోషము (దుఃఖము) కల్గినది. కనుక సుఖదుఃఖముల రెంటికీ స్థానము ఒక్క అంతఃకరణమే. ఒకప్పుడు జ్ఞానరూపంలో మరొకప్పుడు అజ్ఞానరూపంలో ఒకప్పుడు సుఖరూపంలో మరొకప్పుడు దుఖః రూపంలో గానవచ్చుటయే అంతఃకరణ ధర్మము.

క్షీరాబ్ధి మధనకాలమందు హాలాహలమున్నూ, చివరకు అమృత భాండమున్నూ రెండూ పొడమినట్లు పురాణగాధ. అట్లే ఆత్మావరణమందే జన్మమృత్యు దుఃఖరూపమగు సంసారహాలాహలమోహమున్న, అనంతానందసాగరమున్నూ కలవు. ఇట్టి ద్వంద్వ లక్షణములు కల్గించుట చేతనే దీనిని ద్వయదోషము కల్గినదానిగా పెద్దలు నిశ్చయించినారు. ఇది యా ఆత్మకు స్వభావము. (నైజగుణము లేక ప్రకృతి) కనుక అచల ఋషులు ఆ వస్తువునకే ప్రకృతి ద్వయమని నామకరణం చేసినారు. యిట్టి ద్వయదోష రహితమైన దొక్క పరిపూర్ణపరబ్రహ్మమే.

ఈ ప్రకృతి ద్వయమునందు మోహశాంతిని గల్గింపగలవాడు ఒక్క పరిపూర్ణ గురువే. గురుమూర్తి చరణారవింద సంసేవనము వలన ఆత్మానందసాగరము దర్శింపగలము. అపుడు, గరళకంఠుని కంఠమందు మరుగైయున్న హాలాహలమువలె అబ్ధిగర్భమందు దాగియున్న యుజ్వల బడబాగ్ని శిఖలవలె, అనంతానందసాగరగర్భమందు మరుగై, సంసార మోహము పశమించినట్లుగా గానవచ్చునేగాని, దాని మూలబీజము మాత్రము పోనేరదు. అట్టి మోహజనక వస్తువైన ఎరుకకు (సమిష్టి అంతఃకరణమునకు) పరిపూర్ణ పరబ్రహ్మమునందు మూలముగాని, కొనకు ప్రవేశించేటందుకు స్థానముగాని లేదని పరిపూర్ణబోధచే దృఢనిశ్చయము గలిగినవాడే గురుమూర్తి. అట్టి గురుమూర్తి ఆత్మతత్వము (గురుతత్వము) యొక్క సగుణస్వరూపుడే గాని నరమాత్రుడు గాదు.

సగుణరూపంలోనో ప్రప్రధమమునందు గురూపాసన సాధ్యము. అపుడు గురుమూర్తి యొక్క రెండుపాదములను యొకచో చేర్చి ఏకీకృత మొనర్చి వందన, అర్చన, పూజాదు లొనర్చవలెను లేదా

శ్లో॥ తీర్థాని దక్షిణే పాదే వేదాస్తన్ముఖ మాశ్రితాః
పూజాయే దర్చితంతంతు తదభిధ్యాన పూర్వకం॥

అను గురుగీతా విధి ననుసరించవలెను. సమూలముగా మోహనిరాకరణముగావించి, పూర్ణబోధచే జన్మ మృత్యు భయ భ్రాంతులను రహిత మొనర్చగల సద్గురుమూర్తికివే మా నమస్కారములు.

శ్లో॥ హేతవే జగతామేవ సంసారార్ణవ సేతవే
ప్రభవే సర్వవిద్యానాం, శంభవే గురవేనమః॥

తాత్పర్యము : కార్యరూపమగు విశ్వోత్పత్తి స్థితి ప్రళయములకు ఎవడు కారణస్వరూపుడై యున్నాడో, సంసార మహాసముద్రమును దాటించుటకు ఏ మహనీయుడు వారధివంటి వాడగుచున్నాడో, సర్వవిద్యలు ఎవనినుండి ప్రభవించినచో, జనన మరణ రాహిత్యమగు కేవల సుఖమును ఎవడు ప్రసాదించగలడో అట్టి సద్గురుమూర్తికి నమస్కారము.

విశేష వివరణము : ఈ విశ్వమునంతటికి మూలకారణు డాగురుపరమాత్మ యొక్కడే, అతడే సర్వమునకు అధిష్ఠాన చేతన స్వరూపుడు. "తేనవినాతృణాగ్రమపి నచలతి" అతని అనుగ్రహము లేక గడ్డిపరక కొన భాగము కూడ కదలజాలదు. "నిత్యం, విభుం, సర్వగతం, సుసూక్ష్మం, తద్భూతయోనిం పరిపశ్యన్తి ధీరా" అని ముండకోపనిషత్తు యాతనిని భూతయోనిగా అభివర్ణించి నది. భూతయోని అనే సమాసమునకు మూలప్రకృతి అని అర్థము చెప్పరాదని, పరమాత్మయే అర్థమని బ్రహ్మసూత్రములలో వ్యాసభగవానుడు స్పష్టము చేసియున్నాడు. గురుస్వరూపమే

అట్టి విశ్వకారణ వస్తువై యున్నది కనుక యీ శ్లోకములో "హేతవే జగతామేవ" అని వర్ణింపబడినాడు.

సంసారసాగరము నుద్ధరించుటకు గురుమూర్తియే వంతెన వంటివాడు. ఈ శ్లోకములో సంసార మొక మహా సముద్రముతో పోల్చబడినది. సంసారార్ణవమనీ, భవసాగరమనీ, సంసార వారధియనీ యిత్యాదిగా వర్ణింపబడినది. సంసారమనగా భార్యాపుత్రాదులతో కూడిన గృహస్తుని యొక్క కాపురమే సంసారముకాదనీ జననమరణములతో గూడినదే సంసారమని యిదివరకే తెలిసికొన్నాము.

శ్లో॥ "జాతశ్చాస్మి మృతశ్చాస్మి, సంసారస్మి పునఃపునః
జన్మమృత్యూ పునర్జన్మ పునర్మృత్యుః పునర్జని॥

అని గర్భోపనిషత్ పలుకుచున్నది. యిదే భావమును

శ్లో॥ పునరపిజననం పునరపి మరణం, పునరపి జననీ జఠరేశయనం
యిహసంసారే, బహుదుస్తారే కృపయాపారే పాహిమురారే॥

అను శ్లోకమున్ను, సంసారమును నిర్వచించుచున్నది. భార్యాపుత్రాదులతో గూడిన సంసారము భయంకరము కానేకాదు. విశేషించి యే స్వల్పంగానో మనోరంజకంగానే యుంటున్నది. ఐనను అట్టి గృహస్తు సంసార బాధను నివర్తి చేసుకొనుట ఎంతమాత్రము కష్టంకానేకాదు. దమ్మిడికి గుడిశెదెబ్బ కొడితే ఒడిసెనన్నారు గురుమహరాజ్. కట్టుకొన్న మంచి బట్ట విడవగవచ్చు కట్టుకొన్న యాలినీ విడువవచ్చు కానీ యెక్కడికి పోయినా కూడా వచ్చే ఏ అంతస్సంసారకారణమగు అంతఃకరణమగు మనస్సును వీడజాలవుగదా! యని వేమన హెచ్చరించియున్నాడు. కనుక గృహస్థాశ్రమమును వదలవలసిన పనియేలేదు. యీ క్రింద పద్య మించుక యవలోకించుడు

చ॥ వనమున నున్ననేమి గృహవాసము జేసిననేమి యాత్మ భా
వనయు నసంగవృత్తి యరివర్గజయంబును గల్గియుండినన్
వనమున నున్ననేమి గృహవాసము జేసిననేమి యాత్మ భా
వనయ నసంగవృత్తి యరివర్గ జయంబును లేక యుండినన్॥

1) ఆత్మచింతనము 2) అసంగవృత్తి 3) అరిషడ్వర్గ జయము యున్న వాడెందుండినను బాధలేదు. అవి లేనివాడెందుండినను ప్రయోజనము లేదని తాత్పర్యము.

కనుక సంసారమనగా అనాదిగా జనన, మరణముల మధ్యయుయ్యాలలూగు జీవాంతఃకరణమే సంసారము. సమిష్టి అంతఃకరణమే సంసార కారణము. భార్యాపుత్రాది రూపమగు సంసారమనునదే యెరుగక తన యెనిమిదవయేటనే సన్యసించిన ఆదిశంకరులు ఆ పిదప నెప్పుడో యేసంసారముచే బాధపొందుచూ లక్ష్మీనృసింహస్తోత్రము రచించి అందు

శ్లో॥ సంసారసాగర విశాలకరాళకాళ
నక్రగ్రహగ్రసన నిగ్రహవిగ్రహస్య
మగ్నస్యరాగలసదూర్మినిపీడితస్య
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబం"

అనిన్ని సంసారసాగరనిమజ్జన ముహ్యామానం దీనం విలోకయవిభో కరుణానిధేమాం" అనిన్నీ ఏ సంసారము నుండి విముక్తిని కోరి లక్ష్మీనృసింహదేవుని కరావలంబమును కోరెను. వాసనామయమగు అంతస్సంసారమునుండియేకదా! నామరూపాత్మకుడైన లక్ష్మీనృసింహ

మూర్తియు సద్గురు స్వరూపము యొక్క సగుణ స్వరూపుడేగదా!

శ్లో॥ పరాత్పర గురుంవందే చైతన్యామృత విగ్రహం
యస్యావలోకనేనైవ గతా సంసారవాసనా॥

అనగా ఆ గురుమూర్తి కృపావలోకనమాత్రాన సర్వవాసనాక్షయము మనోనాశనము గాకుండునా మరియు ముకుందమాలలో

శ్లో॥ భవ జలధి మగాధం దుస్తరం నిస్తరేయం
కథ మహ మితిచేతో మాస్మగాఃకాతరత్వం
సరసిజ దృశిదేవేతావకీ భక్తి రేకా
నరకభిదినిషణ్ణాతారయిష్యత్యవశ్యమ్

అని భక్తుడు భగవానుని ప్రార్థించుచున్నాడు.

సంసారమును సముద్రముతో నేల పోల్చవలె? యింతంతని కొలతలు చెప్పరానిదై, అగాధమగు లోతుగలదై, ఈదరాని మహా వైశాల్యముగలదై కొండలవలె మీద కురుకు తరంగ పంక్తితో తిమింగలములు, మొసళ్ళు మొదలగు జలచరముల కాలవాలమై మహా భయంకరమై యున్నది. సముద్రము, అట్లే అద్యంతములు గానరానిదై అగాధమై శబ్దస్పర్శాది విషయముల యందలి రాగద్వేషములు ఒకదాని వెనుక నొకటిగా వచ్చి తన్ను ముంచెత్తుచుండగా కోరికలు కామక్రోధాదులు మొసళ్ళవలె తన నిగ్రహశక్తిని నాశనము చేసి చిత్తస్థైర్యమును కబళించుచుండగా జీవుడు కింకర్తవ్యతామూఢుడై (యేమి చేయుటకు తోచనివాడై) జన్మాదిగా దుఃఖపరంపరలకు లొంగి కృంగి యీ ఘోర సంసార బాధను భరించలేక గురునికి శరణాగతుడగుచున్నాడు. యీ సంసార మహాసముద్ర మెట్టిదో యీ క్రింది పద్యము చక్కగా వర్ణించుచున్నది.

సీ॥ ఘనతమంబనియెడి కమఠంబు విహరింప
తతరజంబనెడి మత్స్యంబు మెలగ
మహిత రోషంబను మకరంబు జరియింప
వరకామ మనెడి శైవలము గప్ప
మదమత్సరములను మండూకములు జేర
పాదలు రోగములను బుగ్గలొదవ
పెనులోభమనియెడి ఫేనంబు దేలాడ
విసిరి మోహంబను వేల మలర

గీ॥ జన్మ మృత్యువులను భంగ చలనమొప్ప
దుఃఖమను జలవాహిని దొలగకుండ
భవ జలధిలోన మునిగెడి పాపి నెవ్వ
డరసి దరిజేర్చు వాడె సద్గురువరుండు

తాత్పర్యము : అజ్ఞానాంధకారమే తాబేలు, పాపగుణములే మహామత్స్యములు, గొప్పదగు దోషములే మొసళ్ళు, కామోద్రేకమే నీటి పాచి, మదమత్సరములే మండూకములు, నానావిధ రోగములే పైకి బుసబుస పొంగు నీటి బుగ్గలు, లోభ బుద్ధులే నురగులు, మోహమే యుప్పెన, జనన మరణములే రాకపోకలు జరుపు సముద్ర కెరటములు, దుఃఖపరంపరలే జలప్రవాహ

ములు. యిట్టి సంసార జలధి మునకలిడు పాపరూప జీవిని దరికి చేర్చువాడే సద్గురూత్తముడు. అట్టి సద్గురు స్వరూపమే వుపాసితవ్యము.

3) ప్రభవే సర్వ విద్యానాం = జ్ఞానోత్పత్తి సాధనములగు సర్వ వేదశాస్త్రములు గురు స్వరూపము నుండియే యుత్పత్తియైనవి. ఎట్లనగా గురుపరమాత్మయందలి పరావాగ్రూపమగు ప్రణవము తొలుత ధ్వన్యాత్మకమై పిదప, పశ్యంతి మధ్యమ వైఖరీలుగా పరిణమించి వర్ణాత్మకమగు శబ్దస్వరూపము వహించి పిమ్మట నానావిధ శాస్త్రములు విద్యలుగా వికాసము చెందుటచే గురుపరమాత్మనుండియే సకల విద్యలు ప్రభవించినవని చెప్పనగును.

విద్య యనగా జ్ఞానమనియు, అవిద్య యనగా అజ్ఞానమనిన్ని అర్థము.

శా॥ అజ్ఞానంబున దోచు సంసరణదుఃఖావ్ధా యజ్ఞానమాత్మజ్ఞానంబున నాశనంబగు తదాత్మ జ్ఞానమీశ్వరా నుజ్ఞంగాని ఘటింపదు..'' అని చెప్పబడినది. సంసారకారణమగు అజ్ఞాన నాశనము కావలెనన్నచో ఈశ్వరకృప (గురుకృప) వలన ఆత్మజ్ఞానము కలుగవలసియున్నది. మాయారూపమగు సంసారకారణము తానేయై, వ్యష్టి అంతఃకరణ రూపమగు కార్యరూప సంసారమున్నూ తానేయై సంసార నాశనహేతువగు సర్వ "విద్యా స్వరూపో భగవాన్" అని కీర్తింపబడే వాడున్నూ తానేయై అన్నియు తానేయైయుండు సద్గురుమూర్తి కివే నా నమస్కృతులు.

4) శంభవే = "శం" అనగా సుఖములేక ఆనందము, ఆనందము కలిగించును. గనుక "శం" కరుడు శంభువనిన్ని ఆ పరమాత్మ సగుణరూపములకే పేర్లు జన్మరాహిత్యముగాక మరేమిన్నీ అత్యంత పరమసుఖమని యనుటకు వీలులేదు. కనుక శివస్వరూపుడైన సద్గురువే శంభుశబ్దముచే వర్ణింపబడినవాడు. కనుక జగత్కారణుండును. సంసారాబ్ధిని దాటించువాడును, జ్ఞానమయుడును, సకల విద్యలకు ఉత్పత్తి స్థానీయుడును. జన్మరాహిత్య సుఖమును ప్రసాదించువాడును అగు శ్రీ సద్గురు పరమాత్మ కివే నా నమస్కృతులు.

శ్లో॥ హేతవే జగతామేవ సంసారార్ణవ సేతవే
ప్రభవే సర్వవిద్యానాం శంభవే గురవేనమః॥

తాత్పర్యం : జగత్తున కేకైక కారణ స్వరూపుడును సంసార మహాసముద్రమును దాటుటకు సేతువు (వారధి లేక వంతెన) వంటి వాడును, సర్వ విద్యలకు యుత్పత్తి స్థానమైనవాడును, సుఖమును గలుగ జేయువాడును అగు గురుమూర్తికి నమస్కారము.

విశేష వివరణము : 1) హేతవేయేవ 2) సంసారార్ణవసేతవే, అను రెండు హంశములే ప్రస్తుతం వివరణ చేయబడుచున్నవి.

1) హేతవే ఏవ=జగత్కారణ వస్తువేది? అను ప్రశ్నకు తొలి మానవుల కాలము నుండియు జిజ్ఞాస జరుగుచునే యున్నది. 1) కాలము 2) స్వభావము 3) కర్మ 4) యదృచ్ఛ 5) పంచభూతములు (పరమాణువులు) 6) యోని (ప్రకృతి) 7) పురుషుడు (హిరణ్యగర్భుడు) 8) వీని సంయోగము 9) ఆత్మ అని, నానా ప్రకారములుగా జగత్కారణమును యూహించుచూ వచ్చిరి. తాత్వికులు 1. సత్తు 2. అసత్తు 3. సదసత్తు 4. రజస్సు 5. జ్ఞానము 6. ఆకాశము 7. స్థూలసూక్ష్మములు 8) ఆవరణము 9) అంభస్సు. అని వేరువేరుగా కొందరు వాదించుచూ వచ్చిరి. యీపై అన్నిటిలో దేనిని, జగత్కారణముగా తీసుకొన్నను అది అవాంతర కారణమే యగుచున్నది కాని పరమకారణము (అత్యంత మూలకారణము) కాదని తేటపడుచున్నది.

"బ్రహ్మసవనం, బ్రహ్మవృక్ష మాసీత్. యతో ద్యావా పృధివీ నిష్టతక్షుః" అనగా బ్రహ్మవనమందలి బ్రహ్మవృక్షముయొక్క కర్రతోనే ఈ భూమ్యాకాశములు చెక్కబడినవి. అంటూ, బ్రహ్మమే జగత్కారణముగా తొలివేదమైన ఋగ్వేదమే నిర్ణయించినది. శ్రుతిస్మృతులు అన్నీ కూడా బ్రహ్మమునకే జగత్కారణత్వము చెప్పినవి. చివరకు జగత్కారణమైనదేదో అదే బ్రహ్మమని నిర్వచనాలే బయలుదేరినవి.

1) యతోవాయిమానిభూతాని జాయంతే, యేన జాతానిజీవంతి, యత్ప్రయంత్యభి సంవిశంతీతి తద్విజిజ్ఞాస స్వతద్బ్రహ్మేతి అని తైత్తిరీయ శ్రుతియున్ను

2) "జన్మాద్యస్యయతః" అని బ్రహ్మసూత్రములున్ను సృష్టి స్థితి లయములు దేని యందుండి కలుగుచున్నవో అదే బ్రహ్మమని స్థిరపరచినవి.

3)"యో ఉ ఖిలం జగన్నిర్మాణేనబృంహతి వర్ధయతిసబ్రహ్మ" అనగాయీ అఖిల జగత్తును నిర్మించుటకూ యేది విజృంభించి వ్యాపకత్వము చెందినదో అదే బ్రహ్మమని చెప్పినది. (బ్రహ్మమే జగత్కారణమనుటకు సంపూర్ణ వివరణను తెలియగోరువారు నేను రచించిన పరిపూర్ణ దర్శనములోని సృష్టి విజ్ఞాన ప్రకరణమును చూడగోరెదను.

శ్రుతి స్మృతులు బ్రహ్మమే జగత్కారణమని అంటే యీ శ్లోకములో గురుతత్వమే జగత్కారణమని చెప్పబడినది. "గురుస్సాక్షాత్ పరబ్రహ్మ" అని, "గురురేకం పరబ్రహ్మ" అని గురుత త్వము కొనియాడబడుచున్నది. బ్రహ్మముకన్న గొప్పవస్తువున్నులేదు. బ్రహ్మమే గురుతత్వము, గురుతత్వమే పరబ్రహ్మము. కనుక ఏ విధంగా చెప్పినా ఒక్కటే.

ఐతే, జగత్తు పుట్టనేలేదని, అజాతవాదమును సాధించుటకు శంకరాచార్యులవారి పరమ గురువైన గౌడపాదాచార్యులవారు తమ మాండూక్యకారికలలో ప్రయత్నించిరి.

జగత్తు పుట్టనేలేదన్న అజాతవాద సిద్ధాంతమున కంతగా ఆదరణ లభించలేదు. త్రాటియందు పామువలె బ్రహ్మమందు లేకనే జగత్తు తోచినది. జగత్తునకు పారమార్థిక సత్యత్వము లేదని, కాని వ్యావహారిక సత్యత్వమున్నదని కనుక అది మిధ్యాపదార్థము అని సిద్ధాంతము చేయుటతో అద్వైత సిద్ధాంత ప్రతిష్ఠాపనాచార్యులగు శంకరాచార్యులవారు తృప్తిపడిరి.

అచల ఋషులట్లుగాక, "జగత్తు లేదనుటకు నీవెవ్వరు? జగత్తే లేనిచో యింటికి దర్వాజా లెందుకు? గోడల కడ్డముగా నడచిపోరాదా? జగత్తున కత్యంత మూలకారణమై, సకల నామరూపాలు వహించి, సర్వభ్రాంతులకు మూలకారణమైన యెరుకే (జ్ఞానస్వరూపమగు బ్రహ్మమే) లేదనవలెను. ఆ యెరుక పరిపూర్ణ పరబ్రహ్మమందు పుట్టలేదు. లేకనే తోచినది" అని అజాతవాద వివర్తవాదముల రెంటికి పరిపూర్ణబోధచే సమన్వయము గావించిరి. "బ్రహ్మ మందు జగత్తు పుట్టలేదు" అనే వాక్యమునకు యే ఆక్షేపణా యుండరాదంటే, బ్రహ్మమనగా పరిపూర్ణ పరబ్రహ్మమనీ. జగత్తు అనగా జగత్తునకు మూల కారణమగు ఎరుకే జగత్తు అనీ అర్థము చెప్పవలసి యుంటుంది. అట్లా చెప్పినపుడే జగత్కారణ వస్తువు బ్రహ్మమే. (యెరుకే) అని వుపనిషత్తుల తాత్పర్యమున్నూ సమన్వయం కాగలదు.

ఈ గురగీతా శ్లోకమునందలి "యేవ" శబ్దప్రయోగమ[illegible]రేదీ జగత్తునకు కా[illegible]ణం కాదు అని స్పష్టమగుచున్నది. సృష్టికారణములని చెప్పబడిన కాలకర్మాదులన్నియు యీ అధిష్టానబ్రహ్మ సంబంధమే కనుక అవి అన్నియు ఆ బ్రహ్మముకంటె భిన్నముకావు. మరి యీ అధిష్టాన బ్రహ్మమే. నిమిత్త. వుపాదాన, అభిన్న నిమిత్తోపాదాన వివర్తోపాదానాది సర్వకారణములై

యున్నది. కనుక "హేతవే జగతా మేవ" అని యీ గురుతత్వము అభివర్ణింపబడినది.

"సంసారార్ణవ సేతవే" సంసారమనగా గృహస్తుని భార్యాపుత్రాది సంసారము కాదనీ, జనన మరణాదులు పొందించేది పొందేది యేదో అదే సంసారమని యిదివరకే వివరింపబడినది. యీ సంసారము అర్ణవము అనగా మహాసముద్రముతో యెట్లు శంకరాదులు పోల్చిరో కూడా యిదివరకే వివరింపబడినది. ఉత్తుంగ తరంగ పంక్తితోను పెద్ద యొడలను కూడా తలక్రిందులు చేయగల తిమితిమింగలాది మహాభయంకరమగు జలచరములతోను నిండియుండెడి మహా సముద్రమును దాటుటెంత కష్టము? అట్టి సముద్రమును దాటించుటకు గురువు తెప్పవంటి వాడనీ, లేక నావ వంటివాడనీ లేక పెనుయోడవంటివాడని పోల్చినాచాలదు. ఏలననగా, తెప్ప, నావ, చివరకు పెద్దయోడగూడ సముద్రమును నిరపాయముగా దాటగలవని చెప్ప జాలము. కనుకనే శ్రీరాముడు లంకకు సేతువునే కట్టినాడు. సేతువు అనగా పెద్ద వంతెన అట్టి వంతెన యున్నచో యెట్టి మహాసముద్రమునైన యవలీలగా దాటగలము. సంసార మహాసాగరమును దాటుటకు గురుమూర్తి అట్టి నిరపాయమగు దివ్య మార్గముగా దాటింపగలవాడని తెలుపుటకే సంసార్ణావ సేతువు అని అభివర్ణింపబడినాడు.

అట్టి గురుమూర్తి దివ్య శ్రీచరణముల నాశ్రయించి అహరహము సేవించి కృతకృత్యుల మగుదుము గాకా!

శ్లో॥ శ్రీమత్పరం బ్రహ్మగురం స్మరామి
శ్రీమత్పరంబ్రహ్మగురుం భజామి
శ్రీమత్పరం బ్రహ్మ గురుం వదామి
శ్రీమత్పరం బ్రహ్మ గురుం నమామి॥

తాత్పర్యం : పరబ్రహ్మ స్వరూపుడగు సద్గురువునే స్మరించు చున్నాను. భజించుచున్నాను. స్తుతించుచున్నాము.

విశేషార్థ వివరణం : శ్రీ అనగా శుభము, మంగళము, సంపత్కరము అని అర్థము. శ్రీమత్ అనగా శుభప్రదమై, మంగళప్రదమై సంపత్కరమై అని భావము. పరంబ్రహ్మ అన్ననూ పరబ్రహ్మ అన్నను ఒకటే. నామ రూప గుణ క్రియలకు పరముగా నున్నదే పరబ్రహ్మము. అది నిరాకారము. నిర్గుణము, నానాత్వమున కతీతముగా, "ఏకమేవాఽ ద్వితీయం" గా నున్నది. సగుణరూపమై అన్నిటితో ఓతప్రోతమై (అనగా పడుగుపేకవలె పెనవేసుకొన్నదై) యుండునది సగుణ బ్రహ్మమనీ, అపర బ్రహ్మమనీ చెప్పబడును. బ్రహ్మము అను శబ్దము "బృహి" వృద్ధౌ అను ధాతువునుండి ఏర్పడినది కనుక బ్రహ్మ మనగా పెద్ద వస్తువు అని అర్థము. కనుక పరబ్రహ్మ మనగా జగజ్జీవేశ్వరులకు పరంగానున్న పెద్ద వస్తువు అని అర్థము సిద్ధించుచున్నది.

ఆ పరబ్రహ్మవస్తువే, సగుణమైనపుడు సర్వమూ తానేయై "సర్వం ఖల్విదం బ్రహ్మ" అని కొనియాడబడుచున్నది. అదియే సృష్టి స్థితిలయములకు కారణమగుచున్నది. అపుడది జాగదంతః పాతియు (Immanant). జగదతీతము (Transcentacet) ను గూడనై యున్నది. సర్వనామ, రూప, గుణక్రియా విశేషముల కన్నిటికి అదియే ఆధారము. అధిష్ఠానమూనై యున్నది.

శ్లో॥ గురుస్సత్వమయోవిష్ణుః రాజశశ్చతురాననః,
తామసో రుద్రరూపేణ సృజత్యవతి హంతిచః

రజోగుణ ప్రధానమై బ్రహ్మయను నామరూపములు వహించి అదే సర్వమును సృజించుచున్నది. సత్వగుణ ప్రధానమై విష్ణువు, అను నామరూపములు వహించి అదే సర్వ జీవరాసులను పోషించుచున్నది. తమోగుణ ప్రధానమై రుద్రుడను నామరూపములు వహించి సంహారక్రియ చేయుచున్నది. యిదే సగుణ బ్రహ్మము దీనినే

సీ॥ తత్పదంబుననీవు త్వంపదంబుననీవు
నసిపదంబుననీవు నాత్మనీవు
అండాండములునీవు పిండాండములునీవు
బ్రహ్మాండములునీవు బ్రహ్మమీవు
సత్తు చిత్తులునీవు సాక్షిరూపమునీవు
క్షరుడవునీవు అక్షరుడవీవు
క్షేత్రంబులును నీవు క్షేత్రజ్ఞుడవునీవు
కర్మంబులును నీవు జ్ఞానమీవు

తే॥గీ॥ "స్థూల దీర్ఘంబులుననీవు సూక్ష్మమీవు
నీవు నేనును నీవైన భావమీవు"
రమ్య గుణధామ భద్రాద్రిరామ పరశు
రామ నరసింహ్వదాససంరక్షితాహ్వాహ్వవ॥ అనిన్ని

సీ॥ విశ్వసృష్టివినీవు, విశ్వేశుడవునీవు
విశ్వవంద్యుడనీవు విశ్వమీవు
వేదవేద్యుడవీవు వేదాంతుడవునీవు
వేదస్తుడవునీవు వేదమీవు
యజ్ఞ కర్తవునీవు యజ్ఞభోక్తవునీవు
యజ్ఞరూపుడవునీవు యజ్ఞమీవు
దేవ దేవుడనీవు దేవాత్మకుడనీవు
దైవజ్ఞుడవువీవు దైవమీవు

తే॥గీ॥ శిష్యుడవు నీవు పరమ దేశికుడ వీవు
సగుణ నిర్గుణుడవు నీవు సాక్షివీవు॥ రమ్య అనిన్ని
పరశురామ నరసింహ్వదాసుగారు చెప్పియున్నారు.

ఈ స్థితియందు బ్రహ్మము సగుణ నిర్గుణములగు రెండు రూపములుగాను ఏక కాలమునందే యుండియున్నది. శ్రుతి "పాదోస్యవిశ్వాభూతిని త్రిపాదశ్యామృతం దివి" అనగా. ఏకపాదముచే (తనయందలి నాల్గవ భాగముచే) విశ్వస్వరూపమై, మిగతా మూడు భాగములచే (పాదములచే) అమృతస్వరూపమై, దివ్యముగా (అనగా ప్రకాశస్వరూపమై)యున్నదని చెప్పబడినది. లేదా. అవికృత పరిణామ వాదరీత్యా ఎన్ని వస్తువులుగా తాను మార్పుజెందినా స్వరూపహానిలేక అనగా తాను మాత్ర మేమాత్రము క్షీణించక యున్నదని చెప్పబడినది. లేదా, వివర్తవాదరీత్యా తనయందలి తన మాయాశక్తి ప్రభావముచే, తన స్వరూపమునందు ఎట్టి

వికారములేక, రుజ్జువునందు సర్పప్రతీతి అయినట్లు జగజ్జీవేశ్వర ప్రతీతి ఆయినదని చెప్పబడినది. మరిన్ని నిమిత్త,ఉపాదానా,అభిన్న నిమిత్తో పాదనాది కారణములలో ఏకారణము అయివున్నదని చెప్పబడినా కార్యాత్పూర్యం కేవలం కారణరూపముగా వుండబడిన స్థితి యొకటి. కార్యోత్పత్తనంతరం గలస్థితి యెకటి. కార్యమునకు పూర్వం కార్యము బీజరూపముగా కారణమునందుడనేయున్నది. కార్యానంతరం కార్యమునందు కారణము వ్యాపకమై, అనువృత్తమై, లేక ఓతప్రోతమైయున్నది, కాని యిక్కడ చిత్రమేమంటే కార్యరూప వస్తువునందు అంతరముగా మాత్రమేగాక బాహ్యము నందుగూడ కారణమైన వస్తువు వుంటూయున్నది. ఈ విధముగా బ్రహ్మాండమునకు బాహ్యం తరములయందు బ్రహ్మపదార్థమున్నది. అంతరమునందున్న దానికి అంతర్యామి లేక సూత్రాత్మ యనీ, బాహ్యమందున్నదానికి పరబ్రహ్మమనీ పేర్లు పెట్టబడినవి. అనగా సృష్ట్యనంతర పరిస్థితుల యందు, అనగా నేనున్నప్పుడు నాకు తోచుచున్న యీ బ్రహ్మాండ మున్నపుడూగూడ నాయందూ బ్రహ్మాండమందూ మాత్రమేగాక నాకూ బ్రహ్మాండమునకూ అతీతముగనున్న పరబ్రహ్మమే యీ శ్లోకమునందు 'పరబ్రహ్మ' అని అభివర్ణింపబడినది. ఇదియే నేతి నేతి, అనగా న+ఇతి=నేతి కనుక, యిది కాదిది కాదని నామరూపాత్మకముగనున్న సర్వము నిషేధించిన పిమ్మట శేషించినదే పరబ్రహ్మయని చెప్పబడినది. దీనినే

సీ॥ అష్టతనువులుగా వష్టాత్మలునుగావు
అష్టాంగ యోగాది నిష్ఠగావు
అష్టమూర్తులుగావు, అష్టపురంబులు
గా వష్ట మదములుగావు నీవు
అష్టాబ్జములుగావు యష్టపాశంబులు
యష్టస్థలంబులు సరియగావు
దశరంధ్రములుగావు రవనాడులును గావు
దశవాయు గుణసమూహములుగావు

తే॥గీ॥ పంచశక్తులుగా వాది ప్రకృతి గావు
సర్వ చైతన్య పరిపూర్ణ సాక్షివీవు ॥రమ్య॥ అని,

సర్వ నిషేధాత్మకముగ యీ జీవేశ్వర జగన్నాటకమునకు విలక్షణముగానున్న సాక్షిస్వరూపమని శ్రీ పరశురామ నరసింహదాసుగారు దానిని అభివర్ణించి యున్నారు.
శ్రుతి : "సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్" అనీ, శ్రుతి, "అస దేవ సౌమ్యేద మగ్ర ఆసీత్"అనీ, సృష్టికి పూర్వము వున్నదేది "సత్" అనీ, "అసత్" అనీ ద్వయస్వరూపముగా వర్ణింపబడినదేదో అదే పరబ్రహ్మము లేక పరంబ్రహ్మము. అదియే మంగళప్రదము, శుభప్రదము, సర్వసంపత్కర మూనై యున్నది. అంతేగాదు. సర్వ మంగళములకు శుభములకు సంపదలకు నదియే ఆధారములేక అధిష్ఠానముగాను కారణ స్వరూపముగానూ యున్నది. కనుకనే దానిని "సత్యం" శివం, సుందరం" అన్నారు. "తమేవ భాంత మనుభాతి సర్వం, తస్య భాసా సర్వ మిదం విభాతి"అని ముండకోపనిషత్ అది యుండబట్టియే యీ విశ్వమింత సుందరముగా సౌష్టవముగా ఆనందజనకముగానున్నది. లేనిచో జడమని చెప్పబడే యీ విశ్వ ప్రకృతికీ సౌందర్య

మొక్కడిది? ఈ ప్రకృతి సౌందర్యమును జూచి ముగ్ధులై గదా కావ్యగానము చేయువారు కొందరు, చిత్రకల్పన చేయువారు కొందరు. శరీరమునే మరచినవారు కొందరు యుగయుగాంతరముల నుంచి గానవస్తూనే యున్నారు.

సర్వ శృంగారములు దానివే. యే వస్తువునందు యెట్టి శృంగార సౌందర్యములు గానవచ్చిననూ. అవి అన్నియు ఆపర బ్రహ్మలక్షణములే. వానిని గుర్తెరుగు నీ జ్ఞానమున్ను ఆ బ్రహ్మ సంబంధమే. ఆ బ్రహ్మము అఖండ చిద్ఘన స్వరూపము గదా! అట్లే నీకు కలుగు శబ్ద స్పర్శ రూపరస గంధాత్మకమగు విషయానందముగూడ ఆ బ్రహ్మానంద సాగరమునందలి అవలేశమే. అందుచేతనే ఆ బ్రహ్మమును ఆనంద ఘనమున్నూ అన్నారు. ఆ బ్రహ్మమునే, "సత్యంజ్ఞానమ నంతం బ్రహ్మ" నిత్యం విజ్ఞాన మానందం బ్రహ్మ" అని శ్రుతులు వర్ణించినవి. ఇది అంతయు శ్రీమత్ అను మాటచే శ్లోకమునందు సూచింపబడినది.

ఈ పరబ్రహ్మమే నిర్గుణముగానూ సగుణముగాను యున్న, సద్గురుతత్త్వమైయున్నది. కనుక గురు భక్తునికి సర్వమూ గురుస్వరూపమే. "గురో రన్యం న కించన" అనగా గురువు నకన్యముగా ఏమీ లేదు. కనుకనే "గురుస్సాక్షాత్ పరబ్రహ్మ" యనిచెప్పబడినది. గురుతత్వమును ఆ విధంగా నిర్గుణ స్వరూపములోగూడ గుర్తించిన శిష్యుడు గురూపాసన యెట్లు చేయవలెను? అన్న విషయాన్ని ఈ గురుగీతా శ్లోకము చక్కగా వివరించుచున్నది. ఉపాసకుడైన తాను, ఉపాస్యమైన యా పరబ్రహ్మతత్త్వమును అన్యమెరుగని నిష్ఠతో అనగా అనన్యభక్తిచే ఉపాసించును. దానినే స్మరించును. దానినే భజించును. దానినే స్తుతించును లేక దానిని గూర్చియే మాటలాడును. దానికే నమస్కరించును. యిట్లు త్రికరణములచే అనగా మనోవాక్కాయములనేక బాటను నడిపించును. నవవిధభక్తులని చెప్పబడే "శ్రవణం, కీర్తనం, స్మరణం, విష్ణోః పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం సఖ్య, మాత్మనివేదనం" అనువానిలో ముఖ్యముగా 1) స్మరణ 2) కీర్తన 3) అర్చన 4) ఆత్మనివేదన అనునవి గైకొనబడినవి కనుక 1) నామనస్సుచే గురుతత్వమును "స్మరామి" స్మరించుచున్నాను. 2) నావాక్కుచే "వదామి" కీర్తించుచున్నాను. లేక ఆ గురుతత్వమును గూర్చి మాటలాడుచున్నాను. 3) నా శరీరముచే "భజామి" భజించుచున్నాను. లేక అర్చించుచున్నాను. 4) "నమామి" ప్రపత్తి లక్షణముచే శరణాగతిచేసి, ఆత్మనివేదనము గావించుచు నమస్కరించు చున్నాను అని త్రికరణశుద్ధిగా సర్వాత్మనా శిష్యుడు అనన్య భక్తిచేతను ప్రపత్తి భావముచేతను గురుతత్వమును ఉపాసించు చున్నాడు.

కాని సగుణరూపంలో తప్ప యుపాసన సాధ్యముకాదు. "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి" బ్రహ్మము నెరిగిన తన గురువు రూపుదాల్చిన యా పరబ్రహ్మమే. "యాదృశీ భావనా యత్ర తాదృశీ భవతి నిశ్చయం" అనగా దృఢభావన ఫలించక తప్పదు అని గుర్తెరిగి, గురుతత్వమైన యా పరబ్రహ్మమును సగుణరూపములో తన గురువునందే చూచుకొని భక్తుడుపాసన చేయుచున్నాడు.

శ్లో॥ బ్రహ్మానందం, పరమ సుఖదం కేవలం, జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం, గగనసదృశం, తత్వమస్యాదిలక్ష్యం
ఏకం, నిత్యం. విమలమచలం, సర్వధీసాక్షిభూతం
భావాతీతం, త్రిగుణరహితం, సద్గురుం తం నమామి॥

తాత్పర్యం : బ్రహ్మానందమే స్వరూపంగా గలదియును, శ్రేష్ఠమైన సుఖమును ప్రసాదించునది యును, సర్వమూ తానే కనుక అది తప్ప రెండవది లేనిదియును అనగా కేవలము జ్ఞానమే రూపముగా గలదియును, ద్వంద్వములకు అతీతమైనదియును "తత్వమసి" మొదలగు మహావాక్యములకు లక్ష్యార్థమైన ప్రత్యక్బ్రహ్మైక్యమగునదియును, మలినరహితమైనదియును, కదలిక లేనిదియును, సమస్తమైన బుద్ధివృత్తులకువేరై సాక్షిరూపంగానున్నదియును భావమునకందనిదియును, సత్వ రజస్తమస్సులను గుణములు ప్రకాశింపని స్థితిలో నున్నదియును అగు గురుస్వరూపమునకు నమస్కరించుచున్నాను.

విశేష వివరణము : 1) బ్రహ్మానందం : తీపియందు యెన్నో తారతమ్యములున్నను, తీపి అను రుచి ఏకముగానే చెప్పబడినట్లు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధరూపములుగా ఆనంద మెన్నియో విధములుగా నున్నను అంతయూ ఆనందముగానే చెప్పబడుచున్నది. ఐననూ బ్రహ్మానందమనీ, విషయానందమనీ రెండు విధములుగా విభజింపవచ్చును. జ్ఞానేంద్రియములచే విషయ పంచకము నెరిగి, అంతరింద్రియములచే నానందించుట విషయానందము. అనగా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను అనుభవించునపుడు కలిగిన ఆనందము. ఇది ఆ క్షణమందే తప్ప తదనంతరము నిలువనిది, కనుకనే క్షణికము. ఒక మితిని అతిక్రమించిన యిది దుఃఖమును కలిగించును. దుఃఖసమిశ్రితముగాని విషయానందము లేదు. ఉదా॥ గారెలు కమ్మగా నున్నవిగదాయని మరిరెండు తింటే కడుపునొప్పి కలుగును. కనుక, క్షణికం, అల్పం, దుఃఖ సంమిశ్రితం, అయి వున్నది. మరియు అనుభవించినకొలదీ ఆశను పెంచునుగాని విషయములయందు వైరాగ్యమును కలిగించదు.

శ్లో॥ నజాతు కామః కామానా ముప్త భోగేన శామ్యతి
హవిషా కృష్ణవర్త్మేవ భూయయేవాభివర్ధతే॥

తాత్పర్యం : ఎంత నెయ్యిపోసినా అగ్ని చల్లారనట్లు కామము భోగించుటవలన శాంతి చెందదు సరిగదా కోరికను పెంపేచేయును. విషయానందము పశుపక్ష్యాదులకున్ను మానవులకున్ను సమానమే అయినా, మానవులు విషయానందమును తమ విజ్ఞానముచే ఎన్నో రెట్లు పెంచుకొని, సుఖ సాధనములను మరీ మరీ వృద్ధిచేసుకొని ఉత్తరోత్తర సుఖానుభూతికై ప్రాకులాడుచూ విషయలంపటులై తమ శక్తి సామర్థ్యములను దుర్వినియోగము చేసుకొనుచున్నారు. పశువుల ఆనందము కంటె మానవుల యానందము గొప్పదిగా తోచుచున్నట్లే మనుష్యుల ఆనందము కంటె, గంధర్వుల యొక్కయు, దేవతలయొక్కయు ఆనందము ఉత్తరోత్రా అధికాధికముగా నున్నట్లు అభివర్ణింపబడినది. కనుకనే ఆయా లోకభ్రాంతిచే యజ్ఞయాగాదులు గావించు చున్నారు. స్వర్గాది భోగము లాసించుచున్నారు. ఈ స్వర్గాదులయందు కల్గునని ఆసించే సుఖమునకే ఆముష్మిక సుఖమని పేరు. ఐహికాముష్మిక సుఖములలో యేదిన్ని బ్రహ్మానంద సుఖముగాదు. కనుకనే "యిహామూత్రార్థఫలభోగవిరాగం" అధికారి లక్షణంగా నిర్ణయించినారు. బ్రహ్మానందమనగా పరబ్రహ్మ సంబంధమగు ఆనందమే గాని చతుర్ముఖ బ్రహ్మసంబంధము గాదని గుర్తెరుగవలెను. "బృంహి" వృద్ధౌ అను ధాతువునుండి బ్రహ్మశబ్దముత్పత్తి బ్రహ్మమనగా అత్యంత పెద్ద వస్తువు. సత్తు, చిత్తు, ఆనందములే యా బ్రహ్మమునకు స్వరూపలక్షణముగా చెప్పబడినవి. "సత్యజ్ఞానమనంతం బ్రహ్మ" అనీ, "నిత్యం విజ్ఞాన మానందం బ్రహ్మ" యనీ

శ్రుతులు దానిని అభివర్ణిస్తున్నాయి. ఆ బ్రహ్మము ఎంతగొప్పదో ఎంత శాశ్వతమో దాని స్వరూప లక్షణమగు ఆనందముకూడ అంతగొప్పదే. అంత శాశ్వతమైనదే. బ్రహ్మానందమున ఆనందము పరాకాష్ఠ వహించుటచే యిక అంతకంటే కోరదగిన అధికానందములేదు. అదే రసస్వరూపము. శ్రుతి : "రసోవసః రసగ్గ్ హ్యేవాయంలబ్ధ్వానందీభవతి" (తైత్తి, ఆనందపల్లి) విషయానందముగూడ నందయామె, ఆనందమే రూపంగాగల బ్రహ్మముపంచతన్మాత్రరూపంగా పరిణమించి విషయా నందమునకు కారణరూపముగానున్నది. బ్రహ్మానంద మొక సాగరమైతే విషయానంద మందొక బిందుప్రమాణమని చెప్పవచ్చును. జ్ఞానేంద్రియ పంచకముచే విషయములను గుర్తించుటవలన గాక, కేవలము అంతరేంద్రియ వ్యవహారముతో ఆ బ్రహ్మానందము యొక్క అనుభవమును ఆస్వాదించ వచ్చును.

ఉదా: సగుణరూపంలో ఆ బ్రహ్మమును విష్ణువుగానుపాసించు ప్రహ్లాదుడన్నట్లుగా బమ్మెర పోతనగారు భాగవతమున,సీ॥ మందార మకరంద మాధుర్యమును గ్రోలు మధుపంబు వోవునే మదనములకు" అని ప్రారభించి, గీ॥ అంబుజోదరదివ్య, పాదారవింద॥ చింతనామృతపాన విశేషమత్త చిత్తమేరీతి నితరంబు జేరనేర్చు, వినుతగుణశీల, మాటలు వేయునేల? అన్నారు. విష్ణుదేవుని విమలపద చింతనముచే హృదయము ద్రవీభూతమై, రసోత్పత్తికాగా, ఆ ఆనంద రసముద్రావి, ద్రావి మత్తెక్కినచిత్తములు, యితర విషయానందములను కోరగలదా? అదే విధముగా నిర్విషయ స్వరూపము చెందిన మనస్సు బ్రహ్మాకారముకాగా జనించు బ్రహ్మానంద రసమును చవిజూచిన జ్ఞానియు, విషయానందములకై ప్రాకులాడడు గురుతత్వము అట్టి బ్రహ్మానందస్వరూపమైనది అని భావము.

2) జ్ఞానమూర్తిం : బ్రహ్మము ఆనందరూపమేగాక అఖండమగు జ్ఞానస్వరూపంగూడనై యున్నది. సత్,చిత్ ఆనందములలో చిత్తనగా యీ అఖండజ్ఞానమునకే పేరు. అట్లే నిత్యం అని కూడా యీ శ్లోకములో గురుతత్వ మభివర్ణింపబడియున్నది. సత్ అనగా త్రికాలాబాధ్యం అనగా మూడుకాలముల యందునున్నది. నిత్యమన్నా సత్యమున్నా యిదే అర్థంలో ప్రతిపాదింపబడెను కనుక గురుస్వరూపము సల్లక్షణ, చిల్లక్షణ, ఆనంద లక్షణములుగల బ్రహ్మస్వరూపమే గాని అన్యముగాదు.

3) గగన సదృశం : అనగా ఆకాశమువంటిదని అర్థము. బ్రహ్మము లేక గురుస్వరూపము, ఆకాశమువలె, నిర్వికారం, నిస్సంగమూ, సర్వవ్యాపకమూ సూక్ష్మాతిసూక్ష్మమునై యున్నది. కనుక ప్రథమములో యీ దృష్టద్రాష్టాంతములయొక్క విశేషము వస్తునిశ్చయ పూర్వకముగా సమర్థులగు గురువులచే శిష్యులు చక్కగా గుర్తెరుగవలసియున్నది.

4) తత్వమస్యాధిలక్ష్యం : "తత్వమసి" అను మహా వాక్యమునకు లక్ష్యార్థమేమి? "తత్" అనగా పరమాత్మ లేక బ్రహ్మము "త్వం" అనగా ప్రత్యగాత్మ, యీ ప్రత్యగాత్మ పరమాత్మలకు నామ మాత్ర భేదమే, ఉపాధి భేదముచే యీ నామభేదం ప్రవర్తిల్లినది. అంతేగాని అంతయు అఖండ జ్ఞాన స్వరూపంగా ఏకమయ్యే వున్నది. యిదియే తత్వమస్యాది మహావాక్యముల లక్ష్యార్థము (యీ మహావాక్య విచారణ సంపూర్ణముగా నెరగోరువారు "పరిపూర్ణ దర్శన" గ్రంథము చూడవలెను)

5) అచలం : అనగా చలించనిది. ఎట్టి కదలిక లేనిది అని అర్థము పరబ్రహ్మమునకు సృష్టికి పూర్వ మెట్టి చలనమునులేదు. బాహ్యమున గానవచ్చు వస్తుస్థితియందు గలుగు

కదలికమాత్రమే చలనముకాదు. అంతరమునందలి మార్పుకూడా చలనమే. నిస్సంకల్పస్థితిలో నున్న బ్రహ్మమునకు సంకల్పము గలుగుట కూడా చలనమే. 'కీ' లేని గడియారమునందెట్టి చలనమూలేదు. కాని ఒక మెయిన్ స్ప్రింగుకు, 'కీ' యిస్తే అంతా చలనమే, మరియు స్థితికల్గియున్న ప్రతిదానికి గతి (చలనము) యున్నాయుండును. గతి లేనప్పుడు స్థితి, స్థితి లేనప్పుడు గతి. బ్రహ్మమునకుగూడ ఈ స్థితీ, గతి, అను ద్వంద్వములున్నవి. యిందు ఆ బ్రహ్మము యొక్క స్థితి లక్షణములు పేర్కొనబడినవి. కనుక 'అచల' మని వర్ణించినా 'పూర్ణ' మని వర్ణించినా యిది కేవలాచలముగాదు. "పూర్ణ మదః పూర్ణ మిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే, పూర్ణస్యపూర్ణమాదాయ పూర్ణమేవా వశిష్యతే" అని శ్రుతి వర్ణించినదానియందు పూర్ణమేవా వశిష్యతే అని అవశిష్య రూపంగా నుండే పరిపూర్ణ పరబ్రహ్మంగాదని తెలియవలెను. కనుక చలాచలములు రెండూ యెరుకే. సాపేక్షికమైయున్న శబ్దములే. కనుక పరిపూర్ణమునుగురించి చెప్పజాలవు.

6) సర్వధీసాక్షిభూతం : "ధీ" యనగా బుద్ధి, శరీరమున అత్యంత సూక్ష్మమై అంతరాంతముగానున్న బుద్ధి వృత్తులచే వికారము పొందక, (సూర్యుడు తన వెలుగులో జరుగు సకలవ్యవహారములతోనూ సంబంధపడక, "కర్మసాక్షి" అను సార్థకనామమెట్లు పొందెనో) బుద్ధి వ్యాపారమునకు సాక్షిగా గురుతత్వమున్నది అని చెప్పబడినది. అంటే గురుతత్వము ప్రత్యగాత్మ రూపముగా దేహమునందున్నది. మరియు బ్రహ్మాండమున అష్ట ప్రకృతులలో నొకటగు సమిష్టి బుద్ధి తత్వముచే వికారముపొందక సృష్టి స్థితి లయ విస్తీర్ణ ఆకర్షణాది సకల బ్రహ్మాండ వ్యాపారమునకు గూడ సాక్షిగానున్న తత్వమే అనగా పరమాత్మయే గురుతత్వముగా నున్నదని తెలియవలెను.

7) భావాతీతం : భావములన్నియు, యింద్రియ రూపముగా నున్న మనస్సునకు సంబంధించినవే. యింద్రియరూపమగు మనస్సునకు, ఆధిభౌతికము సంకల్ప వికల్పములు. యిట్టి సంకల్ప వికల్పాత్మకమగు మనస్సుచే పరమాత్మతత్వము లేక గురుతత్వము తెలియబడ జాలదు. కాని నిరీంద్రియమై నిశ్చల రూపము వహించిన బుద్ధికి మాత్రం గోచరమైయున్నది. "ఏషు భూతేషు సర్వేషు గూఢాత్మానః ప్రకాశతే. దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః" యనగా సర్వభూత వినిర్ముక్తమైన లేక నిస్సంకల్పం చెందించిన మనస్సునకు గురుతత్వము అతీతమనరాదు. భావసహితముగా వ్యవహరించు మనస్సుచే మాత్రం తెలియ బడదు. గనుక భావాతీతమన్నారు. భావాభావముల రెంటిలో దేనిచేతనూ గుర్తింపరాని దొక్క పరిపూర్ణ పరబ్రహ్మమే.

8) త్రిగుణరహితం : పరమాత్మయందు త్రిగుణములున్నవా లేవా? అంటే బీజరూపము గానైనా యున్నవనే అనవలసియున్నది. త్రిగుణములు ప్రకటముగాని స్థితిమాత్ర మన జెల్లును. త్రిగుణములు అత్యంతశూన్యమై లేశమైన లేనిదొక్క పరిపూర్ణపరబ్రహ్మమే.

కనుక యీ శ్లోకమునందు "అచలం" అనీ, "భావాతీతం" అనీ, "త్రిగుణరహిత" మనీ. గురుస్వ[illegible] ముభివర్ణింపబడినదంటే. పైన వివరించబడిన అర్థమునందేయని గ్రహించవలెనుగాని గురుస్వరూపమే పరిపూర్ణ పరబ్రహ్మమనరాదు. అది గురుస్వరూపముగాదు లఘుస్వరూపముగాదు. విభువూగాదు. అణువూ గాదు. ఏమనీ అనరానిదది. ఏకానేకములు కాదు. సంఖ్యకేరాదు. గురుస్వరూపమన్ననో, "ఏక మేవాఽ ద్వితీయం బ్రహ్మ అనీ. "ఏకం

అనేకం భవతి'' అనిగూడా చెప్పబడుచూ వున్నది. సర్వమూ తానె అయిసర్వ శబ్దములచే వర్ణింపదగినదై, పరమాత్మయేయగు గురుస్వరూపమునకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ శ్వేతాంబరం శ్వేతవిలేపపుష్పం
ముక్తావిభూషం ముదితద్వినేత్రం
వామాంక పీఠే స్థిత దివ్యశక్తిం
మందస్మితం పూర్ణ కృపానిధానం

శ్లో॥ ఆనంద మానందకరం ప్రసన్నం
జ్ఞానస్వరూపం నిజబోధయుక్తం
యోగీంద్ర మీడ్యం భవరోగవైద్యం
శ్రీ మద్గురుం నిత్యమహంనమామి

తాత్పర్యం : ఈ రెండు శ్లోకములను కలిపి చదువవలెను. ఏలననగా మొదటిశ్లోకములో గురుపరమాత్మ యొక్క అభివర్ణనము, రెండవ శ్లోకములో కూడా పొడగించబడి రెండవ శ్లోకములో మాత్రమే నమామి అను క్రియాపద మీయబడినది.

1) తెల్లని వస్త్రములును, తెల్లని మైపూతయు (చందనాదులు) తెల్లని పుష్పములును (తెల్లనివేయైన) మంచిముత్యములును, ధరించినవాడును, సంతోషముతో గూడిన ప్రకాశవంత మగు రెండు నేత్రములుగలవాడును, ఎడమ తొడపైన అర్ధాంగియగు దివ్య శక్తిని నిలుపుకొన్న వాడును, చిరునవ్వు వెన్నెల గురిపించువాడును, సంపూర్ణమైన కృపకు ఆలవాలమైన వాడును (కరుణా సముద్రుడును)

2) ఆనందమే స్వరూపముగా గలవాడును, యితరులందరకు ఆనందము కలిగించు వాడును, యెల్లపుడు విసుగు చిరాకు మొదలైనవి గానరాని ప్రసన్న వదనము గలవాడును జ్ఞానస్వరూపుడును, స్వస్వరూప జ్ఞానముతో భాసించువాడును, యోగీశ్వరేశ్వరుడును, అందరిచే ప్రస్తుతింపబడువాడును జనన మరణ రూప ఘోరసంసార వ్యాధిని నిర్మూలించు వైద్య శ్రేష్ఠుడగు శ్రీగురుపరమాత్మకు నిత్యము నేను నమస్కరించుచున్నాను.

విశేష వివరణములు : 1) శ్వేతాంబరం, శ్వేతవిలేపపుష్పం 2) వామాంకపీఠేస్థిత దివ్యశక్తిం 3) పూర్ణకృపానిధానం 4) ఆనంద మానందకరం 5) జ్ఞానస్వరూపం నిజబోధయుక్తం అనువాని వివరణము తెలిసికొందము.

1) శ్వేతాంబరం శ్వేతవిలేపపుష్పం = గురుమూర్తి ధరించిన వస్త్రములు, శరీరమునకు పూయబడిన గంధము, అలంకరించుకొన్న పుష్పములు అన్నియు తెల్లనివే. అంతేకాదు. ధరించిన ఆభరణములు మంచి ముత్యములతో గూడినవగుటచే అవియుతెల్లనివే. సంతోషముతో గూడిన నేత్రములు తెల్లతామరరేకులవలె ప్రకాశించునవి గనుక అవియు తెల్లనివే. ఎడమ తొడపై నాసీనమైయున్న శక్తి స్వరూపిణి దివ్యకాంతులతో వెలుగునది గనుక ఆమెయు తెల్లనిదే. ఆయన చిరునవ్వు వెన్నెల వెలుగులీనునది గనుక అదియును తెల్లనిదే. వేయేల మొత్తమాయనకు సంబంధించిన సర్వము శుభ్రవర్ణముతో ప్రకాశించు చున్నది. కనుక రాశీభూతమైన శుద్ధవర్ణమే ఆయన స్వరూపముగా గ్రహించవలెను.

2)వామాంక పీఠేస్థిత దివ్యశక్తిం = పరమాత్మ పురుషుడు. అతని శక్తియే ప్రకృతి.

అతని శ్రేష్ఠ ప్రకృతియే పరాప్రకృతిగా గీతయందు అభివర్ణింపబడినది. ఆ పరాప్రకృతియే దివ్యశక్తి. అది పరమాత్మకంటె భిన్నముకాదు. అగ్నియందున్న ఉష్ణశక్తి అగ్నికి వేరుగా లేనట్లేనని తెలియవలెను. ప్రకృతి పురుషులను సాకారములో ఉమామహేశ్వరులుగా వర్ణించినారు. ఏకరూపములో మహేశ్వరుడు అర్ధనారీశ్వరుడని కీర్తింపబడుచున్నాడు. అతనియందలి వామభాగము స్త్రీ (శక్తి) రూపము. దక్షిణ పార్శ్వము పురుషరూపము. వామాంక పీఠము అనునపుడు యెడమ తొడపైన అని అర్థమున్నను వామాంక మనగా యెడమ భాగము అను అర్థము గ్రహించుట లెస్స.

ఏ వర్ణమున్నను కన్నులకు గానవచ్చును. కాని పరమాత్మ గానరాడుగదా! కనుక పరమాత్మకు వర్ణమున్నట్లే చెప్పరాదు. కాని శ్వేతవర్ణము (తెలుపురంగు) సూర్యుని యందుగల సప్తవర్ణములలో లేదు. సూర్యుని కిరణమందుగల వర్ణములు వర్షానంతరము సూర్యుని కభిముఖంగా వాతావరణమందు నిలచిన నీటితుంపురులలో విశ్లేషింపబడి యింద్రధనుస్సు రూపములో కానవచ్చుచున్నవి. తెలుపు రంగు ఈ సప్త వర్ణములలో యేదీకాదు. ఈ సప్తవర్ణములే సూర్యుని రథమునకు బూన్చిన సప్తాశ్వములుగా అలంకారికముగా అభివర్ణితమైనవి. యీ ఏడు వర్ణములున్ను కండ్లకు గానవచ్చును. యీ సప్తవర్ణములు విశ్లేషింపబడినచో తిరిగి ఒకే కాంతి ఏర్పడును. ఈ కాంతియైనను తెల్లసున్నము వంటి లేక మల్లిపూవువంటి తెల్లరంగుకాదు. విశ్లేషింపబడని సూర్య కిరణపు కాంతికూడా పరమాత్మ యొక్క వర్ణముగా నిర్ణయింపరాదు. అది శుద్ధ స్ఫటిక సన్నిభము అని కొన్ని యెడల వర్ణింపబడినది. స్ఫటిక కాంతి కన్నులకు గానసగును. కాని యీ గురుపరమాత్మ యొక్క కాంతి కన్నులకు గానరానిది. అది యొక అలౌకికమగు దివ్యకాంతి, "మనసైవానుద్రష్టవ్యం" అనగా అది శుద్ధ మనస్సుచేతనే తెలియదగినది. సత్వగుణము కన్నులకు కానరానట్లే శుద్ధ సత్వగున లక్షణమైన యా తేజము (అనగా జ్ఞానము) చర్మ చక్షువులకే మాత్రము గోచరింపదు. కనుక మొదటి శ్లోకములో సూచింపబడిన శ్వేతవర్ణముయొక్క లక్ష్యార్థ రూపమగు యీ అలౌకిక తేజఃపుంజము ఏ వర్ణములూగాని దివ్యవర్ణముగా గుర్తింపనగును.

3) పూర్ణకృపానిధానం : అనగా ఏ లోపములేని నిండు కృపకు గనివంటివాడు. సూర్యుడు తన తేజము తన కిరణములద్వారా యెంతకాలము వెలుగు ప్రసారము చేయుచున్ననూ అతని కాంతి తరుగనట్లే. ఆ సూర్యుడెంత మండుంటెండలుగాచి సముద్ర జలములను ఆవిరి రూపములో పైకి తోడుకొన్నా సముద్రజలములెట్లు క్షీణించుట లేదో అట్లే గురుపరమాత్మ యొక్క కరుణ ప్రాణులపై యెంత ప్రసరించిననూ ప్రేమరాశియగు నాతని కరుణ యేమాత్రము క్షీణించదు. కనుకనే అతడవ్యయుడని అన్వర్థనామము పొందినాడు ఆ ప్రేమ అవ్యయము, అనంతము, అక్షయము, ఎంతకృప (కరుణ లేక దయ) భక్తులు దానినుండి స్వీకరించుచున్నా అది నిండుగానే వుండును. కనుకనే "ప్రేయమిత్యుపాసీత" అనగా ఆ పరమాత్మను ప్రేమస్వరూపునిగా నారాధించుమని శ్రుతి యాదేశించుచున్నది.

కుంటి, గ్రుడ్డి మొదలగు బిచ్చగాండ్రకు ఒక్కపైసా యిచ్చినా అదియును దయకు చిహ్నమే కావచ్చును. ధనాధిపతియగు కుబేరుని ఐశ్వర్యమునకుగూడ యొకానొక పరిమితి యుండవచ్చును. కాని గురు పరమాత్మయొక్క కృపాధనమునకు పారములేదు. అది అపారము. ఎవ్వరూ నీయలేని పూర్ణఫలమైన మోక్షముగూడ నాతడొసంగగలడు. తనస్వరూప సాక్షాత్కార

మునే గల్గించి తనలోనే చేర్చుకొనగలుగును. ఇదియే పూర్ణకృపాలక్షణము. అట్టి పూర్ణకృప గురుమూర్తియందే సాధ్యము. కనుకనే అతడు కృపాపీయూష సింధువుగా అభివర్ణింపబడినాడు. ఇట్టి కృప అనన్యము.

4) ఆనందమానందకరం : అనగా గురుమూర్తి ఆనంద స్వరూపుడు. మరియు ఆ ఆనందమును యితరులకు కల్గింపగలవాడునూ అయివున్నాడు. ఆనంద మనగా సుఖము లేక సంతోషము అని సామాన్యార్థములు. సుఖమునకు దుఃఖము, సంతోషమునకు విచారము ప్రతి యోగి రూపమగు వ్యతిరేకార్థములై యున్నట్లు ఆనందమునకు వ్యతిరేకార్థ రూపమగు శబ్దము గానరాదు. జీవుల దుఃఖములకు అతడు సాక్షిగానున్ననూ అతడు దుఃఖలేశము పొందడు. నాటక సూత్రధారి పాత్ర లభినయించు దుఃఖాభినయమువల్ల వికలత నొందడు సరిగదా బాగా అభినయించినారని సంతోషించునట్లే పరమాత్మ జీవులు దుఃఖాక్రాంతులై యున్నపుడు గూడ అతని ఆనంద లక్షణమునకు యెట్టి మార్పును యుండదు. ఏలననగా, సత్, చిత్, ఆనందలక్షణములు పరమాత్మకు స్వరూపలక్షణమైయున్నవి. అనృత, జడ, దుఃఖములు జీవేశ్వర జగద్రూపములయందు గానవచ్చుచున్నవి. సచ్చిదానందములు (అస్తి భాతి ప్రియములు) సకలమునందూ లేశరూపముగా వున్నవి. వుండక తప్పదు. ఏలననగా "ఏకం అనేకం భవతి" అనే న్యాయముగా "ఏకేమేవా ద్వితీయం బ్రహ్మ" యగు నా పరమాత్మయే అనేకముగా అయినాడు కనుక ఆయన సచ్చిదానంద లక్షణములు సృష్టియందు సర్వేసర్వత్ర అంశరూపములనైనా యుండక తప్పదు. కాని ఆయన ఆనందము అనంతము, "నిత్యం విజ్ఞానమానందం బ్రహ్మ" యనియు "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అనియు శ్రుతులు వర్ణించు చున్నవి. యీ రెండు శ్రుతులలోను 1) నిత్యము, సత్యమున్ను 2) విజ్ఞానము - జ్ఞానమున్ను 3) ఆనందము - అనంతమున్ను అయివున్నవన్నమాట. కనుక పరమాత్మ యొక్క ఆనందము అనంతమున్ను సర్వానందముల కన్నను యెన్నోరెట్లు విశేషాధిక్యతకలదిన్ని అయివున్నది. స్వరూపము చేతనే సహజముగా యిట్లానందమయుడుగా నుండటయేగాక పరమాత్మ ఆ విలక్షణానందమును నిజభక్తులకు ప్రసాదించగలిగిన వాడున్ను అయివున్నాడు. స్వరూప సాక్షాత్కారము పొందినవారు ఆ గురుపరమాత్మవలె తామున్ను ఆనంద స్వరూపులే అగుచున్నారు. కనుక గురుపరమాత్మ ఆనందమయుడేగాక ఆనందకరుడు అని గూడ వర్ణింపబడినాడు.

5) జ్ఞానస్వరూపం, నిజబోధయుక్తం : పైన సూచించినట్లు జ్ఞానముకూడ పరమాత్మకు స్వరూపలక్షణమే అయి వున్నది. యీ జ్ఞానము జీవోపాధులయందలి జ్ఞానమువలె పరిమితమైనది కాదు. పరమాత్మయందలి యీ చిల్లక్షణము అపరిమితము, అనంతము, అఖండము. కనుకనే జీవులు కించిజ్ఞులు. పరమాత్మ సర్వజ్ఞుడు. నిజబోధయుక్తం అనగా తన సహజ జ్ఞానమును మెలకువలోనే యుంటూ తన స్వరూప స్థితిని మరువకుండా యుండువాడు అనిఅర్థము.

కాని సృష్టికి పూర్వము నేనను అహం స్ఫురణయే ఆ పరమాత్మకు లేదు. నేను బ్రహ్మముననే అఖండ జ్ఞానమున్నూ లేదు. స్థాణురూపముగా అచల స్థితిలో నుండెను. "శుద్ధే సుషుప్తి దృష్టాంతం" అనే న్యాయముగా గాఢ సుషుప్తిలోనున్నట్లు మరుపురూపములో నుండెను. అపుడు నిజబోధయుక్తుడై లేడు. సృష్టి సంకల్పముతో మేల్కొని యెరుక రూపుడై, తిరిగి సర్వప్రళయ పర్యంతమూ మాత్రమే ఆ మేల్కయందుండెను. ప్రళయాది పునఃసృష్టి పర్యంతమూ

యా పరమాత్మకు స్వరూప విస్మృతి యున్నదని చెప్పక తప్పదు. "ఉపాసకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా" అనే న్యాయముగా సాకారరూపము వహించి నిజబోధయుక్తుడై శిష్యోద్ధరణకావించు సగుణ రూపుడగు గురుపరమాత్మకు నిత్యమూ నమస్కరించుచున్నాను.

శ్లో॥ హృదయాంబుజే కర్ణికమధ్యసంస్థం
సింహాసనే సంస్థిత దివ్యమూర్తిం
ధ్యాయేద్గురుం చంద్రకళా ప్రకాశం
సచ్చిత్సుఖాభీష్టవరంధానం

తాత్పర్యం : హృదయపద్మమునందలి దుద్దు మధ్యభాగమున నున్న సింహాసనమందు ప్రకాశరూపుడై ఆహ్లాదకరమగు చల్లని వెన్నెల వెలుగులు విరజిమ్మువాడును, యీప్సితార్థము లను, సచ్చిదానంద రూపమగు స్వస్వరూప సాక్షాత్కారమును యొసంగువాడును, అగు సద్గురు పరమాత్మను ధ్యానించవలెను.

విశేష వివరణం : 1) హృదయ పద్మము 2) సింహాసనము 3) చంద్రకళాప్రకాశము 4) సచ్చిత్సుఖాభీష్టవరందధానం అను నాలుగు విషయములను వివరించి తెలుసుకోదగును.

1) హృదయాంబుజ మనగా హృదయమనే పద్మము. దీని స్థానస్వరూపస్వభావములు నిర్ణయించుటలో భేదాభిప్రాయములు కలవు. కొందరు హృదయ మనగా వక్షస్థలమున ఎడమభాగములోనున్న గుండెకాయయని చెప్పెదరు. అగుచో ఇది స్థూలరూపమైన మాంస పిండమై సంకోచవికాసములు చెందుటలో స్పందన ధ్వనులు, చేయుచూ స్థూల శరీరమందు ప్రాణవాయు సంచారమునకును రక్తశుద్ధికిని తోడ్పడుచున్నది. ఈ గుండె కొట్టుకొనుట ఆగినచో మానవుడు మరణించినట్లు. హృదయం స్థూలనేత్రములకు గానవచ్చునదిగాదు. వక్షస్థలమున కుడిభాగమున హృదయము కలదు. అచటనే సకల వృత్తులు జనించుచున్నవి. అదియే అంతఃకరణకు స్థానము, అదియే చిత్తాకాశమని హృదయాకాశమని పిలువబడుచున్నది. యిదియును హృదయ కమలము అను పేర ప్రవర్తించుచున్నది. ఇది విషయ గ్రహణచేయుట కనుకూలముగ అధోముఖమైయున్నది. దీని నాశ్రయించుకొనియే బుద్ధి సంచరించును. ఇది సకల వాసనలకు ఆశ్రయమై సుషుప్తిలో అజ్ఞానరూపంచెందుచూ జాగ్రతలో అంతఃకరణ వ్యాపారములన్నియు జరుపుచుండును. ఐతే అంతఃకరణము జడముగదా! దీనిని ప్రవర్తింప చేయుచేతనమేది? ఆత్మప్రకాశము. యీ హృదయమునందు చేరుట వలన యిది చైతన్యవంతమగుచున్నది. యీ హృదయ ప్రదేశమున వ్యవహారముచేయు చేతనము జీవేశ్వర భేదముచే రెండు విధములు. అంతఃకరణముతో కూడి పనిచేసే ఆత్మప్రకాశము జీవుడనియు ఆ అంతఃకరణము నధిష్టించి విలక్షణముగానుండి పనిచేయించునదీ సాక్షియనియు కూటస్థుడనియు ఈశ్వరుడనియు పేర్లు.అందుచే భగవద్గీత

"ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశేర్జునతిష్ఠతి।
భావయన్ సర్వభూతానాం యంత్రారూఢాని మాయయా"

అని చెప్పబడుచున్నది. వేదాంత పరిభాషలో అంతఃకరణ విశిష్టచేతనము. ఉపహితచేతనము అనుశబ్దములచేతను క్షర అక్షర నామముల చేతను యీచేతనమును వాడినారు.

కాని యీ చేతనము (లేక ఆత్మప్రకాశము) నకు మూలస్థానమేది? శ్రీకృష్ణదేశికేంద్రుల

వాడు యీ హృదయ పద్మమునకు యిచ్చిన నిర్వచనము చూడనగును.

కం॥ వన్నియలై దొకచోటను
పన్నుగ గలసినది హృదయపద్మంబనుచున్
యెన్నుదురు జనులు ఎరుకం
దున్నాదని శ్రుతులు బల్కుచున్నవి సుమ్మీ॥

అన్నారు కందార్థములో.

కనుక ఎచట పంచవర్ణములు కలసివుండునో, అదియే హృదయ పద్మమని ఎరుకకు అదియే స్థానమనిన్ని భావము. పిండాండ విచారణ మాత్రమేచేయు అల్పబోధ పరాయణులు. ఎరుపు. తెలుపు. నలుపు. ధూమ్రము సునీలము అను పంచవర్ణములుగల నేత్ర స్థానమే యెరుకకు స్థానమని నిర్ణయించుకొనుచున్నారు. తల్లి గర్భములో పిండోత్పత్తికి పూర్వమునందునూ, శరీరనాశనంతరమున్ను స్థూలరూపమగు నేత్ర మెక్కడ నున్నది. లేనిచో యెరుక యెక్కడ వున్నది? లేనేలేదు. లేదని యంటే యెరుక రాహిత్యము కొరకు కృషి సలుపనేల? కనుక పిండాండమందలి నేత్రస్థానమే హృదయము. అదే ఎరుకకు స్థానము అనే మాటకు విలువలేదు. మరిన్ని నేత్రస్థానమందు దోచు రంగులు ప్రతిఫలించిన రంగులే అనిచెప్పనొప్పును. పిల్లలు యెండలో అద్దముపట్టి ఆ సూర్యప్రకాశమును ప్రక్కనున్న గోడమీద అనునట్లు చేసినవిధముగానే సహస్రారమందుగల ఆత్మప్రకాశమే వక్షస్థలమందువున్న హృదయమునందలి అద్దమువంటి అంతఃకరణమందు ప్రతిఫలించగా దాని ప్రతిబింబము నేత్రస్థానమందు పడి రంగులుగా గొచరించును కనుక సహస్రారమే హృదయస్థానమని మరికొందరందురు. కనుక యీ మూడు రీతులలో నిర్ణయించిన స్థానములలో నిజమైన హృదయ స్థానమేదియో విచారించనగును. ఆధార స్వాధిష్ఠాన మణిపూరక అనాహత విశుద్ధ అజ్ఞేయ సహస్రార చక్రములలో వరుసగా, గణపతి, బ్రహ్మ, విష్ణు, రుద్ర, యీశ్వర, సదాశివ, జీవ సద్గురువులుగా ఆదిదేవతలు నిర్ణయింపబడినారు. కనుక పిండాండమందు సహస్రారమే గురుస్థానము శరీరోపాధులను, అందలి యింద్రియములను ఆయా యింద్రియాధిష్టాన దేవతలను పరమాత్మ సృష్టించి పిమ్మట జీవరూపముగా తానే ఆ శరీరము లందు ప్రవేశింప గోరెను. కాని శరీరమందలి నవద్వారముల యందునూ యింద్రియాధిష్టాన దేవతలు నివాసమేర్పరచుకొని యున్నందున సహస్రారకమలము యొక్క స్థానమగు బ్రహ్మరంధ్రము నుండియే గురుపరమాత్మ శరీరమున ప్రవేశించి సహస్రారమున నివాసమేర్పరచుకొనెను అని యుపనిషత్ప్రవచనము. మరియును హఠయోగ పద్ధతులచే కుండలినీభేదన మొనరించి సహస్రార స్థానమందున్న పరమాత్మతో చేర్చినపుడే సమాధి సిద్ధించుచున్నది. మరిన్ని ప్రత్యగాత్మ స్థానము మూర్ధ్నియని నిర్ణయము గదా! కనుక అంతఃకరణకు స్థానమైన వక్షస్థలము నందుచెప్పబడిన హృదయము చిదాభాసులగు జీవేశ్వరులకు స్థానము మాత్రమేగాని గురుపరమాత్మకు స్థానము గాదు. కనుక పిండాండమందు సహస్రార పద్మమే హృదయ పద్మము అని చెప్పనగును. పరమాత్మ ప్రకాశము శరీరమంతట వ్యాపకమగుటలో అంతఃకరణ స్థానమున ప్రతిఫలితమై పరావర్తముచెంది నేత్రస్థానమున గానవచ్చుచున్నది అని గుర్తించవలెను. ఐతే యీ శరీరము సహితము ఒకపుడు లేదు గదా! మరియు నొకప్పు డుండదుగదా! అప్పుడీ గురుపరమాత్మకు స్థానమేది యను శంక యుదయించుట సహజమే. అపుడది బ్రహ్మాండమునందునూ బ్రహ్మాండోత్పత్తికి పూర్వము అధిష్టాన పరబ్రహ్మస్థానమునందును

యే విధముగానున్నదీ గురుముఖతః తెలుసుకొనవలెను.

2) సింహాసనం : "ఊర్ధ్వామ్నాయ గురోఃపదం, త్రిభువనోంకారాఖ్యసింహాసనం" అనీ "సహస్రపత్రకమలే లుప్తాక్షరేమంటపే" అనీ గురుగీత అన్యత్రా వర్ణించుచున్నది. కనుక సహస్రార పద్మమందు అక్షర సముదాయము కూడ తననుంచి యుత్పత్తి చెందక పూర్వము ఓంకారమనే సింహాసనము నధిష్టించి గురుమూర్తి వృప విష్టుడైయున్నట్లు భావించి గురుమూర్తిని ధ్యానించవలసియున్నది.

3) చంద్రకళా ప్రకాశం : అనగా గురుమూర్తి చూచెడివారి హృదయములకు ఆహ్లాదమును గలిగించెడి ప్రసన్న వదనాబ్జముగలవాడు అని తాత్పర్యము. అయితే చంద్రుడు షోడశ కళాప్రపూర్ణుడని చెప్పబడుచున్నది. ఆ షోడశ కళ లేవనగా

శ్లో॥ అమృతా, మానదా, పూషా, తుష్టిః, పుష్టీ, రతి, ర్ధృతిః
శశినీ, చంద్రికా, కాంతి ర్జ్యోత్స్నా శ్రీః ప్రీతి, రంగదా
పూర్ణా, పూర్ణామృతా, కామదాయిన్యః, స్వరజాః కలాః"

యీ అన్ని కళలు మనస్సును ఆహ్లాదపరచెడివే.

4) సత్,చిత్, సుఖ, అభీష్టవరందధానం (ప్రదానం అని పాఠాంతరము) : గురుపరమాత్మ సచ్చిదానందమయుడు, కనుక తన స్వరూప లక్షణమును శిష్యులకు (భక్తులకు) ప్రసాదించగలడు. ఐతే సచ్చిదానందములు అన్నిటియందు యిదివరకే వుండగా యిపుడు క్రొత్తగా గురుమూర్తి యిచ్చుట ఏమి? యను శంక రావచ్చును. ప్రతివాడును "అహం బ్రహ్మాస్మి" అని వాచా చెప్పగలడేగాని ఆ బ్రహ్మ లక్షణములు తనయందు పూనగలడా! పూనలేడు, అట్టి ఆచరణ చేయలేడు. కాని గురుభక్తుడట్లుగాదు. గురుకృపకు పాత్రుడు గాగల్గినచో తానే గురుస్వరూపుడననే ఆరూఢ జ్ఞానముతో "బ్రహ్మవి ద్బ్రహ్మైవభవతి" అనే శ్రుత్యర్థమును సార్థకపరచగలడు. అతని అభీష్టములు అన్నియు కోరకనే అతనికి సిద్ధించును.

అట్టి గురుకృపా ప్రసాదలబ్ధికై గురుభక్తులందరము నిరంతరము "జలము నెడబాయ నొల్లని జలచరముల రీతి" సద్గురుమూర్తి పాద పంకేరుహములను హృదయ సింహాసనమున ప్రతిష్టించి ధారావాహికముగా ధ్యాన మొనర్చెదము గాక!

శ్లో॥ పాదాబ్జే సర్వసంసార దావకాలానలం స్వకే
బ్రహ్మరంధ్రే స్థితాంభోజ మధ్యస్థం చంద్రమండలం॥

తాత్పర్యం : ఎవని పాదకమలమునందు, సర్వసంసారమును దహించు దావాగ్నియున్నదో, బ్రహ్మ రంధ్రమందున్న సహస్రార పద్మమందుగల చంద్రమండలమందెవరు వుండివున్నారో అట్టి సద్గురుమూర్తినికి స్మరించవలెను. (అని,ఏదప వ్రాయబడిన, అకథాదిత్రిరేఖాబ్జే అను శ్లోకముతో నన్వయము )

విశేష వివరణ : 1) పాదాబ్జము 2) సర్వసంసారము 3) దావ కాలానలం 4) బ్రహ్మరంధ్ర స్థితాంభోజమధ్యస్థం చంద్రమండలం అనువానిని గూర్చి వరుసగా చర్చించి తెలిసికొనదగును.

1) పాదాబ్జము : పాదకమలము, అసలు పాదమనగా "పద్యతే అనేన యితి పాదః అనగా దేనిచేత పొందబడునో అది పాదమనిన్ని "పద్యతయితిపాదః" అనగా పొందబడేది కూడా పాదమనిన్ని వ్యుత్పత్తి అర్థములు. కనుక పొందవలసిన గమ్యస్థానమున్ను, అది పొందుటకు సాధనభూతములున్ను కూడా పాదములే అని చెప్పనగును. అనగా మోక్షసాధనములున్ను

మోక్షస్థానమున్ను గూడ పాదములే. కనుక పొందదగిన గురుపదమున్ను ఎతత్ప్రాప్తికి ఆశ్రయించ వలసినదీన్ని కూడా గురుపాదమే.

మనకు తెలియబడుచున్న యీ సమస్తము కార్యకారణరూపములుగానున్నది. విశ్వము కార్యముగానుదానికి మూలకారణముగా బ్రహ్మమున్ను తెలియబడుచున్నవి. కారణరూపమైన బ్రహ్మము కూడా యింద్రియములకు గోచరమైయున్నందున కార్యరూపముగానున్న విశ్వమును అట్టి కారణరూపమైన బ్రహ్మమును ప్రతిపాదించుచున్నాము. కనుక బ్రహ్మమును తెలుసుకొనుటకు విశ్వమే సాధనమై వున్నది. ఈ విశ్వమును విభజించి, ఒక్కొక్క భాగమునే వివరించి అది బ్రహ్మము కాజాలదని నిరసించుచూ. "నేతినేతినేతీతిహోవాచ" అను శ్రుత్యనుసారముగా బ్రహ్మమును. నిర్విషయరూపమైనమనస్సుచే గుర్తించదగియుండుటచే అనేకులు యీ విశ్వమును విభజించుచూ వచ్చిరి. "చతుష్టయం వా యిదగ్ంసర్వం" అని నాలుగు, నాలుగులుగా విభజించిన పద్ధతి యొకటి వుదాహరణకు నాలుగు వేదాలు. నాలుగు యుగాలు. నాలుగు దిక్కులు. నాలుగు సముద్రాలు. నాలుగు శరీరాలు. నాలుగవస్థలు, నాలుగు రభిమానులు. నాలుగు వర్ణాలు. యిత్యాదిగా విభజించిరి. విశ్వము.బ్రహ్మము. రెండున్ను ఓతప్రోతములై విడరానివిగా నున్నందుననే బ్రహ్మైవేదం విశ్వ మిదం వరిష్టం" అని విశ్వమే బ్రహ్మమని శ్రుతి ఉద్ఘాటించినది.

"చతుష్టయం వా యిదగ్ సర్వం" అను ప్రకారం కార్యకారణ రూపముగానున్న యీ బ్రహ్మమును నాలుగు భాగములుగా విభజించియే "పాదోస్య విశ్వాభూతాని త్రిపాదస్యా మృతం దివి" అని మూడుపాదములు (భాగములు) దివ్యము. అమృతము. దివ్యమూనైయుండగా, ఒక పాదం మాత్రమే విశ్వరూపం వహించెనని చెప్పబడినది. ఇది జిజ్ఞాసి యొక్క వూహామాత్ర విభజన మాత్రమేగాని బ్రహ్మ గోవువలె చతుష్పాద జంతువుగాదు. నాలుగు పావలాలు గల రూపాయి వంటిదిన్ని కాదని మాత్రం గుర్తుంచుకోవలెను. "సో యమాత్మా చతుష్పాత్" అనగా "అయమాత్మా బ్రహ్మ" అని చెప్పబడ్డ బ్రహ్మము నాలుగు పాదములుగలది. బ్రహ్మము ఆత్మ ప్రకృతి (చిత్) అనియే పేర్లు పెట్టిన అభిధేయమగు వస్తువు మాత్ర మొక్కటే బ్రహ్మము అన్నపుడు నపుంసకలింగము. ఆత్మ అన్నపుడు అది పుంలింగము. ప్రకృతి అన్నపుడది స్త్రీ లింగము.

విశ్వ. తైజస. ప్రాజ్ఞ. ప్రత్యగాత్మ అని ఆత్మకు నాలుగుపాదములు చెప్పబడి ఆత్మ పాద చతుష్టయమని పేరు గాంచినవి. విరాట్. హిరణ్య గర్భ. అవ్యాకృత. పరమాత్మలు బ్రహ్మపాద చతుష్టయం. "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ"యని శ్రుతియు. "తస్యవాచకః ప్రణవః" అని యోగసూత్రము న్ను "ఓం" అభిదానమనిన్ని. బ్రహ్మవస్తువే అభిధేయమనిన్ని చెప్పుచున్నది. 'అ' కార. 'ఉ' కార. 'మ'కార అర్థమాత్రలే ప్రణవపాద చతుష్టయముగా చెప్పబడుచున్నవి. అధిష్ఠాన చేతన బ్రహ్మము యొక్క చైతన్యశక్తి అగ్ని. వాయు. ఆదిత్య. దిగ్దేవతారముగా. వాక్. ప్రాణ. నేత్ర. శ్రోత్రము అనే నాలుగింద్రియములకు విషయగ్రహణ సామర్థ్యమిచ్చుచున్నవి. ఈ అధిష్టాన దేవతలు నల్గురికి ఆకాశపాటలేక (లేక అంతరిక్షపాద) చతుష్టయమనిన్నీ ఆధ్యాత్మలగు. వాక్కు. ఘ్రూణము, నేత్రము. శ్రోత్రములకు మనోబ్రహ్మపాద చతుష్టయమనిన్ని పేర్లు. ఒకే బ్రహ్మ ఆధ్యాత్మ రూపముగానూ అధిదైవిక రూపముగానున్ను వ్యవహరించు చున్నందున వీనికన్ని ఆయా పేర్లు పెట్టబడినవి.

ప్రకారాంతరముగా. బ్రహ్మమునకు 1) అవిద్యాపాదము 2) విద్యాపాదము 3) ఆనంద పాదము 4) తురీయపాదము అను నాల్గుపాదములు నిర్ణయింపబడినవి. 1) అవిద్యాపాదము = అవిద్య అనగా అజ్ఞానము. విద్య అనగా జ్ఞానము. ఈ జ్ఞానా జ్ఞానములు వేర్వేరు వస్తువులు కావు ఒకే వస్తువు యొక్కరెండు స్థితులు. ఒకే నాణెము యొక్క రెండు ప్రక్కల వంటివి. కనుకనే శ్రీకృష్ణదేశికేంద్రులవారు "జ్ఞానా జ్ఞానంబులు. యీ జ్ఞానివేగాని వేరుగా వెన్నటికే" అని తెలవిచ్చినారు. ఒకే వ్యక్తికి జాగ్రత్సుషుప్తుల యందు జ్ఞానాజ్ఞానస్థితులున్నట్లే సృష్టికి పూర్వదశయందు బ్రహ్మము సుషుప్తి దశయందున్న దానివలె యున్నది. "శుద్ధే సుషుప్తి దృష్టాంతం" అని శుద్ధ బ్రహ్మమునకు "నిస్సంకల్పరూపమగు బ్రహ్మమునకు" సుషుప్తి దృష్టాంతముగా నీయబడినది. కనుక యిది బ్రహ్మము యొక్క మరుపు రూపము (అజ్ఞానము) యిదియే అవిద్యాపాదము.

2) విద్యా పాదము : ఆ బ్రహ్మమునకే అహం స్ఫురణకల్గి "సోఽ కామయత బహుస్యాం ప్రజాయేన" అనగా నే ననేక మగుదును గాక! అను సంకల్పము కలిగినపుడు అది జ్ఞానస్వరూపమైనది. యిదే యెరుకరూపమైన విద్యాపాదము.

ఈ విద్యావిద్యలు లేక యెరుక మరుపులు బ్రహ్మమునకు సహజ స్వరూపములై యున్నవి. మరియు మరుపురూపమే సత్ అని ఎరుక రూపమే చిత్ అని కూడా సమన్వయించదగును. విద్యావిద్యలనే యీ ద్వంద్వములు కానిదీ యీ ద్వంద్వములు లేనిదీ ఏదో దానికి "నిర్విద్యా" అని పేరు పెట్టవచ్చును. అచలము, బయలు, పరిపూర్ణము అంటూ పేరులేనిదానికి పేరుపెట్టిన విధముగా నిర్విద్య అని కూడా ఒక పేరు పెట్టవచ్చును. "పాండిత్యం నిర్విద్యా" అను శ్రుతి న్యాయముగా, ఆ నిర్విద్యారూపమైనదానిని తెలుసుకొన్నవారే పండితులు, సూరిజనులు.

3) ఆనందపాదము : దుఃఖ సమ్మిశ్రమము కానిదిన్ని, దుఃఖపర్యవసాయి కానిదిన్ని అగు నిరతిశయ సుఖము లేక అత్యంతిక సుఖము ఏది కలదో దాని కానందమని పేరు. నేనే బ్రహ్మననే అఖండ సంతృప్తి రూపజ్ఞానముచే కల్గిన బ్రహ్మానందమే ఆనందము. సత్, చిత్, ఆనందములే బ్రహ్మమునకు స్వరూపలక్షణము. స్వస్వరూపాఖండ జ్ఞానానందమే ఆనందపాదము.

4) తురీయపాదము : పై మూడు కానిది తురీయపాదము. ఇది లక్ష్యము. పై మూడూ లక్షణము. తురీయ మనగా సంఖ్యానీకములో నాలుగవది అని అర్థంకాదు. యిదమిత్థమని నిర్ణయింపజాలని అనిర్వచనీయస్థితి. అది పై మూడు స్థితులు కాని అతీతస్థితి. అయిననూ అది కూడా మొదటి మూటిచేత చెప్పబడిన బ్రహ్మము యొక్క స్థితియేగాని వేరుకాదు. దానిని కొందరు నిర్విశేషమంటారు. అంటే విశేషములు కానరాలేదన్నమాటే. కాని. కానరానంత మాత్రాన లేనేలేవనికాదు. అందు సచ్చిదానందములు బీజరూపములో అణగిమణిగియున్న యొకవిధమైన శూన్యస్థితియన్నమాట. దానికే నిర్వాసనా మౌనముద్రానిష్ఠ అని కొందరూ, నిర్వికల్ప సమాధి అని కొందరూ పేర్లు పెట్టుకొన్నారు. ఏ పేర్లు పెట్టినా అవన్నీ జ్ఞేయ బ్రహ్మము యొక్క నాల్గు విధములగు స్థితి బేధములు మాత్రమేనని రూఢిగా గుర్తెరుగవలెను.

పాదములు అనుసరికి భూమిపై చేపులు నడుచునట్టి అవయవములే స్ఫురించును. అందునూ గురుపాదములనుసరికి గురుమూర్తి మానవాకారములో భూమిపై నడయాడు పాదముల జంటయే తప్పక స్ఫురించును. కనుక రెండేపాదములుగాని నాలుగుకాదు అని కూడా తోచును. నాలుగు అని చెప్పిననూ దోషములేదు. ఏలననగా గురుస్సాక్షాత్ పరబ్రహ్మ" కనుక బ్రహ్మమునకు చెప్పబడిన పాదములు గురుపరమాత్మకున్నూ చెప్పనగును.

గురుగీతలో గురుపరమాత్మకు రెండు పాదములుగా అభివర్ణింపబడిన

శ్లో॥ వందే గురుపదద్వంద్వం వాఙ్మనోతీతగోచరం
శ్వేతరక్త ప్రభాభిన్నం శివశక్త్యాత్మకం పరం॥

అను శ్లోక వ్యాఖ్యానము అన్యత్రా వివరించబడినది. గురుపదద్వంద్వం, శివశక్త్యాత్మకమై (పురుష ప్రకృతులుగా) వరుసగా శ్వేత, రక్త, ప్రభారంజితమైయున్నవి. అవియే దక్షిణ వామపాదములు. అవి రెండున్నూ కలసి ఏకరూపమగు బ్రహ్మపదము. అదియే గురుని శ్రీపాదము. కనుకనే గురుని పాదముల రెంటినీ ఏకముగా చేర్చియే భక్తుడు గురునికి నమస్కార పూజాదులు చేయును. ఈ గురుపాదములు వస్తునిశ్చయ రూపముగా నిర్గుణ స్వరూపమునందు కూడా ఎట్లు సమన్వయ మగునో గురుముఖతః తెలుసుకొనదగును.

. ఆకాశమే అవిభాజ్యము అనగా భాగింపరానిదిగదా! ఆకాశము కంటె సూక్ష్మమై, సర్వ వ్యాపకమై, అఖండముగానున్న ఆత్మను విభాగించుట అనూహ్యమైనను, సుబోధార్థము మాత్రమే. నిరవయవమైనదానిని సావయవముగా నూహించి, వూహామాత్రముగానే విభజించిరని తెలియవలెను. అయితే, పైన చెప్పిన నాల్గు పాదములలో ఏ పాదము, (లేక రెండు పాదములలో ఏపాదము) సంసార నాశన సమర్థకమైయున్నది. అజ్ఞానమే సంసార కారణమన్నారు. అంధకారమునకు ప్రకాశమువలె అజ్ఞానమునకు, జ్ఞానమే (విద్యయే) సాక్షాత్ విరోధియై నాశనకారియైయున్నది. కనుక, అట్టి పాదమేదియనగా విద్యాపాదమే. రెండు పాదములే చెప్పినచో, గురుమూర్తియొక్క దక్షిణ పాదమునందే అట్టి జ్ఞానాగ్ని నెలకొనియున్నది అని చెప్పనగును.

శ్లో॥ తీర్థాని దక్షిణేపాదే. వేదాస్సమ్ముఖ మాశ్రితాః" అంటూ గురుగీత సకల పుణ్యతీర్థములు దక్షిణ పాదము నాశ్రయించుకొని యుండు నని చెప్పుచున్నది. శివ, శక్తులే గురుపాద ద్వంద్వము శివ స్వరూపమైన దక్షిణపాదమే జ్ఞానరూపము. కనుక జ్ఞానాగ్ని గురుమూర్తి యొక్క దక్షిణపాదమునే ఆశ్రయించియున్నదని చెప్పనగును. రెండు పాదములు గలసి ఏకపాదము. అదే శ్రీపాదము. అది యేక రూప ద్వంద్వము లేక ద్వంద్వరూప ఏకముగా జిజ్ఞాసి భావించుకొని ఆ శ్రీపాదమునే ఆశ్రయించి కృతార్థుడు కావలెను.

2) సర్వసంసార అని సర్వశబ్దము నేల యుపయోగించవలెను? సంసారమనగా పుత్ర మిత్ర కళత్రాదులతోను, ధన కనక వస్తు వాహనాది సకలైశ్వర్యములతో గూడినది సంసారముగాదనిన్ని జనన మరణ ప్రవాహరూప అనాది సంసృతియే సంసారమనిన్ని లోగడ రాజయోగి పత్రికాముఖంగా పలుమారు తెలిసికొనియేయున్నాం. అట్టి సంసారమునకు మూల కారణమేదియో దానితో సహా నాశన మొనర్చునని చెప్పుటకే సర్వసంసారమని చెప్పబడినది ఈ ఘోర సంసారమునకు మూలకారణమేమి? భ్రాంతియే సర్వభ్రాంతులకు మూలం. మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే. అఖండ రూపమగు యెరుకయే బ్రహ్మమనుకొనుటే తొలి భ్రాంతి. తద్భ్రాంతి రహితమందే సర్వసంసార రాహిత్యము సిద్ధించును. అయితే ఆ భ్రాంతి

రహిత మెట్లు చేకూరును? పరిపూర్ణ బోధవలన మాత్రమే చేకూరును. అది పరిపూర్ణ గురుపాదము లాశ్రయించినవారికే లభ్యమగును. అది కేవలము జ్ఞానాగ్ని మాత్రముకాదు

శ్లో॥ "యథైధాంసి సమిద్ధోగ్ని భస్మసాత్కురుతే ఉ ర్జున
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మ సాత్కురుతే తథా"

జ్ఞానాగ్నిచే సర్వకర్మలు నాశనమగునని చెప్పబడినది. సాధారణముగా కట్టెలను దహించిన అగ్ని కట్టెలను భస్మంచేసి, తానుకూడా చల్లారిపోవుచున్నది. కానీ "జ్ఞాన దేవతు కైవల్యం" జ్ఞానమే పరబ్రహ్మ స్వరూపమని నిలబెట్టుకొంటే, యాదవకుల నాశనమునకు ముసలంవలె మిగిలిపోయి తిరిగి భ్రాంతికారణమై సంసారమును వృద్ధిపరచును. అట్టి ఘోర సంసార శాశ్వతనాశనమునకు పరిపూర్ణ బోధాగ్ని కావలెను. అట్టి బోధాగ్ని దావకాలానల సన్నిభమైనది. అనల మనగా అగ్ని, దావము అనగా అడవి. దావానలం అనగా అడవియందు అల్లిబిల్లిగా నల్లుకొన్న చెట్లయొక్క కొమ్మలు గాలిచే యొకదానితో నొకటి రాపాడుట వల్ల వుత్పత్తియైన కార్చిచ్చునకే దావానలం అని పేరు. ఈ అగ్ని, పచ్చి ఆకులు పచ్చికొమ్మలు నేలమీదనున్న పచ్చిగడ్డితో సహా సర్వమును భస్మీపటలమొనర్చును. పరిపూర్ణ బోధాగ్ని దావానలంతో పోల్చుటతో వూరుకొనకుండా కాలానలంతో కూడా పోల్చినారు. కాలానలం అనగా ప్రళయకాలాగ్ని, ప్రళయకాలమందు భూమండలమంతయు జలములోలయమైపోగా సర్వము జలమయమై యుండును. అంతట ద్వాదశాదిత్యులు నవగ్రహములు విజృంభించి కాలాగ్ని యుత్పన్నమై ఆ మహా జలరాసినంతను గ్రహించి యింకించివైచును. దావానలమున్ను ప్రళయాగ్నిన్ని రెండు న్నూ కలసినచో అట్టి అగ్ని యొక్క మహాశక్తి ఎంతటిదో పరిపూర్ణ బోధాగ్ని అంతటిది అని సూచించుటకే దావకాలానలమని వాడినారు.

అట్టి పరిపూర్ణ బోధాగ్నిచే గాక సర్వసంసార నాశనముగాదు. గురుపాదముల వ్రాలి సర్వార్పణం చేసుకొన్న గురుకృపా పాత్రులకే అట్టి బోధ లభ్యమగును. దివ్యమగు అట్టి గురుపాదము సోకిన చోటు "ధన్యాచ వసుధా దేవీ" అన్నట్లు పవిత్రీభూతమై ధన్యత గాంచుచున్నది. అట్టి గురుపాదమునుండి జాలువారిన యుదకధారచే శిష్యుడు. బాహ్యాభ్యంతరములయందు పవిత్రీభూతుడై స్ఫటికమణితో సమానుడగుచున్నాడు.

4) బ్రహ్మరంధ్రే స్థితాంభోజ మధ్యస్థం చంద్రమండలం = అట్టి గురుమూర్తి ఎక్కడున్నాడు? సద్గురుమూర్తియే. సర్వవ్యాపకమగు బ్రహ్మస్వరూపము గనుక బ్రహ్మాండ భాండావంతముల యందంటా నిండియున్నాడు.

లోక కళ్యాణార్థము మానవుడై అందరివలె యీ లోకములో నడయాడుచు కోరిన వారికి తన దివ్యోపదేశ ప్రబోధములచే సర్వభ్రాంతి రహిత మొనర్చుచున్నాడు. అంతేగాదు. పాలకడలిలో బొడమి లేక వినాశము గావించుచున్న హాలాహలమును. పూర్తిగా మ్రింగిన లోనున్న లోకములు నాశనమగునని యెంచి గుటకవేయకుండా కంఠముననే ధరించుటవల్ల కలిగిన తాపోపశమనమునకై పరమశివుని జటాజూటమున స్థిరనివాస మేర్పరచుకొన్న చంద్రుని వలె. జీవుల సర్వతాపములను హరించి ప్రశాంతత చేకూర్చుటకై ప్రతియొక్కని బ్రహ్మరంధ్రమందున్న సహస్రారకమలమునందు కూడా గురుమూర్తి స్థిరనివాస మేర్పరచుకొని యున్నాడు. ఆ విధముగా మనయొక్క బాహ్యాభ్యంతరములయందు సర్వత్రా వ్యాపకమై యున్న గురుపరమాత్మకు

"శ్రీమత్పరం బ్రహ్మ గురుం స్మరామి. శ్రీమత్పరం బ్రహ్మ గురుం భజామి
శ్రీమత్పరం బ్రహ్మ గురుం వదామి శ్రీమత్పరం బ్రహ్మ గురుం నమామి"
అన్నట్లు స్మరణ. భజన. వచన. నమస్కృతులతో అహరహము వుపాసించెదము గాక!

శ్లో॥ నిత్యం శుద్ధం. నిరాభాసం నిరాకారం నిరంజనం
నిత్యబోధం చిదానందం గురుం బ్రహ్మనమామ్యహం॥

తాత్పర్యం : త్రికాలములయందుండుటవల్ల శాశ్వతమని చెప్పబడునదియు. శుద్ధమైనదియు. సత్యస్వరూపమైనదియు. ప్రత్యేకమగు ఏ ఆకారము లేనిదియు. అజ్ఞానరూపమగు వుపాధి లేనిదియు. స్వరూప విస్మృతిలేని మెళుకవయందే యున్నదియు. జ్ఞానానంద లక్షణములు గలదియునై సాక్షాత్ పరబ్రహ్మమే యైనదియునగు గురుస్వరూపమునకు నేనెల్లపుడు నమస్కరించు చున్నాను.

విశేష వివరణములు : 1) నిత్యము = కాలత్రయములందు శాశ్వతమైయుండునది అని సామాన్యార్థము. అనగా దాని అస్తిత్వమునకు అనగా వునికికి మాత్రము భంగములేదన్నమాట. కాని దాని రూప నామములు నిరంతరమూ మారుచునే యున్నవి. అయిననూ వస్తువుయొక్క యునికికి భంగము కలుగుటలేదు. వాఙ్మనస్సుల కందే సమస్తమూ గొప్పదైన ఆ పరబ్రహ్మ స్వరూపమే. ఏ వస్తువునూ కేవలము నశించిపోవుటలేదు. నామరూపములయందు భేదము గాన వచ్చుట మాత్రమే. ఉదాహరణకు, ఒక చెట్టును తీసుకొందము. చెట్టు ముక్కలు ముక్కలుగా నరికినపుడు చెట్టుయొక్క నామరూపములు నశించినవి. కాని యిపుడు చెట్టు కట్టెల రూపములో నున్నది. కాలితే బొగ్గుల రూపము వహించినది. యింకనూ కాల్చినచో నుసిరూపములో నున్నది. ఆ నుసి గాలిలో యెగురకొట్టినా వాతావరణము నందుండి నేలపై రాలి మన్ను రూపము వహించు చున్నది. కనుక చెట్టు కేవలము నాశనము కాలేదు. అనగా పదార్థమునకు నాశనము లేదని విజ్ఞానశాస్త్రము చెప్పుచున్నది. అదే విధముగా బ్రహ్మము నానారూపములు చెందుచున్నది. ప్రళయానంతరము తిరిగి సృష్టికి పూర్వమున్న స్థితిలో నుంటున్నది. కనుక సృష్టికి పూర్వము. సృష్టి యనంతరము. సృష్టికాలమునందూ. అనగా భూత భవిష్యత్ వర్తమానకాలములయందు బ్రహ్మపదార్థము యేదో రూపములో వుంటూనే వున్నది. కనుక దానిని త్రికాలాబాధ్యము అన్నారు. సద్రూప మనగా నిదియే. బ్రహ్మమును యీ దృష్టితోనే నిత్యమన్నారు. అంతేగాని. నామరూపములలో కూడా మార్పు లేదనే అర్థములోకాదు. మార్పు చెందేది మాయ. కనుక యిది మాయా బ్రహ్మమనాలి.

రజ్జు సర్పదృష్టాంతమును రెండు రీతులుగా నన్వయింపవచ్చును 1) రజ్జువు (తాడు) సర్పముగా మారనేలేదు. అయిననూ. ఏకాలమునందునూ నిజముగా దానియందులేకున్ననూ. సర్పము రజ్జువునందు ప్రతీతి అయినది. కనుక రజ్జువు సత్యము. సర్పము మిధ్యఅన్నారు. అట్లే బ్రహ్మము సత్యమైయుండగా దానియందు జగద్భ్రాంతి గలిగినది. కనుక "బ్రహ్మసత్యం జగన్మిధ్యా" అన్నారు. 2) రజ్జువు వున్నది. అదే పాముగా భాసించినది. అనగా పాముయొక్క రూపం తోచినది. భాసించిన సర్పము రజ్జువుకంటె భిన్నంగాలేదు. రజ్జువే అయివున్నది అట్లే బ్రహ్మమున్నది. అది జగత్తుయొక్క రూపం వహించినది. కనుక జగత్తు బ్రహ్మముకంటె వేరుగాదు. బ్రహ్మమే యిది రెండవ దృష్టి. యిందు జగత్తు మిధ్యగాదు. "మీయతే అనేన యితి మాయ"

అనగా ఒక మితిలోనికి తెచ్చునదియే మాయ అను నిర్వచనానుసారం మాయ అనంతమగు బ్రహ్మము. మితిలో గానవచ్చి క్రొత్త రూప నామములువహించునది. యీదృష్టిలో బ్రహ్మమెంత సత్యమో జగత్తున్నూ అంతే సత్యము. కాని రూప నామములలోకూడా మార్పు చెందని కేవల నిత్యత్వం కాదు. బ్రహ్మము కానిది ఏదీ లేదు కనుక నామరూపాలు కూడా బ్రహ్మమే. వానిని కూడా మిథ్య యని యనరాదు.

అస్తి భాతి ప్రియ రూప నామము లను ఐదు లక్షణములలో మొదటి మూడు నిత్యమైన బ్రహ్మముగాను రూపనామములు అనిత్యమగు జగత్తుగాను చెప్పబడినది. బ్రహ్మము ఏకము నిత్యము అనంతము. నామరూపములు అసంఖ్యాకములు అనేకములు అనిత్యములు. ఏకం అనేకం భవతి అనే న్యాయంగా ఒకే బ్రహ్మము ద్వివిధముగానున్నది. నిత్యానిత్యములచే ద్వంద్వ లక్షణములు గలిగి కారణబ్రహ్మము. కార్యబ్రహ్మము అని చెప్పదగియున్నది. నిత్యానిత్యములనే నిర్ణయ మెరుగని కేవల నిత్యత్వ మొక్క పరిపూర్ణ బ్రహ్మమునందే గలదు. "నిత్యం విజ్ఞాన మానందం బ్రహ్మ" అనుటలో గూడా యీ సాపేక్షిక నిత్యత్వమే చెప్పబడినది. ఈ శ్లోకమునందు యిదే అభివర్ణితము.

"శుద్ధం" అనగా తెల్లనిది. స్వచ్ఛమైనది. దోషరహితమైనది అనే నానార్థములుగలవు. తెల్లనిది అనగా తెలుపు వర్ణముగలది. సూర్య కిరణము విశ్లేషిస్తే వచ్చు ఏడు రంగులలో తెలుపు ఒక వర్ణముగాదు. కాని అన్ని వర్ణముల యొక్క సంశ్లేషమునందు కలుగు వర్ణము తెలుపుగా వర్ణింపబడినది. అయిననూ సూర్యకిరణముయొక్క ప్రకాశము మల్లెపూవువలె తెల్లగానుండదు. అది స్వచ్ఛమైనదని (అనగా దానియందితర వర్ణములు లేనట్లుగా) తోచినా దానియందన్ని రంగులూ వుండనేవున్నవి. అట్లే గురుపరమాత్మయొక్క స్వరూపము శుద్ధమైనది లేక స్వచ్ఛమైనది అని అభివర్ణింపబడినా సమస్తవర్ణాత్మకమగు ప్రపంచమును అది బీజరూపముగా ధరించియున్నది. అట్లే దానియందు యే దోషములులేక మహాపవిత్రమైనదిగా తోచబడినా వుపాధులను పొందే దోషము మాత్రము దానికి స్వభావమై యున్నది. క్షరోపాధి అక్షరోపాధి అను వుపాధిద్వయముగా పరిణమించే దోషము దానియందే గర్భీకృతమైయున్నది. "నిర్దోషం హి సమం బ్రహ్మ" అని చెప్పినపుడు కేవల దోషరహితమైన దొక్క పరిపూర్ణపరబ్రహ్మము మాత్రమే అని తెలియవలెను. దానినే క్షరాక్షరపాధి ద్వయం. దోష రహితమని శ్రీకృష్ణదేశికేంద్రులవారు శెలవిచ్చినారు.

3) "నిరాభాసం" అభాస లేనిది. అభాస యనగా లేనిది వున్నట్లుగా తోచుట. ప్రతిబింబము అను అర్థములుగలవు. కనుక నిరాభాసం అనగా లేనిది వున్నట్లుగా తోపింప చేయనిది. ప్రతిబింబములు లేనిది అని అర్థములు వచ్చుచున్నవి. "వున్నది లేదని యూహింపగా నేర్చలేనిది కలదన లెస్స నేర్చు" అని మాయా ప్రభావము వర్ణింపబడినది. కనుక "అభాస" మాయా ప్రభావము. నిరాభాసం అనగా మాయా ప్రభావమునకు లోబడినది. తనయందు బీజరూపంలోనున్న మాయాశక్తి విజృంభణకానంతవరకు త్రిగుణ స్వరూపిణీయగు మాయాప్రభావమునకు సృష్టికి పూర్వమున్ను బ్రహ్మము లోబడినమాట సత్యమే. అయినా మాయా ప్రభావమునకు లోబడుటవలననే గదా ఆ బ్రహ్మము జగద్రూపముగా భాసించుట. కనుక ఒక స్థితిలో మాత్రమే ఆ బ్రహ్మము నిరాభాసము. మిగతా స్థితులయందు అది సాభాసమే

అగుచున్నది. కనుక తాత్కాలికముగ నిరాభాసమైయున్న జగత్కారణమగు బ్రహ్మమే యిందు వర్ణింపబడినది. ఆ బ్రహ్మమునకు ప్రతిబింబము లేదని చెప్పుటయు నట్టిదే. ఏలననగా ప్రతిబింబవాదమున. మాయయందు ప్రతిబింబించి ఈశ్వరుడనియు అవిద్యయందు ప్రతిబింబించి జీవుడనియు నామరూపములు చెందినదియు నా బ్రహ్మమే. కనుక సృష్టికి పూర్వము కారణస్థితిలోనున్న గురుపరమాత్మ తత్కాలమున మాత్రమే నిరాభాసం అని చెప్పదగియున్నది.

4) నిరాకారం : అనగా ఆకారములేనిది. చతుష్కోణాకారము, అర్ధచంద్రాకారము, త్రికోణాకారము, షట్కోణాకారము, వర్తులాకారం బిందువుతో త్రికోణ షట్కోణకారములు లావు, సన్నం, పొట్టి పొడుగు, మొదలగు ఆకారములు ఆ పరమాత్మకు లేవు. కండ్లబడేది ఆకారము. సావయవ స్వరూపమున ఆ పరమాత్మ కండ్లబడనిమాట సత్యమే అయినా శుద్ధ మనస్సునకు గోచరించుచున్నది. మనస్సునకు ఏ రూపంలో గోచరించును? ఏ ఆకారములో నూహిస్తే ఆ ఆకారములోనే అది మనస్సునకు గోచరించును. చీమయందు చీమరూపంలో, ఏనుగునందు ఏనుగురూపంలో, "అణోరణీయాన్ మహతో మహీయాన్" అని చెప్పబడినట్లుగా అణువునుంచి మహా మేరువు వరకు గల సర్వవస్తువులయందు నిండియుండి అణువుకంటే చిన్నదై అణువులోపల మహత్తుకంటెనూ పెద్దదై మహత్తును అతిక్రమించి ఆ పరమాత్మ యున్నదంటే అన్ని ఆకారములు దానివేనన్నమాట. అదికానిది ఏదీలేదు. "యాదృశీ భావనాయత్ర తాదృశీ భవతి నిశ్చయం" అనగా ఎట్లు భావిస్తే అట్లే అదిగోచరించునన్నమాట. రామకృష్ణ పరమహంస గారి శిష్యులైన నాగమహాశయుడు, వివేకానందస్వామి, అనువా రిర్వురిపైన మహామాయ తనజాలము (వలను) కప్పివేసెనట. అప్పుడు, భక్తుడైన నాగమహాశయుడు తన్ను అణువుకంటే చిన్నగా నిశ్చయించుకొని ఆ వలను పటాపటా బ్రద్ధలు చేసుకొని బయటపడినట్లు వర్ణింపబడినది. "యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజా మ్యహం" అంటోంది భగవద్గీత. ఆ పరమాత్మయందే సర్వాకారములు చెందు లక్షణము బీజరూపంగా నున్నందుననే ఆత్మ సర్వాకారం అని చెప్పబడినది.

5) నిరంజనం అనగా అంజనము లేనిది. అంజన మనగా అజ్ఞానము. ఉపాధి కాటుక అని అర్థములు గలవు. పరమాత్మ స్వరూప లక్షణముచే సచ్చిదానంద స్వరూపమని చెప్పబడినా దానియందే అనృత జడ దుఃఖములు అణగిమణిగి యుండి త్రిగుణ విజృంభణలో మాయాకార్యము లన్నియు ప్రకటమగుచున్నవి. అవ్యక్తాధిష్ఠానములు లేక మాయా బ్రహ్మములుగా నున్నదా పరమాత్మ స్వరూపమే సర్వ ద్వంద్వములకు అదే పుట్టిల్లు. అది ఏకరూప ద్వంద్వము సమిష్టి అజ్ఞానమే మాయ. సృష్టికి పూర్వము జ్ఞానమయముగా నున్నట్లుగా తోచినా అనంతర కాలమందు అజ్ఞాన లక్షణములు దానియందే పొడసూపుచున్నవి. నిరుపాధికంగా తోచినా సర్వోపాధులకు అదియే మూలకారణము. కడపటి శరణాలయమున్నూ కటిక చీకటివలె కాటుకవలె నల్లగానుండును. అజ్ఞానమును గాఢాంధకారముతోను జ్ఞానమును తేజస్వరూపముతోను పోల్చి చెప్పుదురు. ఈ తేజోంధకార స్వరూపముల (లేక జ్ఞాన జ్ఞానములు) రెండూ పరమాత్మవే అయినా సృష్టికి పూర్వదశ యందు అది జ్ఞానఘనము. లేక చిద్ఘనము అయి వున్నట్లు తోచబడుచున్నది. కనుక ఆ లక్షణము మాత్రమే యీ శ్లోకమునందు పేర్కొనబడినది.

6) నిత్యబోధం = బోధ యనగా జాగృతి. మెళుకువ. ఆత్మ స్వరూప జ్ఞానము కల్గియుండుట. జాగ్రత్తయందు సంపూర్ణ జ్ఞానము(యెరుక)తో నుండును. స్వప్న సుషుప్తులయందు మరుపురూపం చెందెను. నిత్యబోధం అనగా సర్వకాల సర్వావస్థలయందు స్వరూప విస్మృతి (మరుపురూపమైన అజ్ఞానము) లేకయుండుట. తాను తానై అఖండ జ్ఞాన సంపత్తి కల్గి అవస్థాంతరములు పొందకయున్న స్థితినే నిత్యబోధ స్థితియని అభివర్ణింపబడినది. ఇట్టి స్థితి సృష్టికి పూర్వం పరమాత్మకు సహజమైయున్నందున నిత్యబోధం అని వర్ణింపబడినది. త్రిగుణ విజృంభణతో అవ్యక్తాది పరిణామములు జెంది స్వరూప విస్మృతి చెంది వుపాధి తాదాత్మ్యము చెందుచున్నది.

7) చిదానందము = చిత్ యనగా అఖండజ్ఞానము. అట్టి అఖండ జ్ఞానముతో నుండుటచే కల్గు నిరతిశయ సుఖమే చిదానందము. అఖండజ్ఞాన మనగా నిరంత రావచ్ఛిన్న తైలధారవలె తెంపులేని స్వస్వరూప జ్ఞానము. అపుడన్యథా జ్ఞానమునకు తావులేదు. అన్యవస్తు జ్ఞానము శబ్దస్పర్శాదులను గుర్తింపజేసి సుఖదుఃఖాలను కల్గించును. సృష్టికి పూర్వం శబ్దాదుల యుత్పత్తియే లేనందున. సుఖదుఃఖ ద్వంద్వములకు తావేలేదు. అట్టి నిరతిశయ సుఖమే ఆనందము. ఆ ఆనందము గురుపరమాత్మయందు సృష్టికి పూర్వము సహజమై యున్నది.

8) గురుం బ్రహ్మ నమామ్యహం = బ్రహ్మ స్వరూపుడగు గురుపరమాత్మకు నేనే నమస్కరించుచున్నానని భావము. గురు శబ్దార్థము. బ్రహ్మ శబ్దార్థము రెండున్నూ వుత్పత్త్యర్థముల పరిశీలనచే ఏకమేనని తెలియబడుచున్నవి. అంతకంటె గొప్పదగు వస్తువు లేదునుట.అయినను అది పరమాణువు కంటె చిన్నదనుటచే పరమాణువుకు లోపలను మహత్ కంటె పెద్దదగుటచే మహత్తును అతిక్రమించి ఆవరించియుండుటచే మహత్తుకు కూడా బైటనువున్నది. ఆ విధముగా గొప్ప కురుచ లన్నియు తానే అయివుండి సగుణ నిర్గుణ రూపములుగా చెలువొందు గురుపరమాత్మ కివే మా సుమాంజలులు.

శ్లో॥ సకల భువన సృష్టిః కల్పితాశేష సృష్టి
నిఖిల నిగమ దృష్టి స్సత్పదార్థైకసృష్టి
అతద్గణ పరమేష్ఠి స్సతద్వార్థైక దృష్టి
భవగుణ పరమేష్ఠి ర్మోక్షమార్గైక దృష్టిః॥

తాత్పర్యం : ఈ శ్లోకమును. తరువాతి శ్లోకమును. సృష్టి కారణమగు పరమాత్మ దృష్టి విశేషమును అభివర్ణించి. అట్టి దృష్టి తనయందు ప్రసరించి నివాస మేర్పరచుకొనియుండుగాకయని భక్తుడు కోరుకొన్నట్లుగా చెప్పుచున్నవి. "నివసతు" అని తరువాత శ్లోకము నందలి క్రియాపదమే దీనికన్ని వర్తించును.

సకల లోకములను అందలి సమస్తమును. సమస్త వేదములను సదసత్ పదార్థము లన్నిటిని శాశ్వతమైన దృష్టి ఏ సృష్టించుచున్నదో మంగళప్రదమును మోక్షమార్గమును సూచించు నదియును అగు ఆ చూపు (నా యందు యెల్లపుడు నివసించుగాక అని తరువాత శ్లోకముతో నన్వయము)

విశేష వివరణములు : 1) సృష్టి 2) దృష్టి 3) సకల భువనసృష్టిః 4) కల్పితాశేష సృష్టి 5) నిఖిలనిగమ దృష్టి 6) సత్పదార్థైకదృష్టి 7) అతద్గణ పరమేష్ఠి 8) సత్పదార్థైక దృష్టి

9) భవగుణ పరమేష్ఠి 10) మోక్షమూర్తిక దృష్టి అను అన్నిటి వివరణయు ఆవశ్యకమే.

1) సృష్టి : అనగా సృజించుట, నిర్మించుట, రచించుట యిత్యాది అర్థములున్నవి. సృష్టి అనుటలో నిజంగా అదివరకు లేనిది, యిపుడు క్రొత్తగా తయారుచేయుట అనే భావమున్నది. గారడివాడు లేని వస్తువును సృష్టించును. వున్న వస్తువును లేకుండాచేయును. ఈ అర్థములో దృగ్గోచరమగు యీ సూర్యచంద్ర నవగ్రహ నక్షత్రాదులు, పంచభూతములు, వాని కార్యములు, అనగా చరాచర ప్రాణికోటితో గూడిన యీ ప్రపంచము, యిదివరలో లేకనే, యిపుడు నూతనముగా, సరిక్రొత్తగా ఏర్పడెనని యనవచ్చునా? గంధ్రయిసుక నుండి తైలమావిర్భవించునా? ఇదివరకేదో రూపములో సూక్ష్మదశలో నున్నది యిపుడు స్థూలాకృతిలో ఆవిర్భవించి ప్రకటమయ్యె ననుట సమంజసము. అంతకు పూర్వము కూడా యున్నది. యిపుడు క్రొత్తగా వచ్చినదనరాదు. కనుక దానిని నిజముగా సృష్టిశబ్దముచే వ్యవహరింపనే రాదు. మరి ఏమనవలెను? సృష్టి ప్రళయములని యనకుండా ఆవిర్భావతిరోభావములని వాడుట మంచిది. ప్రళయమునందు ప్రపంచము గోచరించకుండా పోవుచున్నదేగాని నాశనము పొందుటలేదు. తిరోభావము (కనుపించకుండా పోవుట) జెంది, సూక్ష్మదశలోనుండి, మరల యిపుడు స్థూలాకృతిలో ఆవిర్భావము (ప్రకటమగుట) చెందెనన్న మాట అంటే పూర్వమున్న ప్రపంచము కొంతకాలము మరుగై యిపుడు మరల ప్రకటమయ్యెనని చెప్పవలెను. యింతకాల మెక్కడ ఏ రూపంలో నుండెనను ప్రశ్న వుదయించును. పూర్వ ప్రపంచము కానవచ్చియున్నపుడు, కానరాకపోయినపుడు కూడా ఏది నిత్యముగా అధిష్ఠాన చేతన బ్రహ్మ రూపములో నున్నదో, దానియందా పూర్వ ప్రపంచ బీజములు సూక్ష్మరూపంలో అణగిమణిగి యుండి వర్తమాన ప్రపంచావిర్భావమునకు కారణమయ్యెననుట శాస్త్ర సమ్మతము యుక్తియుక్తమునైయున్నది. సర్వప్రపంచమునకు త్రిగుణాత్మికమై యున్నది. ఆ త్రిగుణాత్మిక ప్రకృతికి (మాయకు) బ్రహ్మమే ఆశ్రయమూ ఆధారమూనై, ఆ బ్రహ్మముయొక్క సామర్థ్యరూపశక్తిగా నున్నది. ఈ శక్తికి బ్రహ్మము వినా వునికియే లేదు. కనుక యిది బ్రహ్మ భిన్నము.

శ్లో॥ న తస్య కార్యం కరణంచ విద్యతే
నతస్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే
పరాస్యశక్తి ర్వివిధైవ శ్రూయతే
స్వాభావికీ జ్ఞాన బల క్రియాచ॥

జ్ఞాన, బల, క్రియా రూపమగు సర్వసామర్థ్యములు ఏ వస్తువునందున్నవో ఆ బ్రహ్మమే సృష్టి కారణము.

సృష్టి కారణమగు బ్రహ్మమునుండి, కార్యరూప జగత్తు, ఎందుచేత యెట్లావిర్భవించెను? ఎందుచేత బ్రహ్మము సృష్టించెను? అను ప్రశ్నలను అడుగనేరాదని కొందరు, పరమాత్మ తన లీలకొరకు సృష్టి సంకల్పము చేసెనని కొందరు, అసలు సృష్టి లేనేలేదని కొందరు చెప్పెదరు. కాని యోచిస్తే విజ్ఞానదృష్టికి జవాబులన్నియు అసంగతములుగా తోచక తప్పదు. గాలి యెందుకు వీచును? అంటే వీచుట (చలించుట) దాని స్వభావము అనియే చెప్పవలెను. సృష్టి సంకల్పము నిస్సంకల్ప స్థితిలోనున్న బ్రహ్మమునందెందుకు కలుగవలెను? అంటే ఆ కారణ బ్రహ్మమునకు సంకల్పించుట నిస్సంకల్పస్థితిలో నుండుట రెండునూ సహజ స్వభావములు అని అనక తప్పదు.

"ఏకం అనేకం భవతి అనేకం ఏకం భవతి" అను శ్రుత్యర్థముల ననుసరించి ఏకానేకములుగా మారుటయే దాని స్వభావముగా గుర్తించవలెను. సృష్టి యెట్లు జరిగెను? అను ప్రశ్నకు సమాధానముగా ఆరంభ, పరిణామ వివర్తవాదములే గాక యింకను అనేక వాదములున్నవి. అవన్నియు ప్రస్తావించుట అప్రస్తుతము. కాని వేసవికాలములో మేఘరూపంగానైన కానరాని జలము వర్షాకాలంలో, వర్ష రూపంగా స్థూలాకృతి చెంది నదీనదములై ప్రవహించి, సముద్రము చేరి, మరల తొల్లిటి అవ్యక్తరూపమును ధరించుటెట్లో. అట్లే సృష్టి ప్రళయములని సమాధానము పొందవచ్చును. కాలగతి ననుసరించి వర్షపాత మెట్లు సంభవమో జీవుల కర్మగతి ననుసరించి సృష్టి ప్రళయములున్నూ పరమాత్మకు కలుగునవి శాస్త్రములు చెప్పుచున్నవి.

"ఇచ్ఛామాత్ర ప్రభో సృష్టిః" "సోఽ కామయత బహుస్యాం ప్రజాయేయేతి" అనియు శ్రుతులు పలుకుచున్నవి. ఈ యిచ్ఛ (కామన లేక సంకల్పము) జ్ఞానము (తెలివి లేక యెరుక) యొక్క లక్షణమే. నిస్సంకల్పస్థితి మరుపు రూపము. మొదటిది జాగ్రదవస్థా లక్షణము. రెండవది సుషుప్త్యవస్థవంటిది. కనుక సృష్టికి పూర్వస్థితి అనగా బ్రహ్మము యొక్క నిస్సంకల్పస్థితి శుద్ధమని చెప్పుటకు "శుద్ధే సుషుప్తి దృష్టాంతం" అని చెప్పబడినది. నిన్నటి దినమున జాగ్రద్దశలో చేయు వృత్తి వ్యవహారములు మరల నేటి దినమున కొనసాగించినట్లే ఆ పరమాత్మ పూర్వ పూర్వ సృష్టుల యొక్క రూపములోనే లేక నమూనాలోనే "యథాపూర్వ మకల్పయత్" వర్తమాన సృష్టిని (తన యందణగి మణగియున్న సృష్టి బీజములనుండి బీజవృక్షన్యాయంగా జగద్వృక్షమును) ఆవిష్కరించెను.

2) దృష్టి : అనగా చూపు, కన్నులున్నగదా చూపు? కన్నులే లేని ఆ బ్రహ్మమెట్లు చూచును? నేత్రముద్వారా అంతఃకరణవృత్తి బహిర్గతమై రూపములను గుర్తించును.కనుక చూపు అనే మాటకు చూడవలెననే సంకల్పరూప వృత్తియే నిజమగు అర్థ మనవలెను. బ్రహ్మము యొక్క సంకల్ప రూపవృత్తియే ఆ బ్రహ్మమునకు చూపు, అది అన్ని చూపులకు, అందరి చూపులకు చూపైవున్నది. "శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో, యద్వాచోహ వాచం, సఉ ప్రాణస్యప్రాణం చక్షుష శ్చక్షురసి విముచ్య ధీరాః ప్రేత్యాస్మాల్లోకా దమృతా భవంతి" అని వర్ణించినది. యా బ్రహ్మము, శ్రోత్రమునకు, శ్రోత్రము, మనస్సునకు మనస్సు, వాక్కునకు వాక్కు, ప్రాణమునకు ప్రాణము, నేత్రమునకు నేత్రము అయివున్నదని భావము మరియు శ్రుతులు ఈక్ష శబ్దమును ప్రయోగిస్తూ వచ్చినవి. "తదైక్షత, బహుస్యాం ప్రజాయేయేతి" అనియు "సఈక్షత లోకా సృజాయతి" అనియు పేర్కొన్నవి. ఆ బ్రహ్మము యే యింద్రియ పరికరముల సహాయమూ నపేక్షించదు. "అపాణిపాదో జవనోగృహీతా, పశ్యత్యచక్షుస్సశ్రుణోత్యకర్ణః...." అంటూ నా బ్రహ్మమును శ్రుతి అభివర్ణించియున్నది.

బ్రహ్మము యొక్క యీ దృష్టిచేతనే సర్వసృష్టిగావింపబడినది గనుక దృష్టి సృష్టి వాదము ప్రతిపాదింపబడెను. కను దెరచిన విశ్వము. కనుమూసిన నాశము. యీ విశ్వమేలేదు అని మాత్రము దృష్టి సృష్టి వాదమున కర్థము చెప్పుట న్యాయం కాదు. ఏలననగా కనుమూసిన రూపములేగానరావు గాని, మిగతా శబ్ద స్పర్శ రస గంధ విషయములన్నియు తెలియబడు చున్నవి. సర్వేంద్రియములకు మూలమైన అంతఃకరణము జడవస్తువు గనుక, దానిని ప్రకాశింపచేయు అధిష్టాన చేతనము లేనిచో దేనిని గుర్తింపజాలము గనుక ఏదిలేకుంటే అంతఃకరణముగూడ వృత్తి ప్రకాశకము కాజాలదో దానినే దృక్ అనియు తద్వ్యాపారమును

దృష్టియనియు తెలియదగును. కనుక అధిష్ఠాన చేతన బ్రహ్మము యొక్క జ్ఞాన ప్రకాశమే దృష్టి. కనుకనే దివ్యదృష్టి అని అనంతర శ్లోకములో చెప్పబడినది. లౌకికము కానిది దివ్యము అని సామాన్యార్ధము. దివ్ అను ధాతువునుండి దివ్యశబ్దము కలిగినది. దివ్ అనగా ప్రకాశము అంటే వెలుగుకాదు. జ్ఞానము అని తెలియవలెను. బ్రహ్మము యొక్క అఖండమగు యీ దివ్యదృష్టి తనయందు నివాసమైయుండుగాక అని తరువాత శ్లోకములో భక్తుడు ప్రార్థించు చున్నట్లు చెప్పబడినది.

3)సకలభువన సృష్టి = భువనము అనగా జగత్తు, లోకము నీరు, ఆకాశము అను అర్థములన్నవి. కనుక సర్వలోకములను పంచభూతాత్మకమగు జగత్తును సృష్టించిన దాబ్రహ్మము యొక్క దృష్టియే, ఊర్ధ్వ లోకములు ఏడు, అధో లోకములు ఏడు మొత్తము చతుర్ధశ భువనములు చెప్పబడుచున్నవి. ఆపైన గోలోకమనే లోక మొకటున్నదని కొందరందురు. సకల అని చెప్పుటచే ఏ లోకమున్నూ మినహాయింపబడలేదు. అన్ని లోకములు సృష్టిలోనివే యన్నమాట, కనుకనే

కం॥ లోకంబులు లోకేశులు, లోకస్థులు, తెగినతుది, అలోకంబగు
పెంజీకటి కవ్వల నెవ్వండే కాకృతిన్ వెలుగు నతనినే సేవింతున్"

అని భాగవతములో చెప్పబడినది. లోక్యః యితి లోకః అని వ్యుత్పత్తి. అనగా కానవచ్చే లోకము భూలోకము మాత్రమే అయినా, మిగతా లోకములు మనోనేత్రమునకు గోచరించును. లోకాతీతమైన పెంజీకటియు, అవ్వల ఏకాకృతి వెలుగు బ్రహ్మమున్ను శుద్ధ మనస్సు (లేక అతీంద్రియ మనస్సు) నకున్ను మాత్రమే గోచరము. కనుకనే ఆ బ్రహ్మ పదార్థముకూడా "మనసైవానుద్రష్టవ్యం" అనగా మనస్సుతో మాత్రమే తెలియదగినది అని శ్రుతి వివరించినది.ఇక తేజోంధకార రహితమగు దానిని (పరిపూర్ణ పరబ్రహ్మమును) మాత్రమే మనస్సు తెలుసుకొనలేదు. అది అలోక్యము, లోకాతీతము, గురుకృపా విశేషమున మాత్రమే అవలోకింప సాధ్యమైనది.

4) కల్పితా శేష సృష్టిః= అశేష సృష్టిః అనుటలో శేషించినదేమీ లేకుండా నిశ్శేషముగా అనుటలో, శేషశేషీభావములో శేషి అని చెప్పబడిన సృష్టికారణ బ్రహ్మముతో సహా (సృష్టి, సృష్టి కారణమూ రెండూ) కల్పితమే అనే భావము స్ఫురిస్తూవున్నది. కుమ్మరి చేసిన కుండలు శాశ్వతము కాకపోవచ్చునేగాని కుండలు బ్రద్దలైనా కుమ్మరి యుండునుగదా అని దృష్టాంతము చెప్పి వాదించవచ్చును. దృష్టాంతములో కుండయందు కుమ్మరి ప్రవేశించలేదు. కాని ద్రాష్టాంతికమందు "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" అనగా ఉపాదాన కారణమైన పదార్థమునందు తానిదివరకే ప్రవేశించియుండి (తానే వుపాదాన కారణముగా నుండి) యిపుడు నిమిత్తకారణముకూడా అయివున్న తానే జీవరూపముగా అనుప్రవేశము (తిరిగి ప్రవేశం) గావించెనని అర్థము. కనుక ఘట నాశనముతో ఘటద్రష్టయు, స్వప్నాంతమందు స్వప్న ద్రష్టయు లేనట్లే, సృష్టియొక్క అత్యంతాభావమునందు యిక సృష్ట హేతువైన దృష్టియు లేకపోవలసియుండును. దృష్టియొక్క ఆవరణమే సృష్టి. దీపము యొక్క ఆవరణము, దీప ప్రకాశము. ఆ ప్రకాశావరణము పోయినదంటే దీపము లేదని వేరే చెప్పవలసిన పనియుండదు. స్వప్న ద్రష్టయే అనువృత్తముగా జాగ్రత్త సుషుప్తులయందుం టున్నారుగదా! స్వప్న ద్రష్ట స్వప్నమువలెనే లేడని చెప్పుట యెట్లు? అని నరస్వప్న దృష్టాంతమున కాక్షేపణ రావచ్చును. కాని అధిష్టాన స్థానమున ఏక శరీరము ఏక అవస్థయే గాని యిన్ని శరీరములు యిన్ని అవస్థలు లేవు. కనుక దానిని సుర స్వప్నముగా

అచల ఋషులు నిర్ణయించియున్నారు.

5) నిఖిలనిగమదృష్టి : అనగా చతుర్వేదములు కూడా ఆ పరబ్రహ్మముయొక్క దృష్టి వలననైన సృష్టిలోనివే. "బ్రహ్మనిశ్వసితో వేదాః" వేదములు బ్రహ్మ యొక్క నిశ్వాసములో పుట్టినవని అర్థము. దృష్టి ఈక్ష, సంకల్పము, కామన అన్నీ సమానార్థకములని గుర్తించితిమి. దృక్ మనఃప్రాణములు మూడు కలసియే పనిచేయును. సంకల్పముతో మనశ్చలనము. చలనముతో ప్రాణము. ప్రాణ చలనముతో ధ్వన్యాత్మక ప్రణవము. అందుండి ఏబది అక్షరములు, వేదములు సర్వ వాఙ్మయము ఏర్పడెను. కనుక ఆ పరమాత్మ సంకల్ప రూప దృష్టిలోనే సకల వేదములు కూడా ఆవిర్భవించెనని చెప్పబడినది.

6) సత్పదార్థైక సృష్టిః = సత్పదార్థమును మాత్రమే సృష్టించినది అని అర్థము. పరబ్రహ్మము సద్రూపమైన ఆత్మగా మారుటయే ప్రథమ పరిణామము. నిస్సంకల్ప స్థితిలోనుంటే బ్రహ్మము. సంకల్పించినపుడదియే పరమాత్మ లేక ఆత్మ. బ్రహ్మమున్ను దాని తొలి మార్పుగా రూపొందిన ఆత్మయున్నూ రెండూ సద్రూపములే అయితే,యిక సత్పదార్థమును సృష్టించుట ఏమి? ఆత్మగా మారిన బ్రహ్మము అసత్పదార్థమైతేనే తప్ప యీ మాట కర్థములేదు ఏలననగా. యిది వరకు వున్నదియే పుట్టేనా? వుండివుంటే యిక పుట్టుట ఏమి? నిస్సంక కల్ప స్థితిలోనున్న బ్రహ్మమును అసత్ అనీ, సంకల్పస్థితిలో నున్నపుడు అదే ఆత్మ గనుక దానిని సత్ అనీ అన్నారని అనవలసివస్తోంది. కనుకనే తైత్తిరీయోపనిషత్తునందు "అసద్వా ఇదమగ్ర అసీత్తతోవై సదజాయత" అని చెప్పబడినది కనుక సదసత్తుల రూపంగా ఆత్మ బ్రహ్మలున్నవన్నమాట. అయితే "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్" అని చెప్పిన ఛాందోగ్యశ్రుతిమాటేఏమి? యిది యెట్లు సమన్వయము అని అడుగవచ్చును. అవును, సమన్వయించుట చాలా అవసరము. ఆత్మ బ్రహ్మలు భిన్నములు కావు. స్థితి భేదమే గాని ఇతర భేదము లేదు. అసత్ పదార్థమందు కూడా సత్ వుంటే తప్ప దాని నుండి సత్పదార్థము సృష్టికాదు. కనుక అది సద్రూపమున్ను అయి వుండవలెను అంటే బ్రహ్మము సదసద్రూపము. వుభయాత్మికము.రెండుండనిచో సృష్టి లేదని అనుభవమే గదా! బ్రహ్మముతో సహా అన్నిటి యందునూ క్షణికము అగు అసద్రూపమునూ మార్పు జెందని యొకానొక సత్తాయున్నూ స్ఫురించుచున్నవి. కేవలము సత్పదార్థమైతే మారనే మారదు. కేవలము అసత్తయితే తోచుటకే వీలులేదు. సత్ అనగా వునికి, అసత్ "వున్నది" అని అంటే, వున్నది అనే మాట సత్తే గనుక మనస్సునకు వున్నట్లుగా గోచరించేదంతా సదసద్రూపమే కనుక జగత్తుకు కారణమంటూ చెప్పాలంటే అది సదసద్రూపమనే చెప్పాలి. ఇందుకు శ్రుతి ప్రమాణం "అసదె ఇద మగ్ర ఆసత్ తత్సదాసత్ తత్స మభవత్ తదండం నిరవర్తత" "సదసచ్చాహమర్జున" అని గీత సద్రూపమైన ఆత్మ రూపమును ముందుగా పొంది బ్రహ్మము సద్రూపమగు జగత్తును సృష్టించెనంటే ఏశ్రుతికి విరుద్ధం కాదు.

7) అతద్గణ పరమేష్ఠిః = అనగా అతత్ = తత్పదార్థము గాని, గణ = సమూహములకు పరమేష్ఠి = సృష్టికర్తయైన చతుర్ముఖ బ్రహ్మ అయినదియు నని అర్థము. తత్ అనగా సృష్టికి పూర్వం నామ రూప క్రియా రహితమై ఏకమై అచలమైయుండి సృష్టి కత్యంత మూలకారణమైన బ్రహ్మము. త్రిమూర్తులు దేవ, గంధర్వ, కిన్నర కింపురుష యక్ష రాక్షస మానవ పశుపక్ష్యాదులన్నియు అతత్ గణములు. ముందుగా హిరణ్యగర్భుడుత్పత్తి

జెంది ఏమ్మట అతనిచే యీ దేవ గంధర్వాది ప్రాణికోటియంతయు నుత్పత్తి గావించినది కూడా పరమాత్మయొక్క యీ దృష్టియే యని తాత్పర్యము.

8) సత్పదార్థైక దృష్టిః = సత్పదార్థముగా కావలెనను సంకల్పము అని గుర్తించితిమి. అసద్రూపంలోనుండిన స్థితిలో యీ ప్రథమ సంకల్పము కలిగి నిస్సంకల్ప స్థితినుండి దిగజారి సద్రూపము వహించిన దన్నమాట. అంటే అభావస్థితినుండి భావరూపము చెందె ననవలెను. యిదియే సృష్టి. తానే సద్రూపమైన ఆత్మరూపము చెందెననవలెను. యిదియే సృష్టి. తానే సద్రూపమైన ఆత్మరూపము చెందెనన్నమాట. ఆ పిదప "తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశస్సంభూతః ఆకాశా ద్వాయుః వాయోరగ్నిః...." అను శ్రుత్యనుసారం సకల సృష్టి జరిగెను. "అస్తి త్యేవోప లబ్దవ్యః" అని కఠోపనిషత్ యీ ఆత్మను గురించి చెపుతోంది. సద్రూపమైన దానిని "అస్తి" అనీ, అసత్ రూపమైన దానిని "నాస్తి" అని మనం అంటున్నాము. అస్తి, నాస్తి పదములు సాపేక్షకత్వములో చేరినవే, "అస్తి" అనిగాని, "నాస్తి" అనిగాని మనం అంటున్నపుడు, సదసత్ రూపమైనకారణ బ్రహ్మమును గూర్చియే పల్కుచున్నాము. కనుకనే పరిపూర్ణ పరబ్రహ్మమును సత్, అసత్, అస్తి, నాస్తి అని పదములు తెలుపజాలవని పరిపూర్ణ భావజ్ఞుల నిర్ణయము. వెనుక సత్పదార్థైక సృష్టిః, అని చెప్పి యిపుడు సత్పదార్థైక దృష్టిః అని చెప్పబడుటచే పరమాత్మ యొక్క సంకల్పమే సృష్టికారణమని చెప్పవలసియున్నది.

9) భవగుణ పరమేష్టిః : భవము = అనగా 1) సంసారము పుట్టుట అని యొక అర్థమును 2) భవుడు = అనగా శివుడు (సర్వమంగళ స్వరూపుడు) అను మరియొక అర్థమున్ను గలవు యీ రెండర్థములలోను యీ సమాసమును విచారించదగును. సంసారగుణములేవి? 1) త్రిగుణములగు సత్వ రజస్తమస్సులు. వీని సామ్యావస్థయే ప్రకృతి 2) అజ్ఞానము అనగా తన నిజస్వరూపముయొక్క విస్మృతి. 3)అవివేకము అనగా వున్నవి వున్నట్లుగాను లేనివి లేనట్లుగానూ గుర్తింపలేకపోవుట. 4) అభిమానము అనగా యిది తన దేహము, తన వస్తువులు అను భేద దృష్టి కలిగియుండుట 5) రాగద్వేషములు అనగా తనవని అనుకొన్నవానియందు ప్రేమ యితరమునందు ప్రేమ లేకపోవుట 6) కర్మ అనగా క్రియారూపములో తన శ్రేయస్సు మాత్రమే దృష్టిలో నుంచుకొని స్వార్థ బుద్ధితో పనులు చేయుట 7) జన్మ అనగా పూర్వ దేహమును వదలి తన సంస్కారాభినివేశముల కనుగుణముగా తాను సృష్టించుకొన్న నూతన దేహములందు ప్రవేశించుచుండుట. యివి భవగుణములు. వీనికన్నిటికి మూలము త్రిగుణములు. ఇవి పరమాత్మయందు బీజరూపములో సృష్టికి పూర్వమే యుండుటచే వీని వికాసమునకు కూడా ఆపరమాత్మ సృష్టికర్తయగు బ్రహ్మవంటివాడే అగుచున్నాడు.

2) రెండవ అర్థములో భవగుణములు అంటె శివుని గుణములు అంటే మంగళకరమగు సమస్త కల్యాణ గుణములు. మొదటి అర్థములో ఏ గుణములు సంసార గుణములుగా వర్ణించితిమో ఆ గుణములేగాక తత్పత్తి యౌగికములగు సత్వసంపత్తి అఖండజ్ఞానము, బ్రహ్మాకారవృత్తి, నిరభిమానము, తూష్ణీభావము, నైష్కర్మ్యము, నిస్వార్థము, నిరుపాధికము యీ లక్షణములు సృష్టికి పూర్వమున్న బ్రహ్మ గుణములు. యివియే స్థితప్రజ్ఞ లక్షణములు. యిట్టి గుణముల వుత్పత్తికి కూడా ఆ పరమాత్మయే మూలకారణమని అర్థము.

10) మోక్షమార్గైక దృష్టి = మోక్షమార్గమునందే ఆసక్తి (దృష్టి)గలది. మోక్ష మనగా

విడుదల దేనినుంచి? బంధమేది? నిస్సంకల్ప స్థితిలోనుండక, సృష్టి సంకల్పము కల్గి, దాని ననుసరించి సత్వరజస్తమోగుణాత్మకమగు తన యందలి మాయనే వుపాదాన కారణముగా గైకొని (అనగా తానే వుపాదాన కారణంగానుండి) జీవేశ్వర జగద్రూపమగు సకల బ్రహ్మాండము లుగా తన మాయాశక్తి ప్రభావముచే తానే మార్పుచెంది, మరల తానే అందు జీవరూపంగా ప్రవేశించెను. దీనినే అభిన్న నిమిత్తోపాదాన కారణముగా నిర్ణయించిరి. పూర్ణనాభి (సాలెపురుగు : పట్టుపురుగు) తన నాభియందున్న జిగురు పదార్ధమును చొల్లురూపంగా వెలువరించి, తానే గూడల్లెనని దృష్టాంత మిత్తురు. యీ దృష్టాంతమున తన గూటిలో సాలెపురుగు బంధింపబడక తన గూటికి పైన విహరించును. అట్లే పరమాత్మ తన సృష్టికి విలక్షణుడై సాక్షిమాత్రుడుగా నున్నాడని యితరులందురు. కనుక దానికి బంధమేలేదు. యిక మోక్ష ప్రసక్తియేలేదు, కనుక ఆ పరమాత్మకు మోక్షాసక్తియు నుండవలసిన పనిలేదు. కనుక పరిపూర్ణభావజ్ఞులు పూర్ణనాభికి పట్టుపురుగు అని అర్ధము తీసుకొని దీనిని చక్కగా వివరించినారు. ఎట్లనగా పట్టుపురుగు తన చుట్టూ తాను గూడు అల్లుకొని, ఆ పట్టుకాయయందు చిక్కుపడి ఎట్లు యీ బంధమునుండి మోక్షం పొందుదునా అని పరితపించుచూ, చివరకు తా నల్లిన ఆగూటిని కొరికి రంధ్రము చేసుకొని అందుండి మోక్షము చెందును. అట్లే సృష్టి సంకల్పం చేసిన పరమాత్మ తన సృష్టియందు తానే తగుల్కొని, సృష్టిబంధమునుండి మోక్షము చెందుట కాసక్తి గలిగి ఆ దృష్టియందేయుండును. బంధమోక్షములు రెండూ సృష్టికారణమగు పరమాత్మవే, ఈ యెరుక లీలల గురించి కృష్ణదాసుగారు తమ కందార్ధములలో చక్కగా వివరించి, "వినుమూర్ణనాభి తా బుట్టిన మీదట" అను కందార్ధములోనున్ను, బంధమోక్షము లెవరికి అను పశ్నకు జవాబుగా "ఆటాడి ఆడకుండును" అనే కందార్ధములోనున్ను వివరించినారు. ఈ రెండు కందార్ధములూ నిజసాంప్రదాయక గురువుల పాద సన్నిధిని చక్కగా విచారించదగినవి.

పరమాత్మయే కావలెనని సృష్టి బంధమున చిక్కి దానినుండి మోక్షము, కోరుచున్నాడు అధోదృష్టిచే అక్షర పురుష నామమున జగత్స్వప్నమును గాంచుచూ, వూర్ధ్వదృష్టిచే పురుషోత్తముడనే నామమున నిస్సంకల్ప స్థితిలలోనికి పోవుచున్నాడు. క్షర అక్షర, పురుషోత్తములని ముప్వురు పురుషులు లేరు. ఒకడే పురుషుడు. త్రిపురుషైక పురుషుడు మోక్షస్థానము. పురుషోత్తమ స్థానము. బంధస్థానము అక్షర పురుషస్థానము. ఈ బంధ మోక్షములే లేనిది. పరిపూర్ణ పరబ్రహ్మము. అట్టి పరిపూర్ణబోధనను గ్రహించి సర్వ భ్రాంతి రహితము గావించిన సద్గురుమూర్తి కివే మా నమస్కృతులు.

శ్లో॥ సకల భువనరంగ *స్థాపనా స్తంభయష్టి          * "భంగ" యని పాఠాంతరము

స్వకరుణ రసవృష్టి స్తత్వమాలా సమష్టిః

సకల సమయసృష్టి సచ్చిదానంద దృష్టి

ర్నివసతు మయి నిత్యం శ్రీ గురోర్దివ్యదృష్టిః॥

తాత్పర్యం :- సకల భువనములతో గూడిన యీ జగన్నాటక రంగస్థలనిర్మాణమునకు మూల స్తంభమైయున్నదియును కరుణా రసమునే వర్షపాతముగా గురిపించునదియును, సమస్త తత్వములతో సమష్టిగా రచింపబడిన పూలహారముగలదియును, కాలమునకుగూడ సృష్టికారణ మైనదియును, సత్ చిత్ ఆనందమయ రూపమగు దృష్టి విశేషముగలదియునగు గురుదేవుల

అప్రాకృతమగు అఖండజ్ఞానదృష్టినాయందు నిత్యము స్థిరనివాసమై యుండుగాక :

విశేష వివరణం :- 1) సకల భువనరంగ స్థాపనా స్తంభయష్టిః 2) కరుణరసవృష్టిః 3) తత్వమాలా సమష్టిః 4) సమయసృష్టిః 5) సచ్చిదానందదృష్టిః 6) నివసితుమయి నిత్యం7)దివ్యదృష్టిః అనువాని నన్నిటిని విచారించవలెను.

1) సకల భువనరంగ స్థాపనారా స్తంభయష్టిః :- శరీరమే ఒక నర్తనశాల, అంతఃకరణమే రంగస్థలి. విషయ సంస్కారములే వాద్య విశేషములు. మనస్సే నర్తకి. వ్యష్టి అహంకార విశిష్టుడగు జీవుడే రంగస్థల నిర్మాత (స్టేజీ మేనేజరు) నాట్య ప్రదర్శనమునకు పూర్వపరమధ్య కాలములయందు, నర్తనశాలను రంగస్థలిని ప్రకాశింప చెయునది ప్రత్యగాత్మ ప్రకాశము.

అట్లే సమష్టియందు ప్రపంచమే యెక్క నర్తనశాలగా లేక నాటకశాలగా నిర్మించి సమష్టి అహంకార విశిష్టుడైన ఈశ్వరుడు జగన్నాటకమునకు సూత్రధారుడుగా నుండి సృష్టిస్థితి లయకారకుడై జీవులను పాత్రధారులుగా నొనర్చి, ఎవరి కర్మానుకూల ప్రవృత్తి ననుసరించి వారి కాయా పాత్రలనిచ్చి జగన్నాటక మాడించుచున్నాడు చిద్ఘనమగు పరమాత్మ ప్రకాశమే ఈ జగన్నాటకము నుద్దీపింప చేయుచున్నది. వ్యష్టి సమష్టి రూపమగు యీ నాటకశాలా నిర్మాణమునకు ఆధారము గానూ అధిష్ఠానముగానూ యున్నదా పరమాత్మయే ఆ నాటకరంగ స్థలికి మూలస్తంభ మొకటుండ వలెనుగదా! అది ఏది? అని ఋగ్వేదములో ప్రప్రధమున జిజ్ఞాస గావింపబడెను. ''కింస్విద్వనం కవుస వృక్షమాసీత్ యతో ద్యావాపృధివీ నిష్ఠతక్షుః?'' అనగా ఏ వనములోని యే చెట్టుయొక్క కర్రతో యీ భూమ్యాకాశములతో గూడిన జగన్నిర్మాణము గావింపబడెను? అను ప్రశ్నకు జవాబుగా ''బ్రహ్మ స వనం బ్రహ్మవృక్షమాసీత్ యతో ద్యావాపృధివీ నిష్ఠతక్షుః'' అని సమాధానము. అనగా జగదుపాదాన కారణమేదనగా బ్రహ్మవనములోని బ్రహ్మవృక్షము యొక్క కర్రతో భూమ్యాకాశములతో గూడిన బ్రహ్మాండము తయారుచేయబడెను. బ్రహ్మమే సమిష్టి వనమై అందలి యొక బ్రహ్మవృక్షము యొక్క కర్రతో యీ విశ్వరచన గావింపబడెను. చెక్కిన వారెవరు? బ్రహ్మమే. కనుక నిమిత్తోపాదాన కారణములు రెండూ బ్రహ్మమే. ఇదే అభిన్న నిమిత్తోపాదాన కారణము. సహాయ కారణములున్ను బ్రహ్మమే. కనుక యీ సకల బ్రహ్మండములతో గూడిన యీ జగన్నాటక రంగస్థల నిర్మాణమునకు మూల స్తంభము, నాటకశాల, అందలి రంగస్థలి పాత్రధారులు, జంత్రవాద్య విశేషములు, నాటకరంగ ప్రకాశమగు దీపమూ, సర్వమూ, ఆ పరమాత్మయే. యష్టి అనగా కర్ర అని అర్థమున్నూ యున్నది. అచలముగానున్న ఆధార మొకటుండినగాని చలన విశేషములు సౌష్ఠవముగా నుండజాలవు. రైలుపట్టాలు కదలకుండా నున్నపుడు వానిపై రైలెంత వేగముగా పరుగెత్తినా ప్రమాదముండదు గదా!

2) కరుణారసవృష్టిః = కరుణయే వర్షముగా గురిపించువాడు. సూర్యుడు తేజఃకిరణము లను, చంద్రుడు శీతల కిరణములను, అగ్ని యుష్ణతరంగములను, సహజముగా ప్రసారము చేసినట్లే పరమాత్మ కరుణారస ధారలను అవిచ్ఛిన్నముగా గురిపించుట పరమాత్మకు సహజము అతడు ప్రేమనిలయుడు. ప్రేమయే స్వరూపముగా గల వాడు. ఏలననగా అస్తి భాతి ప్రియములు బ్రహ్మము యొక్క స్వరూపము. మరిన్నీ విశిష్టాద్వైతమున జీవజగత్తు లాతని శరీరముగా నిర్ణయింపబడినవి. ఎవని శరీరమున వానికి ప్రేమయుండుట సహజ లక్షణమే

గదా! (God is Love) అనగా దైవము ప్రేమయే అని అర్థము. "ప్రియమి త్యుపాసీత" అనగా "ప్రేమ రూపములో భగవంతుని యుపాసింపు"మని శ్రుతి విధించినది. కనుక ప్రేమయే స్వరూపముగా కల పరమాత్మకు జీవులయెడ అపార కరుణ వుండుటలో ఆశ్చర్యములేదు. అందుచే సాలోక్య సామీప్య సారూప్యములే గాక తన సాయుజ్యమునే జీవుల కొసంగుచున్నాడు. ప్రేమరూపుడగు పరమాత్మయందునూ ఆ పరమాత్మ యొక్క మారు రూపములగు జగజ్జీవేశ్వరులయందునూ జీవులకున్ను ప్రేమ కలుగుచున్నది. జీవులకున్ను ప్రేమ కలుగుచున్నది. అందుకే "ఆత్మవస్తు కామాయ సర్వం ప్రియం భవతి" అని శ్రుతి చెప్పినది. నిజమగు భక్తుడందుచేతనే ప్రేమమయుడై సమస్త విశ్వమును ప్రేమించగలుగుచున్నాడు. నదీ ముఖద్వారమునుండి సముద్రజలము నదిలోనికి, నదీజలములు సముద్రములోనికి ప్రవహించురీతిగా యీ ప్రేమ ప్రవాహము జీవబ్రహ్మల మధ్య అన్యోన్యంగా ప్రసారమగుచున్నది.

9) తత్వమాలా సమష్టిః : సృష్టిలోగల తత్వములు 25 అని కొందరు, 36 అని కొందరు, 96 అని కొందరు నిర్ణయించినారు. ఒకే మూలతత్వమును, ఏ రకముగా, ఎన్ని తత్వములుగా విభజించి చెప్పినా చెప్పవచ్చును. కాని అన్ని తత్వముల సమిష్టి మొదటిదగు ఆ "ఏకమేఽ వా ద్వితీయం బ్రహ్మ" అను పరమాత్మయేగాని అన్యము గాదు. పూలనన్నిటిని చేర్చి యొక హారముగా గ్రుచ్చి దానికి మాల అని పేరిడినట్లే, తత్వముల సమిష్టిని పరమాత్మయనే మాలగా యీ శ్లోక మభివర్ణించినది అంటే వ్యష్టిలో నానా తత్వములుగానున్నది. సమిష్టిలో పరమాత్మగా నున్నది. అందుకే కృష్ణదేశికేంద్రులవారు "యెరుకన్న వివరించ తత్వాలు" అనిన్ని "తత్వతతి యెరుకంచనినా" అనిన్ని తమ కంఠార్థములలో పేర్కొన్నారు.

4) సకల సమయసృష్టిః = సమయ మనగా కాలము భూత భవిష్యత్ వర్తమాన కాలములనిన్ని వర్షాకాల, శీతాకాల, వేసవి కాలములనిన్ని, త్రికాలములుగా పేర్కొన్నారు. మరిన్ని కాలప్రమాణమును గ్రహగతుల ననుసరించి సూర్యచంద్ర బృహస్పతీత్యాది మానములను కల్పించి నిర్ణయించియున్నారు. కాలమనునది పదార్థము గాకపోయినా భాతిసిద్ధము లేక భావరూపం అయివున్నది. ఇది సృష్టితోనే లేకపోవుచున్నది. కనుక "సృష్టి" అనే భావన కలిగినపుడే "కాల" భావమున్ను ఏర్పడినది. సృష్టి అనేది అనాది, దానికి మొదలంటూ లేదనే పక్షములో కాలమూ అనాదే అనాలి. సృష్టికి పూర్వానంతర మధ్యస్థితులున్నవని అంటేనే సృష్టికి పూర్వకాలమనీ, సృష్టి అయే కాలమనిన్ని సృష్ట అనంతర కాలమనిన్ని భూత వర్తమాన భవిష్యత్కాలములని పేర్లు రాగలవు. పరమాత్మ నిస్సంకల్ప స్థితిలోనుండి సంకల్ప స్థితిలోనికి వచ్చెను. పరమాత్మకు సంకల్పమే కలుగలేదంటే సృష్టిలేదు కాలమూలేదు. ఒకటిగాని, అనేకములుగాని సంఘటనలున్నపుడే కాల ప్రసక్తి వచ్చును. ప్రథమ సంఘటనయే సృష్టి సంకల్పము. దాని ననుసరించి భూత భవిష్యత్ వర్తమాన కాలములను విభజన యేర్పడుచున్నది.

ఆ ప్రథమ సృష్టితో ఏకకాలమందే కాలమావిర్భవించుచున్నది. రెండు సంఘటనలుంటే ఆ రెంటి మధ్యకాలమునకు ఒక కొలత (పరిమాణము) నిర్ణయింపబడుచున్నది. కనుక సంకల్పరూపమైన దృష్టి ఎపుడు కలిగినచో అపుడే అహంవృత్తి చలనము, ప్రాణము, కాలము ఆవరణము ధ్వన్యాత్మకమగు శబ్దము "ప్రణవనాదము" ఇవన్నియు బ్రహ్మమునందొకే క్షణమున

ఆవిర్భవించి క్రమశః వికాసము చెంది జీవేశ్వర జగత్తుగా పరిణమించుచున్నది.

5) సచ్చిదానంద దృష్టిః సత్ + చిత్+ ఆనంద = సచ్చిదానంద, సత్ అనగా శాశ్వత వునికి, చిత్ అనగా అఖండ జ్ఞానము. ఆనంద మనగా అనంతమగు నిరతిశయ సుఖము. యీ సచ్చిదానందములు పరమాత్మకు స్వరూప లక్షణములుగా అభివర్ణింపబడినవి నేనే అను అహం స్ఫురణతోపాటే, సంకల్పము, నేనే శాశ్వతమగు ఉనికి గలిగి అఖండ జ్ఞానానందమయుడనై యున్నాననే భావోత్పత్తిన్ని కలుగుచున్నవి. ఇదియే సచ్చిదానంద దృష్టి. ఒక్కడనైన తాను అనేకం కావలెనని యిచ్ఛయున్న అనేకంగా అయిన తానా దృష్టికి కర్తననే కర్తృత్వ భావమున్ను, నేను యితరము అనే భేదభావనయున్ను, కలిగిన పిదప పరమాత్మ తన సృష్టియందు తానే పట్టు పురుగువలె బద్ధుడగుచున్నాడు. పరమాత్మయొక్క యీ పరిణామములో రాను రాను చిదానంద లక్షణములు క్షీణిస్తూ, అజ్ఞానము దుఃఖము పెరుగుటయు తటస్థించుచున్నవి. గాని తనతోపాటు తన యందు కల్గిన సర్వస్వమూ సచ్చిదానంద లక్షణములుగలదియే ఐననూ ఆవరణ మధికమైన కొలది సచ్చిదానందములు ప్రకాశింపక అనృత జడ దుఃఖములు అనునవన్నియు సృష్టికి పూర్వమందు అఖండ యెరుక యందు బీజరూపముగా యున్నవి. అఖండ యెరుక. నేను సచ్చిదానంద రూపుడును అనే దృష్టికూడా లేక కేవల నిస్సంకల్ప రూపమైన మరుపు రూపములోనున్నది. అందుకే "శుద్ధే సుషుప్తి దృష్టాంతం" అని దానిని సుషుప్త్యావస్థతో పోల్చినారు. నేను సచ్చిదానంద రూపుడనను దృష్టి ఎరుక లక్షణము. నేనను అహం వృత్తియేలేని స్థితి మరుపు యొక్క తొలిరూపము. యీ యెరుక మరుపులు లేనిదే పరిపూర్ణము.

6)నివసితు మయి నిత్యం = అనగా నాయం దెల్లపుడూ అఖండ జ్ఞానరూపమగు యీ యెరుక నిలబడియుండుగాక అని అర్థము. భక్తుడెందుకు యీ విధముగా కోరుకొనవలెను? నేనే జీవుడను, అజ్ఞానిని. దుఃఖ స్వరూపుడను అను దృష్టి పోయినగాని యీ ప్రపంచమున ఎవరికిన్ని శాంతిలేదు. యీ ఆవరణ దోషము తొలగినపుడే శాంతి సుఖములు గలుగును. ప్రథమంలో అశుభ వాసనలను శుభవాసనలచే తొలగించి, చివరకు శుభాశుభవాసనలు రెండునూ రహితమై కేవల సర్వవాసనాక్షయమైనపుడే మనోనాశనమున్ను కలుగును. "నానాకర్మజవాసనాన్విత మనోనాశంబు కాకున్న బ్రహ్మానందానుభవంబుగల్గునే?" అనగా అఖండ యెరుక స్థితియే కలుగదు. కనుక ముందుగా నేనే సచ్చిదానంద స్వరూపుడననే దృష్టి కలుగుటకు అంతఃకరణమున ఆ పరమాత్మయందు లగ్నమైన దృష్టి నెలకొనవలెనని భక్తుడు కోరుకొనుచున్నాడు.

7) శ్రీ గురోర్దివ్యదృష్టిః : అధిష్ఠాన చేతన బ్రహ్మమే. గురుస్వరూపము. సర్వమునకు అధిష్ఠానముగాను, ఆధారముగాను, సృష్ట్యాది పంచకృత్యములకు (సృష్టి స్థితి లయ నిగ్రహానుగ్రహములే పంచకృత్యములు) కర్తగాను, యున్న ఆ సచ్చిదానంద పరమాత్మయే దివ్యము. అనగా స్వయం ప్రకాశము, పారలౌకికము, అప్రాకృతము కాని సంకల్పరూపము. అట్టి గురు పరమాత్మ నా హృదయమందే యెల్లపుడు నివసించుగాక

జలము నెడబాయనొల్లని
జలచరముల రీవిబూని సచ్ఛిష్యుడు
హృజ్జలజంబను పీఠముపై
నిలిపి యితరముమాని గురువునే కొల్చుసుమ్మీ"

అన్నారు.శ్రీకృష్ణదేశికులవారు.అట్టి శక్తి సామర్థ్యములు నా కెట్లు కలుగును ? గురుకృపా ప్రసాదసిద్ధివలననే తప్ప యితర మార్గము లేదు. అట్టి గురుకృప నాశించియే భక్తు డీ శ్లోకద్వయముచే పరమాత్మను తన దేహమనే దేవాలయములో ప్రవేశించి స్థిరముగా నివసించుమని ప్రార్థించు చున్నాడు. "నీకృపాలోకనము నామీదా ప్రసరింపరాదా నేను నీ వాడనేగాదా!" అని అహరహము గురుదేవుల దివ్య శ్రీ చరణములను స్మరించుచుందుము గాక!

శ్లో॥ న గురో రధికం, నగురో రధికం
న గురో రధికం, న గురో రధికం
శివశాసనతః, శివశాసనతః
శివశాసనతః శిశాసనతః ॥

తాత్పర్యం:- గురువుకంటె అధికములేదు. అని రెట్టించి, రెట్టించి శివుడు తన ఆరూఢతను వెల్లడించుచున్నాడు.

శ్లో॥ ఇదమేవ శివం, ఇదమేవ శివం
ఇద మేవ శివం, ఇద మేవ శివం
హరిశాసనతో, హరిశాసనతో
హరిశాసనతో, హరిశాసనతః ॥

తాత్పర్యం:- ఈ గురుస్వరూపమే సర్వమంగళ స్వరూపమని రెట్టించి రెట్టించి శ్రీ మహావిష్ణువు పలుకుచున్నాడు.

శ్లో॥ విదితం, విదితం, విదితం, విదితం,
విజనం, విజనం, విజనం, విజనం,
విధి శాసనతో, విధి శాసనతో
విధి శాసనతో, విధి శాసనతః

తాత్పర్యం:- ఈ గురు స్వరూపము స్పష్టముగా తెలియబడుచున్నదని అందు మరొకరు గానవచ్చుటలేదని, విధి అనగా చతుర్ముఖ బ్రహ్మ తన ఆరూఢత నుద్ఘాటించుచున్నాడు. ఈ మూడు శ్లోకములలో బ్రహ్మ విష్ణు మహేశ్వరులు (త్రిమూర్తులు) గురుస్వరూపమును గూర్చిన తమ దృఢనిశ్చయ జ్ఞానము నుద్ఘాటించియున్నారు.

వివరణములు:- యీ శ్లోకములలోని 1)అధికం 2) శివం 3) విదితం 4) విజనం 5) త్రిమూర్తులు(శివ విష్ణు విరించి) 6) శాసనం అను శబ్దములను వివరించి తెలుసుకొనుట ఆవశ్యకము.

1)న గురో రధికం= గురువుకంటె అధికమగునది ఏదీలేదు అధిక మనగా ఎక్కువ అనీ, పెద్దది అనీ, లాభము అనీ అర్థములు గలవు. గురు అను శబ్దమునకే పెద్దది అని అర్థము. బ్రహ్మవస్తువు కంటె పెద్దది ఏమిలేదు."అణో రణీయాన్ మహతో మహీయాన్" అను శ్రుతిననుసరించి అ గురుస్వరూపమైన బ్రహ్మపదార్థము మహత్‌కంటెను పెద్దదియై దాని నతిక్రమించి యున్నదని భావము. కనుక గురుశబ్దమునకు గురుస్వరూపము (పరమాత్మ స్వరూపం) అని అర్థముగాని, మనుష్య శరీరముతో తనకు మంత్రోపదేశము చేసిన గురుడు కాడని స్పష్టము. ఆ గురు స్వరూపమే. మానవాకృతిలో తన్ను ధరించుటకైయిట నవతరించెనని

శిష్యుడు భావించనిచో కడతేరలేడు. సృష్టికి పూర్వము బ్రహ్మమునకు అన్యముగానే పదార్థము లేనేలేదుగదా? అపుడది దేనికంటె పెద్దది? దేనికంటె చిన్నది ? పెద్ద చిన్న అను పదములు పరస్పర సాపేక్షికములుగదా ? అని అంటె, తన ఆవరణమునందే, తానే అనేక వస్తువులుగా మారుచున్నది. అవిఅన్నియు తన ఆవరణములోనివే కనుక అవి తనకంటె చిన్నవిగా నుండక తప్పదు. ఒకే గీత గీచి, దాని కొసలు పెంచకుండా దానిని పెద్దదానిగా చేయుటయెట్లు ? అనే సమస్యకు, ఒక బుద్ధిమంతుడు దాని ప్రక్కనే దానికంటె ఒక చిన్నగీతను గీచినాడట! అపుడు మొదటిగీత తరువాత గీచిన గీతకంటె పెద్దదగునుగదా ! అట్లె తానే నామ రూపాత్మకమగు సమస్త వస్తువులుగా తన ఆవరణమునందే మార్పులు చెందుటచే సృష్టిలోని సమస్తము కంటెను అది పెద్ద వస్తువే అగుచున్నది. అయితే తన ఆవరణ దాటితే తాను శూన్యమే అగుచున్నది. గనుక తనకంటె పెద్దదిగా అది మారురూపం వహించజాలదు. కనుక దానికంటె పెద్దవస్తువు సృష్టిలో లేనేలేదు-అని చెప్పబడుచున్నది.అధికమగు శబ్దమునకుగల లాభము అని అర్థము కూడా యిట సమన్వయమే అగుచున్నది. ఎట్లనగా ల-భము అనే మాటకు యిదివరకు ఒకానొక వస్తువునకుండె విలువకంటె అదనముగా లభించినదానిని లాభమందురు. లేదా క్రొత్తగా లభించిన ఒక వస్తువుకూడా లాభమనదగును. ఈ అర్థములో గురుస్వరూపమే లభించే అన్ని లాభములకంటె నుత్కృష్టమైనది. అంతకంటె అదనంగా ప్రాప్తించదగిన గొప్పలాభము మరియొకటి లేదు. అదియే లాభమునకు లేక సిద్ధికి పరాకాష్ఠ. అదియే చరమ లక్ష్యము. సాధనలచేత పొందగలిన సిద్ధులలో అంతకంటె నుత్కృష్టమగు సిద్ధిలేదు. గురుస్వరూప సాక్షాత్కారమే (లేక పరమాత్మస్వరూప సాక్షాత్కారమే) ఆ సిద్ధి స్వతస్సిద్ధమగు పరిపూర్ణ పరబ్రహ్మము, ఏ సాధనలచేతను ప్రాప్తింపదగినది కాదు. కనుకనే దానిని సాధనాంతర నిరపేక్షకమన్నారు. గురుకృపా సంసిద్ధిలేక అది యెంతవారికి లభించదు.

2) ఇదమేవ శివం= అనగా యీ గురుస్వరూపమే శివస్వరూపం శివం అనగా త్రిమూర్తులుగా చెప్పబడిన బ్రహ్మ విష్ణు మహేశ్వరులోని మహేశ్వరుడు గాడు. పరిశుద్ధుడని, పరమాత్మయనీ, మోక్షమనీ, వేదమనీ, పరమానంద స్వరూపుడనీ, శుభమనీ, క్షేమకరమనీ, సుఖస్వరూపమనీ శివం అనుమాటకు నానార్థములున్ననూ, యీ అర్థములన్నియూ ఆ గురు స్వరూపముయెడల మాత్రమే సార్థకములు. మరియు గురుస్వరూపముతోనే సమన్వయింపదగి యున్నవి. అది అత్యంత పరిశుద్ధము "సర్వ శుద్ధః పవిత్రోసా" అని దానిని గురుగీత అన్యత్రా అభివర్ణించుచున్నది. పరమాత్మ స్థానమే మోక్షస్థానము. వేదమనగా జ్ఞానము తెలివిచే తెలియదగినది. నిరతిశయ సుఖస్వరూపముగా నిర్వచింపబడిన ఆనందము, దాని స్వరూప లక్షణములలో నొకటి. అఖండ జ్ఞానమని చెప్పబడిన చిల్ల క్షణము. మరొకటి మంగళప్రదము, శుభప్రదము నగుటచే అదియే శ్రీకార స్వరూపము. శబ్దరూపమగు వేదవాఙ్మయ మంతటికి మూలమగు పంచాశత్ (యేబది) వర్ణములుగా దేనినుండి ఆవిర్భవించెనో ఆ ప్రణవము పరవాగ్రూపముగా దానియందే యున్నది. నామ రూపాత్మకమగు సమస్తమున కదియే పుట్టినిల్లు. కనుక ఓంకార, శ్రీకరములు గురుపరమాత్మయే అయివుండుటచే అది శివస్వరూపముగా యీ శ్లోకమునం దుద్ఘాటింపబడినది. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" "సత్యం శివం సుందరం" అను శ్రుతి వాక్యముల యందలి సర్వాశబ్దార్థములు యీ "శివం" అను మాటకు అన్వయింపనగునని "శివం" శబ్దము యొక్క నానార్థములు సూచించుచున్నవి.

3) విదితం= ఎరుగబడినది. వినబడినది అన్యత్రా తెలియబడినది. విదితం అనగా స్పష్టముగా ప్రకటమై ప్రకాశించుచున్నది. ఆ గురు పరమాత్మయొక్క స్వరూపము యెక్కడో పరోక్షముగా లేదు. తనకు బయట, లోపల, తనయందు సర్వేసర్వత్ర నిండియే యున్నదగుటచే వివేకవంతుల కది ప్రత్యక్షముగానే యున్నది. అట్టి వివేకము లేనివారు మాత్రము సూర్యోదయమును గ్రుడ్డివాడు తెలుసుకొనలేనట్లే తెలియజాలకున్నారు. ఈ భావమునే గురుగీత యీ క్రింది శ్లోకమున నుద్ఘాటించుచున్నది:-

శ్లో॥ శ్రీ గురోః పరమం రూపం వివేకం చక్షు రగ్రతః
మందభాగ్యాన పశ్యన్తి అంధ సూర్యోదయం యధా

సృష్టి అంతయు ఆ గురుపరమాత్మయొక్క మారురూపముగా గుర్తించినవారి కేదిచూచినా, వినినా,తోచినా అంతయు గురుస్వరూపమేగాని అన్య మేమియు లేదు. గురుముఖతః వస్తునిర్ణయము పొందినవారు దానిని యెల్లపుడు దర్శించుచున్నారు. కనుకనే అట్టి దృషి పెంపొందిన ప్రహ్లాద కుమారుడు

కం॥ "ఇందు గల డందు లేడని, సందేహము వలదు, చక్రి
సర్వోపగతుం, డెందెందు వెదకి చూచిన, యందందేగలడు"

అని వుద్ఘాటించగలిగెను.

4) విజనం = అనగా జనులులేని నిర్జన ప్రదేశము. జీవోపాధుల యుత్పత్తికి పూర్వము నిజరూపములో ఆ గురుపరమాత్మ యొక్కడే యున్నాడు. అపుడు ఒకటి, రెండు మొదలగు సంఖ్యానీకం యొక్క ప్రసక్తియే లేదు. ఎలననగా ఒకటి అనే సంఖ్య 2,3,యిత్యాది సంఖ్యానీకమును అపేక్షించియే ఒకటి అనబడుచున్నది. నానాత్వము లేనపుడు ఏకత్వముండి నను దానిని ఒకటి అని పిలువరాదు. విజనం అన్నపుడు దానియందుగల 84 లక్షల జీవోపాధులుగాన రాలేదు. కాని ఒకప్పుడు గానవచ్చిదనీ, ముందు గానవత్తురనీ ధ్వని యున్నది."ఏకం అనేకం భవతి," "అనేకం ఏకం భవతి" అనే శ్రుతియందు అనేకం ఏకం భవతి అయిన స్థితి మాత్రమే విజనం అను శబ్దముచే సూచింపబడుచున్నది. తనయందున్న అనేక నామరూపాలు ప్రకటముకాక పూర్వము అది విజనమే. తాబేలు అవసరానుసారం తన అవయవములన్నియు తనలోనికి వుపసంహరించుకొనునట్లు సర్వమును పరమాత్మ తనలోనికి వుపసంహరించుకొనుచున్నది.

5) త్రిమూర్తులు= బ్రహ్మ విష్ణు మహేశ్వరులు వీరే ప్రధమములో రూప నామములు పొందినవారు. "ఏకో దేవ స్త్రిధా భిన్నః బ్రహ్మ విష్ణు మహేశ్వరాః" అని చెప్పబడినది.

శ్లో॥ "గురు స్సత్వమయో విష్ణు ర్రాజస శ్చతురాననః,
తామసో రుద్రరూపేణ సృజ త్యవతి హంతి చ"

అని గురుగీత వారి గుణములు క్రియలు వర్ణించినది తాము ప్రకటమైన స్థానము వీరికి తెలిసినంతగా యితరులకు తెలిసియుండదు. కనుక వారి మాటలకు యెక్కువ విలువ నీయవలసియున్నది. తమ మాతృస్థానమును గూర్చి వారు చేసిన నిర్ణయములే యీ శ్లోకముల యందు పేర్కొనబడినవి.

6)శాసనము = అనగా ఆజ్ఞ. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు చేసిన యీ నిర్ణయములు పరమ సత్యములు. చక్రవర్తి ఆజ్ఞకు తిరుగులేని విధంగా బ్రహ్మ విష్ణు మహేశ్వరులు చెసిన

యీ నిర్ణయములను తెలుపలేదు. వారి ఆజ్ఞలకు లోబడి గురు స్వరూపము ఆయా విధములుగా నైనదని అర్థము చెప్పకొరాదు. ఆ గురు స్వరూపమును యధాతధంగా. వున్న స్థితిని వున్నట్లుగా సందర్భివర్ణించినారు. వారి నిర్ణయములను ఎట్టి సంకోచమూ ఎట్టి ప్రశ్నయూ లేకుండా విశ్వసింప వలసియున్నదని మాత్రమే అర్థము.

భూమా పదార్థమై. శివ స్వరూపమై. ప్రత్యక్షముగా గానవచ్చు ఆ గురు పరమాత్మ స్వరూపమున కివే మా నమస్కృతులు.

శ్లో॥ ఏవం విధం గురుంధ్యాత్వా జ్ఞానముత్పద్య తే స్వయం.
తదా గురూపదేశేన ముక్తోహ మితి భావయేత్.

తాత్పర్యం:- ఈ ప్రకారముగా గురుధ్యానము చేసినచో పరమాత్మ జ్ఞానము దానంతట నదే కలుగగలదు. అప్పుడు గురుమూర్తి అనుగ్రహించిన వుపదేశముచే గురుభక్తుడు ముక్తిని చెందితినని భావించవలెను.

విశేష వివరణములు:- 1) ఏవం విధం 2) గురుధ్యానము 3) జ్ఞానము 4) గురూపదేశము 5) ముక్తి.

1) ఏవం విధం:- ఈ ప్రకారముగా అని యర్థము అనగా యీ శ్లోకమునకు గురుగీతలో చెప్పబడిన పూర్వ శ్లోకములలో చెప్పన విధంగా గురుధ్యానము చేయుచుండినయెడల దానంతట అదే గురు భక్తునికి జ్ఞానము గలుగును.

2) గురుధ్యానం:-

శ్లో॥ శ్రవణం, కీర్తనం, స్మరణం, విష్ణోః పాద సేవనం,
అర్చనం, వందనం, దాస్యం, సఖ్య మాత్మ నివేదనం

అను తొమ్మిది విధముల బాహ్యభక్తి విధానములున్నవి కాని గురూపాసనా విధానమునందు ధ్యానమునకు విశేష ప్రాధానత్య కలదు. ధ్యానము పూర్తిగా అంతరంగిక భక్తి విధానమునకు సంబంధించినది. ధ్యానము రెండు విధములు 1) సగుణ ధ్యానము, 2)నిర్గుణధ్యానం ఈ రెండు విధములు గూడ గురుగీతయందు చెప్పబడియున్నవి. గురుగీత అనుష్ఠానాధ్యాయయునందు. అంగన్యాసకరన్యాసములు చెప్పిన పిదప ధ్యానశ్లోకములు చెప్పబడియున్నవి.

సగుణధ్యానం - సగుణధ్యానములో తన శరీరములో మూర్ధ్ని స్థానమున సహస్రార పద్మమున ఓంకార సింహాసనమున గురుమూర్తిని ప్రతిష్ఠించుకొనవలెను ఏలననగా హంస రూపములో ఆధారాది షట్చక్రములయందు సంచరించు ప్రాణమే అన్ని దేహములను ధరించి భరించుచూ బ్రహ్మాండమంతయూగూడ వ్యాపించి శాశ్వతమై సర్వాధారమై యున్నది. ఇట్టి ప్రాణము సహస్రారమునకు చేరి నిశ్చలమగుచున్నది. అట్టి మహోత్కృష్టస్థానమున గురుమూర్తి రూపమును ఆయన దివ్య పాదపద్మములను సుప్రతిషిత మొనర్చుకొనవలెను. పరమ శాంత రూపములో అభయ ముద్రతో ప్రసన్నమగు ముఖముతో. కరుణామృత దృష్టితో, విమల గంధ పుష్పాంబర విభూషణములతో. ప్రకాశించు జ్ఞానానందమయమగు దివ్యరూపముతో నున్న వానిగా గురు రూపమును భావించుకొనవలెను. ఆ మూర్తియందే మనస్సును కదలనీయకుండా నిలుపుట అభ్యసించవలెను. ఇట్టి అభ్యాసముచే కొంత కాలమునకు నిర్గుణ ధ్యానమునందు నిలుచుటకు మనస్సు శక్తివంతంకాగలదు కనుక సగుణ ధ్యానముయొక్క అవసరమును గుర్తించి గురుమూర్తి

యొక్క యిట్టి సర్వమంగళ స్వరూపమును విస్మరించకుండ మనస్సునందు ధారణచేయుటకై అవకాశముగలిగినపుడెల్ల గురుశరీరమును విమలగంధ పుష్ప వస్త్రాభరణములచే నలంకరించి ఈ రూపముతో గురుమూర్తిని సింహాసనారూఢునిచేసి గురుపూజ చేసుకొనుచుండ వలెను. ఆ మూర్తివంతమును చెరగిపోకుండ హృత్ఫలకమునందు చిత్రించుకొనవలెను. ఆయన పాదపద్మముల యందు బుట్టిన ప్రాణరూప యుదకధారచే తన బాహ్యాభ్యంతరములు పరిశుద్ధమగుచున్నవని భావించుకొనుచుండవలెను. సాకారమూ సగుణమూ నగునిట్టి మూర్తివంతము సంకల్ప మాత్రమున స్ఫురించుటకు అవసరమగునంత కాలమూ యిట్టి సగుణ ధ్యానము విడువరాదు "ఏకోమూర్తి స్త్రీధాభిన్నః బ్రహ్మ విష్ణు, మహేశ్వరాః" గురుదేవుడే ఆ ఏక మూర్తి. ఈ గురుమూర్తి

శ్లో॥ అ త్రినేత్ర శ్శివ స్సాక్షాత్ ద్విబాహుశ్చ హరి స్స్వయం
అచతుర్వదనో బ్రహ్మ శ్రీ గురుః కధితః ప్రియే॥

అనగా గురుమూర్తి మూడు కన్నులు లేని శివుడు. రెండుచేతులు మాత్రమే గల విష్ణువు. నాలుగు ముఖములు లేని బ్రహ్మయని భావించుచుండవలెను. ఇట్టి భావనవలన గురువు నరమాత్రుడనే దృష్టి నశించిపోగలదు. దైవమేననే ఆరూఢత కలిగినపుడు మాత్రమే గురుగీతా ధర్మము లన్నియు నాతనికి చిక్కగలవు అని గురుగీతయే-

"యస్య దేవే పరాభక్తి ర్యధా దేవే తథా గురౌ
తస్యైతే కధితా హ్యర్థా ప్రకాశంతే మహాత్మనః

అని చెప్పుచున్నది.

నిర్గుణ ధ్యానం:- "గురుస్సాక్షాత్ పరబ్రహ్మ" అనే భావము దృఢపడుటకై నిర్గుణ ధ్యానము అవసరము. సృష్టికి పూర్వము, నిత్యశుద్ధ బుద్ధ ముక్త స్వరూపమై, "సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి" అను సంకల్పము పూని సృష్టి, స్థితి, లయ, నిగ్రహాను గ్రహములను పంచకృత్యము లకు ఆధారమూ, అధిష్ఠానమూనై, సర్వత్రా తానై, సర్వమూ తానేయై యున్న గొప్ప స్వరూపము (భూమాపదార్థము లేక గొప్పతత్వము) ఏదియో అదియే పరమాత్మ స్వరూపము, మోక్షస్థానము అదియే గురుపరమాత్మ యొక్క స్వరూపం అను భావనయందు మనస్సును సంలగ్న మొనర్చుటే నిర్గుణధ్యానము. ఈ ధ్యానము ధారావాహికముగా నొనర్చు చుండినచో మనస్సు శుద్ధమై నిరింద్రియ మగును అట్టి స్థితి ఏ క్షణకాలము సిద్ధించిననూ భక్తుడు ధన్యుడే.

ఏ సాధనయైనను సిద్ధింపవలెనన్నచో సాధకుడు యమ నియమములు కల్గి యుండుట ముఖ్యావసరము. లేనిచో ఏ సాధనయూ సిద్ధింపదు. ఏలననగా ఒక్క అంతఃకరణయే వృత్తి భేదముచే జ్ఞానమనో బుద్ధి చిత్తాహంకారములను పేర్లు పొందినది. అంతఃకరణ పరిశుద్ధి లేనిచో జ్ఞానమును పురస్కరించుకొని చేయు తత్వ జిజ్ఞాసగాని. మనస్సును పురస్కరించుకొని మనోలయము చేయుటకు అభ్యసింపబడు యోగసాధనకాని. బుద్ధిచే పూర్వపక్ష సిద్ధాంతములను నిర్ణయించు మత సాధనకాని, చిత్తేంద్రియమును పురష్కరించుకొని చేయు భక్తి సాధనకాని. అహంకారమును పురష్కరించుకొని చేయు మంత్రోపాసనగాని ఫలప్రదములు కావు. కనుక సాధకుడైనభక్తుడు యమనియమములు కల్గియుండ వలెను.భూతదయ. అహింస. సత్యసంభాషణ. దొంగిలించ కుండుట. బ్రహ్మచర్యము. ఎవరి

సొత్తును దానపూర్వకముగా కూడా స్వీకరించకుండుట అను నీ యైదున్ను యమమనబడును. శౌచము, తపస్సు, సంతోషము, స్వాధ్యాయము, (ఉత్తమ గ్రంధ శోధనము) ఈశ్వర ప్రణిధానము లేక గురుసమాశ్రయణము అనునవి నియమమనబడును. గ్రంధ విస్తరణ భీతిచే వీనిని యిచట వివరించుట లేదు ఏ వేదాంత గ్రంధమునందైనను యివి లభ్యముకాగలవు. ఈ యమ నియమాదుల ప్రయోజనము అంతఃకరణ శుద్ధి లేక చిత్తశుద్ధి. ఇది లేనివానికి ధ్యానము కుదరదనియే నొక్కి చెప్పనగును.

3)జ్ఞానము :- ఇంద్రియజన్యజ్ఞానము, శాస్త్రజ్ఞానము, యుక్తాయుక్తవిచక్షణారూప జ్ఞానము మొదలగు జ్ఞానములు యిచట ప్రసక్తములుకావు. జ్ఞానమనగా కేవల పరబ్రహ్మజ్ఞానమునే గ్రహించవలయును. యీ జ్ఞానము శాస్త్రశ్రవణముచే గలిగేదికాదు. స్వయముగా తనకుతానే కలుగవలెను. భగవద్గీత 13 వ అధ్యాయములో చెప్పబడిన అమానిత్వాది లక్షణములన్నియు గూడ యీ జ్ఞానము ననుసరించి అప్రయత్నముగానే కలుగును. యీ కల్గిన జ్ఞానము పరోక్ష జ్ఞానమా? లేక అపరోక్ష జ్ఞానమా అంటే పరోక్షజ్ఞానము మాత్రమే, అయితే శాస్త్రజ్ఞానమువలన ఇట్టి పరోక్ష జ్ఞానము లభించదా! యీ ధ్యాన పద్ధతి నవలంభించనేల? యంటే శాస్త్ర జ్ఞానము కేవలం వాచాజ్ఞానము మాత్రమే యగును. అమానిత్వాది లక్షణోపేతమగు పరబ్రహ్మ విషయకమగు జ్ఞానము కానేరదు. శాస్త్ర పండితులయ్యును దుష్ట ప్రవృత్తిలో నుండువారనేకులు నేడు మనకు గానవచ్చు చున్నారు. వారు అజ్ఞానులకన్న హీనులే యని యనదగును. కనుకనే అమానిత్వాది లక్షణోపేతమగు జ్ఞానమును వర్ణించి, దాని కన్న భిన్నమైనది అజ్ఞానమేనని భగవద్గీత యుద్ఘాటించినది. "సద్గుణంబు ల్లెల సంఘంబులై వచ్చి అసుర బాలకునందు నలముకొనియె" గురుధ్యానముచే సిద్ధించిన జ్ఞానముతోపాటే అమానిత్వాది సకల సద్గుణములు వచ్చి యా భక్తుని అంతఃకరణమందువసించును. అట్టి సద్గుణంబుల లవడకున్నంతవరకు సాధకునికి జ్ఞానోదయం కాలేదనియే చెప్పనగును. ఈ అమానిత్వాది లక్షణములు భగవద్గీత 13 అధ్యాయం 7 నుంచి 11 వరకు గల శ్లోకములలో చెప్పబడియున్నవి. ఇవన్నియు గల్గిన నాడే, సాధకుడు పూర్ణబోధ కధికారి కాగలడు. అతనికి నిరాటంకముగా పరిపూర్ణ గురువు పరిపూర్ణ బోధ ననుగ్రహించగలడు. అంతవరకు సద్గురువు ధ్యానపద్ధతియందే శిష్యులచే కృషి చేయించును.

4) గురూపదేశం : అనగా శిష్యునికి గురువు అనుష్ఠాన మంత్రమును చెవిలో చెప్పుటకాదు. వస్తు నిశ్చయంగా ఆత్మస్వరూపమును దర్శింపచేయుట లేక సన్నిహిత మొనర్చుటయే యుపదేశము. ఉదాహరణకు "తత్వమసి" యను వాక్యమును శిష్యునిచే శ్రవణం చేయించుటయే యుపదేశము గాదు. "త్వం" పదముచే చెప్పబడిన ప్రత్యగాత్మ స్వరూపమును, "తత్" పదముచే లక్షింపబడిన పరమాత్మ (లేక పరబ్రహ్మమును) ను శిష్యునికి చూపించి పిమ్మట "అసి" అను పదముచే వుపలక్షితమైన అఖండాత్మను శిష్యునిచే దర్శింపచేయించుటే నిజమగు యుపదేశము. అందుకే గురుగీతలో "త్వం పదం దర్శితం యేన" "తత్ పదం దర్శితంయేన" అసిపదం దర్శితం యేన" తస్మై శ్రీ గురువేనమః అని మూడు శ్లోకములలోనూ చెప్పబడినది. అపుడుగాని శిష్యునికి అపరోక్ష సాక్షాత్కారము కాదు. అపుడే అపరోక్ష జ్ఞానము కలిగి తానే ఆ పరమాత్మను అనే అఖండ జ్ఞానానుభవము కల్గును.

అపుడుగాని సర్వసందేహములు నిరస్తముకావు. అపుడుగాని అజ్ఞాన బంధవిముక్తిలేదు.

5) ముక్తి = సామాన్యార్థములో, తానే అఖండాత్మ స్వరూపుడనని దృఢముగా గుర్తించుటయే ముక్తి. కాని అట్లు గుర్తించక పూర్వము బద్ధుడనని శంకించిన తానే, యిపుడు ముక్తుడనని భావించును గదా! కనుక యీ బంధమోక్ష స్వరూపుడు తానే, అపుడు అజ్ఞాన స్వరూపుడు, ఇపుడు మహాజ్ఞాని, ఈ జ్ఞానాఽజ్ఞానరూపములు రెండూ ఒక జ్ఞానానివే. అనగా ఒక అంతఃకరణము నకు సంబంధించినవే గదా! తొలుత స్వస్వరూప విస్మృతిచే అజ్ఞానావరణము చెందినదీ తానే. ఇపుడు గురుకృపచే ఆ యజ్ఞానావరణమును తొలగించుకొని, తన స్వస్వరూపమును గుర్తెరిగినదీ తానే. ఇపుడు గలిగిన యీ అఖండ జ్ఞానము మరల ఆవరణము కల్పించుకొన నేర్చును గదా! కావలెనని సృష్టి సంకల్పము బూని తన సృష్టియందు తనకు తానే పట్టుపురుగు వలె బంధమున చిక్కెను గదా! "స్వసంకల్ప వశాద్బద్ధో నిస్సంకల్పాద్విముచ్యతే" అనగా పరమాత్మ స్వరూపుడనైన, నేను, నా స్వసంకల్పముచే, నేనే సృష్టిరూపం వహించి, ఆ సృష్టించిన ప్రాణులయందు నేనే జీవరూపంగా ప్రవేశించి బద్ధుడనైపోతిని. తొలుత సృష్టి సంకల్పమునకు పూర్వం, నిస్సంకల్పుడనై ముక్త రూపములోనుంటిని. ఇపుడు మరల నా తొలి రూపములో నిస్సంకల్పుడనై ఏకమాత్రుడనై యున్నాను. ఈ సంకల్ప నిస్సంకల్పములు, జాగ్రత సుషుప్తులవలె నాకు సహజములైయున్నవి. నా గుర్తెయీ సంకల్ప నిస్సంకల్పములలో నడయాడుచున్నది. ఈ గుర్తునే వీడిన గాని తిరిగి సంకల్పించి తిరిగి బద్ధుడనై పోవుట తప్పదు సంకల్పములేని కేవల నిస్సంకల్పస్థితి పరిపూర్ణ పరబ్రహ్మమందేగాని నాకు సాధ్యముకాదు.

ఈ జ్ఞానాఽజ్ఞానములు (యెరుక మరుపులు) సంకల్ప నిస్సంకల్పములు నాకు సహజము. ఇక నెప్పటికి స్వకల్పిత బంధజాలమున చిక్కకుండు నుపాయమేది? సర్వ ద్వంద్వ రహితమగు నిరపేక్షిక కేవల పరిపూర్ణ పరబ్రహ్మము నా కన్యమై వుండక తప్పదు. అది నేను కాజాలను సరిగదా ద్వంద్వ లక్షణములు సహజమైయున్న నా గుర్తుచే ఏ ద్వంద్వములూ ఏ మాత్రమూలేని దానిని గుర్తింపజాలను. కనుక నా జ్ఞానావరణమును విడచినగాని అది తెలియబడదు. "స్వయం బ్రహ్మమయో భూత్వా తత్పరంచ అవలోకయేత్" అని గురుగీత అన్యత్రా యుద్ఘాటించుచున్నది. నేనిపుడు బ్రహ్మస్వరూపుడనై యున్నాను. నా కన్యమైనదానిని చూడవలెనంటే నన్ను నా జ్ఞానావరణముతో సహా విడచి చూడవలెగదా! అని తన్ను తాను విడచుట తోడనే తానే లేకపోవుచున్నాడు. అదియే నిజమగు ముక్తి. అపుడునేను ముక్తుడనని భావించే అహమే లేకుండాపోవును. "ముక్తోహం" అని పలికేదే లేకపోయినది. నా "అహము" నకు (నేను అనుదానికి) ముక్తి కలిగినది. నా అజ్ఞానమునుండి విముక్తి గలిగి జ్ఞానము పొందుట ముక్తిగాదు. జ్ఞానాజ్ఞాన రూపమగు నా "అహం" అనగా "నేను" లేకుండపోవుటయే నిజమగు ముక్తి. ఏలననగా తొలుత "అహం బ్రహ్మాస్మి" అనే భ్రాంతి రూపములో నుంటిని. "భ్రమేణాహం" అనగా అహమే నేను అనుటయే భ్రమ. నేన్నెటికీ పరిపూర్ణ పరబ్రహ్మమును కాజాలను. కనుక "అహం బ్రహ్మాస్మి" అనుట మరీ భ్రమ. మరి యిప్పుడు నేనైన ఏ బ్రహ్మమున్నదో, ఆ బ్రహ్మము నా సర్వ బంధములకు మూలకారణమే యగుచున్నదని గుర్తించితిని కాని యింకనూ అట్లుగుర్తించిన గుర్తు శేషించియున్నది. ఆ గుర్తున్నూ భ్రాంతియే. "భ్రాంతిరహిత మిదం మోక్షం" కనుక అట్టి అహం పదార్థ రహితమునందు గాని నాకు సర్వ భ్రాంతి రహితంగాదు. "నేను"

కు మోక్షం లేదు. కనుక "ముక్తోహం" అనగా ముక్తుడనుటకు వీలులేదు.

ఇట్టి అహం పదార్థ రహిత పూర్ణస్థితిని ప్రసాదించు సద్గురు మూర్తిని అహరహము మనము సేవించుదుముగాక!

శ్లో॥ కిమత్ర బహునోక్తేన శాస్త్రకోటి శతైరపి
దుర్లభా చిత్త విశ్రాంతి ర్వినా గురుకృపాం పరాం॥

తాత్పర్యం : అనంతకోటి శాస్త్రములయందలి అనేకములగు వాక్యములనేర్చి చెప్పుటవలన ఏమి ప్రయోజనము? శ్రేష్ఠుడగు సద్గురుకృపా విశేషములేనిచో చిత్త విశ్రాంతి కలుగుట మాత్రము సాధ్యముకాదు. అనగా గురుకృపయే చిత్త విశ్రాంతికి ఏకైక మార్గము అని భావము.

విశేష వివరణము : ఇందు 1) చిత్త విశ్రాంతి 2) గురుకృప 3) అట్టి గురుకృప యెట్లు సిద్ధించును? అను మూడు ముఖ్య విషయములను గూర్చి విమర్శించి తెలుసుకొనవలసియున్నది.

1) చిత్త విశ్రాంతి : అంతరేంద్రియములో చిత్తేంద్రియ మొకటి. చింతన చేయుచుండుటయే దీని పని. జరిగిపోయినట్టియు, జరుగుచున్నట్టియు, జరుగనున్నట్టియు, సుఖదుఃఖ రూపములగు శబ్దాది విషయపంచకమును గూర్చి చింతన చేయుటలో, జలాంశముచే పొడమిన చిత్తేంద్రియము ద్రవీభూతమై, ఆనందాశ్రువులనో లేక దుఃఖాశ్రువులనో రాల్చుటకు హేతుర్భూతమగు చున్నది. ఇట్లు చింతన చేయుటలో అంతఃకరణమునందు శుభాశుభ సంస్కారములు ఏర్పడి జన్మ పరంపరలకు కారణమగుచున్నది. కనుక యిట్టి చిత్తవృత్తి అవశ్యము నిరోధింపవలసినదే యని మతకారులు భిన్నభిన్న మార్గములను యిందు కుపాయభూతముగా నిర్ణయించినారు. "యోగశ్చిత్తవృత్తి నిరోధః" అని సూత్రీకరించి పతంజలి యోగమార్గమును నిర్ణయించినాడు. యిష్ట దైవమును గూర్చి "శ్రవణం, కీర్తనం, స్మరణం" యిత్యాది వ్యాపారమునందు చిత్తమును లయింపచేసి యితర వృత్తులకు స్థానంలేకుండ చేయవలెనని భక్తులు సూచించినారు. నిరంతరా వచ్చిన్న తైలధారావతుగా అఖండ బ్రహ్మాకారవృత్తి యందుండవలెనని లేనిచో

చ॥ పరపురుషాను రక్తిగల భామిని యెల్లపనుల్ గృహంబునన్
బొరిబొరి జేయుచుం బ్రియుని పొందు సుఖంబుగ జూచురీతి భా
స్వరపరతత్వవేది నిజవర్ణ నిజాశ్రమ యోగ్య ధర్మముల్
నిరతము సల్పుచుం బరమనిర్మల సౌఖ్యముగాంచు నెమ్మదిన్

అని చెప్పబడిన రీతిగా జీవితము సాగించవలెనని జ్ఞాన మార్గీయులు నిర్ణయించినారు.

పరిపూర్ణ భావజ్ఞుల నిర్ణయమేమో తెలియుటకు పూర్వము విశ్రాంతి అనగా నేమో. చిత్తమును పై విధములచే విశ్రాంతి చెందుట ఆచరణ సాధ్యమగునో కాదో విచారించవలసి యున్నది. శ్రాంతి యనగా ఉపరమము విశ్రాంతి యనగా అట్టి ఉపరమము విశేషముగా నుండుట. మనస్సుచే గదా బ్రహ్మవస్తువునందు ఉపరతి సల్పుట? చూస్తే అచల లక్షణము గల ఆకాశములో 8వ వంతు భాగము చలనాత్మకమగు వాయువులో చేరిన గదా మనమనస్సేర్పడినది? "చంచలం హి మనః కృష్ణ" అంటూ అర్జునుడు శ్రీకృష్ణునితో గీతయందు మొరబెట్టుకొన్నాడు? "ఆ మనస్సు కూడ నానాకర్మజ వాసనాన్వితమైయున్నదే? యిక అఖండ బ్రహ్మాకారవృత్తి కలిగియుండుట యెట్లు? మరియును అఖండ బ్రహ్మాకారవృత్తియందే యుందమన్నను, ప్రాణధర్మమైన ఆకలిదప్పులు బాధించి అడ్డుతగులుచున్నవిగదా! ఎట్లో

బలాత్కారముగ నిగ్రహించవలెనన్నప్పటికి శరీరము నిలువజాలక పడిపోవును గదా! భక్తి మార్గమున ప్రహ్లాదకుమారునివలె

"పానీయంబులు ద్రావుచున్ భాషింపుచున్ హస లీ
లా నిద్రాదులు సేయుచున్ దిరుగుచున్ లక్షించుచున్ సంతత
శ్రీ నారాయణ పాదపద్మయుగళీ చింతామృతా స్వాదనం
ధానుండై మరచెన్ సురారి సుతుడే తద్విశ్వమున్ భూవరా

అని చెప్పబడినరీతిగా హరి నామస్మరణయందు మేను చొక్కించుటకూడా పైకారణములచేతనే సాధ్యముకాదు యోగమార్గమున చిత్తవృత్తుల నిరోధించవచ్చును గాని, పాము పడగపై కర్రతో నొక్కిపెట్టినంత కాలమే పాము అణగియుండి కర్రతీస్తే కాటువేయు విధముగా, ఎంత కాలము యోగమందుంటే అంతకాలము మాత్రమే చిత్తవృత్తి లణగియుండును. ఇక గత్యంతరమేమి? పరిపూర్ణ భావజ్ఞులు నిర్ణయించిన మార్గాంతరమేమి?

అంతఃకరణమును శాంతింపచేసుకొన్నవాడే శ్రాంతుడనబడును. అట్టి శ్రాంతునికే చిత్తవిశ్రాంతి సాధ్యము. అంతఃకరణ కట్టి శాంతి యేపుడైన చేకూరునా? అంతఃకరణ స్థూలధర్మములగు కామ, క్రోధ, లోభ, మోహాదులలో నేదియు బాధించనపుడే శాంతి గాని క్రోధ లక్షణములు బయటపెట్టనంత మాత్రముచేత అది శాంతముగాదు. బయటకు రానీక అణచిపెట్టిన కోపము నిద్రాణమైయున్న అగ్ని పర్వతమువలె యెప్పుడో యొకప్పుడు పెఠిల్లున ప్రేలి బ్రద్ధలై ప్రళయకారణమగును. లేక లోలోపల, కుములుచూ అంతరమును కాల్చివేయుచుండును. క్రోధ మొక్కటే నిగ్రహించవలెనంటే అదియునూ సాధ్యముకాదు. దాని పూర్వాపరరూపములు ఏమియు లేకపోయినపుడే శాంతి. క్రోధమునకు పూర్వాపరము లెట్లున్నవి?

సీ॥ కోరుట కామంబు, కోరిక అర్థంబు
కొనసాగకుండిన క్రోధమగును
వచ్చిన ద్రవ్యంబు వదలకుండుట లోభ
మా ధనాపేక్ష మోహంబునగును
ధనమున్నదని మోదమున నుబ్బి నాకేమి
యనుచు గర్వించిన యది మదంబు
తనద్రవ్య మపహరించిన జనులందున
మరది నీర్ష్యనుంచుట మత్సరత్య
తే॥గీ॥ మనుచు నీ శత్రుషట్కవర్గము నణంచి
శాంతి జెందిన పురుషుండు సర్వసముడు"

అని చెప్పబడినది. ఈ అరిషడ్వర్గమునకు కోరికయే మొదటిదై మిగతా వానికి కారణమైయున్నది కనుకనే కృష్ణదేశికేంద్రులు

కం॥ "ఏయాపేక్ష జనించిన
ఆయాపేక్షెల్ల మాయ యని తెలియదగున్
ఆయాసమౌను దానను
ఛీయని యది విడువదగును క్షేమముకొర్కై" యనిన్ని

"ఇచ్ఛారాహిత్యమే స్వచ్ఛమగు బోధయనిన్ని సెలవిచ్చినారు. ఐతే ఆ యిచ్ఛారాహిత్యమెట్లు చేకూరును? ఆ ఇచ్ఛ లేక కోరిక యెట్లు కలుగుచున్నదో దెలసి దాని పట్టునుండి తప్పించినపుడే యిచ్ఛకలుగ కుండపోవును. ఈ కోరిక (కామము) కు పరంపరాకారణములను మూలకారణము తెలిసికొనవలసియున్నది.

శ్లో॥ ధ్యాయతో విషయాన్ పుంసస్సంగస్తేషూపజాయతే
సంగాత్సంజాయతే కామః, కామాత్రోఽ ధోభిజాయతే

శ్లో॥ క్రోధాద్భవతి సంమోహః సంమోహాత్స్మృతివిభ్రమః
స్మృతి భ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణస్యతి భ॥గీ॥ 2-62,63

తాత్పర్యం : విషయచింతనవలన ఆ విషయముల యందు యింద్రియములు సంగము బొందును. అట్టి సంగమువలన కోరికపుట్టును. కోరిక సఫలముకానిచో క్రోధము, దానివలన, అవివేకము, అందువలన విస్మృతి దానివలన బుద్ధినాశము, ఆ పిదప సర్వనాశము (అనగా శాశ్వతమగు జన్మ పరంపర) కలుగుచున్నది.

అన్నింటిలో విషయచింతనచేయు చిత్తమే మొట్టమొదటిది. చిత్తమునకు విషయ చింతన చేయు ప్రవృత్తి ఏల కలగవలయును. "కామయేష క్రోధయేష రజోగుణ సముద్భవః" అట్టి కామప్రవృత్తికి రజోగుణము కారణమని గీత అన్యత్ర చెప్పుచున్నది. గుణత్రయరూపమగు ప్రకృతికి ఆధారమూ అధిష్ఠానమూ చేతన బ్రహ్మమే అయి వున్నది. కనుకనే దానికి కూడా సృష్టికామన కలిగెను. "యిచ్ఛామాత్ర ప్రభుస్సృష్టిః" "సోఽ కామయత బహుస్యాం ప్రజాయేయ" అని శ్రుతులు పలుకుచున్నవి. అట్టి అధిష్టాన చేతన బ్రహ్మముయొక్క పట్టునుండి దీనిని తప్పించవలెను. ఇపుడు కాని రజోగుణ నాశము గాదు. "నిస్త్రైగుణ్యోభవార్జున" అన్న భగవచ్ఛాసనమున్నూ పాలింపబడ జాలదు.

ప్రకారాంతరముగా విచారించినచో, కామక్రోధాదులన్నియు ఆకాశభూతము యొక్క స్థూలాంశగుణములై యున్నవి. కనుక ఆకాశముయొక్కయు దాని మూలమగు ఆత్మయొక్కయు రహితస్థితియగు పరిపూర్ణ బ్రహ్మము యొక్క నిశ్చయమునందుగాని కామక్రోధాదుల యుత్పత్తికి మూలమే లేదని దృఢపడదు. పాము కోరల యందలి విషము పిండివేయబడినదని తెలిసినచో పాము భయకారణము కాకుండాపోవును. అట్లే, గుణములు గుణములయందు వర్తిస్తున్నవి. అట్లు వర్తించుట వానికి సహజము. గుణాశ్రయమగు అంతఃకరణకు వునికియేలేదు. గుణాతీతమగునది పరిపూర్ణ పరబ్రహ్మమే. అట్టి పూర్ణస్థితిని గురుకృపకు పాత్రుడై తెలిసినవానికి యెట్టి భయభ్రాంతులు యుండవు. పైనుండి వ్రేలాడుచుండు గొలుసుయందలి పైనున్న మొట్టమొదట రింగుయొక్క పట్టును వూడదీసినచో గొలుసంతయు కూలిపోవును. అట్లే పరిపూర్ణబోధచేత ఎరుక సంసారమంతయు నొక్కసారిగా కుప్పకూలిపోవును. అపుడు చిత్తము బంధకారణము కాబోదు. విషయములందు వర్తించుచున్ననూ సర్వసంగపరిత్యాగమే సిద్ధించును. ఈ విషయమే భగవద్గీత యందు

శ్లో॥ తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మ విభాగయోః
గుణాగుణేషువర్తంతే యితిమత్వానసజ్జతే॥ అని చెప్పబడినది.

సృష్టి కారణవస్తువే అశాంతి కత్యంత మూలకారణ వస్తువుగా నున్నది. ఆ సృష్టికారణ

వస్తువునకు పరిపూర్ణ బ్రహ్మమునందు మూలంగాని, నిల్చుటకు స్థానంగాని లేద్దని పరిపూర్ణ బోధవలనగాని ఆరూఢంకాదు. గుణాతీతస్థితి లభ్యమై చిత్తవిశ్రాంతి లభించవలెనంటే, అశాంతి నిలయమగు అంతఃకరణము ప్రశాంతి నిలయం కావాలంటే, పరిపూర్ణ బోధయే యేకైక మార్గమై యున్నది.

గురుకృప : పరిపూర్ణ బోధ యేట్లారూఢమగును? గురుకృప లేకున్న ఆరూఢంకాదు. కనుకనే కృష్ణదేశికేంద్రులవారు "అపరోక్షమౌనె మనుజులకు పరోక్షంబైన బయలు గురుకృప లేకన్" అని ప్రశ్నించి గురుకృపచేతనే పరిపూర్ణ పరబ్రహ్మము తెలియబడునని ఆకందార్థములో సమాధానము చెప్పియున్నారు. కనుక 'గురుకృప' యనగా నేమో విచారించవలసియున్నది.

గురుస్వరూపమేదో తన గురువుచే తెలియబడి మనోనిశ్చయమగుటయు, ఆ పిదప యా మనస్సు తదాకారాకారితమై ఆత్మనిశ్చయమగుటయు మాత్రమే గురుకృపా ప్రసాదసిద్ధికి నిదర్శనములు, తనతోబాటు గురుస్థానమున నిల్చిన సచ్ఛిష్యునికే గురుమూర్తి "అదిగో చూడు" మని యెరుక యొక్క ఆవరణమును తప్పించి నిరావరణమగు పరిపూర్ణ పరబ్రహ్మమును తెలియచేయగలడు. అట్టి గురు కృప లేనిచో ఆత్మస్వరూప నిశ్చయముగూడ కాజాలదు. గుణాతీతస్థితి మాట వేరే చెప్పనవసరమేలేదు.

గురుకృప యెట్లు కలుగును? : సద్గురుపాదములాశ్రయించి, గురుమంత్రోపదేశము గొని, గురుకృపా ప్రసాదసిద్ధియే యేకైక లక్ష్యముగా అనుష్ఠానముచేయుచు, అంతఃకరణశుద్ధికై త్రికరణశుద్ధిగా నాలుగు శుశ్రూషలున్ను సత్కర్మానుష్ఠానమున్ను చేయుచు తను మన ధనముల యందు వంచనలేక గురుడే పరుడని గురూపాసనగావించు సచ్ఛిష్యునికి అచిరకాలములోనే గురుకృప కలుగగలదు.

చిత్త విశ్రాంతి కొరకై చెప్పబడిన యితర మార్గములు ఆచరణ యోగ్యములు కావని చెప్పనగును. ఏలయనగా అఖండబ్రహ్మాకారవృత్తిగాని లేక సమాధి నిష్టగాని గృహస్తులకు సాధ్యముగాదు. "పరపురుషానురక్తి గల భామిని వలె ఆత్మదృష్టి వదలకుండా సకల కర్మలు చేస్తే ఆకర్మలు బంధకారణములు కావుగదా!" అని అనవచ్చును. కాని యిందు స్వపురుషానురక్తియో, లేక పరపురుషానురక్తియో ఏదియో యొక అనురక్తి యుండక తప్పదు. ఆ పరపురుషుని యందు రాగము పెంపొందినపుడు యితరమునందు ద్వేషం పెంపొందుటయు తప్పదు. చివరకు రాగద్వేషముల వాగురులలో చిక్కినవాడే యగుచున్నాడు. అట్లుగాక పరిపూర్ణ పరబ్రహ్మమునందు పురుషుడులేడు. ఏ అనురక్తి లేదు. అందు ఏదీలేదు కనుక దేనియందునూ రాగద్వేషములుండవు.

"పానీయంబులు ద్రావుచుం గుడుచుచున్......" ఇట్టి అఖండ భక్తి తానే గురుస్వరూపము. గురుస్వరూపమే తానని ఆరూఢమగుటకు కావలసినదే. ముందుగా గురుకృప సాధించనిచో ఏదియు సాధ్యము కాదు.

శ్లో॥ "దుర్లభో విషయత్యాగః దుర్లభం తత్త్వదర్శనం
దుర్లభా సహజావస్థా సద్గురోః కరుణాం వినా॥

అని శాస్త్రములు చెప్పుచున్నవి. అంటే, విషయత్యాగముగాని, తత్త్వదర్శనము గాని, సహజావస్థయగు పరిపూర్ణ బోధస్థితిగాని గురుకృప లేక కలుగదని తాత్పర్యము.

విషయత్యాగము : అనగా శబ్దాది విషయములందు ప్రవర్తించుట మానివేయుటమాత్రమే కాదు. మనస్సునందు సంస్కారరూపముగా తిష్టవేసుకొని యున్న విషయవాంఛ కూడ రహితముకావెలను భగవద్గీత

శ్లో॥ కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసాస్మరన్
యింద్రియార్ధాన్ విమూఢాత్మా మిధ్యాచార స్సవుచ్యతే॥

అని విషయములయందు వర్తించుట మాత్ర మరికట్టి మనస్సుచే విషయముల గూర్చి చింతించు వాడు మిధ్యాచారిగా నిర్ణయింపబడెను. తత్వదర్శనం అనగా ఆత్మస్వరూప సాక్షాత్కారము అనగా ఆత్మరూపమే తానగుట. సహజావస్థ అనగా పరిపూర్ణస్థితియేగాని యితరము లేమియు సహజ పద్ధతులుగావు. ఏలననగా సన్యాసము పరమాత్మసృష్టికే వ్యతిరేకము గనుక అది సహజావస్థ గాదు. సమాధిగూడ కొన్ని సాధన విశేషములచేత సాధింపగలిగినదై కృతకమైయున్నది. అట్లుగాక పరిపూర్ణ ప్రబోధయందు వున్నదున్నట్లుగాను లేనిది లేనట్లుగాను గుర్తించి పరిపూర్ణ పరబ్రహ్మము నందు యెరుకకు మూలముగాని స్థానంగాని లేదని నిస్పృహతో సకల కార్యములు అందరివలెనే గృహస్తాశ్రమమునందే యుండి జీవితము సాగించుటయే సహజావస్థ. ఇదియే "యింగితము నెరిగి సద్గురు పుంగవుచే నరుడు భుక్తి ముక్తి క్రియలన్ సంగాసంగము లెడలిన" సహజామనస్క రాజయోగస్థితి యిట్టి కృపకుదాపాదైసచ్ఛిష్యుల తరింప చేయుచున్న సద్గురుమూర్తి కివే మా నమస్కారములు.

శ్లో॥ ఆబ్రహ్మస్తంభ పర్యంతం పరమాత్మ స్వరూపకం
స్థావరం, జంగమంచైవ ప్రణమామి జగన్మయం॥

తాత్పర్యము : తృణాది బ్రహ్మ పర్యంతము సమస్తమూ, పరమాత్మ (గురు) స్వరూపమేకాని అన్యము లేనేలేదు. కదలనివిన్ని, కదలేవిన్ని అగు సమస్త ప్రాణులున్ను ఆ గురుపరమాత్మయే. జగత్తంతయు ఆ పరమాత్మ మయమైయున్నది. అట్టి గురుపరమాత్మకు నేను నమస్కరించుచున్నాను.

విశేష వివరణము : 1) ఆ బ్రహ్మ స్తంభ పర్యంతము అనగా చిద్ఘనమై సృష్టికారణమై యున్న బ్రహ్మ పదార్థము మొదలు, చైతన్యము లేని జడ పదార్థమగు గడ్డిపోచవరకు గల సమస్త వస్తువులు కూడా పరమాత్మ స్వరూపమే.

2) పరమాత్మ స్వరూపకం : పరమాత్మకు సత్, చిత్, ఆనందములు స్వరూప లక్షణము. గడ్డిపరకకు కూడా నిజముగా అదే స్వరూప మన్నమాట. అంటే, సత్, చిత్, ఆనందములు గడ్డిపరక యందు కూడా నున్నవన్నట్లే, ఎట్లున్నవి? అని విచారించినచో."గడ్డిపోచవున్నది" అనే మాటలో ఆ గడ్డిపరక యొక్క వునికియే (వుండుటయే) సల్లక్షణము. ఆ తృణాదులు స్వయముగా కదలలేవు గదా! అందు చేతనము యెట్లున్నది? దానికి తెలుసుకొనే తెలివి లేదు గదా! అందు చిల్లక్షణ మెట్లున్నది? అని శంకింప నవసరం లేదు. ఏలననగా ఆ తృణాదులు పశువులకునూ స్వరూపమై యున్నవి. తిన్న అన్నముయొక్క సూక్ష్మాంశము మనస్సునకు పుష్టి కలుగచేయు చున్నది. కనుక మనకుగల చలనశక్తి, తెలివిన్ని, బీజరూపముగా తృణాదులయందుందనియే చెప్పి తీరవలెను. అట్లే ఆనందము గూడ ఆ గడ్డిపోచయందున్నది. దానిని తిను పశువునకు కడుపునిండిన తృప్తి రూపమగు సంతుష్టి ఆనందముయొక్క అంశమే గదా! కనుక సచ్చిదానంద లక్షణములు తృణాదులయందుకూడా వున్నట్లే.

మరి పరమాత్మ సచ్చిదానంద లక్షణములుగలదిన్ని ప్రపంచము అనృత జడ(అసజ్జడ) దుఃఖాత్మక మనియు అందురు. యిదెట్లు సమన్వయము చేతురు? అని ప్రశ్నించవచ్చును. సత్యానృతములు (లేక సదసత్తులు) చిజ్జడములు, ఆనంద దుఃఖములు, యివన్నియు ద్వంద్వములు. ఈ ప్రపంచమునందన్ని పదార్థములు, దేనికది ఏక రూపముగా నున్నట్లు స్థూలముగా గోచరించినా, అవి నిజముగా ఏకరూప ద్వంద్వములే. సత్ నందసత్తు, చిత్తునందు జడము, ఆనందమునందు దుఃఖము గర్భీకృతములై బీజ స్థితిలో నున్నవనియే చెప్పవలెను.

3) జగన్మయం : అనగా జగత్తంతా పరమాత్మ మయమే అని అర్థము.

సృష్టికి పూర్వదశయందు ఆపరమాత్మ మధ్యందిన మార్తాండునివలె, ఒకడే అయి ఏకరూపముగా నుండి "ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ" అని కొనియాడబడినాడు. ఆ బ్రహ్మమునకే "సోఽకామయత, బహుస్యాం ప్రజాయేయేతి" అని సృష్టి కామనగలిగెను. అపుడా ఒకడైన పరమాత్మ అనేక నామములతో అనేక రూపాలుగా పరిణమించెను. ఇదియే సృష్టి కనుక సృష్టి అనగా "ఏకం అనేకం భవతి" అను శ్రుతి న్యాయంగా ఒకటి అనేక మగుటయేగాని, కుమ్మరి తనకు వేరుగానున్న మట్టిని గైకొని కుండలను తయారుచేయుటవంటిది కాదు కుమ్మరి వలె పరమాత్మ నిమిత్త కారణమనియు కుమ్మరి గ్రహించిన మట్టి వుపాదానకారణమనియు, అట్లే మాయ వుపాదాన కారణమనియు కుండలు తయారైనట్లు తయారైన జగత్తు కార్యరూపమనియు, కొందరందురు కాని అది సరికాదు పరమాత్మయే నిమిత్త కారణమున్ను పరమాత్మయే వుపాదాన కారణమున్ను అయివుండుటయే గాక అభిన్న నిమిత్తోపాదన కారణమని చెప్పబడినాడు. ఆ పరమాత్మయే కార్యరూప జగత్తును అయి వున్నాడు. "తత్సృష్ట్వాతదేవాఽనుప్రావిశత్" అని శ్రుతి యుద్ఘోషిం చుచున్నది. కార్యరూపమగు జీవేశ్వర జగత్తును కల్పించి ఆ నామరూపాత్మకమగు సర్వమునందు ఆ పరమాత్మయే అను ప్రవేశము గావించెను. అనుప్రవేశమనగా మరల ప్రవేశించుట. తానే ఆవరణాత్మకమగు జగద్రూపమగుట తొలి ప్రవేశము. అందు తెలివి రూపముగా ప్రవేశించుట అను ప్రవేశము అని తెలియవలయును. తెలివి రూపముగా ఏ స్థానమందు ప్రవేశించును? అని ప్రశ్నిస్తే అణు అణువునా అణువు బాహ్యాభ్యంతరముల సర్వత్రా ప్రవేశించెననియే చెప్పితీరవలెనుగాని ఆ తెలివి ఏదో ఒక స్థానమున ఎక్కువగా అభివ్యక్తమగుచుండుటచే ఆ స్థానమునందే పరమాత్మ యున్నాడని చెప్పుట ఎంతమాత్రము సమంజసముకాదు. కనుక వస్తువుయొక్క ఆవరణమున దంతా ఆ పరమాత్మ తెలివి రూపముగా వ్యాపకమై యున్నాడని చెప్పుట మిక్కిలి సమంజసము. ఇక పరమాత్మ కన్యముగా ఏమి వున్నవి. ఏమియులేదు కనుకనే యీ శ్లోకములో జగన్మయం అనగా జగత్ అంతా పరమాత్మమయము అనే మయమ్ శబ్దము ప్రయోగింపబడినది.

4) స్థావర జంగమములు : అనగా కదిలేవి, కదలనివి అగు ప్రాణులు కదలకపోయినా ప్రాణమున్న సమస్తము, స్థావరములు అని చెప్పబడును. తరులతా గుల్మాదు లిట్టి ప్రాణులు. జంగమములు అనగాప్రాణము, చలనమూ, రెండూవున్న ప్రాణులు. ఈ రెండే చరాచరములని నామాంతరముచే పిలువబడుచున్నవి. చలాచల లక్షణములు వీనియందు వేరువేరుగా స్థూలదృష్టికి గోచరించుచున్నవేగాని స్థావరములయందు చలనము లేకపోలేదు. పై కెదుగుట, పక్కలకు కొమ్మలు తొడిగి విస్తరించుట, మొదలు యొక్క కైవారము పెరుగుట భూమిలోపలికి వేళ్ళు తన్నుట యివన్నియు చెట్లకుండగా యివి కదలుటయే లేదని అనవచ్చునా? ఎక్కువ

దూరము ఎక్కువ స్థలంలో కదలుట లేదుగాని అసలు కదలుట లేదని చెప్పరాదు. లతలు పొదులు తీగెలు తొడిగియింకనూ అధిక ప్రదేశములోనికి వ్యాపించుటలేదా? కనుక నిజంగా స్థావరములని చెప్పదగినవి ఏవి? పర్వతములు పైకి పెరుగుట. లోనికి క్రుంగుట జరుగుచున్నప్పుడు వానిని మాత్రము స్తావరములన వచ్చునా?

పృధివాది పంచభూతములు, సూర్యచంద్ర నవగ్రహ నక్షత్రాదులు అన్నియు చలనాత్మకములయి వున్నవి. సూర్యుడు కదులు చున్నాడా? అంటే కొన్ని వేల సంవత్సరముల అనంతరం అతని స్థానము ఏ కొద్దిగానో మార్పు చెందుచున్నదని విజ్ఞానవేత్తలు చెప్పుచున్నారు. మొత్తము ఖగోళమే కదలుచున్నది. కనుక విశ్వమంతయు చలనాత్మకమే ఐవున్నది. "తేనవినాతృణాగ్రమపినచలతి" అనగా పరమాత్మసత్తాలేనిచో గడ్డిపరక కూడా కదలదు. కనుక అన్నిటి యందూ పరమాత్మ నిండుకొనియే యున్నది. అన్నీ పరమాత్మ యొక్క మారురూపములే అయివున్నవని చెప్పక తప్పదు. "బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్టం" అనగా యీ విశ్వమంతా శ్రేష్ఠమైన పరబ్రహ్మ స్వరూపమే ననిన్నీ "సర్వం ఖల్విదం బ్రహ్మ" (అంతా బ్రహ్మమేననీ) "బ్రహ్మణోన్యం నకించన" బ్రహ్మమునకన్యంగా యితరవేమీ లేదనిన్నీ శ్రుతులు ఘోషించుచున్నవి. కనుక విశ్వము బ్రహ్మము యొక్క స్థూలావరణము అని చెప్పదగును. అట్లని ఆ యావరణ లోపల యెక్కడో బ్రహ్మమున్నదని యనుకోరాదు. బెల్లపు గడ్డయు, దానియందు తీపియున్నట్లు బ్రహ్మము విశ్వము అవినాభావసంబంధముగలవై విడదీయరానివైయున్నవి. సృష్టికి పూర్వము నిజరూపంలో నున్న బ్రహ్మము సృష్టియనంతరం విశ్వరూపంలోనున్నది. కనుక విశ్వములో ఏ వస్తువును యే రూపంలో ఆరాధించినా బ్రహ్మమును ఆరాధించినట్లే. మొదటిది సగుణోపాసన యనీ రెండవది నిర్గుణోపాసన యనీ చెప్పబడుచున్నది. ఈ సృష్టిలోనే ఉపాసకునికి యిష్టమైన ఆకారములో విగ్రహనిర్మాణము, విగ్రహారాధనయును పెద్దలచే నిర్ణయింపబడినవి కనుకనే "ఉపాసకానాం హితార్థాయ" బ్రహ్మణోరూపకల్పణ" అనగా వుపాసకుల సౌలభ్యము కొరకు బ్రహ్మమునకు రూపకల్పన గావింపబడెనని తెలియవలెను.

విశ్వమంతటా (గురు)పరమాత్మను దర్శించుటే ఆత్మదృష్టి యిదే అమృత దృష్టి వస్తు దృష్టియు, గుణ దృష్టియు మృతదృష్టి అని అనబడుటకిదే కారణము. అమృతదృష్టిలేక పరమాత్మ దృష్టికలిగినపుడే, ప్రహ్లాదునివలె "తనయందు నిఖిల భూతములందు నొక భంగి సమహితత్వంబున జరుపుట సాధ్యమగును. విశ్వమే గురువు. గురువే విశ్వము. "గురుమధ్యేస్థితం విశ్వం, విశ్వమధ్యే స్థితో గురుః గురుర్విశ్వం సమస్తంతు తస్మై శ్రీ గురవేనమః" అంటూ గురుపరమాత్మను గురుగీత అన్యత్రా అభివర్ణించుచున్నది.

తాను విశ్వములోనివాడే గాన తానున్ను గురుస్వరూపుడే.తన స్థూల సూక్ష్మకారణ మహాకారణ శరీరములన్నియు గురుస్వరూపమే తన శరీరేంద్రియ మనః ప్రాణములన్ని యు గురుమయమే అయివున్నవి గురుమూర్తి యొక్క నామరూపములయందు మాత్రమే గురువును చూచుట బాహ్యాభక్తి విశ్వమందంతటా గురుమూర్తిని చూడగల్గుట అనన్యభక్తి తనయందూ విశ్వమందూ కూడా గురుదృష్టితో నుండుట ఏకాంత భక్తి.

కనుక యీ దృష్టితో, అనేది, వినేది, తినేది, కనేది, వూహించేది సమస్తమూ ఎరుకే (పరమాత్మ స్వరూపమే లేక గురుస్వరూపమే) అనుట సమంజసమే. కాని యిట్లు అనువారుమాకు ఆత్మ వస్తు నిశ్చయమైనది అని మురియరాదు. ఏలననగా యెరుక అనగా అఖండ ఎరుక

సృష్టి కారణమై సృష్టికి పూర్వ దశయందున్న పరమాత్మయొక్క స్వస్వరూప సాక్షాత్కారము పొందుటయే ఆత్మవస్తు నిశ్చయము ఇట్టి స్వస్వరూప సాక్షాత్కారము ``గురోర్ముఖేన జ్ఞాతవ్యంనాన్యథా గ్రంధకోటిభిః'' అన్నారు. మరిన్నీ ``శ్రీ గురోః పరమం రూపం వివేకం చక్షురగ్రతః మందభాగ్యాన్న పశ్యంతి అంధసూర్యోదయం యధా'' అని గురుగీత యుద్ఘాటించుచున్నది. కనుక గురుముఖతః ఆత్మవస్తు నిశ్చయము పొందిన వివేకులకే ఆగురుస్వరూప సాక్షాత్కారము లభించును మందభాగ్యులైన తదితరులు అంధప్రాయులై వస్తు సాక్షాత్కారము గావించుకొనలేరు. అట్లే తారకాభ్యాసములో భ్రూ మధ్యస్థానమున ఆపొజ్యోతిని దర్శించుట, లేక ఆర్యదర్పణ విధానముచే దానిని తోలుకళ్ళతో చూచుట లేక కన్నుల ప్రక్కల వ్రేళ్ళిడి తిన్నగ భ్రూ మధ్యమందు దృష్టి నిలిపి మేము ఆత్మ సాక్షాత్కారము పొందితి మనుకొనేవారున్ను ఆత్మవంచన చేసుకొనుచున్నవారే అని తెలియదగును. అఖండ యెరుక యేదో ఉత్త బట్టబయలేదో? మూలంలేని గుర్రైరిగే శరీరమేదో యివన్నియు వస్తునిశ్చయముగా తెలుసుకొన్న వార్కిగాని పరిపూర్ణబోధ తెలియుట కల్ల.

ఆత్మవస్తు సాక్షాత్కారము గలిగించి, తదుపరి ఏస్థానమున ఏ నామ రూపములతో ఆ అఖండ యెరుక దృశ్యమానమగుచున్నదో తెలిపి ఆ పిదప పూర్ణబోధచే జనన మరణ భ్రాంతితోపాటు సర్వభ్రాంతి రహితము గావించు సద్గురుమూర్తికివే మా నమస్కారములు.

శ్లో॥ వన్దేహం, సచ్చిదానందం భావాతీతం జగద్గురుం
నిత్యం పూర్ణం నిరాకారం నిర్గుణం స్వాత్మ సంస్థితమ్

తాత్పర్యం :- సచ్చిదానంద లక్షణములు గలదై, మానసేంద్రియ వ్యాపారమునకు అతీతమై, విశ్వాతీతమై, నిత్యమై, బాహ్యాభ్యంతరముల యందంతటా నిండినదై , గుణ విజృంభణ లేనిదై, అందరి అంతఃకరణములయందు నెలకొన్నదియు నగు గురుమూర్తికి నేను నమస్కరించు చున్నాను.

విశేష వివరణములు :- 1) సచ్చిదానందములు : కాలముచే భాదింపబడని అనంతమైన అఖండ యునికియే సత్తు, సర్వజ్ఞత్వ లక్షణముతో గూడిన అంతులేని జ్ఞానమే చిత్, సుఖ దుఃఖములు రెండూకాని అనంతమగు విలక్షణ స్థితియే ఆనందము. పరమాత్మకు (అఖండ యెరుకకు) సచ్చిదానందములు స్వరూప లక్షణము అని చెప్పబడుచున్నది. అంటే, యెరుకకు నాశన ముంటే దానిని సద్రూపమని యనకూడదుగదా! పరిపూర్ణ బోధచే యెరుక రహితమగు నన్నారేమి ? అని సందేహము కలుగవచ్చును. రజ్జుసర్పమువలె యెరుకయు యెల్లపుడు యెల్లరకు తోచుచునేయుండును గాని, ఆ ఆరోపిత భుజంగము వలన అది ఆరోపితమని యెరిగిన వారికి మాత్రము అది భయ భ్రాంతులు యెట్లు కల్గింపనేరదో అట్లే పరిపూర్ణమందు లేకనే తోచిన యెరుక పరిపూర్ణ భావజ్ఞులకు మాత్రం ఎట్టి భయభ్రాంతులు ఆశామోహములు కల్గించదు. ఇది యెరుక యందలి భ్రాంతి రహితమేగాని ఎరుక రహితముకాదు. ఇట్టి భ్రాంతి రహితులు రజ్జుసర్పమువలె యెరుక లేనే లేదని ఆరూఢత కల్గియందురు. ఆ యెరుక వారి కేవిధముగానూ బాధాకరము అయివుండదు.

విద్యుచ్ఛక్తికి, దాని ప్రకాశమునకు, వుపాధినిబట్టి కొలత లేర్పడినవేగాని అసలు శక్తికి మాత్రము ఏ కొలతలేదు. అట్లే పరమాత్మ జ్ఞాన స్వరూపమే అయివున్నందున దానిని అనంతమూ అఖండమూ అన్నారు. అంతఃకరణమును (లేక వుపాధినిబట్టి) దాని తెలివికి

హెచ్చుతగ్గులేర్పడినవి. కాని మూలమునందు మాత్రమది అఖండమూ అనంతమూ అయివున్నదనుట స్పష్టము దానికే చిత్ అనినారు.

గాడసుషుప్తి యందు సుఖదుఃఖములు లేవు. ఆస్థితియందు అంతఃకరణమున కానందమయ కోశమని పేరడినారు. అట్లే "శుద్ధేసుషుప్తి దృష్టాంతం" అంటూ సృష్టికి పూర్వమున్న పరమాత్మకు అఖండానంద లక్షణము చెప్పినారు. కానీ ఆ ఆనందమే వుపాధుల జాగ్రత్స్వప్నములలో పరిమితమగు సుఖదుఃఖ రూపములు చెందుచున్నది. జీవుల సుఖదుఃఖములకు యీ పరమాత్మ యొక్క ఆనందమే మూలకారణముగా నున్నదని తెలియవలెను.

2) భావాతీతం:- భావాభావ పదార్థములు యింద్రియ రూపమగు మనస్సుచే తెలియబడును. అతీంద్రియమగు ఆధిభౌతికమగు సంకల్పవికల్పములులేని (మనస్సు) నకు పరమాత్మ గోచరించును. "మనసైవానుద్రష్టవ్యం, మనసైవానుశ్రోతవ్యం" అను శ్రుతిలో చెప్పబడినదీ అతీంద్రియ మనస్సే, గోచరించుటఅనగా, ఆ మనస్సా స్థితిలో పరమాత్మతో తాదాత్మ్యము చెంది తన వునికియే కోల్పోయి స్వస్వరూప స్థితిలో వుందన్నమాట. ఆ స్థితిలో గుర్తించునట్టి మనస్సు, గుర్తింపబడిన పరమాత్మ, అనే ద్విపుటి (రెండు) లేనేలేదు. దీనినే భావాతీత స్థితి యన్నారు.

3) జగద్గురుం:- అనగా జగత్తులోని సర్వులకూ బోధక గురువై యున్నాడని అర్థముకాదు. గురు అనే శబ్దమునకు గొప్పది, పెద్దది అని అర్థము జగద్గురుం అంటే జగత్తును అతిక్రమించి జగత్తు కంటె గొప్పదై పెద్దదై యున్న వస్తువు. జగత్ అనగా పంచభూతాత్మకమైన విశ్వము. ఆ పరమాత్మ స్వరూపము విశ్వగతము. విశ్వాతీతము కూడనై యున్నది. ఈ భావమే. "గురు మధ్యేస్థితం విశ్వంవిశ్వమధ్యే స్థితో గురుః" అనే గురుగీతా శ్లోకములో అభివర్ణితమై యున్నది.అటి గురు స్వరూపమే జగద్గురువుగాని జగద్గురువులమని పేరుపెట్టుకొన్న ప్రతివారూ జగద్గురువులు గారు.

4) నిత్యం:- శాశ్వతమైనది, గురుస్వరూపము విశ్వగతము విశ్వాతీతము అయివుం దంటే. విశ్వం వున్నా పోయినా గురుస్వరూపం (అఖండ యెరుక) వ్యాపకమై వుంటూనే వున్నది. ఐనా పరిపూర్ణ బ్రహ్మమునందు మాత్రం యిది లేదని గుర్తించిన పూర్ణ భావజ్ఞులకు మాత్రం యిది లేనేలేదుఅని ఆరూఢతగల్గినందున యే విధంగానూ భ్రాంతిజనకము కాకుండా వుంటూ వున్నది

5) పూర్ణం:- అనగా నిండుకొనియున్నది అని అర్థము. దేనిని నిండుకొనియున్నది? అని ప్రశ్నిస్తే తన ఆవరణమునందది పూర్తిగా నిండుకొనియున్నది. బ్రహ్మాండ భాండము లన్నియు ఆయెరుక యెక్క ఆవరణమునందే వుండుటచే వాని యన్నింటి బాహ్యాభ్యంతరములయందూ ఆ యెరుక పూర్ణమై యున్నదేకాని, తన ఆవరణమెంత పెద్దది అయినా, "మహతో మహీయాన్" యని చెప్పబడియున్నా, దాని కొక మితి మాత్రమున్నది. సూర్య చంద్ర నవగ్రహ నక్షత్రాదుల ప్రకాశము యెంత గొప్పదయినా అవి యన్నియు నొకమితి కలిగియేయున్నవని నేడు Science (విజ్ఞానశాస్త్రము) చెప్పుచున్నది. ఎట్లనగా:-

నక్షత్రములు మనకు కానరానివి యింకా యెన్నియో వుండివున్నవట. అంటే అర్థమేమి? మన భూమి ఆయా నక్షత్రముల ప్రకాశావరణమును మీరి యున్నదగుటచేతనే అవి మనకు

కానవచ్చుట లేదు. అట్లే ఆత్మప్రకాశమునకు కూడా ఒక ఆవరణమున్నదని చెప్పవలసియే యుండును దీపమూ, దీప ప్రకాశమూ, అను రెండూ మితిలోనే యున్నవి. పూర్ణశబ్దముచే యీ యెరుకయే సూచింపబడినదిగాని, నిరావరణమై లేని ఎరుక యొక్క బాహ్యాభ్యంతరములయందు అఖండమై సూది మోపుటకు సందీయని పరిపూర్ణ పరబ్రహ్మము సూచింపబడలేదు. కనుక ఈ శ్లోకమునందు గురుస్వరూపము పూర్ణమని అభివర్ణింపబడినదేగాని గురుస్వరూపం పరిపూర్ణమని చెప్పబడలేదు. గురువే పరిపూర్ణమనీ పరిపూర్ణమే గురువని కొందరపోహచెందియున్నారు. పరిపూర్ణము గురువూకాదు, శిష్యుడూకాదు. పరిపూర్ణమేదీకాదు. గురుశిష్యోభయ రహితమైనదే పరిపూర్ణము.

6) నిరాకారము = అనగా ఏ ఆకారమూ లేనిది. సాకారమగు వస్తుజాతమంతయూ ఏకదేశీయమే అగును. సాకార వస్తువులయందంతటా నిరాకారముగ పరమాత్మయే నిగూఢముగా, అఖండముగానున్నది. సాకారమగు నామరూపాలు మిథ్యయనీ నిరాకార పరమాత్మయందు ఆరోపితములనీ యితరు లంటారు. నిరాకారమగు ఆత్మయే (ఎరుకయే) సాకారముగా మారినదని పరిపూర్ణబోధ చెప్పుచున్నది. "ఎరుకైన భూత పంచకము" అనీ, "ఆకాశాదిక భూతానీకాత్మయమగుచు యెరుక యీ జగమయ్యెన్" అనిన్నీ అంటూ శ్రీకృష్ణదేశికేంద్రులు కందార్థములు వ్రాసినారు. కనుకనే ఆత్మ సర్వాకారమని అభివర్ణింపబడినది. సాకార నిరాకారములు రెండూ గానిది పరిపూర్ణము మాత్రమే.

7) నిర్గుణం:- అనగా త్రిగుణములు బీజరూపంగా అణగిమణిగియున్న స్థితి మాత్రమేగాని త్రిగుణములు అసలు లేనేలేని స్థితిగాదు. అందుచే సగుణ నిర్గుణములు రెండూ యెరుకే ఒక్క పరిపూర్ణమునందే త్రిగుణములు లేవు. కనుకనే "సగుణ నిర్గుణములు సదసత్తులును , నిరాకార సాకారముల్ గాని దేదో" అంటూ కేవల పరిపూర్ణము భద్రాది రామశతకంలో అభివర్ణింపబడినది.

స్వాత్మ సంస్థితం = అనగా తన ఆత్మయందే చక్కగా నిలచి యున్నది అని అర్థము. స్వ+ఆత్మ=స్వాత్మ ఆత్మ శబ్దము, దేహము మనస్సు. బుద్ధి. అంతఃకరణము, ప్రాణము. జీవుడు, ప్రత్యగాత్మ పరమాత్మ బ్రహ్మము అను నానార్థములలో ప్రయోగింపబడుచున్నది స్వ అనగా "తనయొక్క" అగుటచే వ్యష్టి శరీరమునందుగల ఆత్మనే గ్రహించవలెను. తన అంతఃకరణము నందే సంస్థితమైయున్న ఆత్మను గ్రహించవలెను. జడమగు అంతఃకరణమునకు చైతన్య మిచ్చుచు. దాని నధిష్టించియున్న చేతనమే యిక్కడ . చెప్పబడినది. స్థాన నిర్దేశము చేయుటలో ఏకదేశీయతా దోషము కలుగుచున్నను. పాటించకపోవుటకు కారణ మేమనగా దానిని ధ్యానగమ్యము గావించుటకే అని తెలియదగును."ఈశ్వర సర్వభూతానాం. హృద్దేశే ర్జున తిష్ఠతి" అని గీత చెప్పుచున్నది. "పరాంచిఖాని వ్యతృణత్స్వయంభూస్తస్మాత్పరాక్పశ్యతి నాంతరాత్మన్ కశ్చిద్ధీరః ప్రత్యగాత్మన మైక్షదావృత్త చక్షు రమృతత్వమిచ్ఛన్" అని కఠోపనిషత్తులో, ధీరులు తమ అంతరాత్మయందు లోజూపుచూచి ప్రత్యగాత్మను దర్శింతురు అని చెప్పబడినది. కానీ యిందులకు ఎంతో ఏకాగ్రత కావలసియున్నది. మన యింద్రియములన్నియు బైటికే ప్రసరించుచూ బ్రహ్మాండమందలి శబ్దాదులను మాత్రమే తెలుసుకొనుచున్నవి. ఒక్క అంతఃకరణము మాత్రము అంతరింద్రియముల రూపంలో ఏకాగ్రత చెంది సర్వమును గుర్తించును ఆ అంతఃకరణమునకు సత్తా యిచ్చు ఆత్మ ప్రకాశము అందే యుండుటచే

ఏకాగ్రత నభ్యసించినవారు ఆత్మను తమయందే చూడగలరు. కానీ సామాన్యులకిది కష్టసాధ్యము. కనుక గురుకృపకు పాత్రులై ఆత్మ స్వరూపమును వస్తునిశ్చయముగా గుర్తెరిగినవారు సునాయాసముగా బ్రహ్మాండ వ్యాపితమగు ఆత్మ స్వరూపమును గుర్తించగలరు. అతడు తనయందు నిఖిల భూతములందు నొక భంగి సమహిత తత్వంబున జరుపగలుగును.

"యద్య త్పశ్యతి చక్షుర్భ్యాం తత్తదాత్మేతి నిశ్చయా !
యద్యచ్ఛ్రుణోతి కర్ణాభ్యాం తత్తదాత్మేతినిశ్చయా...

అను శ్రుతిలో చెప్పబడినట్లు సర్వత్ర ఆత్మనే దర్శింపగలుగును.

ఇట్టి ఆత్మస్వరూప సాక్షాత్కారము గల్గించుచూ భక్తులను గ్రహించుచున్న గురుదేవుల కివే మా సహస్రానంత ప్రణామములు.

శ్లో॥ స్ఫటికే స్ఫాటికం రూపం, దర్పణే దర్పణో యధా !
తథాஉత్మని చిదాకార మానంద స్సోహ మిత్యుత॥



తాత్పర్యం : ఒక స్ఫటికమునందు మరొక స్ఫటికము యొక్క స్వరూపమున్ను, ఒక అద్దమునందు మరొక అద్దము యొక్క ప్రతిబింబమున్నూ, ఏవిధంగా ప్రకాశించునో, అట్లే నా ఆత్మయందు చిదాకారం (జ్ఞాన స్వరూపమున్ను) ప్రకాశించుటచే ఆనందస్వరూపమగు పరమాత్మ స్వరూపమే నేనగుచున్నానని భావము.

విశేష వివరణం:- స్ఫటిక, దర్పణముల దృష్టాంతములు, ఆత్మని, చిదాకారం, సోహం అని వానిని గూర్చి వివరణ తెలుసుకొనవలసియున్నది.

స్ఫటికదృష్టాంతం:- స్ఫటికము మణి అని చెప్పబడుచున్నది. పరిశుద్ధమై, స్వచ్ఛమై నిర్మలమై యుండుటలో యిది పేరుగాంచినది. నవరత్నములని చెప్పబడే వజ్ర వైఢూర్యాదులులలో ఇది చేరలేదు. నవరత్నములకుండే వర్ణములలో ఏవర్ణమున్నూ దీనికి లేదు. ఐననూ నేత్రగోచరమగుచున్నది కనుక దీని కేదో వర్ణము చెప్పవలెను గనుక శుద్ధ వర్ణమని యన్నారు. గాజుతో తయారైన నకిలీ స్ఫటికములు గూడా ఏ వర్ణమున్ను లేక స్వచ్ఛముగానేయుండును కనుక శుద్ధత్వము, స్వచ్ఛత మాత్రమే స్ఫటిక మణియొక్క ప్రత్యేకతలని చెప్పుటకు వీలులేదు. మరి స్ఫటికముయొక్క విశిష్ట లక్షణ మేది?

స్ఫటికమణి సన్నిధానమున ఏవస్తువుంచితే ఆ వస్తువు యొక్క వర్ణమును స్ఫటికమణి వహించును. యిదే దాని ప్రత్యేకత. పరమాత్మ శుద్ధస్ఫటికసన్నిభం అని వర్ణింపబడినది. "సర్వశుద్ధః పవిత్రో உసౌ" అని స్వయంగా నాతడు మహాపరిశుద్ధస్వరూపుడైనా అన్ని వర్ణములకు తావిస్తున్నాడు. "వన్నియలై దొకచోటను పన్నుగ గలిసినది హృదయ పద్మంబ నుచున్" దానినే వర్ణించినారు. ఐతే పరమాత్మ "ఏకమేవాஉద్వితీయం బ్రహ్మ" అని శ్రుతి చెపుతూంటే ఆ శుద్ధపరమాత్మకు రంగులుపులిమే అన్యవస్తువులున్నాయి అనుట శ్రుతివిరుద్ధంగాదా అని ప్రశ్న రావచ్చును. దీని కొక్కటే జవాబు. అన్ని వర్నములు మయూరాండము (నెమలిగ్రుడ్డు) లోని వర్ణరహితమైన ద్రవపదార్ధములో బీజరూపంగా యుండియున్నట్లే పరమాత్మయందు సర్వవర్ణములు బీజరూపంగా వున్నవనే చెప్పాలి. ఐతేమణియందుకూడా సర్వవర్ణములు బీజరూపంగా నున్నాయా? లేవు. స్ఫటికమణి అన్యసాపేక్షచేతనే రాగరంజితమౌతోంది. పరమాత్మ అట్లుగాక స్వయంసత్తాచేతనే తనయందలి వర్ణములను ఆవిష్కరించుకొంటోంది.

ఒక శుద్ధస్ఫటికమణి యొక్క సన్నిధానమున మరియెక శుద్ధ స్ఫటికముంచిన నేమగును?

ఆ రెండు స్ఫటికములలో దేనియందుగాని ఎట్టి వికారములుగాని మార్పులుగాని కలుగనే కలగవు జీవోపాధి అయిన అంతఃకరణయందు మాలిన్యరూపములగు సంస్కారములన్నియు నశించినచో అదియును స్ఫటికమణితో సమాన మగుచున్నది.అట్టి అంతఃకరణతో శుద్ధస్ఫటిక సన్నిభమైన పరమాత్మను ధ్యానించినచో ఏమి జరుగును ? పాలయందు పాలు. నీళ్ళయందు నీళ్ళు కలసిన విధముగా రెండిటి యొక్క ప్రకాశములు ఏక రూపమువహించు చున్నవి. సముద్రమునందు గలసిన నదీజలములు తమ వ్యక్తిత్వమును గోల్పోయి సముద్రమే అయిపోనట్లుగా తానే ఆపరమాత్మ యగుచున్నాడు.

దర్పణే దర్పణోయధా:- ఒక వైపు పాదరసము పూయబడిన గాజు అద్దము యెదుటనుంచిన ప్రతివస్తురూపమున్ను అందు ప్రతిబింబించును.ఇట్టి దర్పణమునకున్ను ఏ రంగు వుండదుగాని అన్ని రంగులను ప్రతిబింబించగలదు. ఒక దర్పణమున కభిముఖముగా మరొకదర్పణముంచినచో రెంటికీ రూపములు (వర్ణములు) లేవు ఒక దానియందొకటి ప్రతిబింబిచినట్లే దోచదు. అట్లే శుద్ధజీవాంతః కరణమున పరమాత్మ వేరుగా ప్రతిఫలించక బింబ ప్రతిబింబములు ఏకరూపమే వహించును. అంతే గాక నిరాకారమునకు ప్రతిబింబమే చెప్పరాదుగదా! నిజముగా సర్వవ్యాపకమే పరమాత్మయగుచో ప్రతిబింబిచుట కన్యదేశమున్ను లేదుగదా?

కాని బింబరూపుడు పరమాత్మయనీ, జీవేశ్వరులు ప్రతిబింబ స్వరూపులగు చిదాభాసులనీ అద్వైతనిర్ణయము. సమష్టి యజ్ఞానము లేక మాయయందలి చిదాభాసము యీశ్వరుడని వ్యష్టి యజ్ఞానమందలి చిదాభాసుడే జీవుడని నిర్ణయము ఈవాదమునకే ఆభాసవాదమని ప్రసిద్ధి బింబస్థానముననున్నది చిత్స్వరూపము. జీవచైతన్యము శుద్ధచైతన్యము యొక్క ఆభాసమాత్రమే, ప్రతిబింబము నిజబింబమునం దైక్యమగునా? అద్దము పగిలినచో అద్దమందు తోచిన ప్రతిబింబం తోచిన చోటనే అనగా అద్దముతోనే లేకపోవునుగాని పోయి నిజబింబమం దైక్యమగునా? ఇక జీవబ్రహ్మైక్యము మోక్షము అని చెప్పటెట్లు ? చిదాభాసుడు మిథ్యే అని ఒకవంక చెప్పుచూ పరమాత్మయందత డైక్యమగునని చెప్పుట సరిగాదు. లేనివాడు తోచినంతకాలము వున్నట్లు తోచినా, చివరకు తానే లేకపోవునుగాని లేనివా డెన్నడైన వున్న వానితో ఐక్యం చెంది వున్న వాడగునా? కనుక ఐక్యము చెప్పుట సరిగాదు.

దర్పణ దృష్టాంతము ఆభాసవాదమును సూచించగా స్ఫటిక దృష్టాంతము అవచ్ఛేద వాదమును సూచించును యిందు ఆభాసుడు లేడు. అంతఃకరణావచ్ఛిన్న చైతన్యమే జీవుడని నిర్ణయము. పరిపూర్ణ పరబ్రహ్మమునందు అధిష్ఠాన చేతనమునకుగానీ, మాయావిద్యలకుగానీ ప్రతిబింబములకుగానీ మూలము లేనేలేదు.

తథాఽఽత్మని చిదాకారం = అసలు జీవాంతఃకరణము శుద్ధముగానున్నచో అందు చిత్స్వరూపమును, ఆనందరూపమును అగు పరమాత్మ ప్రతిబింబించునని "సోఽహమిత్యుత" అదియే సోఽహం అని చెప్పబడినది అని గురుగీత చెప్పినది. అంటే అది గురుగీత ఆమోదించిన సిద్ధాంతముగాదన్నమాట

కం॥ ప్రకటమగు బింబమందున ముకురము
ముకురస్థ బింబములు లేవెపుడున్

అనగా పరిపూర్ణపరబ్రహ్మమందు, అధిష్ఠాన చేతనము మాయా విద్యలు అందలి ప్రతిబింబములు

అనేవానికి మూలంగాని స్థానంగాని లేనేలేదని మాకు బోధించు శ్రీసద్గురుమూర్తి సగుణ నిర్గుణరూపములకివే మా నమస్కారములు.

శ్లో॥ ఉపదేశస్త్వయం దేవీ గురుమార్గేణ ముక్తిదం
గురుభక్తి స్తథాత్యంతావై కర్తవ్యశ్చమనీషిభిః॥

తాత్పర్యము : గురుమార్గమునందు కృషిచేయువారికి ముక్తి నీయగల దీ ఉపదేశము వివేకులైనవారికి గురుభక్తి ఆవశ్యకర్తవ్యమై యున్నది.

విశేష వివరణములు : 1) ఉపదేశము 2) గురుమార్గము 3) ముక్తి 4) గురుభక్తి 5) మనిషి.

1. ఉపదేశము : ఉపదేశమనగా గురువు శిష్యునికి ఒకానొక మంత్రము మరియొకరికి వినబడకుండా చెప్పునది. గురువు ఉపదేశించు మంత్రము అనధికారులైనవారు వినకూడని నిర్ణయం. ఏలననగా ఎవరికీ తెలియనిదానిని గురువు తనకు మాత్రమే ఉపదేశించెననే లక్ష్యము శిష్యునికి వుండవలెను. అందెదో విశేషమున్నది అది అందరకు ప్రసాదింపబడునది కాదు. ఆ ఉపదేశానుసారము ఆ మంత్రానుష్ఠానము దానికి తగిన ఆచరణ చేసిన రోజున ఆ ఉపదేశము వలన తనకు మేలు గలిగి కృతకృత్యుడనగుదును అని ఆ గురువునందు ఉపదేశవాక్యమునందు పూర్ణ విశ్వాసము శిష్యునికి వున్నప్పుడే శిష్యుడు కృతకృత్యుడు కాగలడు. దైవమునందు, గురువునందు, వైద్యునియందు, మంత్రము నందుతీర్థమునందు, దివ్యక్షేత్రములయందు ఇట్టి విశ్వాసము వుంచుట మిక్కిలి అవసరమని పెద్దల వాక్యము. ఉపదేశమునకు అధికారులు కానివారు మంత్రము మాత్రం విన్నచో ప్రయోజనమేమియు నుండదు. ఏలననగా ఇంతేకదా మంత్రము. దీనివలన యేమి ప్రయోజనము రాగలదు? మంత్రాలకు చింతకాయలు రాలునా! అంటూ వారు తలంతురు. శ్రీ రామానుజులవారు గుడిగోపురము నెక్కి "ఓ మానవులారా! నేనిప్పుడు తిరుమంత్రము చెప్పుచున్నాను. మీరు దానిని జపించుచో వైకుంఠము పొందగలరు" అని అక్కడ సమావేశమైన ప్రజానీకమునకు అందరకు వినబడునట్లు ఎలుగెత్తి బిగ్గరగా వినిపించెనట. లక్షలాది ప్రజలు ఆ మంత్రము వినగలిగిరి. అట్లు విన్నవారందరూ వైకుంఠమున కేగిరా? నిశ్చయముగా వారికి వైకుంఠ ప్రాప్తి కలుగలేదని ఘంటాపదముగా చెప్పవచ్చును. కారణమేమి? ఆ మంత్రము విన్నవారికి వైకుంఠ ప్రాప్తి పొందవలెనని తీవ్రాపేక్షగాని, అమంత్రం నందట్టి మహత్తర శక్తి కలదని గాని వారికి విశ్వాసముండదు. అధికారి యగువాడు సమర్థుడైన గురువు నాశ్రయించి చతుర్విధ శుశ్రూషణ ఆచరించి గురుకృపకు పాత్రుడై రహస్యముగా గురువువలన ఉపదేశము గైకొనుట కర్తవ్యము. నేడు సర్వ మంత్రములు గ్రంథస్థములై ఎవరికి కావలసిన మంత్రము వారికి సులభముగా లభించును. అంతమాత్రమున ఆ మంత్రముచే యెవరును అభీష్టసిద్ధిని పొందజాలరు. గురువు తనకు లభించిన మంత్రశక్తిని హస్త మస్తక సంయోగం చేసి శిష్యునికి అనుగ్రహించవలెను. ఉపదేశానంతరము శిష్యుడు చతుర్విధ శుశ్రూషలు చేయవలెనా? లేక మంత్రోపదేశమునకు పూర్వమే చేసుకొని పిదప మంత్రోపదేశము పొందవలెనా? ఏది వుత్తమము అని అంటే తన శుశ్రూషచే గురువును మెప్పించిన పిదపనే మంత్రోపదేశం పొందుటయే ఎక్కువ ప్రయోజనకారి, శిష్యుడా ఉపదేశము పొందుటకు అర్హుడోకాడో గురువు గ్రహించుటకు అవకాశముండును. అనధికారికి ఉపదేశించుట బూడిదలో పోసిన పన్నీరే అగును. అట్టి శిష్యుడు ఆ మంత్రసిద్ధిని పొందలేకపోవుటయే గాక గురువును లేక మంత్రమును లేక రెంటిని విడచిపెట్టినచో రౌరవాది నరకప్రాప్తి చెందనూగలడు.

పూర్వకాలమందు గురుని ఆశ్రమమునందుండి 12 సంవత్సరములు సేవచేసినవారికే మంత్రోపదేశము చేసెడివారట. శిష్యుడెట్టివాడో గురువు గ్రహించి యోగ్యుడైతేనే గురువు వుపదేశము చేసెడివాడు. ఒకానొక గురువుయొద్ద ఉపదేశ మాసించి పన్నెండు సంవత్సరములపై కాలమునుంచి గురుని ఆశ్రమమునందు ఉన్నప్పటికి గురువుగా రా శిష్యునికి ఉపదేశము చేయలేదట. శిష్యుడు పదేపదే ఉపదేశము చేయుదని ప్రార్థించుచునే యుండెను. శిష్యుని పోరు పడజాలక స్నానము చేయుటకై శిష్య సహితముగా నదికిపోయి శిష్యుడు నీటిలో మునిగి వున్నప్పుడు గురువు అతని మెడపై చేతులుంచి లేవకుండా నొక్కిపెట్టి వుంచెనట. శిష్యుడెట్లో పట్టు తప్పించుకొని బయటపడి "ఏమీ స్వామీ? నన్నేల నొక్కిపెట్టితిరి? మరియొక్క క్షణము ఆలస్యమగుచో నేను చనిపోయి వుండెడివాడను" అని నిష్ఠురోక్తులాడెను. గురువు అందుకు సమాధానముగా "నేనట్లు నిన్ను లేవకుండా అదిమిపట్టినపుడు నీకెట్లుండినది" అని ప్రశ్నించగా "మీ పట్టు తప్పించుకొని ఎంత త్వరగా నీటినుండి బయటపడిపోదునా అని నా ప్రాణము తహతహలాడిపోయినది." అని శిష్యుడు జావాబిచ్చెను. "ఈ సంసార ప్రవాహమునుండి ఎంత త్వరలో తప్పించుకొని బయట పడిపోవుదునా అని అట్టి తహతహ నీకు ఎప్పుడు కలుగునో అప్పుడుగాని నీవు ఉపదేశార్హుడవు కాదు" అని గురువు సమాధానము చెప్పెను. అట్లే తగు పరీక్షలు చేసినగాని ఉపదేశము చేసెడివారుకాదు. అందుకే శ్రీకృష్ణదేశికేంద్రులవారు "దేశాటనంబుచేసితి" అనే కందార్థములో "దేశికుదయబుట్ట చేసి శుశ్రూష, ఉపదేశముగొని ఉపదేశ మిచ్చితి మెచ్చి అని శెలవిచ్చినారు. కనుక చిరకాల శుశ్రూష చేసి గురుని మెప్పించి పిదపనే శిష్యులు పూర్వము ఉపదేశము పొందెడివారని స్పష్టమగుచున్నది.

గాని నేటి కాలమున "అల్పశ్చకాలో బహవశ్చ విఘ్నాః" అన్నట్టుగా జీవిత కాలము అల్పము.విఘ్నములు అనంతములుఅగుటచే గురుని కడనేయుండి చిరకాలము శుశ్రూషచేసి మెప్పుపొంది ఉపదేశము పొందుటకు అవకాశము తక్కువగుటచే శుభేచ్ఛ కలిగి ఉపదేశము పొందుటకై శిష్యుడేతెంచిన వెంటనే మంత్రోపదేశము మాత్రముచేసి తాము చెప్పిన విధముగా అనుష్ఠానము ఆచరణయు చేయునో లేదో పరీక్షించి తృప్తిపడినపుడే శిష్యునికి బోధ రహస్యము లను గురువు వెల్లడించుచున్నాడు. ఈ విషయము కూడా శ్రీకృష్ణదేశికేంద్రులవారు తమ కందార్థములలో వెల్లడించియున్నారు. "చెప్పదగు గురుడు బోధను చెప్పినపని చేసెనేని శిష్యాగ్రణికిన్.........." అంటూ శిష్యుని కెపుడు బోధించతగునో సూచించి యున్నారు.

ఉపదేశము అను మాటకు మరియొక అర్థముగూడ గలదు. ఉప+దేశము = ఉపదేశము. "వుప" అనగా చిన్న అనియును, సమీపస్థమైన అనియును. దేశము అనగా ప్రదేశమనియు అర్థములు. కనుక చిన్నదేశము లేక సమీపస్థమగు ప్రదేశమనియు అర్థము. ఒక పెద్ద నదితో కలియు చిన్న నదిని వుప నదియనియు. ఒక ఖండములో భాగమై ఆ ఖండముతో సమాన లక్షణములుగల దేశమును వుపఖండమనియు నందురుగదా! అట్లే శిష్యునికి పరమాత్మ యొక్క స్వరూపమును తెలియ పరుచుటకుగానుస్థూలారుంధతీ న్యాయముగా ప్రత్యగాత్మయొక్క స్వరూపము నెరిగించి తద్వారా పరమాత్మ నెరిగించుట కూడా ఉపదేశము అనదగును.

శ్లో॥ కూటస్థ బ్రహ్మజీవేశ యిత్యేవంచ చతుర్విధా
మహాకాశో ఘటాకాశో............జలాభ్రకే యథా॥

అనగా యిందు కూటస్థ బ్రహ్మలకు ఘటాకాశ మహాకాశములున్ను. జీవేశ్వరులకు జలాకాశ మేఘాకాశములున్ను దృష్టాంతము లీయబడినవి. విశ్వగతమును విశ్వాతీతమును అయివున్న (Immanant and transcendaut) ఆకాశము (Space) ఎంత పెద్దదైనను ఆవరణ యుక్తమే అందుకే కృష్ణదేశికేంద్రులవారు "ఆవరణము ఆకసము నిరావరణ మచల మనుచు ననిరి మహాత్ముల్" ఈ దృష్టితో ప్రత్యక్పరమాత్మలనేగాక ఎరుక పరిపూర్ణములను శిష్యులకు తెలియ పరుచుట కూడా వుపదేశమే కాగలదు. యెరుక పరిపూర్ణముల నీవిధముగా గురుమూర్తిచే నెరిగి గురుమార్గమందు, గురుభక్తి, గురుసేవ, గురునిష్ఠ కలిగియుండవలెనని యీ శ్లోక ముద్ఘాటించినది.

గురుమార్గము : గురుశిష్య లక్షణములు సరిగా వున్నప్పుడే యీ పరిపూర్ణబోధయందు గురుశిష్యన్యాయము శోభించును. గురువు త్రిమూర్తులకంటె గొప్పవాడు సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపుడు. తన్నుద్ధరించుటకు మానవాకృతిలో జన్మించినవాడు అనే లక్ష్యము శిష్యునికి వుండవలెను. కం॥ "తల్లివి, తండ్రివి, దాతవు వల్లభుడవు బాంధవుడవు, వసుధీశుడవున్ తెల్లమిగదేవుడవు" అని తన ప్రేమకు పాత్రమగు సర్వము గురుమూర్తియే అనే దృఢభావముతో శిష్యుడు గురువును "నరులిష్టదైవములకున్ పరిచర్య నొనర్చునట్లు నిత్యము గురుని పూజించవలెను. "జలము నెడబాయనొల్లని జలచరముల రీవిబూని సచ్ఛిష్యుడు హృజ్జలజంబను పీఠముపై నిలిపి ఇతరముమాని గురువునే గొల్చుసుమ్మీ, తదూక్తులనే తలచునమ్మీ! కలకాలమీరీతి గడుపుచునే ప్రొద్దు తలిదండ్రి దొర దాతదైవమనుచు గురువుచే గొల్చుసుమ్మీ, తదూక్తులనే తలచునమ్మీ॥ ఇట్టి యనన్యభక్తి గురువునందుంచి

శ్లో॥ శరీరం ఇంద్రియ ప్రాణం అర్థం స్వజనబాంధవాన్
ఆత్మదారాధికం సర్వం సద్గురుభ్యోనివేదయేత్॥

అను రీతిగా తన సర్వస్వము గురునికి నివేదించవలెను. తనుమన ధనములు గురునకు వినయంబున ధారపోసి నవవిధభక్తులచేతను గురుని సేవించవలెను. మరియును తన అంతఃకరణశుద్ధికై సత్కర్మాచరణమును చేయుచు స్థాన, ఆత్మ, అంగ, భావ, శుశ్రూషలను గావించు కొనుచుండవలెను. భగవద్గీత చరమశ్లోకము "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" అనురీతిగా తను కర్తృత్వ మేమియు ఉంచుకొనక కర్తృత్వమంతయ్ను గురుపరమాత్మదే అను నిశ్చయములో ఆగామి కర్మఫలములు అంటకుండాలాగున శేషజీవితమును సాగించవలెను. గురువు శిష్యుని కన్నకొడుకుగా భావించి హృదయ గ్రంధి విచ్ఛేదన మొనర్చవలెను. గురువుచేత శిష్యుడును శిష్యుని ప్రవర్తన చేత గురువును "మణియేన వలయం, వలయేన మణిః" అనగా మణులచేత బంగారు కడియమును, కడియముచేత మణియును ప్రకాశించు రీతిగా గురుశిష్యు లిద్దరును పేరు కీర్తులు సంపాదించవలెను. గురుశిష్యులు ఈ విధముగా ఉన్ననాడే శిష్యుడు కృతకృత్యుడై జన్మరాహిత్యమును పొందును.

3) ముక్తి : ప్రతిప్రాణియు తన కర్మకు తాను బద్ధుడై జనన మరణ ప్రవాహములోబడి కొట్టుకొంటూ స్వతంత్రత లేక సుఖదుఃఖములు పొందుటయే బంధం. యీ బంధమునుండి విడుదల పొందుటయే ముక్తి. సగుణస్వరూపుడగు భగవంతునియందు భక్తి కలిగి సేవించినచో ముక్తి కలుగునని కొందరిచే వివరించుబడుచున్నది. అట్టి భగవంతుని విష్ణువుగానో, శివునిగానో భావించి, వుపాసించుచున్నారు. ముక్తి ఐదు విధములుగా యున్నది.

1) సాలోక్యం : అనగా తన యిష్టదైవముయొక్క లోకము తనకు ప్రాప్తించుట. ఆ లోకములో దుఃఖములేవియు నుండవని కేవల సుఖమే యుండునని వారి భావన.

2) సామీప్యం : ఆ యిష్టదైవముయొక్క లోకమునందు ఉండుటయేగాక ఆయనకు సమీపములో సన్నిధానమున ఆనందముతో నుండుట.

3) సారూప్యముక్తి : ఆ యిష్టదైవము యొక్క రూపముకూడా తాను పొందుట

4) సాయుజ్యము : అనగా యిష్టదైవముతో తాదాత్మ్యము నొందుట

5) సార్ష్టిత్వము : తన యిష్టదైవము కేవలం షడ్గుణైశ్వర్య సంపత్తిగల భగవంతుడు. షడ్గుణైశ్వర్యము లేవనగా : 1) జ్ఞానము 2) వైరాగ్యము 3) ఐశ్వర్యము 4) యశస్సు 5) సంపద 6) స్వాత్మానందము. ఈ గొప్ప లక్షణములన్నియు ప్రాప్తించుట లేక సృష్టి ప్రళయములు భూత భవిష్యత్‌లు తెలుసుకొనుట, విద్యావిద్యల నెరుగుట ఆరు గుణములు కలిగియుండుట భగవల్లక్షణములు. యిట్టి భగవల్లక్షణము లన్నియు తనకు ప్రాప్తించుటయే సార్ష్టిత్వము అను ముక్తి ఈ పంచముక్తులలో శాశ్వత జన్మరాహిత్యములేదు. ఏలననగా బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివుడు అనువారలందరికి ప్రళయము చెప్పబడియున్నది. మహాప్రళయము తో పైన చెప్పబడిన పంచముక్తులుకూడా పోవలసినవే భక్తునియొక్క వ్యక్తిత్వము లేక జన్మ కారణమగు వస్తువు పూర్తిగా నశించలేదు. జనన మరణ రహితమగు మోక్షము లభించుటయే ముక్తి అను పదముచేత ఈ శ్లోకములో లక్షింపబడినది.

3) గురుభక్తి : భక్తి యనగా, భయముతో గూడిన ప్రేమ, కుమారునికి తండ్రి యందుగల ప్రేమ భక్తియన జెల్లును. ఏలననగా ప్రేమతోపాటు తండ్రి శాసించిన ప్రకారం చేయనిచో తండ్రి తన ఆస్తిని తన కీయడేమో! పైగా శిక్షించునేమో! యను భయముగూడ నుండును. గురువు చెప్పిన మంత్రానుష్ఠానము, ధ్యానము త్రికరణ శుద్ధితో చేయనిచో బోధ రహస్యములను తనకు ప్రసాదించడని భయపడును. తండ్రిని ప్రేమించునట్లు ప్రేమించుట గురుభక్తియని సామాన్యార్థము. విశేషార్థములో, గొప్పభక్తి యని అర్థము గొప్పభక్తి యేదంటే, బాహ్యశక్తి, అనన్యభక్తి, ఏకాంతభక్తి అను భక్తి త్రయములలో ఏకాంత భక్తి గొప్పది. ఏకాంత భక్తి అనగా గురుస్వరూపమే తాను. తానే గురుస్వరూపము. గురుస్వరూపముకాని దేదీ విశ్వమందు వేరే లేదని వునికి గలిగియుండుట ఆదిశంకరులు "స్వస్వరూపాయ సంధానం భక్తిరి త్యభిధీయతే" అని భక్తిని నిర్వచించినారు. యిట్టి స్వరూపానుసంధానమే నిజమగు గురుభక్తి పరాభక్తి యని ఏకాంతభక్తియనీ ఏకభక్తియనీ స్పష్టీకరింపబడినది వస్తు నిశ్చయముకూడా గురుముఖతః తెలుసుకొన్నవానికి గలుగునది బుద్ధి నిశ్చయము (పరోక్ష జ్ఞానము) మాత్రమే ఆత్మనిశ్చయజ్ఞానము (అనుభవజ్ఞానము, అపరోక్ష జ్ఞానం) గా పరిణతిబొందుటకు ధ్యానమే ఏకైకసాధనము. గురూపదేశముగొన్న శిష్యుడు యిట్టి గురుభక్తి సలుపుటయే అత్యంత కర్తవ్యమని ఈ శ్లోక ముద్ఘాటించుచున్నది. యితర భక్తి విధానముల యందు ఉపాస్య ఉపాసకులకు భేద ముండనే యున్నది. కాని యీ భక్తి భావమునందు యీ భేదదృష్టి అంతరించుటచే యిది అద్వైతభక్తియని చెప్పనగును. "తేషాం, జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి రివ్వశిష్యతే" అనగా నాలుగు రకముల భక్తబృందములలోనూ యిట్టి ఏకాంతభక్తిగల జ్ఞానియే శ్రేష్ఠుడు అని చెప్పబడెను. గురుస్వరూపం తానేయై ఏకభావనచెందుట అనంతరం తన కన్యముగనున్న పరిపూర్ణపరబ్రహ్మమును యెరుగుటయు గురుభక్తుని లక్ష్యములు.

4) గురుభక్తి : పరిపూర్ణ బోధ మార్గమందు గురుభక్తి ముఖ్యావసరము. భక్తి సోపానములగు బాహ్యభక్తి యనన్యభక్తి, ఏకాంత భక్తి, అనువానితో గురుపుత్రుడు ఏకాంతభక్తినే అభ్యసింపవలసి యున్నది. తన వ్యక్తిత్వమును, మిగుల్చుకొనియున్నంతవరకు జన్మరాహిత్యము సిద్ధించదు. తన సూక్ష్మకారణ మహాకారణ శరీరములను గురుమూర్తి నిజస్వరూపమునందు లయము చేయవలెను. గురుస్వరూపంతో తాను తాదాత్మ్యము సిద్ధించుకొనవలెను. యిందుకు గురుగీత ప్రథమాధ్యాయము నందు పేర్కొనబడినరీతిగా తన నాలుగు దేహములను ప్రతినిత్యము మానసిక పూజావిధానముచేత గురువుకు అర్పించుటయు, భగవద్గీత చరమశ్లోకమునందు చెప్పబడ్డరీతిగా సర్వధర్మములను గురువునకు అర్పణచేసి శరణాగతుడై కర్తృత్వరహిత కర్మాచరణముచే ఆగామికర్మ నాశనముచేసుకొన్న వాడే కృతకృత్యుడు కాగలడు. కనుకనే గురుభక్తి అత్యంత ముఖ్యావసరమని ఈ శ్లోకములో చెప్పబడినది.

5) మనీషి : మనీష అనగా బుద్ధి. మనీషి అనగా బుద్ధిమంతుడు. వివేకి అగు మానవుడు. పూర్వజన్మసుకృతమునగాని యీ గురుమార్గ మందరికి లభ్యంకాదు. అట్టివాడే ఉపదేశం పొందుటకు పూర్ణాధికారి. ఏకాంతభక్తి సాధనే అతని అనంతర ముఖ్యకర్తవ్యమైయున్నది. గురుభక్తి లేనిచో నెట్టి మనీషావంతుడయినను కృతకృత్యుడు కాలేడు. వుపదేశానంతరం గురువు నరుడనే భావన పూర్తిగా విసర్జించి కేవలం గురువు పరమాత్మ స్వరూపుడే అను భావం దృఢమగుటకైగురుభక్తి, గురుసేవ, గురునిష్ఠ గలిగి గురూపదిష్టమార్గమందు కృషి చేయవలెను. ఇందుకు తగిన శక్తి యుక్తులు కూడా ఆ గురుపరమాత్మయే అనుగ్రహించవలెను. ఆ గురుపరమాత్మ కివే మా అనంతకోటి ప్రణామములు.

శ్లో॥ నిత్యయుక్తా శ్రయస్సర్వ వేదకృత్ సర్వవేదకృత్।
స్వపర జ్ఞానదాతా చ తం వందేగురు మీశ్వరమ్॥

తాత్పర్యము : ఎల్లప్పుడు ఆత్మజ్ఞానముతో గూడుకొనియున్న వాడును. సమస్తవేదములకు కర్తయున్ను, సర్వమును తెలియజేసెడి వాడును, తనయొక్కయు తనకతీతమైన పరవస్తువు యొక్కయు విజ్ఞానము గల్గించువాడును. సమస్తమునకు ప్రభువును ఐన, గురుమూర్తికి నమస్కరించుచున్నాను.

విశేషవివరణము : 1) నిత్యయుక్తాశ్రయుడు 2) సర్వవేదకృత్ 3) స్వపర జ్ఞానదాత 4) వందే గురుమీశ్వరం. అను నాలుగు విషయములను గూర్చి వివరించి తెలుసుకొనదగును.

1) నిత్యయుక్తాశ్రయుడు : నిత్య + యుక్త + ఆశ్రయుడు = నిత్యయుక్తాశ్రయుడు యుక్త = కూడికొనియుండుట అనగా యోగము నిత్యయుక్తుడు = నిరంతరము యోగమునందు సుప్రతిష్ఠుడు ఆశ్రయము అనగా విశ్రాంతి స్థానము. శరణాలయము, ఆధారము అని అర్థము. కనుక నిరంతరము యోగమునందు సుప్రతిష్ఠులైయున్న యోగులకు ఆశ్రయమైనవాడు. జీవేశ్వరులు ప్రకృతి పురుషులు ప్రత్యగాత్మ పరమాత్మలువీని ఐక్యమును తెలిసినవారే యోగులు ప్రత్యక్పరమాత్మల కైక్యము నిజముగా సాధించవలసిన పనేలేదు. అట్టి ఐక్యం నిత్యసిద్ధము, స్వాభావికమేగాని, అగంతుకముకాదు. కనుక ఏతత్ప్రాప్తి కొరకు ప్రయత్నము చేయవలసిన పనియేలేదు. కనుకనే దానికి ప్రాప్తా ప్రాప్తవ్యము అని శాస్త్రము పేరిడినది. గురుపరమాత్మయే యిట్టి యోగులకు కూడ ఆశ్రయభూతుడు. అఖండ బ్రహ్మాకారవృత్తి యందుండి ప్రాపంచిక దృష్టికూడ లేకపోవుటయే నిత్యయుక్తత్వమని అనరాదు. భుక్తి ముక్తి క్రియలు రెంటి యందునూ

సంగాసంగములు లేక ప్రవర్తించుటే పరమ యోగము. ఇదే గీతాకారుని కర్మ కౌశలము యిదే అస్పర్శయోగము. ఇదే భగవానుడనుగ్రహించగల బుద్ధియోగము. కనుకనే గీత

శ్లో॥ ఏషాం సతతయుక్తానాం, భజతాం ప్రీతిపూర్వకం
దదామి బుద్ధియోగం తంయేన మాముపయాంతితే॥ (10-10)

అనగా నిరంతరము యోగయుక్తులై, నన్ను భక్తితో భజించెడి వారలకు, నన్ను పొందగల బుద్ధియోగము నిచ్చుచున్నాను. కనుకనే యీ శ్లోకములో ఆ గురుపరమాత్మ నిత్య యుక్తాశ్రయుడు అని అభివర్ణింపబడినాడు.

సర్వవేదకృత్ = అన్ని వేదములు చేసినవాడు. ఎన్ని వేదములున్నవి? "అనంతోవై వేదాః" అని "వేదాస్త్యనంతాని" అనిశ్రుతులు, వేదములనంతములు. అసంఖ్యాకములు అని ప్రతిపాదించు చున్నవి. వేదవిభాగము చేసిన వ్యాసుడు నాలుగు వేదములక్రిందనే, వేదవిభాగం చేసినందున చతుర్వేదములని ప్రసిద్ధిచెందినది. వేదము అనుమాటకు తెలియబడినదని అర్థము. ఎవరు తెలియజేసిరి? పరమాత్మయే. తెలియబడిన దంతయు లేక జ్ఞానముచే తెలుసుకొన్నది. తెలుసుకొను చున్నది. ముందు తెలుసుకోదగినది. అనగా తెలివికి (జ్ఞానమునకు, లేకయెరుకకు) తెలియ బడుటకు సాధ్యమైదంతయు వేదము అని చెప్పదగియున్నది. ఒక్క పరిపూర్ణ పరబ్రహ్మము తప్ప అన్యమంతయు తెలివియొక్క ఆవరణములోనికి వచ్చునదే! కనుక వేదములు అసంఖ్యాకములు అనంతములు అని చెప్పదగియున్నవి. వేదము అను మాటకు జ్ఞానము అని కూడా అర్థము కనుకనే జ్ఞానం, జ్ఞేయం, పరిజ్ఞాతా, అని త్రివిధ రూపంగా చెప్పబడిన త్రిపుటి అంతయు వేద శబార్థములో యిమిడి యున్నది. యీ విధమగు సమస్తమునకు కర్త ఎవరు? పరమాత్మయే ఎట్లు సృష్టించెను?

"బ్రహ్మనిశ్వసితో వేదాః" బ్రహ్మము బయటకు వదలిన నిశ్వాసనుండి యే వేదములు పుట్టినవి అని అర్థము అచలరూపంలో నున్న ఆ బ్రహ్మ వస్తువునందు చలన లక్షణముతోచిన వెంటనే సమస్తోత్పత్తిజరిగెను. అందు ధ్వన్యాత్మకమగు ప్రణవమే మొదటిది. అందుండి ఏబది అక్షరములు. శబ్దములు వాక్యములు, సర్వవాంగ్మయము ఏర్పడెను. గనుక బ్రహ్మము యొక్క నిశ్వాసమునుండియే వేదములు ఉపనిషత్తులు సకల నిగమాగమములు. సర్వవేదకృత్ అని యీ శ్లోకములో ఎందుకు రెట్టింపబడినది? అంటే 4 వేదములేగాక సర్వ వాగ్మయములున్ను సృష్టి సర్వస్వమున్నూ కూడా ఆ పరమాత్మనుండియే వెలువడినది. అని తెలియపరుచటకే అని తెలియవలెను. కనుకనే భ.గీ. (15-15) లో "వేదైశ్చ సర్వైరహమేన వేద్యో వేదాంత కృద్వే నవి దేవచాహం" అని భగవానుడు సెలవిచ్చినాడు.

3) స్వ, పర, జ్ఞానదాత = "స్వ" అనగా తనయొక్కయు. పర = తనకు పరమైన అనగా తన కంటె అత్యంత భిన్నమైన దాని యొక్కయు విజ్ఞానమును ప్రసాదించువాడు అని అర్థము. "స్వ" అనగా గురుమూర్తి యొక్క స్వరూపజ్ఞానమా లేక శిష్యుని యొక్క స్వరూప జ్ఞానమా? అంటే ప్రత్యగాత్మ పరమాత్మల యొక్క స్వరూపము. ఏకమే కనుక యీ శంకకు తావేలేదు. ఇట్టి ఏకైక రూపమగు స్వరూపమునకు భిన్నమైనదేది? పరిపూర్ణ బ్రహ్మ మొక్కటే అది జ్ఞాతవ్యం కాదు గదా! దానిని గురించి గురుమూర్తి ఎట్లు తెలియపరచగలడు? శిష్యునికి స్వస్వరూప జ్ఞాన మారూఢమైన పిదప దాని కన్యమేదో తెలివి లేకనే తెలుసుకోగలడు. స్వస్వరూపమే యెరుక. అట్టి యెరుక లేనిదీ యెరుకగానిది కదా పరిపూర్ణ పరబ్రహ్మము.

కనుక ఎరుక రహితము నందే ఆ పరవస్తునిశ్చయం. ఇట్టి యెరుక పరిపూర్ణముల జ్ఞానం నెవరు ప్రసాదించగలరు? గురుమూర్తియే. ఈ జ్ఞానం వాచాజ్ఞానంగాదు. వాచాజ్ఞానం గ్రంధపరిశోధనవలననే లభింపగలదు. యిది వస్తునిశ్చయ జ్ఞానం. కేవలం గురుకృపవలన మాత్రమే లభింపగలదు.

4) వందే గురు మీశ్వరం = ఈశ్వరుడనుటతోనే సగుణరూపుడని తెలియబడుచున్నది. సత్వగుణ ప్రధానమగు మాయను స్వాధీనంచేసుకొని సృష్టి స్థితి లయములనుచేయు ప్రభువే ఈశ్వరుడు "యోలోకత్రయ మావిశ్యభిర్తవ్యయ యీశ్వరః" అని యీశ్వరశబ్దం గీత నిర్వచించినది. మూడులోకములనిండి ధరించి భరించుచు ఎప్పటికి క్షయ మెరుగని అవ్యయమూర్తియే ఈశ్వరుడు. "ఏకో దేవస్సర్వ భూతేషుగూఢః" అనీ, "ఈశ్వరస్సర్వ భూతానాం హృద్దేశేఽ ర్జునతిష్ఠతి" అనిచెప్పబడిన విధంగా ఆ యీశ్వరుడే సర్వభూతములయందున్నూ రహస్యంగా సర్వజీవుల హృదయ ప్రదేశములయందున్న వాడని చెప్పబడినది. కనుక పిండబ్రహ్మాండములన్నిటి యందునూ తెలివి రూపంగా నున్నవాడని చెప్పవలసియున్నది. ఆ ఒక్క యీశ్వరుడే "ఏకోమూర్తి స్త్రీధాభిన్నః బ్రహ్మవిష్ణుమహేశ్వరః" ఆ ఈశ్వరుడే బ్రహ్మ విష్ణు మహేశ్వరులను త్రిమూర్త్యాత్మకుడైనాడు. "గురుస్సత్య మయో విష్ణుఃరాజసశ్చతురాననః తామసోరుద్రరూపేణ సృజత్యవతి హంతిచ" కనుక ఆ యిశ్వరుడే గురుడు. త్రిగుణ విశేషములచే త్రిమూర్తులై నాడని సిద్ధించుచున్నది. గురువే బ్రహ్మ విష్ణు మహేశ్వరులుగా సాక్షాత్తు బ్రహ్మస్వరూపుడు గానున్నాడని గురుర్బ్రహ్మ అను శ్లోకముద్ఘాటించుచున్నది. ఏశబ్దార్థం గ్రహించవలసివచ్చినా, ఆ శబ్దమే శాస్త్ర గ్రంధం లేక దర్శన శాస్త్రంలో నుపయోగింపబడినదో, ఆ గ్రంధములోనే ఆ శబ్ద నిర్వచనము నరయుట ధర్మము. గురుగీతలో గురువే ఈశ్వరుడు అని యీ శ్లోకమున్ను " నిరస్త సర్వసందేహో యేకీకృత్య సుదర్శనం, యోదర్శయతి......భజామి గురుమీశ్వరం" అను శ్లోకమున్ను వుద్ఘాటించుచున్నవి. భగవద్గీతలోని ఈశ్వర శబ్ద నిర్వచనముగూడ యిందు కనుగుణ్యముగానే యున్నది

శ్లో॥ "ఉత్తమ పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహ
యోలోకత్రయ మావిశ్య భిభర్త్యవ్యయ ఈశ్వరః

క్షరాక్షరపురుషుల కతీతుడై పరమాత్మయని కీర్తింపబడిన పురుషోత్తముడే త్రిలోకములను భరించుచు అవ్యయుడనీ, ఈశ్వరుడనీ పిలువబడుచున్నాడు. కనుక సాక్షాత్ బ్రహ్మమగు గురుపరమాత్మయే, పురుషోత్తముడనీ, పరమాత్మయనీ, అవ్యయుడనీ,ఈశ్వరుడనీ స్థితి భేదముచే వేర్వేరు పేర్లతో పిలువబడుచున్నాడు. అట్టి గురుమూర్తి

శ్లో॥ "గురుమధ్యేస్థితిం విశ్వం, విశ్వమధ్యేస్థితోగురుః
గురుర్విశ్వం సమస్తంతు తస్మై శ్రీగురవేనమః"

అని కీర్తింపబడుచున్నాడు. ఈశ్వర స్వరూపుడైన గురుమూర్తికి నమస్కారములని యీ శ్లోకము చెప్పుచున్నది. ఎవరే నామ రూపములతో సేవించినా ఆ గురుపరమాత్మకే సమర్పితమగుచున్నది. కనుకనే "యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజా మ్యహం" అంటున్నాడు. శ్రీకృష్ణభగవానుడు. ఇట్టి విజ్ఞానముతో ఆ గురుపరమాత్మ నామరూపముల నహరహము భజించెదముగాక!

శ్లో॥ సర్వం గురుముఖాల్లబ్ధం సఫలం పాపనాశనం
యద్యదాత్మహితం వస్తు తత్తద్ద్రవ్యం న వంచేయేత్

తాత్పర్యం : అత్యంత మూలకారణముగానూ, ఆధారము గానూ యున్న గురుపరమాత్మ నుండియే సర్వము ప్రాప్తించుచున్నది. సర్వఫలములు సిద్ధించుచున్నవి. సకల పాపములూ వుపశమించు చున్నవి. కనుక యీ పరమాత్మ ప్రీతికరములగు వస్తువులయం దెంతమాత్రము ననాదరణ ముంచరాదు. వంచింపరాదు. అనగా మోసగించరాదు.

విశేష వివరణం : 1) గురుముకాల్లబ్ధము 2) సఫలం పాపనాశనం 3) ఆత్మహిత వస్తువులేవి? 4) తత్తద్ద్రవ్యం న వంచయేత్ అను నాలుగు విషయములను వివరించి తెలుసుకొనదగును.

1) గురుముఖాల్లబ్ధము : ముఖమనే శబ్దమునకు నానార్థములు గలవు. అందు వదనము, నోరు, మూలము, ఆధారము, ద్వారము అను నానార్థములు గలవు.

వదనము : శరీరావయములలో చాలా ముఖ్యమైనది జ్ఞానేంద్రియ గోళకములకు స్థానము, మనోవికారములు ప్రతిఫలించు దర్పణము, కనుకనే బుద్ధికి ముఖస్థానము చెప్పబడినది. వ్యక్తి ప్రత్యేకతను గుర్తించుటకు ముఖ్యసాధనమునై యున్నది. అఖండ గురుస్వరూపమునకు ఆకాశావరణమే ముఖము. అందే సమస్తము సృష్టి స్థితి లయములు చెందుచున్నవి.

ముఖశబ్దమునకు నోరు అను అర్థములో, శబ్ద నిర్గమ స్థానము అనగా శబ్దము వాగ్రూపముగా బయల్వెడలు స్థానము నోరు. ధ్వన్యాత్మక, వర్ణాత్మకమగు సమస్త శబ్దములు గురుపరమాత్మనుండియే వెలువడినవి. "బ్రహ్మ నిశ్వసితో వేదాః" అనగా వేదములు బ్రహ్మ యొక్క నిశ్వాసములని చెప్పబడినవి. బ్రహ్మ కుచ్ఛ్వాస నిశ్వాసలు జరుపు ఘ్రాణేంద్రియ మున్నదా? యని ప్రశ్నింపరాదు. అలంకారికముగా శ్రుతి యట్లు చెప్పినది. అంతకు పూర్వ మా బ్రహ్మమునందు బీజరూపముగా నున్న ప్రాణముయొక్క చలనాంశము ప్రకటనమైనదని మాత్రమే యర్థము. బ్రహ్మము యొక్క ప్రథమ చలనమే విశ్వాస, దానితోపాటే ఆ బ్రహ్మమునందణగిమణగియున్న పరావాక్కు, ధ్వన్యాత్మకమై ప్రణవాభిదానము నందినది. పంచాశదక్షరములతో, ప్రపంచము ప్రణవాక్షరమందుద్భవించెనని శ్రుతులు పలుకుచున్నవి. ఉచ్ఛారణ విశేషముల కీయబడిన గుర్తులే అక్షరములు. వానితో యీ శబ్ద ప్రపంచము (వాఙ్మయము) అంతయు విస్తరిల్లెను గదా!

మూలం : నామరూపాత్మకమగుయే వస్తువును గ్రహించి దాని కారణ పరంపరను అన్వేషిస్తూ పోయినా చివరకు పరమాత్మ స్థానమునే చేరుకొందుము. అపైన దానికి వేరే మూలముగాని స్థానము గాని లేదు. దాని కదే మూలము. దానికదే స్థానము. ఆ బ్రహ్మమే సమస్తము నకూ అత్యంత మూలకారణమై యున్నది.

ఆధారం : స్వర్ణకారునికి (కంసాలికి) ఏయే ఆభరణములు రూపొందించవలెనన్నా, వానికి దాగలి యెట్లాధారమైయున్నదో, అట్లే యీ జీవేశ్వర జగద్రచనకు కూటముగా (దాగలిగా) నూ, కూటస్థుని గానూ ఆ బ్రహ్మమే జగదాధారుడుగా నున్నాడు.

ద్వారం : ప్రవేశ నిర్గమ స్థానమే ద్వారము. అనగా లోపలికి బయటకు దేనిగుండా పోవలెనో అదే ద్వారము. తాబేలు తన యవయవములను అవసరానుసారము బయటకు లోనికి తన నుండియే ఎట్లు ప్రసరింపచేయునో అట్లే జీవేశ్వర జగత్తును, బ్రహ్మము ఆవిర్భావ

తిరోభావములను చెందించును. ఆ సృష్టి ప్రళయములు దేనిద్వారా జరుగుచున్నవో అదే ద్వారం అదే బ్రహ్మము యొక్క ముఖము లేక ద్వారముగా వర్ణింపవచ్చును.

ఇది. సగుణ స్వరూపుడగు తన స్వగురువునెడల నెట్లన్వయింపనగును?

ముఖము : ప్రసన్న గంభీరమై కరుణామృత వృష్టి గురియు కన్నులతో గూడినగురుదేవుని మందస్మిత ముఖారవిందమెంత మనోహరము. సందర్శనమాత్రముచేతనే సర్వకోరికలు యీ డేరినంత తృప్తి కల్గి పరమశాంతి చేకూరును. జ్ఞానానంద సాగరమున నోలలాడుచున్నట్లుండును. కనుకనే గురుగీత "యస్య సన్నిధి మాత్రేణ చిదానందాయ తే నమః" అని అన్యత్ర పలుకుచున్నది. కనుకనే అట్టి సాధుపుంగవుల దర్శనము పూర్వపుణ్య విశేషమునగాని సిద్ధించదు. అంతేగాక "సాధూనాం దర్శనం పుణ్యం" అని చెప్పబడినట్లుగా ఆ గురుదర్శనము మరియొక పుణ్య సంస్కారమును సృష్టించుచున్నది.

నోరు, ద్వారము : "గురువక్త్రే స్థితం బ్రహ్మ" మనీ, "గురోర్ముఖేన జ్ఞాతవ్యం" అనీ గురుగీతయే వర్ణించుచున్నది. ఏలననగా జ్ఞాన విజ్ఞాన రూపమగు బోధయంతయు గురువాక్యము ద్వారానే లబ్ధమగు చున్నది. వాగింద్రియ గోళకము (స్థానము) నోరే గదా!

మూలము, ఆధారము : శిష్యుని జ్ఞానాభివృద్ధికి గురువే మూలమూ ఆధారమూ నని చెప్పదగును. శిష్యుని అంతఃకరణమున జ్ఞానబీజమును నాటుటకు బోధచే దానిని మొలకెత్తించి దానిని పోషించుటకు , ఆ జ్ఞాన వృక్షము పుష్పించి ఫలింపచేయుటకు గురువే మూలకారణమై యున్నాడనుట నిస్సందేహము. గురువు లేనిదే ఏవిద్యయూ రాణించదు. "గురువులేని విద్య కూడ దెవ్వరికైన, శూలికైన, బ్రహ్మచూలికైన" అని, శివకేశవులకే గురువసరముకాగా సామాన్యుల మాట చెప్పనేల? బ్రహ్మవిద్య విషయంలో గురుని యవశ్యకతను గూర్చి ఎవరికిని యెట్టి సంశయము నుండ జాలదు. ఐనను కొందరు మహాత్ములకు యీ జన్మలో గురువున్నట్లు కానవచ్చుట లేదే అని ప్రశ్న రావచ్చును. అయితే అట్టివారు కారణ జన్మలనీ, లేక సిద్ధపురుషులనీ పూర్వపూర్వ జన్మలలో గురుకృపా సంసిద్ధి పొందినవారని గ్రహించవలెను.

సగుణ నిర్గుణరూపములలో నున్న గురుమూర్తినుండియే సర్వమూ లభించుచున్నది. అనగా మనో వాక్కుల కందే సమస్తమూ గురుస్వరూపమే కారణంగా గలిగియున్నది. జయాపజయములు జ్ఞానా జ్ఞానములు, భావాభావములు, బంధమోక్షములు, జనన మరణములు మొదలగు సమస్తమూ గురుస్వరూపమునందే మరుగుగానో లేక బహిరంగముగానో వుండియున్నవి.

2) సఫలం, పాపనాశనం : ఇచట పాపపుణ్యములన నేమో యించుక విచారించవలసి యున్నది. సుకృత, దుష్కృతముల ఫలములే పుణ్యపాపములు. సుకృత మనగా సుకర్మ యొక్క ఫలితము. ఇది సుఖ కారణము. దుష్కృతము (దుష్టకర్మ) యొక్క ఫలితము, దుఃఖ కారణము. కనుక పుణ్యపాపములు అనగా సుఖ దుఃఖ హేతువులైన సుకృత దుష్కృతములని యొక విధముగా నిర్ణయించవచ్చును. గురూపాసనకు ఫలిత మేమనగా మన పూర్వపుణ్యములు ఫలించి, సఫలమై మనకు సుఖప్రాప్తి చేకూరగలదు. దుఃఖహేతువులైన పాపకర్మ ఫలితములు ఫలోన్ముఖమునకు రాకపూర్వమే నాశనము చెందును. పాప నాశనమగుటచే దుఃఖధ్వంసము కాగలదు. దుఃఖనివృత్తి యే ఆనందావాప్తియు కలుగుటే మోక్షమని నిర్వచింపబడినది గదా! పుణ్యకర్మ సఫలమగును. పాపకర్మవిఫలమగును. యీ రెండునూ సఫలం పాపనాశనం అను

పై మాటలచే సూచింపబడినవి.

ఐతే, యిందొక శంకకలుగుచున్నది. పుణ్యకర్మవలన లభించు సుఖప్రాప్తి (లేక స్వర్గ భోగములు) హిరణ్య శృంఖలములు (బంగారు సంకెళ్ళు) వంటిదనీ, పాపకర్మఫలితమగు దుఃఖప్రాప్తి (నరకానుభవము) యినుప సంకెళ్లు వంటిదనీ పెద్దలు చెప్పుచున్నారు గదా! జన్మ రహితమే ఆశించు గురుపుత్రుని యెడల యీ శ్లోకభావమును అన్వయించుటెట్లు? అంటే గురుపుత్రునికి గురుకృపా సంసిద్ధి తప్ప యితర సంకల్ప మేమియు లేదుగదా! గురుకృప కలుగుటే సంకల్పము సఫలమైనట్లు. ఇక పాపనాశనమగుటయేమి? అంటే గురుపుత్రుడు గృహస్థాశ్రమమునందే యుండి అందరివలెనే అన్ని కర్మలు చేయు చుండియు, ఆగామీ కర్మఫలమంటకుండునట్లు కర్మకౌశల మెరిగి ప్రవర్తింప వలెను. కర్తృత్వత్యాగమే అస్పర్శయోగం ఇట్టి యోగముచేగాని కర్మఫల మంటకమానదు. కర్తృత్వమే అహంకారము. నేను అను అహంకార మున్నపుడే "నాది" అను మమకారము కలుగును. యీ అహంకార మమకారములే సర్వానర్థ హేతువులు. కర్తృత్వమే మహాపాపము. గురూపాసన చేయు భక్తుడు గురుమూర్తికి, భక్తి యందు పరాకాష్ఠ రూపమగు ఆత్మనివేదనము గావించుకొనును. అట్టి శరణాగతి చేసిన భక్తునికి "అహం, త్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః" అని భగవంతుడభయప్రధాన మొసంగుచున్నాడు గదా! భక్తుడు "సర్వం గురుముఖాల్లబ్ధం" అని ఏనాడు గుర్తెరిగినాడో నాడే, కర్మ ఫలితములయందనాసక్తి సిద్ధించుచున్నది. రాబోవు సుఖదుఃఖములకు తాను కర్త భోక్త గాడనే భావ మారూఢముకాగలదు. ఇక పాపరూపములగు అహంకార మమకారములకు తా వెక్కడ్డిది. సఫలం అనగా గురుకృపా సంసిద్ధి యనియు "పాపనాశనం" అనగా కర్తృత్వ త్యాగం లేక అహం పదార్థ రహితము అనియు తెలియదగును.

3) ఆత్మహితవస్తువులేవి? అనగా ఆత్మకింపైన వస్తువు లేవి అని అర్థము. గురుపరమాత్మ కానందము కలుగచేయునట్టి వస్తువులా? లేక శిష్యుని కానందము కలుగచేయునట్టివా? శిష్యుని కానంద జనకములగు వస్తువులను నిరాదరణ చేయరాదని చెప్పవలసిన పనియేలేదు. కనుక గురువున కానందజనకములగు వస్తువులు అనియే అన్వయించు కొనవలసియున్నది. గురుస్సాక్షాత్ పరబ్రహ్మ యనిచెప్పుకొంటున్నాము గనుక సగుణ రూపమగు స్వగురుని ఆత్మయే పరమాత్మ. అట్టి గురుపరమాత్మ కానందం గలిగించుటే ఆత్మశుశ్రూషయని గుర్తించవలెను. సర్వమూ గురుముఖాల్లబ్ధమైనపుడు ఏ వస్తు విచ్చినను గురుపరమాత్మ కానందము కలుగజాలదు. మరి యెట్లు? అంటే "ఆత్మా ఉ ఏకస్సన్ యే తత్రయం" అనీ. ఆ ఒక్కటైన సత్పదార్థము" మనః ప్రాణవాచా సంఘాతం సత్తా" యనియు శ్రుతులు పలుకుచున్నవి. అనగా సత్ వస్తువు అనబడే ఆత్మ మనఃప్రాణ వాక్కు రూపములుగా నున్నది అని చెప్పబడినది. మరిన్ని మనఃప్రాణ వాక్కులే ఆత్మ కాహారములని సప్తాన్న వివరణలో చెప్పబడినది కనుక అవియే ఆత్మ హితములగు వస్తువులు. కనుక భక్తుడు తన మనోవాక్శరీరముల (ప్రాణమే శరీరం కనుక) పరిశుద్ధముగా నుంచి వానిని పరమాత్మ కార్యములయందు వినియోగించుచూ త్రికరణ శుద్ధి పాటించెనేని దాని వలన మాత్రమే, గురువు కానందము కలుగును. నాడే భక్తుడు గురుకృపకు పాత్రుడు గాగలడు.

4) తత్త ద్ద్రవ్యం న వంచయేత్ = అనగా ఆత్మహితములగు ఆ మనోవాక్శరీరముల ప్రవర్తనయం దప్రమత్తుడై (జాగరూకుడై) మెలగవలెను. వానిని పెడదారుల బట్టించుటయే

వానిని మోసగించుట. ఆ మనః ప్రాణ వాక్కులు యెట్లు వ్యష్టి సమష్టులయందు అంతఃకరణ రూపములై ఆత్మకు యెట్లు శరీరభూతములై యున్నదియు గురుముఖతః శిష్యుడు విచారించి తెలుసుకొన్నపుడే కాయిక వాచిక మానసిక తపస్సుల కొక ప్రతిష్ఠ కలుగును. ఆ త్రికరణములు మనయందు ముఖ్యమైన పనిముట్లుగా నున్నవి. వానిని రుజు మార్గమున వర్తింపనీయక వక్రమార్గమున నడిపించుటే వానిని మోసగించుట లేక వంచించుట. దుష్టశిక్షణ కుపయోగించినా లేక సత్పురుషులను పీడించుట కుపయోగించినా మన ఆయుధముల కెట్టి పుణ్యపాపము లంటక మన అంతఃకరణనే పవిత్ర మొనరించును. లేదా అపవిత్ర మొనరించును. పరిశుద్ధమగు చిమ్నీ లేక బల్బునందలి దీప ప్రకాశము, ప్రకాశవంతమై చిమ్నీకూడా కనుపించనంత తేజోరూపమున వెలిగిపోవునట్లు, మనయందలి పరిశుద్ధమగు అంతఃకరణము కూడా ఆత్మస్వరూపమునే చెంది తేజోవంతమై విరాజిల్లును. ఆనాడే గురుకృపా సంసిద్ధీ చేకూరగలదు. అట్టి గురుకృపా విశేషమును గూర్చి శ్రీకృష్ణదేశికేంద్రులు "అపరోక్షమౌను మనుజులకు పరోక్షంబైన బయలు "గురు కృపకలుగా, కీలిదెలేని యెరుక తా తొలుగా" అని ఘంటాపథముగా సెలవిచ్చినారు.

త్రికరణముల ప్రవర్తనయందు భీతికలిగి భయభక్తి యుతముగా గురుసార్వభౌముని సేవచేయుటకై శక్తిసంపద నొసంగుటకై శ్రీగురుపరమాత్మ యొక్క సగుణ నిర్గుణ రూపముల నహరహము భజించెదముగాక.

శ్లో॥ పరాత్పరతరం ధ్యాయేత్ నిత్యమానందకారకం
హృదయాకాశ మధ్యస్థం, శుద్ధస్ఫటికసన్నిభమ్॥

తాత్పర్యము : అన్నిటికంటె పరమైనవాడును, ఆనందస్వరూపుడును, హృదయాకాశము స్థానముగా గలవాడును, స్ఫటికమణివలె పరిశుద్ధ స్వరూపుడును అగు సద్గురుమూర్తినే ఎల్లపుడును ధ్యానింప వలెను.

విశేషవివరణములు : పరాత్పరతరం = పరముకంటెను, పరమైన దానికంటెనూ పరముగా నున్నదని అర్థము. అన్నిటికంటెను తనకు సన్నిహితము (దగ్గరగా) నున్నది తన శరీరము. సాధారణముగా ప్రతివాడును వ్యవహారకాలమందు శరీర తాదాత్మ్యము (శరీరమే తాను అనే బుద్ధి) తోనే సకల కార్యము లొనర్చుచున్నాడు. అట్టి తనకు పరముగా (అన్యముగా) నున్నది. పంచభూతాత్మకమగు బ్రహ్మాండము. దానికి పరముగానున్నది ఏదనగా ఈశ్వరుడు. ఆ ఈశ్వరునికంటె పరతరం అనగా యింకనూ అన్యముగానున్న తత్వమే బ్రహ్మము. అదియే గురుతత్వము అనగా తాననే జీవునికి పరముగానున్నది. జగత్తు. ఈ జగజ్జీవులకు పరముగానున్నది ఈశ్వరుడు. (పరాత్ పరము) ఈ జగజ్జీవేశ్వరులు అనే మూటికిన్ని అతీతమై వారి సృష్టి కంటెను పూర్వమేయున్న అధిష్ఠాన చేతన బ్రహ్మమే పరమాత్మ లేక గురుతత్వము. యిదియే పరాత్, పరతరమై యున్నది.

ఆనందకారకం : అనగా ఆనందమును కలిగించునది. పరబ్రహ్మ తత్వమైన గురుతత్వ మానంద మెట్లు కలిగించును? సుఖ దుఃఖములు ద్వంద్వస్వరూపము. ఒకదాని నొకటి ఆశ్రయించి వెలుగు నీడల వలె సాపేక్షికములై యున్నవి. యివి శబ్ద స్పర్శ రూప రస గంధములను పంచ విషయ రూపముగా నుండును. సుశబ్దము సుఖమును, దుశ్శబ్దము, దుఃఖమును కలిగించును. అట్లే మిగితా నాలుగున్నుకూడా సుఖదుఃఖములకు కారకములై యున్నవి.

పంచతన్మాత్రరూపంగా పరబ్రహ్మతత్వమే పరిణమించినది. ఎట్లనగా, "బ్రహ్మణోర వ్యక్తాన్ అవ్యక్తాన్ మహత్, మహత్ మహదహంకారః, మహదహంకారాత్ పంచతన్మాత్రాణి......" అని చెప్పబడినది. అంటే పంచతన్మాత్రలు ప్రకటము కానప్పుడవి బ్రహ్మమునందు బీజరూపంగా వున్నాయన్నమాట. ఆ విధంగా అవి బీజరూపంగానున్నపుడు సుఖదుఃఖములనే ద్వంద్వస్థితిలేదు. అప్పుడేక రూపస్థితియే. దానినే ఆనందమన్నారు. ఆ స్థితి కలగాలంటే, జీవుడు కూడా తన వ్యష్టి సమిష్టి లక్షణములను అతిక్రమించి, బ్రహ్మమే తాను అనే తదాత్మ్యస్థితి ఆరూఢపరచు కొన్నపుడు ఆ బ్రహ్మానందమును తానే పొందగలడు. అట్టి బ్రహ్మానందము గురుని కృపలేక సిద్ధించదు. "గురువు శిష్యుడాయె, శిష్యుడు గురువాయే, గురువు శిష్యులసందు గురుతొక్కటాయె" అనే దాని అర్థము గ్రహించవలెను. గురుతత్వము నేనేయై యేక భావన చెందుటే గురుకృపా సంసిద్ధికి నిదర్శనము. కనుక గురువు ఆనందకారకుడని చెప్పబడినాడు.

హృదయాకాశమధ్యస్థం : హృదయమునందు దహరాకాశము కలదనీ, అదే చిదాకాశమనీ, ఆయాకాశమధ్యమున పరమాత్మయున్నాడని శ్రుతిస్మృతులు ఐక్యకంఠముతో చెప్పే మాట సత్యమే. "యోయం, విజ్ఞానమయః ప్రాణేషు హృద్యం తజ్జ్యోతిః పురుషః" అని బృహదారణ్యకం చెపుతోంది. హృదయ మనగా నేది? అంతఃకరణకు హృదయమే స్థానమని చెప్పబడుతోంది. మానవుని గుండెకాయవుండే స్థానమే హృదయమని కొందరు,అదికాదు, హృదయస్థానము దక్షిణభాగమున కలదని కొందరూ, నేత్రస్థానమే, హృదయమని కొందరూ తారక యోగమున దశవిధ మండలములూ, ముప్పది రెండు చిత్కళలుగా గాన్పించే భ్రూమధ్య దేశముననున్నదే హృదయాకాశ మని మరి కొందరూ చెప్పుచున్నారు.

కందార్థము :

"వన్నియ లైదొకచోటను
పన్నుగ గలసినది హృదయపద్మంబనుచున్
యెన్నుదురు జనులు, ఎరుకం
దున్నాదని శ్రుతులు బల్కుచున్నవి సుమ్మీ
తెలుసుటె మోక్షమన్నావి సుమ్మీ
వన్నెలన్నియు మీరివున్న వస్తువు జాడ
యెన్న దెరుంగక యెన్నో రీతుల పల్కుచున్నవి సుమ్మీ
తెలుసుటె మోక్షమన్నావి సుమ్మీ" అన్నినీ
"తొర్రలు తొమ్మిదిగల మేన్మరికి
ఒక రెంటిలోన మర్రలు నాల్గుం డెర్రది
తెల్లది, నల్లది, కర్రిది, దానగ్రమందుకలదొక్కతూటూ
అదె యెరుకానే పులుగుండెచోటూ"

అని మరియొకచోటనూ శ్రీకృష్ణదేశికేంద్రులవారు పేర్కొన్నారు. మొదటి కందార్థములో చెప్పబడిన "వన్నియలై దొకచోట" అను మాటలున్ను, రెండవ కందార్థములో చెప్పిన "యెర్రది, తెల్లది, నల్లది, కర్రిది, దానంగ్రమందు కల దొక్క తూటు అదే యెరుకానె పులుగుండెచోటూ" అను మాటలున్ను నేత్ర పంచీకరణమున్నూ చూచి సాంప్రదాయక సద్గురు సన్నిధానమున ఉన్నదున్నట్లు

చక్కగా శ్రవణము చేయని అల్పబోధపరాయణులు నేత్రస్థానమే హృదయమని అర్థము చెప్పుకొంటున్నారు.

వీరందరూ పిండబ్రహ్మాండముల రెంటిని చక్కగా విచారణ చేసినవారు కాదని స్పష్టంగా తెలుస్తూనే వున్నది. ఏలనన, "పిండబ్రహ్మాండంబుల రెండును వానిలోని రెండహములు యీ ఖండంబులు నాల్గుగూడి అఖండంబగు యెరుకరూపు" ఆ పిండబ్రహ్మాండముల కతీతముగా యుండునుగదా! దానిని పిండాండములో ఒక అల్ప స్థానమున నున్నదానిగా చెప్పుట ఎంత సాహసము? కనుకనే "దేహమున కొంత నిజమని మోహమున నిల్పుకొనుటె మోసము, గురుద్రోహము" అన్నారు కృష్ణదేశికులు. దేహమందు ఏకదేశమున పరిపూర్ణ పరబ్రహ్మం గాదుగదా చివరకు అఖండరూపమగు ఎరుకకూడా వుండజాలదని స్పష్టమేగదా! బ్రహ్మాండ మనగా పంచభూతాత్మకంగానున్నది. ఈశ్వరుని దేహమని చెప్పబడుతోంది. కనుక ఈ ఈశ్వర దేహమందుననూ అఖండమగు ఎరుక ఏకదేశమున వున్నదని నిర్ణయించరాదు. ఐతే శ్రుతి, "యదేవేహితదముత్ర యుదముత్రతదన్విహ........." అని చెపుతోంది. అనగా ఏది పిండాండ స్థానముననున్నదో అది బ్రహ్మాండ స్థానమున నున్నదన్నమాట. కనుక పిండాండమందున్న హృదయ, నేత్ర, భ్రూమధ్య, మూర్ధ్ని స్థానములు, పంచవర్ణములు కలసినస్థానము. ముందుగా బ్రహ్మాండమందు చూచుకొని, అఖండంబగు యెరుక రూపు అందునగూడా లేదని, దానిని నిరసించి, యీ పిండ బ్రహ్మాండంబులు రెండునూ యుత్పత్తి కాకపూర్వము వుండే పరబ్రహ్మ స్థానమందు వన్నె లేప్రకారం కలసియున్నవో గుర్తెరిగినపుడే హృదయ పద్మమని కందార్థంలో శ్రీకృష్ణదేశికేంద్రులు చెప్పినదితెలియ నగును. అపుడే హృదయ గ్రంధియూ తెలియనగును. తనకు తానే యెంత విచారించిననూ తెలిసికొనుటయు కష్టమే. కనుక వస్తునిశ్చయరూపంగా ఆత్మయొక్క స్థానస్వరూప స్వభావములు తెలిసిన సాంప్రదాయక గురువల సేవించి తెలిసికొనుటయే కర్తవ్యం. హృదయాకాశ మధ్యమున గురుతత్వమున్నది అనుటతో మధ్యమున అనేమాటకు కేంద్రస్థానము అనే అర్థం గైకొనరాదు. మధ్య మనగా ఆ యాకాశమందంతటా సూక్ష్మంగా వ్యాపించియున్నదే గురుతత్వమని గ్రహించవలెను.

శుద్ధస్ఫటికసన్నిభం : హృదయాకాశముననున్న పంచరంగులతో కూడినదానిని నిషేధించగా నిర్విశేషంగా మిగిలియున్నదానికి ఏ వర్ణమూలేదు. అది స్ఫటికము వంటి శుద్ధస్వరూపమని అభివర్ణింపబడినది. స్ఫటికమణికి ఏవర్ణములూ ఏకాంతులూ లేవుకాని దాని సన్నిధానమున ఏ వర్ణములుగల పుష్పముంచినా ఆ వర్ణమునే తానుకూడ పులుముకొని ఆ వర్ణము తనకు (ఆ స్ఫటికమణికి) సహజంగానున్నట్లు తోపింపచేయుచున్నది. అట్లే పరమాత్మ స్వరూపమగు గురుతత్వముకూడ సర్వాకారములు సర్వవర్ణములు తానే వహించి స్ఫటిక మణివలె స్వచ్ఛమై శుద్ధమైయున్న తన నిజరూపమును దాచుకొని మనకు మరుగుగా నున్నది భక్తుడు

"హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపి హితం ముఖం
తత్వం పూషన్నపావృణు సత్యధర్మాయ దృష్టయే" (ఈశావాస్యోపనిషత్)

అని ప్రార్థించుచున్నాడు. హేపూషన్, ఒక హిరణ్మయపాత్రచే మూయబడినదానివలెనున్న సత్యమును నేను దర్శింపకోరుచున్నాను. దయయుంచి ఆ హిరణ్మయపాత్రను తొలగించుమని ప్రార్థించుచున్నాడు. అట్లే వన్నెలతో కూడిన ఆవరణమందణగి మణగియున్న ఆత్మతత్వమును (గురుతత్వమును) గుర్తెరిగి ధ్యానించవలసియున్నది.

నిత్యం : నిత్యమూ అనగా సర్వకాల సర్వావస్థలయందని భావం. యిట్టి ధ్యానము నిరంతరావచ్ఛిన్న తైలధారవత్‌గా తెంపులేకుండా నుండవలెనని యితరులు నిర్ణయించినారు. కాని రాజయోగ పద్ధతియందిది సాధ్యంకాదు. అయితే, ఆత్మస్వరూప నిశ్చయము గల్గి ఆత్మదృష్టిని వీడక సకలకార్యములు చేయుచుండు నేర్పరితనము గల్గియుండుటే రాజయోగి లక్ష్యము. అందరివలె అట్టి రాజయోగి అవస్థాత్రయములందు తిరుగుచూ కేవల ప్రపంచీకుడుగా కానవచ్చునేకాని అతని అవస్థలు దైవావస్థలు, తురీయమందు జాగ్రత్త తురీయమందు స్వప్నము, తురీయమందు సుషుప్తి అయివున్నవి. అవి సాధారణ జీవావస్థలు గావు.

గురుతత్వమును ఆ విధంగా "జలము నెడబాయనొల్లని జలచరముల రీతిబూని సచ్ఛిష్యుడు హృజ్జలజంబను పీఠముపై నిలిపి యితరము మాని గురువునే కొల్చుసుమ్మీ" అని శ్రీకృష్ణదేశికేంద్రులు సెలవిచ్చినారు. అట్టి గురుతత్వమున కివే మా నమస్కారములు.

శ్లో॥ నతా స్మితే నాథ పదారవిందం
బుద్ధీంద్రియ ప్రాణ మనోవచోభిః
యచ్చింత్యతే భావిత ఆత్మయుక్తౌ
ముముక్షుభిః కర్మమయోపశాంతయే॥

తాత్పర్యం : హే ప్రభో! తీవ్రమోక్షేచ్ఛాపరులు. కర్మ నివృత్తికొరకు, ఆత్మయోగముబూని, ఏపాదారవింద ధ్యానమునుచేయు చున్నారో, అట్టి నీ దివ్య చరణారవిందమునకు, నేను నా బుద్ధీంద్రియ మనఃప్రాణ వాక్కులచేత నమస్కారము చేయుచున్నాను.

విశేష వివరణము : ఈ శ్లోకమునందలి ముఖ్యమైన మూడు విషయములను గూర్చి విచారించి తెలిసికొనవలసియున్నది 1) పదారవిందం 2) ఆత్మయుక్తౌ 3) కర్మమయోపశాంతి. అను మూడింటిని గురించి వివరించవలెను.

1)పదారవిందం : గొంగళి పురుగు (కంబళి పురుగు), గాజు పురుగు, రోకలిబండ అనే పురుగు యిత్యాది కీటకములకు అనేక పాదములును, పశువులకు నాలుగు పాదములును. పక్షులకు మానవులకు రెండేసి పాదములును, సృష్టియందున్నవేగాని ఏకపాదమున్న ప్రాణి యేదిన్ని గానము.పదారవిందమన్నప్పుడు ఏకపాదము మాత్రమే సూచింపబడినది. పదము అను మాటకు, యొక వుత్కృష్ట సాధనమనీ, శబ్దమనీ, కాలు అనీ పాదం అనుటలో నాలుగవ భాగమనీ ఇత్యాది నానార్థములున్నవి. పరమాత్మకు ఈ అర్థములన్ని సమన్వయముచేసి చెప్పుట సులభమే. ఎట్లనగా స్థానము అను అర్థములో పరమాత్మయే పరమ పదమని వాడబడుచున్నది. పరమాత్మయే ప్రణవశబ్దముచే పిలువబడుచున్నది. "తస్యవాచకం ప్రణవః" అని పతంజలి యోగ సూత్రము పరమాత్మకు ప్రణవమే అభిదానరూపముగా అనగా నామమైయున్నది అని పేర్కొనబడినది. పరమాత్మయే గురుతత్వము అయివున్నది. గురుపాదము అనేది ప్రసిద్ధి విషయమే గదా! మరియు "జ్యోతిశ్చరణాభిధానాత్" అని బ్రహ్మ సూత్రములలో చెప్పబడి యున్నది. జ్యోతి అను మాటకు పరంజ్యోతి అనియే అర్థము చెప్పవలెను. గనుక చరణము, పాదము, కాలు, అనే అర్థములలో కూడా సమన్వయము కుదురుచున్నది. ఇక నాలుగవ భాగము, అను అర్థములో కూడా సమన్వయమే కుదురు చున్నది. "పాదోస్య విశ్వాభూతాని, త్రిపాద స్యా మృతం దివి" అనే శ్రుతి పరమాత్మయందలి ఒక నాలుగవభాగము చేతనే యీ మహా విశ్వము రూపొందినదనీ, శేషించిన మూడు భాగములు, దివ్యమై, అమృతస్వరూపమై

యున్నవనీ పేర్కొనుచున్నది. ఇన్ని అర్థములూ పరమాత్మ కన్వయయోగ్యములుగానే యున్ననూ పాదము (కాలు) అనే అర్థమే యేల గ్రహించవలెను? శ్లోకమునందు పదమనిమాత్రమే గాక పదారవిందం అని పేర్కొనబడుటచే అరవిందం (అనగా పద్మము) యొక్క సాదృశ్య మొక్క చరణములకే అన్వయించును. గాని మిగతా నానార్థములకు అన్వయము కుదరనందున పాదకమలమే పదారవిందమునకు అర్థముగా గైకొనబడినది.

ఐతే ఇందే అక్షరమైనా అర్థము పరమాత్మకు సరిపోవునా అంటే సరిపోవును. ఎట్లనగా పదము అనగా ఒక స్థానము అనే అర్థము తీసుకుందామంటే పరమాత్మకు ఏకదేశీయత అనే దోషము సిద్ధించుచున్నది. శబ్దము అనే అర్థము తీసుకుందామంటే "నిశ్శబ్దో బ్రహ్మముచ్యతే" అనుమాట అడ్డం వస్తూవున్నది. చరణము లేక కాలు అని అర్థము చెపుదామంటే పరమాత్మ కరచరణాద్యవయములు కలిగిన శరీర ధారి కాదుగదా! పాదములు అనగా కాళ్ళు అని అర్థము గాదు. ఉచ్ఛ్వాస నిశ్వాసలే పాదములు అని అర్థము చెపుదామంటే పరమాత్మకు వుచ్ఛ్వాసనిశ్వాస లున్ను వానిని జరిపే నాసికేంద్రియమున్ను వున్నవని చెప్పవలసిపచ్చును. పోనీ, "నాలుగవభాగము" అనేదే సరిఅయిన అర్థము అని అందామంటే పరమాత్మ ఖండఖండము లాయెనని అనవలసివస్తుంది. యీ సిద్ధాంత రాద్ధాంతములన్నియు యితర సాంప్రదాయకుల బోధల ననుసరించి చర్చింపబడినవి.

ఐతే మీ అచల ఋషులు చెప్పే అర్థమేమి? అని యెరయిననూ సూటిగా ప్రశ్నించ వచ్చును. యీ శ్లోకము గురుగీతలోనిది కనుక గురుపరమాత్మయొక్క పదారవిందమే లక్షింపబడినది. సగుణరూపములో ఆ గురుపరమాత్మ మానవాకారమువహించిన స్వగురు మూర్తియే అయివున్నాడు కనుక ఆ గురుదేవుని చరణారవిందము అని చెప్పబడినదని గ్రహించవలెను. అది ఏకపాదము అనుట యెట్లు? అనగా దక్షిణ పాదముగ్రహించవచ్చును. మరిన్ని రెండుపాదములు ఏక ముఖముగా జేర్చియే పాదాభివందనము పూజాదులు చేయబడు చున్నవి. కనుక ఆ కల్పంలో కూడా ఏకపాదమే. నిర్గున రూపమగు గురుతత్వవిషయంలో సృష్టికి పూర్వం "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అని చెప్పబడిన ఆ పరమాత్మ సృష్టిలో "సహస్రశీర్షాదేవ, సహస్రాక్ష స్సహస్రాపాత్" అని "సర్వతః పాణిపాదం తం సర్వతోక్షి శిరోముఖం" అనే విరాట్స్వ రూపము ధరించినాడు. అపుడు "ఏకం అనేకం భవతి" అయ్యెను. జీవశరీరములకున్న అన్ని పాదములు ఆయన పాదములే అనజెల్లును. కనుక ఆయన సహస్రపాత్ అయినాడు. సంస్కృతమున సహస్రమునే మాట అసంఖ్యాకమగు అనేకత్వమును సూచించునవి యెరుగవలెను.

ఆ పరమాత్మ కంటె గొప్పదిగాని పెద్దదిగాని లేనందుననే అది "మహతో మహీయా" అనీ భూమాపదార్థమనీ, గురుస్వరూపమనీ, చెప్పబడినది. కనుక దానినే గురుతత్వమని అభివర్ణించినారు. సృష్టికి పూర్వం ఆ గురుపరమాత్మ మాత్రము ఏకరూపముగా నున్నదా? పురుష ప్రకృతి రూపముగా దానిని సర్వులు వర్ణించుచునే యున్నారుగదా! ఆ పక్షంలో దాని ఏకరూప ద్వంద్వమనియో, లేక ద్వంద్వరూపయేకమనియో అనవలసియున్నది. పురుషుడు అనగా క్షరాక్షర పురుషోత్తములలో ఏ పురుషుడు? అను ప్రశ్న వచ్చును. ఏ పురుషుని చెప్పిననూ, మిగతా యిర్వురు పురుషులు, ఆ పురుషునియందు గర్భీకృతముగా నున్నారు. ఐననూ పురుషోత్తముడు అనీ ఉత్తమ పురుషుడనీ చెప్పబడె పురుషుని మనము గ్రహించి విచారించుట

న్యాయము. ఏలననగా సృష్టికి పూర్వము ఆ పురుషోత్తముడే యున్నాడు. అతడే త్రిపురుషైక పురుషః అని అభివర్ణింతురు కూడా.

పురుషుడు అనేసరికి రెండు పాదములు గల మానవాకృతియే ముందుకు వచ్చుచున్నది. ఆ పరమాత్మకుకూడా ఒక శరీర మున్నట్లు శ్రుతి యుక్తి అనుభవమువల్ల దెలియుచున్నది. ''ఆకాశ శ్శరీరం బ్రహ్మ'' అని శ్రుతి దెల్పుచున్నది. .జీవ జగత్తులే అతని శరీరము, అతడు శరీర అని విశిష్టాద్వైతము చెప్పుచున్నది. ''రెండు రీతుల కనబడుచుండే మేను'' అని కృష్ణదేశికేంద్రులు సెలవిచ్చినారు. సాంప్రదాయక నిజగురు భక్తులు వస్తునిశ్చయ పూర్వకంగా గురుమూర్తి వలన ఆ రెండురీతులు అనుభవపూర్వకంగా గుర్తించియే యుందురు.

2) ఆత్మయుక్తౌ : ఆత్మయోగము పూనినవాడే ఆత్మయుక్తుడు. స్వస్వరూప ధ్యానసాధనచే పరమాత్మయొక్క స్థాన స్వరూప స్వభావములను గుర్తెరిగి తత్వజ్ఞాన స్వరూపానుభవమును పొందినవాడే ఆత్మయుక్తుడు. ఆత్మయే గురుతత్వము. ''యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి'' అని గీతలో చెప్పబడిన రీతిగా సర్వమునందు పరమాత్మను, పరమాత్మయందు సర్వమును ఓతప్రోతమై యున్నట్లు గుర్తించినాడు. ''తన యందు నిఖిలభూతములందు నొకభంగి సమహి తత్వంబున జరుపువాడై'' యుండును. ''సర్వభూతాత్మ భూతాత్మ'' సకలభూతములయందలి ఆత్మయును తన ఆత్మయును ఒకటేనని తెలిసి యాప్రకారము వర్తించువాడు, స్థితప్రజ్ఞుడనీ, భక్తుడనీ, గుణాతీతుడనీ గీతలో కీర్తింపబడినవాడు. జనన మరణ రూపమగు సంసారమునుండి విడుదల నాశించి అతడు గురూపాసన చేయుచున్నారు. అట్టి ఆత్మయోగులచేతకూడా ఏ పాదము భజింపబడుచున్నదో అట్టిదానికి నమస్కారము చేయుచున్నానని యీ శ్లోకములో పార్వతి పరమేశ్వరునికి చెప్పకొనుచున్నది.

3) కర్మమయోపశాంతి : కర్మయే జన్మకు కారణము గనుక కర్మరహితమునందుగాని జన్మరహితము సిద్ధింపదు. కర్మయనగా పని. కర్మ రహితమనగా ఏపనీచేయక నిర్జీవ కళేబరంవలెపడి యుండుట గాదు. మానవుడు జాగ్రదవస్థలో ఎప్పుడును, మనస్సు, వాక్కు, శరీరము అనువానిలో నేదోదానిచేత ఏదో పనిచేయుచునే యుండును. కనుకనే ''నహి కశ్చిత్ క్షణమపిజాతు తిష్ఠత్య కర్మకృత్'' అనగా ఎవడున్ను ఒక్క క్షణ కాలమైనను ఏ కర్మయూ జేయకుండ నుండడు అని గీత యుటంకించు చున్నది. కర్మ (పని) చేయుచున్నప్పటికి కర్మ చేయనిదానితో సమానమైన స్థితి యొక టున్నదన్నమాట. అట్టి నైష్కర్మ్యసిద్ధి యెట్లు చేకూరును?

కర్మ కారణములేవి? మట్టిలేని కుండవలె కారణములేకుంటే కార్యమున్ను వుండజాలదు. మరిన్ని ఏతత్కర్మ ప్రవృత్తి ఎట్లు జనించుచున్నది? అను విషయములకు సరియగు జవాబులు మనము పొందినచో, కర్మ మానుట యెట్లునూ సాధ్యముగాదు. గావున కర్మకారణమును తొలగించి నైష్కర్మ్యసిద్ధిని సాధించగలమేమో యోచించవలసియున్నది.

ప్రతీ కర్మకున్నూ 5 కారణములు చెప్పబడినవి.

శ్లో॥ అధిష్ఠానం, తధాకర్తా, కరణంచ పృధగ్విదం
వివిధాచ పృధ క్చేష్టా దైవం చైవాత్ర పంచమం॥

అనగా, శరీరము, కర్త,యింద్రియములు నానావిధ క్రియలు లేక పనులు, దైవము అను నీ యయిదున్నూ కర్మకు కారణములై యున్నవి. యీ అయిదున్నూ నున్నచోగాని ఏకర్మయున్నూ

జరుగదు. మనస్సు లేనిచో, కాయిక కర్మయు వాచిక కర్మయూ గూడ జరుగనేరవు. అథవా యేకర్మనైన చేసిననూ అది సలక్షణముగానూ యుండజాలదు. అట్టి పనులు బంధకారణమున్నూ కానోపవు. మనకు తెలియకనే (మన సంకల్పము లేకనే) మన శరీరము నందే వూపిరి పీల్చుట గుండె కొట్టుకొనుట మొదలగు పనులు జరుగుచునే యున్నవి గదా! అవి యెట్టి విధంగానూ మనకు బంధకారణము లగుటలేదు. పసిబాలుడు, ఉన్మత్తుడు చేయు పనులు బంధకారణము కానట్లుగానే, గుర్తెరిగే జ్ఞానరూపుడనైననేను చేయుచున్నాను అను అహంకారము లేక చేయుపనులు మరుపులో చేయబడిన పనులవలెనే బంధకారణములు కాజాలవు. కర్మకారణములని చెప్పబడిన ఆ ఐదింటిలో కర్తృభావము లేకుండా చేసిన కర్మ చేయబడని దానితో సమానము. "చేయగనే చేయుట" అని సూత్రప్రాయముగా పెద్దలు చెప్పిన పద్ధతి యిదే. అసలు కర్మ ప్రవృత్తి యెట్లు కలుగుచున్నదో ఆ ప్రవృత్తి కారణముగూడ తెలిసికొనవలెను.

శ్లో॥ జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః॥ భ.గీ. 18-18

ఏ వ్యవహారము జరుగవలెనన్నా ముందు అంతర త్రిపుటి యగు జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయముల అంతరవ్యవహారము జరిగిన పిమ్మటనే బాహ్యమందు క్రియారూపవ్యవహారము జరుగుచున్నది. అంతరమందున్న జ్ఞానమే బాహ్యమందు కర్తగానున్నది. జ్ఞాతృజ్ఞాన జ్ఞేయ రూపముగా ఒక్క గుర్తెరిగే జ్ఞానమే పరిణమిస్తూవున్నది. అదియే కర్మప్రవృత్తికి హేతుర్భూతమై కర్త, కర్మ, క్రియల రూపం వహిస్తున్నది. ఈ గుర్తెరిగే జ్ఞానమే మూలస్థానమందు అఖండ యెరుకగా నున్నది. దానికి పరిపూర్ణ పరబ్రహ్మమునందు మూలముగాని స్థానము గాని లేనేలేదని ఆరూఢమైన పరిపూర్ణ భావజ్ఞునికేగాని కర్తృభావన నశించదు. కర్తృభావన పోనిచో నైష్కర్మ్య సిద్ధియెన్నడును సిద్ధించదు. ఇతరులు చెప్పే విధంగా అజ్ఞాన నాశనమైనచో నైష్కర్మ్యసిద్ధి కలుగజాలదు. అజ్ఞానమనగా తెలియని తనము! జ్ఞానమనగా తెలిసినతనము. దేనిని గురించిన జ్ఞానాజ్ఞానములు? అనగా పరమాత్మను గూర్చిన జ్ఞానము లేదా ఆ పరమాత్మను గూర్చిన అజ్ఞానము. అజ్ఞానియైన పసిబాలుడు చేసిన పనివల్ల పాపసంస్కార మేర్పడదు. గుర్తెరిగి చేసిన కర్మ తప్పక బంధించును. నేను పరమాత్మనని తెలిసి పాపకార్యములుచేస్తే నా పాపమునకు నిష్కృతియే యుండజాలదు. నేను జీవుడనని చేసినా, నేను పరమాత్మనేయని చేసినా, కర్మబంధము తప్పదు. నేను అచల పరిపూర్ణుడను. పరిపూర్ణ పరబ్రహ్మమందు జ్ఞానాజ్ఞాన రూపమగు ఎరుక లేనేలేదు. నేనేమి చేసినా ఏమీలేదు అనుకొని చేస్తే వారికి ఎరుక పోనే లేదు సరిగదా మరి ఘట్టిగా వున్నదన్నారు దీక్షితులవారు. పండిపోయిన ఆకు చెట్టునుండి దానంతటదే రాలిపోవు విధముగా తనంతట తానే యీ కర్తృభావము తొలగిపోవలెను. అపుడు అతడేమియూ అనుకొనకుండానే సహజంగానే కర్మలు చేయును. ఆ కర్మఫలములున్నూ నాతని నంటజాలవు. ఇదే నైష్కర్మ్యసిద్ధి. యిదియే కర్మమయోపశాంతి, యిది గురుకృపలేక కలుగదు. అట్టి గురుకృపకై ఆత్మయోగము బూనిన పెద్దలు ఏ గురుపాదారవిందము నుపాసించుచున్నారో అట్టి గురుమూర్తి కివే మా నమస్సులు.

శ్లో॥ గుకార శ్చాంధకారోహి రుకార స్తేజ వుచ్యతే
అజ్ఞాన గ్రాసకం బ్రహ్మ గురురేవ న సంశయః॥

తాత్పర్యం : 'గు' కారము అంధకారముగాను, 'రు'కారము తేజస్సుగాను చెప్పబడుచున్నది.

అజ్ఞానమును హరించెడి బ్రహ్మము గురువే. యిందు సందేహములేదు.

శ్లో॥ గుకార శ్చాంధకారస్తురుకారస్తన్నిరోధకృత్
అంధకార వినాశిత్వాద్గురురి త్యభిధీయతే॥

తాత్పర్యం : 'గు'కారము అంధకారము. దానిని నిరోధించునది 'రు' కారము. అంధకారము నశింపుచేయువాడగుటచేత గురువని పిలువబడుచున్నాడు.

విశేషవివరణములు : ఈ రెండు శ్లోకములును, ఏకాభిప్రాయమునే వ్యక్తపరచుచున్నట్లు స్థూలదృష్టికి గానవచ్చుచున్నవి. ఎట్లనగా అజ్ఞానము అంధకారముతోను, జ్ఞానము తేజస్సు (ప్రకాశము) తోనూ పోల్చబడినవి. గురువు తన ప్రబోధచే శిష్యుల అజ్ఞానమును పోద్రోలి జ్ఞానము కల్గించుచున్నాడు కనుక 'గురు' శబ్దమునకు అందలి అక్షరములచేతనే నిర్వచనము సాధించబడినది. 'గు' అను అక్షరమునకు అజ్ఞానమని 'రు' అను అక్షరమునకు జ్ఞానము అని అర్థములుగా చెప్పి 'గురు' శబ్దమునకు అజ్ఞానమును నాశనముచేసి జ్ఞానమును గల్గించువాడని అర్థము చెప్పబడినది. గు=అజ్ఞానము, రు= జ్ఞానము కనుక గురువులో జ్ఞానాజ్ఞానములు రెండునూ యున్నట్లు తెలియుచున్నది. గురువు సాక్షాత్ బ్రహ్మస్వరూపుడుగా చెప్పబడుచున్నాడు. బ్రహ్మము అఖండజ్ఞాన స్వరూపము. అంధజ్ఞానముకూడా నున్నదని చెప్పవచ్చునా? అంటే చెప్పక తప్పదు. ఎట్లనగా అజ్ఞానమునకు మూలరూపము ప్రకృతి. ఈ ప్రకృతికి స్థానమేది? పురుషుడు (లేక బ్రహ్మము) తప్ప అన్యస్థానమున్నదంటే పరబ్రహ్మమునకు ఏకదేశీయతాదోషము కల్గుచున్నది. కనుక పురుషునియందే అజ్ఞాన కారణమగు ప్రకృతి యున్నది. ఒక భాగమునందున్నదనీ చెప్పరాదు. అట్లు చెప్పినచో బ్రహ్మమును భాగించినట్లే కాగలదు. కనుక యీ అజ్ఞానము (లేకమాయ) బ్రహ్మమునందు ఆ పరబ్రహ్మముయొక్క శక్తిరూపముగా బ్రహ్మమునందంతటా, అగ్నిని విడచి దాని దాహకశక్తి వేరుగా విడదీయలేనట్లుగానే, అవిభాజ్యమై యున్నదని చెప్పవలసియేయున్నది.

ఈ రెండు శ్లోకములలో మొదటిదానియందు, అజ్ఞానగ్రాసకమగు బ్రహ్మము గురుతత్వమే అని చెప్పబడినది. గ్రాసక మనగా అచ్ఛాదించునది, మ్రింగునది, లేక కబళించునది అనిఅర్థము. బ్రహ్మము అజ్ఞానమునుమ్రింగి, తన గర్భమందు మరుగుపరచి దానిని తిరోభావ మొనర్చినదేగాని దానిని నాశనము (లయము) చేయలేదన్నమాట. అజ్ఞానము నాశనమై లయమైపోయే కల్పంలో తిరిగి రానేకూడదు. కాని సృష్టికాలమందు తిరిగి ఆవిర్భావముచెంది బ్రహ్మముతో గూడి జీవేశ్వర జగత్పరిణామముచెందియున్నది. గరళకంఠుని కంఠప్రదేశమున నిలచి, లోపలికిగాని బైటికిగాని పోక, ఎవరికీ ఎట్టి హానికరమూ గాక యున్న హాలాహలము రీతిగా సృష్టికి పూర్వము ఈ అజ్ఞానము మరుగునపడియున్నది. చీకటింట విద్యుద్దీపముయొక్క స్విచ్ నొక్కినపుడు ఆ విద్యుత్ప్రకాశము అంతకుముందున్న అంధకారమును గ్రసించి (మ్రింగివేసి) గది అంతటా ప్రకాశ మావరించినది. అంతకు ముందున్న చీకటి ఎక్కడకూ పోకపోయినా వున్నచోటనే మరుగుపడి యున్నది. అట్లే అజ్ఞానము పైకి కానవచ్చినా, కానరాకున్నా, వుండడం మాత్రం తప్పక వున్నదన్నమాట. కనుక మొదటి శ్లోకము ప్రకారము, గురువు జ్ఞానప్రకాశము నిచ్చువాడుగా చెప్పబడినాడు. జ్ఞానప్రకాశము నందు, అజ్ఞానము మరుగుపడిపోయినదేగాని మూలనాశనము పొందలేదు. గాఢాంధకారమునందు ఏమియు గానరానట్లే, అజ్ఞానముచే గ్రుడ్డివాడగు జీవునికి యుక్తాయుక్తములు, నిత్యానిత్యములు

గోచరించక పోవుటచేత అజ్ఞానము అంధకారముతో పోల్చబడినది. జ్ఞానము ప్రకాశముతో పోల్చబడినది. ప్రకాశమువల్ల అంధకారము శాశ్వతముగా నిర్మూలింపబడక ప్రకాశము తప్పిస్తే తిరిగివచ్చు విధంగానే జ్ఞానప్రబోధమాత్రముచేత అజ్ఞానంగాని అజ్ఞానకార్యములగు జన్మపరంపరలు గాని పూర్తిగా శాశ్వతంగా నాశనం కావు అని గ్రహించవలెను.

కాని ఆ అజ్ఞానమును శాశ్వతంగా తిరిగి పొడచూపకుండా చేయగల సమర్థతయు గురువునందు కలదని చెప్పుటకే రెండవ శ్లోకం ప్రవర్తిల్లినది. ఇందు "అంధకార వినాశిత్వాత్" అని పదప్రయోగము చేయబడినది. వినాశము = సంపూర్ణనాశనము లేక విశేషముగా నశించుట. అనగా మొదలంట నశించుట,కనుక యీ శ్లోకార్థము ఏమనగా, 'గు' కారమను అజ్ఞానాంధ కారమును, 'రు' కారమును తేజస్సు (లేకప్రకాశము) నిరోధించును లేక ఆటంకపరచును. కాని గురువు ఆ అంధకారమును నిరోధించనూగలడు. మూలనాశమున్నూ చేయగలడు. నిరోద వినాశ శబ్దముల తారతమ్యమును విస్మరించరాదు.

ఎట్లనగా, వినాశమన్నమాటకు స్వస్వరూపనాశనమే అనగా మూలనాశనమే అని అర్థము. జీవుని మూలజ్ఞాన నాశనమైనపుడే అతని జన్మపరంపరా రూపమగు సంసారచక్రము విచ్ఛిన్నము కాగలదు. బ్రహ్మమునందు సృష్టికి పూర్వము అజ్ఞానము బీజరూపంగానైనా నున్నదనీ అపుడుకేవలం చిద్ఘనస్వరూపంగా తోచబడినా అజ్ఞానం కేవలం లేకపోలేదని గమనించితిమిగదా! కనుకనే అచల ఋషులు బ్రహ్మము జ్ఞానాజ్ఞానస్వరూపమన్నారు. ఈ జ్ఞానాజ్ఞానలక్షణములు రెండున్నూ. తేజోంధకారములవలె ఒకదానివెంబడి మరొకటి గాన వచ్చి రాకపోకలు సాగించును ఆ బ్రహ్మవస్తువునకు సహజమైయుండగా అందలి అజ్ఞానమును శాశ్వతముగ నాశనమొనర్చి జ్ఞానస్వరూప మాత్రమగు బ్రహ్మమును నిలుపుకొనుటకై కొందరు ప్రయత్నించు చున్నారు. ఇది అసంభవము ఒక వస్తువునకు రెండు లక్షణములు నైజగుణములై (సహజములై అనగా వస్తువుతోనే పుట్టినవై) యుంటే వస్తువును నిల్పి, దాని సహజగుణములలో నొకదానిని మాత్రము నాశనముచేయుట అసంభవము. వస్తువుతోగాని వస్తుగుణములలో నేదియుపోదు. కనుకనే తేజోంధకారములుగా జ్ఞానజ్ఞానములుగా నుండువస్తు ముద్రహితమే గావలె. నాడే యీ అజ్ఞానాంధకారము సమూలంగా నశించవలె. జన్మపరంపర రహితము గావలె.

ఐతే, తేజోంధకారములను విచారిస్తే. వెలుగు వుంటేనే నీడరూపమగు చీకటి వస్తోన్నది. వెలుగు లేనిచో నీడగాని చీకటిగాని యుండదు. ఏదైన ఆవరణ అడ్డువస్తే ప్రకాశమునందు చీకటి వస్తూవున్నది. ఆవరణను తొలగిస్తే ఎప్పటి ప్రకాశమే. నిజముగా ఎప్పటికీ నుండేది ప్రకాశమే. కనుక ఆవరణను తొలగిస్తే చాలదా? అని కొందరు వాదించవచ్చును.

యిందుకు పూర్వపక్షంగా యీ క్రింది విధంగా నేల వాదించరాదు? ఎప్పటికీ చీకటే. దానియందు ప్రకాశమే వచ్చి పోతోంది. బ్యాటరీ లైటువేస్తే చీకటిలో కొంతభాగమునందు వెలుగు వ్యాపించినది. లైటు ఆర్పివేస్తే అక్కడకూడా ఎప్పటి చీకటే వున్నది. లైటు వేసినపుడుగాని తీసివేసినపుడుగాని చీకటి ఎక్కడికీని పోలేదు. ఎక్కడనుంచీ రాలేదు. మరిన్ని ప్రకాశమునకొక ఆవరణ అడ్డువస్తే అంధకారం వచ్చింది. ఆవరణ తీసివేస్తే అంధకారం పోతుంది అనే వాదనయున్నూ సరిగాదు, ఎట్లాగంటే, ఆ బ్రహ్మప్రకాశమునకు అడ్డువచ్చిన ఆవరణ ఏది? ఆ ఆవరణము బ్రహ్మమునకు భిన్నమా? అభిన్నమా? భిన్నమంటే అద్వైత హాని. అభిన్నమంటే బ్రహ్మమును బ్రహ్మమే ఆవరించుకొన్నది. లేక జ్ఞానమునుజ్ఞానమే ఆవరించినది. ఆవరించినపుడు

అజ్ఞానమనీ, ఆవరణ లేనపుడు జ్ఞానమనీ, ఆ ఒక వస్తువే పిలవబడుచున్నది అనాలి. అద్వైతహాని అయినా సరే అడ్డువచ్చిన ఆవరణమును జ్ఞానస్వరూపమునకు భిన్నమేననీ, దానిని తొలగించినచో జ్ఞానస్వరూప బ్రహ్మము శేషించగలదనీ అంటే 1) అసలు తొలగించుట ఎట్లు? 2) తొలగించినదానిని తీసి వేరే యెక్కడ పెట్టాలి? అనే రెండు ప్రశ్నలు ఎదురౌతాయి. ఎట్లో తొలగించగలము అను కొన్నా బ్రహ్మమును విడచి వేరేస్థానము లేక దేశము అంటూ ఒకటున్నదా? దేనికైనా ఆ బ్రహ్మమే స్థానముగదా! అపుడు బ్రహ్మము నుండి తొలగించి బ్రహ్మమునందే పెట్టుట యగును. కనుక ఏదీ ఎక్కడకూ తొలగనే లేదన్నమాట.

కనుక నిజముగా నున్నది ప్రకాశము. దానియందు వచ్చిపోయేది అంధకారమని మొదటి వాదన సత్యమా? లేక నిజంగా మొదటినుంచీ వున్నది అంధకారమే. అందు ప్రకాశమే వచ్చి పోతూయున్నది అను రెండవ వాదన సత్యమా. అంటే ఏదీ అసత్యముగాదు. గాని రెండూ అర్థసత్యములే. యెట్లనగా బెల్లమునందు తీపివచ్చినదన్నా లేక తీపి యందు బెల్లము తీపివచ్చినదన్నా లేక (అనగా వస్తువుముందా? దాని గుణము ముందా? అన్నప్పుడు) ఎట్లాచెప్పినా అది పరిపూర్ణ సత్యము కానేరదు. రెండూ కలసియే వున్నవి. కలసియే వచ్చినవి. కలసియే పోవును. కనుక జ్ఞానాజ్ఞానములు రెండూ కలసియే వున్నవి. కలసియే వచ్చును. కలిసియే బోవును. అజ్ఞానవినాశము కావలెనన్న దానితోపాటు జ్ఞానమున్ను వినాశము పొందవలెను. యిట్టి జ్ఞానజ్ఞానముల కునికి పట్టయిన వస్తువునకు మూలములేదు. కొనకు ప్రవేసించుటకు స్థానము లేదు. అని పూర్ణబోధచే నిరూపించి మూలా జ్ఞానమును శాశ్వతముగ రహిత మొనర్చగలవాడు సద్గురుమూర్తియే. అట్టి గురుతత్వమునకివే మా నమస్కారములు.

శ్లో॥ గుకారః ప్రథమో వర్ణో మాయాది గుణభాసకం
రుకారోస్తి పరబ్రహ్మ మాయాభ్రాంతి విమోచకం॥

తాత్పర్యము : 'గురు' శబ్దమునందలి 'గు'కారము, మాయ మొదలగు గుణములను తెలియచేయుచున్నది. రెండవ వర్ణము "రు" కారము ఆ మాయాది గుణములవలన కల్గిన భ్రాంతుల నుండి తప్పించునదియై యున్నది.

విశేష వివరణము : "యా మా సా మాయా" అని "మాయా" కు సామాన్య నిర్వచనము. అనగా ఏది ఒకప్పుడుండి, ఒకప్పుడు లేకుండునో, అదే మాయ అని అర్థము. అంటే, యెల్లప్పుడూ వుండేది ఒకటి ఒకప్పుడు మాత్రమే వుండి, ఒకప్పుడు లేకుండేది ఒకటి అని రెండు వస్తువులను చెప్పినట్లయినది. ఈ రెండవ వస్తువు (మాయ) వున్నపుడు, ఎక్కడవున్నది. పోయినపుడెందు బోయినది? అంటే అద్వైత నిర్ణయరీత్యా పరబ్రహ్మ మొక్కటే ఎల్లపుడూ వుండేది కనుక, దాని యందే దోచి, దానియందే వుండి, దానియందే మరల లేకుండా పోవునని చెప్పబడుచున్నది. సృష్టికి పూర్వము అసలు లేనేలేనట్లుగా తోచుచున్నది. సృష్టి ప్రారంభకాలమున బ్రహ్మమునందు తోచి ఆ బ్రహ్మము యొక్క సాన్నిధ్యమందు చేతనవంతమై బ్రహ్మముతోగూడి జీవేశ్వర జగత్తుకు కారనమైనట్లు చెప్పబడినది. మాయగాని, తత్కార్యములుగాని బ్రహ్మమునుండి కల్గినవికదా! వుండి కల్గినవా? లేకనే గల్గినవా? అను ప్రశ్న వుదయిస్తూ వున్నది. గంద్రయిసుకను గానుగ వేస్తే తైలము లభించునా? కనుక లేకకల్గిందని చెప్పరాదు. వృక్ష కారణము బీజమునందణగి మణగియున్నట్లే జీవేశ్వర జగదాది మాయా కార్యములు సహితం బ్రహ్మమునందు బీజరూపంగా అణగి మణిగి యున్నవని చెప్పకతప్పదు. మరుగై వున్నది ప్రకటమైనదని చెప్పాలి.

ఎక్కడ దాగి వుండెనో అక్కడే ప్రకటమై అక్కడే వుండి, తిరిగి అక్కడేతిరోభావము చెందినవి. కాని అసలే లేకుండా వున్నదెప్పుడు? లేనిది క్రొత్తగా రానూలేదు. ఉన్నది లేకుండా పోనూపోదు. పగలు నక్షత్రాలు కానరాక పోయినంత మాత్రమున నక్షత్రములు లేనేలేవనుట ఎట్లు పొరపాటో అట్లే, అధిష్ఠాన బ్రహ్మము ఎల్లపుడూ ఉండేదనీ, మాయ ఒకప్పుడుండి ఒకప్పుడు పోయేదనీ చెప్పుట కూడా పొరపాటే. ఉన్నదున్నట్లుగా చెప్పాలంటే అధిష్ఠాన బ్రహ్మముతో పాటే మాయయున్నూ ఉందనే చెప్పాలి. ఈ మాయా బ్రహ్మములలో మాయ అనిత్యమనీ, బ్రహ్మము నిత్యమనీ అనరాదు. ఎటొచ్చీ ఈ మాయాది గుణములు ఆ బ్రహ్మమునందు ఆవిర్భావతిరో భావములు చెందుచున్నవేగాని బ్రహ్మమున కన్యదేశమున లేవు మరిన్ని "బ్రహ్మణ్యోం న కించన" అనగా బ్రహ్మమున కన్యముగా కొంచెము కూడా ఏమీ లేదనిన్ని, "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనగా అంతా బ్రహ్మస్వరూపమేననీ శ్రుతులు చెప్పుచున్నవి కనుక మాయా బ్రహ్మములు రెండూ బ్రహ్మము యొక్క రూపాంతరములే అనాలి.

మాయాదులు అనిర్వచనీయమని ఆదిశంకరులు వివేకచూడామణిలో యీ క్రింది విధముగా అభివర్ణించినారు.

శ్లో॥ సన్నా ప్యసన్నా ప్యుభయాత్మికానో
భిన్నా ప్యభిన్నా ప్యుభయాత్మికానః
సంగాన్యసంగాన్యుభయాత్మికానో
మహాద్భుతాఽ నిర్వచనీయ రూపా॥

అనగా మాయ సదసద్రూపంగానూ, భిన్నాభిన్నములుగానూ సావయవ నిరవయవరూపములు గానూ యుంటూ యిదమిత్థమని నిర్ణయింపరాక, అనిర్వచనీయమై, మహాద్భుతమై యున్నదని భావము.కాని మాయా బ్రహ్మములు రెండూ ఒకేవస్తువు. ఒక నాణెము యెక్క బొమ్మ బొరుసులవంటివే. బ్రహ్మమునందలి దైవాత్మకశక్తి లేక బ్రహ్మీశక్తియే మాయశబ్దంతో చెప్పబడినది. యీ పైశ్లోకభావము అధిష్ఠాన బ్రహ్మమునకే వర్తించుననికూడా చెప్పవచ్చును. ఏలననగా ఆ అధిష్ఠాన బ్రహ్మము సృష్టికి పూర్వ మొకవిధంగానుండి తానే జీవేశ్వర జగత్తును ఆవిర్భవింపజేసి, తన కన్యంగా నున్నట్లు తోపింపజేసి తుద కా జగన్నాటకమున కుపసంహారము చేసేది యధిష్ఠాన బ్రహ్మమే కదా! కనుకనే శ్రీకృష్ణదేశికేంద్రులవారు తమ కందార్థములలో

కం॥ అన్ని యు తానై, తనకవి
పన్నుగ వేరనుచు నోటబల్కుచు
మరి తా నన్నిటినెరిగే యెర్కై
యున్నానని యెరుక కెరుకే నూహింపుచుండూ॥
తనలో తానే మోహింపుచుండూ॥" అనిన్నీ

కం॥ ఆటాడి యాడకుండును,
ఆటాడిన మేనిబొమ్మ యాటాడకనే
యాటాడు, ఎరుక యనియెడు
ఆటాడించేటివాడు యతదేరకర్తా॥

అనిన్ని శెలవిచ్చియున్నారు. కనుక యీ అధిష్ఠాన చేతన బ్రహ్మము కంటె అద్భుతమైనదీ అనిర్వచనీయమైనదీ మరొకటి లేదు.

''మాయాది గుణభాసకం'' అనుటలో మాయది గుణములు ఏవి ? అంటే, మాయ యందలి సత్వ, రజస్తమోగుణములున్ను వీనితో గూడిన ఈశ్వర, జీవ, జగత్తులున్ను,వీని నన్నింటిని ''గురు'' శబ్దములోని ''గు'' కారము సూచించుచున్నది. భాసింపచేయుచున్నది లేక ప్రకటపరచు చున్నది. అనగా అతః పూర్వము గోచరించకుండా కేవల వ్యాపక రూపంలో నున్నదానిని ''మీయతే అనేన యితి మాయా'' అనేనిర్వచనానుసారము అమితమైనదానిని ఒక మితిలోనికి తెచ్చి ప్రదర్శించు చున్న పరబ్రహ్మశక్తి ''గు'' కారముగా వర్ణింపబడినది. దీనినే

శ్లో॥ న తస్య కార్యం కరణంచ విద్యతే,
న తస్సమశ్చా భ్యధికశ్చ దృశ్యతే!
పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే,
స్వాభావికీ జ్ఞాన బల క్రియాచ॥

అని శ్వేతాశ్వతరోపనిషత్తు పలుకుచున్నది. దీనియందలి ''పరాస్యశక్తి'' అను సమాసమునం దభివర్ణితమైనదే యీ మాయాశక్తి. యీ శక్తివలన పైన చెప్పబడిన మాయాది గుణములు బ్రహ్మమునందే బ్రహ్మమునకు వేరై యున్నట్లు తోచబడి భ్రాంతికారకములై యున్నవి. సముద్రజలమునందు తోచబడే ఫేన (నురుగు) తరంగ (కెరటములు) బుద్బుదములు (బుడగలు) సముద్రముకంటె నామరూపాదులలో వేరైనా, వస్తుతః సముద్రజలముకంటె భిన్నములు మాత్రము కావు గదా!

శ్లోకమునందలి ద్వితీయపాదము "రుకారోస్తి పరబ్రహ్మ మాయాభ్రాంతి విమోచకం" అని తటస్థ లక్షణములోనున్న మాయాబ్రహ్మమునుగాక, మాయను జీర్ణించుకొన్న శుద్ధబ్రహ్మమును (సృష్టికారకమై సృష్టికి పూర్వమున్న బ్రహ్మమును) గూర్చి పలుకుచున్నది. ఆ బ్రహ్మము శుద్ధముగా దోచబడిననూమాయాశబళితబ్రహ్మమునకు వేరుగాదు. దానిస్వరూపలక్షణమైయున్నది.అతద్వ్యావృత్తి లక్షణముచే అనగా "నేతి, నేతి, నేతీతి హోవాచ" అను శ్రుత్యనుసారము, మనోవాక్కుల కందెడి సమస్తమును నిషేధించగా శేషించిన పరిపూర్ణ బ్రహ్మము మాత్రము కాదని మరువరాదు.

'గురు' శబ్దమందలి 'రు' కారము కారణబ్రహ్మముయొక్క స్వరూపలక్షణము. స్థితియందు మాయాది గుణములు తోచకనే పోవుటవలన భ్రాంతికారకములగు ప్రశ్నయేలేదు. స్వరూపసాక్షాత్కారము మాయాభ్రాంతి విమోచకమని చెప్పబడినది. ఆరోపిత సర్పము అధిష్ఠాన రజ్జుజ్ఞానముచే నశించునట్లే యని తెలియవలెను.

ఐననూ, అధిష్ఠాన పరబ్రహ్మజ్ఞానము, ఆరోపిత జగద్భ్రాంతిని నివర్తింపచేయుననుట లలో, రజ్జుసర్ప దృష్టాంతము వర్తించునా? అనుశంక దోచవచ్చును. కాని దృష్టాంతమును దృష్టాంతముగానే గ్రహింపనగును.రజ్జువునందు సర్పరూపముండియే ఆరోపితమైనది. రూపమునకు తగిన నామము ప్రవర్తిల్లినది. ఈ నామరూపములు మధ్యవచ్చి పోవుచుండుటచే మిధ్య యని చెప్పబడినవి.

భ్రాంతి విమోచకము ఎట్లగును? అంటే బ్రహ్మముకాదని బ్రహ్మముకంటె భిన్నమని భ్రాంతిచేతనే తోచుచున్నది. తోచబడిన దంతయూ ఆ బ్రహ్మమేకాని అన్యము కానేకాదని ఆరూఢజ్ఞానము లభించుటతోనే భ్రాంతి వర్తించును.అంతయూ బ్రహ్మమేయైతే దేనిని యెవరు

యెందకు అనగా ఏ ప్రయోజనమాసించి కోరవలెను? లేక ద్వేషించవలెను. నేనే అను అహంకారము నకు గాని, నాది అనుమమకారమునకుగాని యిక తావెక్కడ నుండును. ఆ విధముగా రాగ ద్వేషాదులు, అహంకార మమకారములు బ్రహ్మముయొక్క యదార్థ వస్తు నిశ్చయముచే నశించి సర్వభ్రాంతి విమోచకము సిద్ధించుచున్నది.

"గురు" శబ్దమందలి గుకారమున కొక అర్థమున్నూ, రుకారమున కొక అర్థమున్నూ చెప్పుటచే రెండు విభిన్న పదార్థములు చెప్పబడినట్లు మాత్రము యెంచరాదు. యీ రెండక్షరములు కూడియే "గురు" శబ్దమైనది. గురుశబ్దంచే చెప్పబడినవస్తువు ఏకమే గాని దానికి రెండురూపములున్నవి.ఆ రెండురూపములే మాయా బ్రహ్మములు. "అవ్యక్తనామ్నీ పరమేశ శక్తిః" అని అధిష్ఠానబ్రహ్మము యొక్క శక్తియే అవ్యక్తమని పేరొందినది.అధిష్ఠాన అవ్యక్తములు అనిన్ని శివశక్తులనిన్ని, జ్ఞానాజ్ఞానములనిన్ని చెప్పబడుతూ గురుతత్వం ఏకరూపద్వంద్వంగా నున్నది. గురువు రూపుదాల్చిన పరమాత్మయేనని గురిగల్గి యుపాసించినవారు కృతకృత్యులగుటలో యెట్టి సందియము లేదు. అట్టి గురుస్వరూపమున కివే మా నమస్కారములు.

శ్లో॥ గుకారశ్చ గుణాతీతో రూపాతీతో రుకారకః।
గుణ రూప విహీనత్వా ద్గురు రి త్యభిధీయతే॥

తాత్పర్యము : సత్వ రజస్తమోగుణముల మూడింటికి అతీతమును 'గు' కారము సూచించును. చక్షుర్గోచరమగు సమస్త రూపములకు అతీతమగుదానిని 'రు'కారము సూచించును. కనుక గుణ రూపములు రెండును మీరిన పరమాత్మ స్వరూపమే గురువని పిలువబడుచున్నది.

విశేషవివరణము:- గుణాతీతము రూపాతీతము అను శబ్దములచే సచ్చిదానంద స్వరూపమగు, అధిష్ఠాన చేతన బ్రహ్మము చెప్పబడినది. కాని పరిపూర్ణ పరబ్రహ్మము చెప్పబడలేదు. గుణాతీత మనగా నిర్గుణమనిన్నీ రూపాతీత మనగా నిరాకారమనిన్నీ రూఢ్యర్థములు. నిర్గుణమనగా కేలము గుణరహితము కాదు. గుణములు బీజరూపముగా వుండి బాహ్యమునకు కానరాక పోవుటయే. 'ఎక్కడా గాలిలేదు' అనే వ్యాకమునకు అర్థము గాలి కదలక మెదలక స్థంభించియున్నది అనగా గాలి వీచుటలేదు అనే అర్థమేకాని వాయుభూతమే లయమైపోయినట్లు కాదుకదా! అట్లే నిర్గుణ మన్నపుడు సత్వగుణ లక్షణములుగాని, రజోగుణ లక్షణములుగాని ఏమియు పరమాత్మ స్వరూపమునందు బాహ్యమున గానవచ్చుట లేదని మాత్రమే అర్థము గుణత్రయ సామ్యావస్థయే ప్రధానమనీ, అవ్యక్తమనీ మూలప్రకృతియనీ పిలువబడుచున్నది అట్టి నామరూపములు ప్రకాశించక పూర్వము ఈ త్రిగుణములు బీజాంకురన్యాయముగా పరమాత్మయం దణగిమణిగి యుండి, సృష్టి కున్ముఖమైనపుడు త్రిగుణ సామ్యావస్థయును, అనంతరం వరుసగా శుద్ధసత్వ, మిశ్రమసత్వ, మలినసత్వరూపములుగా పరిణామములు చెంది ఈశ్వర జీవ జగత్తులను తనయందు ఉద్బుద్ధము చేయుచున్నది. నిర్గుణము లేక గుణాతీతము అనునది కేవల గుణరహితస్థితిగాదు. అట్లే నిరాకారమందును అర్థము చెప్పుకొనవలసియున్నది. ఎట్లనగా నిరాకారమనగా సర్వాకారములు చేరుటవలన ఏర్పడిన ఒకానొక ఊహకుమించిన ఆకారము. ఉదాహరణకు ఊదారంగు, ఇండిగోరంగు, నీలంరంగు,ఆకుపచ్చ, పసుపు, నారింజ, ఎరుపు, అను సప్తవర్ణములు సూర్యకాంతియందున్న రంగులే. ఐననూ సూర్యకాంతి కేరంగూలేదు. ఏరంగూ కాని ఒకానొక విశిష్టకాంతి సూర్యకిరణము

నందు గోచరించుచున్నది. ఆ సూర్యకిరణమే విశ్లేషము చెందినపుడు (ఉదాహరణకు) ఇంద్రధనస్సునందు సప్తవర్ణములు ప్రకటమవుచున్నవి. అంటే అన్నిరూపములు అన్ని ఆకార ఆకృతులు. వర్ణములు, రూపములు, బీజరూపముగా ఆ పరమాత్మయందే అణగిమణిగి యుండి నానారూపములు సృష్టిపరిణామంలో బహిర్గత మగుచున్నవి. ఇందుకు దృష్టాంతమేమైనా ఉన్నదా? అనగా మయూరాండమును దృష్టాంతముగా గైకొనవచ్చును. ఎట్లు అనగా నెమలిగ్రుడ్డును బ్రద్దలుగొట్టి చూచినచో నెమలిశరీరము నందలి చిత్రవిచిత్రవర్ణము లేమైననూ గానవచ్చునా? కానరావు. కేవలము విశుద్ధ జలము వంటి పదార్థమే కానవచ్చును. కాని ఆ నెమలిగ్రుడ్డను బ్రద్దలగొట్టక ఎదుగనిచ్చినచో కాలానుగుణ్యముగానందుండి శోభాయమానమగు చిత్రవిచిత్రములన్నిటితో గూడిన పక్షిపిల్ల బహిర్గతమగు చున్నదే! అట్లే పరమాత్మ తా నెంతో నిర్గుణ నిరాకారవస్తువుగా కానవచ్చిననూ అది కేవలము రూపరహితము కాదు. కనుక సమస్త గుణరూపములను తనయందు బీజరూపముగా గర్భీకృత మొనర్చుకొని యున్నదని చెప్పవచ్చును.

గురు వనగా తనవంటి ఒక మానవుడే అను దృష్టి తొలగుటకై ఈ శ్లోకమునందు గురుతత్వమెట్టిదో వివరింపబడినది.గుణరూపములు కలిగిన మంత్రోపదేష్టయగు తన గురునియెక్క నామరూప గుణాదులను గుర్తించక ఆయనయందు గుణరూపములులేని నిరాకార నిర్గుణ లక్షణములుగల పరమాత్మ దర్శనమే చేసుకొనుచుండవలెను అని బోధించుటకే ఈ శ్లోకము ప్రవర్తిల్లినది. అంతా గురుస్వరూపమే. గురుస్వరూపము కాని దేదియు లేదు."ఆత్మనోన్యం న కించన" "బ్రహ్మణోన్యం న కించన" అన్నట్లుగానే "గురోరన్యం న కించన" అని అనవలసియున్నది. సృష్టికి పూర్వమున్న స్థితిని వూహించి అనగా అది గుణాతీతమని, రూపాతీతమని చెప్పబడినదేగాని ఆ గుణరూపములు ఆస్థితియందు అసలే లేవని అర్థముకాదు.

"శుద్ధే సుషుప్తి దృష్టాంతం" అన్నట్లుగా సుషుప్తి యందు యింద్రియవ్యవహారము ఏమియు కానరానంతమాత్రమున అది యింద్రియమేలే లేని అవస్థయని చెప్పకూడదు. అట్లే "గుణ రూపవిహీనత్వాత్" అంటే గుణరూపములు లేనేలేవనియును అనరాదు. ఆ సమస్త గుణములు, సమస్తరూపములు అపుడా పరమాత్మయందు ద్రవరూపము చెందియున్నవన్న మాట. అనగా నిజముగా చూచినట్లయితే, పరమాత్మసమస్తగుణాకరుడు, సర్వరూపాత్మకుడు, ఆత్మసర్వాకారము అనియే చెప్పవలసియున్నది. వైష్ణవ సిద్ధాంతము వివరించునట్లు బ్రహ్మమనగా విష్ణువేయనియు నిర్గుణము లేక గుణాతీతమనగా హేయ గుణరహితము మాత్రమేగాని కల్యాణగుణ రహితము కాదనియు ఆ పరమాత్మ సమస్త కల్యాణగుణకరు డనియు నిర్గుణ మనగా ఇదే నిజమగు అర్థమనిన్నీ వ్యాఖ్యానించుట గమనించదగిన విషయము. మరిన్నీ రూపరహిత మనగా ప్రాకృతరూపము లేదుగానీ అప్రాకృత దివ్యమంగళ శరీరుడని, విష్ణువు అభివర్ణింపబడు చున్నాడు.

నిర్గుణమే సగుణ మగుచున్నది. నిరాకారమే సాకారమగుచున్నది. నిర్గుణుడు నిరాకారుడు అని చెప్పబడే పరమాత్మ ఒక్కడే జీవేశ్వర జగద్రూపమువహించి సగుణ సాకారరూపములు పొందుచున్నాడు. ఇది ఎట్లు సాధ్యము ? ఇందులకు దృష్టాంత మేదైనాగలదా? అని అడగవచ్చును. జలమునకు గుణము రసముకదా ! రసము మధుర,

ఆమ్ల, లవణ, తిక్త, కటు, కషాయాది రుచులు కలదిగదా., అనగా తీపి, పులుపు, ఉప్పు, చేదు, కారము, వగరు అను షడ్రుచులు కలవుగదా! స్వచ్ఛమగు వర్షబిందువునకు ఈరుచులు ఏమైనా గలవా? ఆబిందు వెందెందు బడునో ఆ గుణరూపములను పొందుటలేదా! అట్లేమండు వేసవియందు కేవలము నిరాకారముగా ఆకాశమునందు ఎక్కడో కంటికి కానరాని మేఘమే, చలిగాలి సోకి తొలకరియందు కారుమేఘముగా రూపొంది చివరకు స్థూలాతిస్థూలరూపమగు నదీనదములై ప్రవహించుటలేదా! సగుణము నిర్గుణముగా సాకారము నిరాకారముగా మార్పుచెందుచున్నది. ఇట్లు ద్వంద్వ స్వరూపముగా యున్నది ఏకవస్తువే. ఇట్టి ఏకరూప ద్వంద్వ స్వరూపమే గురుతత్వము. సగుణ నిర్గుణములు సాకార నిరాకారములు కానిది పరిపూర్ణ మొక్కటే. నిర్గుణరూపము లేశమైననుకూడ వుండుటకు వీలులేనిస్థితియే పరిపూర్ణస్థితి. దీనిని భాగవతుల కృష్ణదేశికేంద్రులవారు శుద్ధ నిర్గుణ పరతత్వమని పేర్కొన్నారు.

ఆ గుణరూపములు బీజరూపంగా యేలేశమో పరమాత్మయందిమిడియున్నా వానిచే సామన్యమానవుడు బాధింపబడనట్లుగా ఎట్టి వికారము పొందకయుండుటచే దానిని గుణాతీతమని రూపాతీతమని అన్నారు. అట్టి గురుపరమాత్మ కివే మా ప్రణామములు.

శ్లో॥ ధ్యానమూలం గురోర్మూర్తిః
పూజా మూలం గురోఃపదం।
మంత్రమూలం గురుర్వాక్యం,
ముక్తిమూలం గురోఃకృపా॥

తాత్పర్యం:- ధ్యానయోగమునకు గురువుయొక్క రూపమును, అర్చనాది పూజా విధానమునకు గురుస్థానమును (పాదమును) మంత్రశాస్త్రమునకు గురువాక్యమును, మోక్షమునకు గురు కటాక్షమున్నూ మూలకారణములుగా యున్నవి. అనగా గురుభక్తుడు గురువుయొక్క రూపమునే ధ్యానించవలెను. గురుపాదమును పూజింపవలెను. గురువాక్యమును మంత్రమువలె స్మరించవలెను. మోక్షముకొరకై గురుకృప సాధించవలెను.

విశేషార్థము:- మూర్తి= స్వరూపము (నిర్గుణము) ధ్యానమూలం ధ్యేయము (ధ్యానింప బడుచున్నది) అధిష్ఠాన చేతన బ్రహ్మమునకు స్వరూపలక్షణము కలదు. మరిన్ని అన్ని రూపములకు మూలము ఈ స్వరూపమే కనుక తన గురువే రూపుదాల్చిన పరమాత్ముడని రూఢిగా తలచవలెను.

వాక్యమునకు మూలము ధ్వన్యాత్మకమగు ప్రణవము (పరావాక్) ఇది ఆ పరమాత్మ యొక్క స్వభావము.

మంత్రమూలం = మననమునకు (జపమునకు) బీజము కనుక. శ్రీగురుపరమాత్మకు, స్థానస్వరూపస్వభావములు పై విధముగా నిర్ణయింపబడినవి. ఎవరు, ఏఏ నామరూపములతో, ఎవరెవరిని, పూజాధ్యానజపములతో ఆరాధించిననూ అవి అన్నియు శ్రీ గురుపరమాత్మకే చెందును. (అతడే సర్వమునకు మూలమై ఆలంబనమై యున్నాడు. కనుక) అందుకే భగవద్గీత "యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజా మ్యహం" (ఎవరు, నన్నేరీతిని సేవింతురో, వారలను అట్లే అనుగ్రహింతును) అంటున్నాడు. భగవానుడు. గురుపరమాత్మ యొక్క ఈ స్థాన స్వరూప స్వభావములు గుర్తెరిగి సాధన చేసినపుడే చెప్పబడిన ఫలము సిద్ధించగలదు.

గురుస్థానమేది ?:- "సర్వవ్యాపకో విష్ణుః" అన్నట్లు సర్వవస్తువుల బాహ్యాభ్యంతరముల

యందూ నిండియున్నదే విష్ణు పదార్థము. దానినే "ఏవం గురుపదం శ్రేష్ఠం" అని గురుగీత చెప్పుచున్నది. అదియే పూజనీయము. ఉపాసితవ్యము. యిక్కడ 'పద' అనగా పాదము అనికూడా కొందరందురు. ఈ అర్థములో పాదద్వయము చెప్పవలెను కాని ఏకపాదమునే ఏలచెప్పిరి? విచారింపవలసియున్నది.

శ్లో॥ వందే గురుపద ద్వంద్వం వాఙ్మనోతీత గోచరం।
శ్వేత రక్త ప్రభాభిన్నం శివశ్శక్త్యాత్మకంపరం॥

అనగా ఏ గురుపాదములజంట యింద్రియరూపమగు వాఙ్మనస్సులచే గుర్తింపరానిదై, శ్వేత, రక్త వర్ణములు గలదై, శివశక్త్యాత్మకమై యున్నదో, మరియు అన్నిటికి అతీతముగా యున్నదో, అట్టి గురుపద ద్వంద్వమునకు నమస్కరించుచున్నాను అని భావము. శివశక్తులు, లేక పురుషప్రకృతులు రెండూ ఏకరూపమని, "ఏకమేవాఽ ద్వితీయంబ్రహ్మ" అని శ్రుతి అంటున్నది. కందార్థములలో "ఏ పురుషుడు గురువర్యుని శ్రీపాదము పట్టలేదో......" అంటూ, ఏకపాదమే సూచింపబడినది. కనుక "గురోఃపదం" అనుటలో ఏకపాదమనే చెప్పినారు, అన్నప్పటికి నమన్వయముగానే యున్నది. గురుకృపాపాత్రులై వస్తునిశ్చయము గావించుకొన్నవారలకు మాత్రమే ఏకపాద మెట్లయినదో సులభ గ్రాహ్యము.

మంత్రమూలం గురుర్వాకం:- వాక్యమునందు కొన్ని మాటలు, మాటయందు కొన్ని అక్షరములు (లేక వర్ణములు) వున్నవికదా! సంస్కృతమున అక్షరములు ఏబది. వర్ణాత్మకమగు ఈ అక్షరములకు మూలము ధ్వన్యాత్మకమగు (కేవల శబ్దస్వరూపమగు) ప్రణవము. "పంచాశ దక్షరముల ప్రపంచము తా నుద్భవించె. ప్రణవాక్షరమందంచు, శ్రుతులెన్నె....." అన్నారు. కృష్ణదేశిక ప్రభువు. ప్రణవము బ్రహ్మవాచకమే. "తస్య వాచకః ప్రణవః" అని యోగసూత్రము. ఆ బ్రహ్మము గురుస్వరూపమేనని గుర్తించితిమి. గురువాక్యము అంటే పరావాగ్రూపమైన ప్రణవస్వరూపముగా గుర్తించవలెను. అదియే శ్రవణ మనన నిది.ధ్యాసలు చేయతగిన మంత్రముగా నెరుగవలెను. కనుకనే "మంత్రమూలం" గురుర్వాక్యం అని అనవలసివచ్చింది. "గురువాక్యం యధా తథా" అన్నారందుకే పెద్దలు.

ముక్తిమూలం గురోఃకృపా:- అనగా గురుకటాక్షమే మోక్షహేతువు అని అర్థము. ఈ అర్థమే "అపరోక్షమౌనె మనుజులకు పరోక్షం బైన బయలు గురుకృపలేకన్"......... అను కందార్థములో కూడా గానవస్తూంది. ఐతే ఈ గురుకృప యెట్లు సిద్ధించును? తనకు మంత్రో పదేశముచేసిన గురువుయెక్క అనుగ్రహముతోనే అని మాత్రమే అర్థముచేసుకొని గురువునకు కట్నకానుకలిచ్చి గురుకృప సిద్ధించినదని సంతోషపడుట వ్యర్థము. యీ పద్ధతులచే నిజగురు వెన్నడు ప్రసన్నుడు కానేరడు. ఆతడట్టి లంచగొండియూగాడు.

నిజగురువు స్వార్థరహితుడు శిష్యుని పవిత్రాంతఃకరణను గుర్తించి పూర్ణబోధ పొందుటకు పూర్ణధికారియని గుర్తించిననే గురుగోప్యమును శిష్యునికి చెప్పగలడు. అథవా స్వార్థగురువై మర్మమును శిష్యునికి తెల్పినా దానియందుండే ధర్మమునుమాత్రము పాలించనిచో శిష్యుడు కడతేరలేడనుట నిర్వివాదమేకదా! మరిన్ని పురుషకారమువల్ల మాత్రమే ఆశయసిద్ధి కాజాలదనిన్ని, దైవకృప (ఈశ్వరానుగ్రహం) యుండనిచో దేనినిగూడ సాధించ జాలడనిన్ని లోకవిదితమే. అందుకే

శ్లో॥ అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధం!
వివిధాచ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమం!!

అంటూంది. భగవద్గీత. అనగా ఏపని జరుగవలె నన్ననూ. కార్యాలయము లేక పనిచేయు స్థానము. ఆపనిచేయుకర్త, ఆతని యింద్రియములు, క్రియారూపమగు వ్యవహారము.దైవము అను ఈ ఐదు కారణములు లేక ఏక్రియయూ జరుగదు.జన్మరాహిత్యమాసించిన శిష్యుడు, గురుకృపా (అదియే గురుభక్తుని విషయంలో దైవకృప) సంసిద్ధికై, మంత్ర, జప ఉపాసనానుష్ఠానాచరణాది సమస్త క్రియలు గురువాజ్ఞప్రకారం చేసిననే కృతకృత్యుడుకాగలడు.కనుకనే "గురుకృపా ప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః అని గురుభక్తుడు సంకల్పించి అనుష్ఠానది ప్రక్రియలు కొనసాగించవలసియున్నది. ఈవిధంగా చేసిన సత్కర్మానుష్ఠాన, గురుధ్యాన, మంత్ర జపానుష్ఠానమువల్ల అంతఃకరణశుద్ధి, ఏకాగ్రత మాత్రమేకాక, ఫలప్రాప్తి కవరోధములగు భూత భవిష్య ద్వర్తమాన ప్రతిబంధములు, మలవిక్షేప ఆవరణ దోషములు తొలగిపోవుటయు. ఆ ఏదప మాత్రమే గురుకృపకల్గుటయు. సాధ్యమగును. అట్టి గురుకృపా సంసిద్ధికై "నాలుగు శుశ్రూషములు లోలతగావించుకొనుచు లోకాతీతం బాలోచించి గురునిచే, యీ లోకము జోలివిడువు మింతేచాలన్నా" అన్నారు. శ్రీకృష్ణదేశిక ప్రభువులు నాలుగు శుశ్రూషణములు, శిష్యునియొక్క ప్రవర్తనమునకు సంబంధించినవి. నాలుగు శుశూషముల వివరణ యీ గ్రంధములోనే అన్యత్ర గాననగును.

శ్లో॥ గూఢో దృఢశ్చ ప్రీతశ్చ మౌనేన సుసపమాహితః
సకృత్కామగతో వాపి పంచధా గురు రీరితః॥

తాత్పర్యము:- సద్గురుమూర్తి 1) రహస్యమైన వునికి గల్గినవాడు 2) జ్ఞానదార్ఢ్యము (దృఢత్వము) గలవాడు, 3) ప్రేమ స్వరూపుడు 4) మౌనమునందు సుప్రతిష్ఠితుడు 5) లోకోద్ధరణ కొరకై మాత్రము బహుకొద్ది కోరికలు గలవాడు నై యుండును.

విశేషవివరణము:- 1) ఈ ఐదు లక్షణములు వివరణ, 2) ఈ లక్షణములు నిర్గుణమగు గురుస్వరూపమునెడలనెట్లన్వయించును? 3) ఈ ఐదులక్షణములూ ఒకేగురువు నందుండవలెనా? లేక ఒక్కొక్క లక్షణమే గల యైదురకముల గురువులున్నారా? అను విషయముల గూర్చి వివరించి తెలుసుకొనదగును.

1(అ) గూఢ, అనగా రహస్యము.గురువు రహస్యవృత్తి నవలంబించి యుండుననగా, యితరులకు తనస్థితి అనగా తానొకగురువని. తెలియరాని విధముగానే జీవించును.అంతేగాని తన్ను గురువుగా ప్రకటించుకొని ప్రచారము చేసుకొనడు.తన బిరుదులు గాని దీక్షానామములుగాని తన పేరునకు తగిలించుకొన కోరడు. అట్టి బిరుదులతొ తన్నందరూ వ్యవహరించవలెనని ఆశించడు. కీర్తి ప్రతిష్ఠలకై ప్రాకులాడడు.ఆడంబరములను దూరీకృత మొనర్చును. లోకులందరివలెనే వ్యవహరించును. క్రొత్తవారు చూచిన ఆతనియందెట్టి ప్రత్యేకతయు గాన రాకుండునట్లు జాగ్రత్త పడును. సత్కార మాన పూజాదులకై మాత్రమే దండ కమండల కాషాయధారణ చేయడు. లోకుల నాకర్షింపవలెనని గొరిభాషాచాతుర్యములతో చిత్రప్రసంగములు చేయడు. ఈవిధముగా తనస్థితిని మరుగుపరుచు కొనుటవలను, లోకుల అవహేళనలకుగాని, గౌరవాగౌరవములకుగాని గురిగాక జీవించును. లేనిచో శిష్టుల మర్యాదలకును. దుష్టుల అవహేళనములకును పాత్రుడై మానావమానములచే చిత్త విశ్రాంతికి భంగము కల్గించుకొన్నవా డగును. బ్రహ్మజ్ఞాని, బాలోన్మత్త

పిశాచవత్తుగా సంచరించునని చెప్పబడినది. పోనీ గురు వారీతిగా నుండునో? యుండడు. అది తన్ను తాను మరిచిపోయున అత్యాశ్రమి విషయము. ఆతడు గురువుగా నుండతగడు. గురువు అట్లుగాక అందరిలో అందరివలెవుండి రాజయోగ రీవితో వర్తించుచుండును. పాముల జాడ పాములకే, స్వాముల జాడస్వాములకే గ్రాహ్యామన్నారు. ఎంతో పూర్వ పుణ్యవిశేషమున్నవారికిగాని గురు సందర్శనమే కాదు. అట్టివారు వచ్చి ఆశ్రయించినపుడు మాత్రమే వారి ఆశయమునకు తగిన బోధ అధికార తారతమ్యమును బట్టి వారి కెరిగించుచుండును.అంతేగాని వూరూరా తిరిగి శిష్యసేకరణగావించి, బ్రహ్మవిద్యా విక్రయము గావించు బాధ గురువులు కారు వారు.

(అ) దృఢ శబ్దముచే గురువుయెక్క జ్ఞానదార్ఢ్యము సూచింపబడినది. గురుకృపాల్లబ్ధ మగు విషయములం దెట్టి సంశయము లేకండ తాను ఆరూఢుడై యుండినగాని, తన శిష్యులకు ప్రబోధచేయడు. విషయ దృఢత్వము లేని గురువులను గూర్చి "తన్ను తా నెరుగడు తా నెవ్వరికిజెప్పు? పాలుమాలినయట్టి పశువుకొడుకు!" అని వేమన నీచముగా నిందించినాడు. అట్టివాడు శిష్యసేకరణ చేయుటకు అనర్హుడు.

(ఇ) ప్రీతశ్చ అనగా, ప్రీతి లేక ప్రేమగలవాడు.దేనియందు? అంటే "సర్వభూతహితే రతః" సకలప్రాణుల క్షేమమునందు దీక్షవహించినవాడు. అట్టివాడు "వసంతవత్ లోకహితం చరంతః"అనగా వసంత ఋతువువలె సర్వుల నానందపరచుచూ, లోకశ్రేయస్సు కొరకే ప్రపంచ మున, నాతడు నడయాడుచుండును.ఆతడు ప్రేమయే స్వరూపముగా గలవాడు. ఆత డట్టి అఖండ ప్రేమమయుడగుటకు కారణమేమి? అతడే విశ్వము.విశ్వమే అతడు. అతడు సర్వమయుడు సర్వము అతనికి ప్రీతిపాత్రమే.ప్రేమయే స్వరూపముగాగల పరమాత్మయే ఆతడు "ఆత్మనోన్యం నకించన" ఆత్మకంటె భిన్నమైనది లేదని. తానే అట్టి ఆత్మస్వరూపుడనని గుర్తించి తద్విధముగా జీవితం సరిదిద్దుకొన్న గురుమూర్తి యందు యెక్కడనైనా ద్వేషలేశమునకైనా తావుండునా? పంచదార బొమ్మయం దెక్కడైనా చేదుండునా? గురుపరమాత్మయందట్లే ఎక్కడచూచిననూ ప్రేమయే! రామనామంలేని రత్నాలన్నీ రాళ్లే గదాయని హారంలోని రత్నాలన్నీ చితుకగొట్టాడు ఆంజనేయుడు గురుమూర్తియందు ప్రేమామృతం పొంగి పొరలుచుండును. కంటిద్వారా కరుణామృతం. వాక్కుద్వారా వచనామృతం "మధురాధిపతే రఖిలం మధురం" అన్నట్లుగా గురుస్వరూప మాదిమధ్యాంతములందంతటా ప్రేమమయమే యైవున్నది."ప్రియమిత్యుపాసీత"అని శ్రుతి విధించు చున్నది.

(ఈ) మౌనేన సుసమాహితః : మౌనమువలన శాంతరూపము చెందిన యంతఃకరణ గలవాడు మౌనము నాల్గు విధములు (1) కాష్ఠమౌనము=మాటలాడకుండా మూతిని బిగించుకొని యుండుట. 2)వాఙ్మనము= కర్మేంద్రియములలోని వాగింద్రియమును బంధించుట. (3)అక్షమౌనము = జ్ఞానేంద్రియ పంచకముచే విషయ పంచకమును గ్రహింపకుండుట (4)మహామౌనము=అంతరింద్రియపంచక వ్యాపారము నరికట్టుట. మౌనమను శబ్దమునకు వాఙ్మౌనమే రూఢ్యర్థము, మాట్లాడకుండా సౌజ్ఞల వల్లనో, వ్రాతవల్లనో భావప్రకటనచేయునట్టి మునీశ్వరుల మౌనవ్రతము వల్ల నేమిప్రయోజనము? మితభాషిత్వము మాత్రము కొంతకాలమునకు సిద్ధించవచ్చును.వాచాలత్వము నరికట్టుటచే సంభాషణములో దొర్లు అతిశయోక్తి రూపములగు అసత్యములును కొంతవరకు తగ్గగలవు. ఇంతకన్న

ప్రయోజనములేదు అరికట్టిన అక్రమౌనములో బాహ్యములగు శబ్దాదులవల్ల చిత్తచలనముండక పోవచ్చునేగాని అంతరింద్రియ వ్యాపారము సాగిచుండుటచే చిత్తశాంతి చేకూరదు. అంతరింద్రియముల నరిగట్టిన మహా మౌనమునకే అమనస్కమనికూడా పేరు. దీనివలన శూన్యసమాధి లభించవచ్చును.లేదా గురుముఖతః వస్తునిశ్చమయు సాధించినవారికి పూర్ణసమాధి లభించవచ్చును ఏసమాధి యైనా తాత్కాలికమే. ఐనను లోకహితము కొరకు తన శరీర, యింద్రియ, మనస్సులను (అనగా త్రికరణములను) వినియోగించుట పరమధర్మమయి యుండగా దైవమిచ్చిన శక్తులను దుర్వినియోగపరుచుట యెంత అనర్ధకము? అట్లేవాని నరికట్టి జడుడై పోవుటయు నంతటి మూర్ఖత్వమే కాగలదు.లోకహితార్థము రూపుదాల్చిన గురుమూర్తి పూను మౌన మెట్టిదియో. యించుక విచారించ వలసివున్నది ఆత్మస్వరూపుడగు తనకు కేవలాత్మయందు మూలముగాని స్థానముగాని లేదని స్థిరపరచుకొన్న వాడగుటచే అతడే నిజముగా స్వార్థరహితుడు (స్వ=తాననే, అర్థ=వస్తువు రహితుడు=లేనేలేదని స్థిరపరచుకొన్నవాడు) ఆదర్శ గృహస్థయి అంటియు నంటనిరీతిగా నాతడు సంసారము సాగించుచుండును. శరీర, యింద్రియ, మనోవ్యాపారము లన్నియు అందరివలెనే జరుపుచుండియు, జరుపనివాడే యగుచున్నాడు.కనుక అతడే నిజమగు మౌనవ్రతుడు. మునీశ్వరుడు.అశరీరి. ఇట్టి మౌనపద్ధతిచేత మాత్రమే సమాహితచిత్తము లభించగలదు.

(ఇ) సకృత్కామగతుడు:- కోరికలు సకృత్తుగా గలవాడు, అతని కోరికలు చాల తక్కువ అని అర్థము. కేవల పరమాత్మ స్వరూపుడే తానైనవానికి ఏమికోరిక లుండును? ఆత్మస్వరూప నిశ్చయముతో సర్వార్థసిద్ధి గలిగినట్లే గదా! ఆప్తకాముడనీ, నిరపేక్షకాముడనీ అతనికి పేర్లు.''కిమిచ్ఛన్ కస్య కామాయ'' అని అతనికే కోరికమాత్ర మెందుకుండును? ఐనను అతని కొక్క కోరిక మాత్రముండును.గురుఋణము తీర్చుకొనవలెననుకొనుటయే ఆకోరిక. తన గురుమూర్తి కృపకుపాత్రుడై భ్రాంతిరహితస్థితి తా నెట్లు చేకూర్చుకొనెనో అట్లె యితరులకు తాను బోధించి తరింపచేసిననాడే తన గురు ఋణము తీర్చినవాడగును. అందుకు తగిన అధికారసంపత్తి తన గురువుచే పొందియున్నాడు. కనుక శిష్యుల ''హృదయ గ్రంధివిడుటకై సదయత యీ బోధ దెల్పుజనదా గురుడై?'' ఇదే అతని మహత్సంకల్పము. సంసార బాధ్యతలలో మునిగియున్నట్లు లోకులకు గానవచ్చినా, యదృచ్ఛాలాభ సంతుష్టి కలిగి, విధాయక కర్మలు కర్తృత్వ రహితంగాచేయు కర్మకౌశల మెరిగినిష్కామ కర్మచేయును కనుక అతనిని సకృత్కామగతుడని అన్నారు.

(2) నిర్గుణమగు గురుస్వరూపమునందీ లక్షణము లెట్లన్వయమగును?

(ఎ) గూఢము= ఆ గురుపరమాత్మ యొక్క స్వరూపము యింద్రియ గోచరముగాదు. కాని ''మనసైవాను ద్రష్టవ్యం'' అని నిర్విషయ స్వరూపము చెందిన మనస్సునకది గోచరమే ఆ పరమాత్మ స్వరూపమెంతో సన్నిహితమయ్యేవున్నది. కనుకనే ''శ్రీగురోఃపరమంరూపం, వివేకం చక్షురగ్రతః'' అన్నారు. ఐనను ''మందభాగ్య నపశ్యంతి అంధస్సూర్యోదయం యథా'' అన్నరీతిగా దురదృష్టవంతులకు దూరస్థమైయున్నది.దీర్ఘకాలం గురుసేవచేసి గురుకృపకు పాత్రులైన అదృష్టవంతులకే అది ప్రత్యక్షము. కనుక అది గూఢముగా నున్నది.

(బి)దృఢము=సుస్థిరము., అంచచలము, సృష్టికి పూర్వమునందునూ, ప్రళయానంతర మందునూ. అది అచలమయ్యే యున్నది. సృష్టిసంకల్పమే ప్రథమ చలనము. సృష్టికారణమైన

ఆ వస్తువునకు చలాచల లక్షణములు సహజమైయున్నవి. యీ ద్వంద్వలక్షణములలో నొకటైన అచల లక్షణముజూచి, అదే కేవలాచల బ్రహ్మమని చాలామంది పొరబడి యున్నారు. దానియందు గర్భీకృతమైవున్న చలనస్థితియే జీవేశ్వర జగత్తులకు కారణమైయున్నది గదా! ఐననూ, అది ఆద్యంతములయందు అచలస్థితిలో నుండినందున దానిని దృఢమని పేర్కొన్నారు.

(సి) ప్రీతశ్చ= ప్రేమయే భగవత్స్వరూపమని సర్వమతములు యొప్పుకొనుచున్నవి. ఎంతటి వికలాంగుడైనా తన అవయవములను ప్రేమించుచుండునుగదా! అట్లే సావయవ రూపమగు సమస్త సృష్టి తనకు ప్రీతిపాత్రమే. మాతాపుత్రసంబంధరీతిగా అన్యోన్యప్రేమ విరాజిల్లుచుండును. "బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠం" విశ్వమే బ్రహ్మము, బ్రహ్మమే విశ్వము. కనుక రెండునూ అన్యోన్య ప్రేమ పాత్రములై యున్నవి. యీ బ్రహ్మజగత్తులు రెండునూ ప్రేమమయములే. అట్టి బ్రహ్మమును "ప్రియమిత్యుపాసీత" అని శ్రుతివిధించినది.

(డి) మౌనేన సుసమాహితః : సృష్టికి పూర్వము అచలమై నిస్సంకల్పస్థితిలోనున్న పరమాత్మ నిస్తరంగ సముద్రమువలె శాంత గంభీరమైయుండెనుగదా! ఇచ్ఛామాత్రః ప్రభుస్సృష్టిః" సృష్టికామనతో ఆ ప్రశాంతసాగరము కల్లోలిత మయ్యెను.అంతకు పూర్వ మది నిశ్శబ్దమని వర్ణింపబడినా, లేశరూపంగా పరావాక్కు అందు నిక్షిప్తమైయుండి. ధ్వన్యాత్మకమగు ప్రణవమై పంచాశదక్షరరూపముగా ప్రపంచ మావిర్భవించెను. సృష్టికి పూర్వము అది సమాధిలో నున్నదానివలె నుండెనని చెప్పబడెను.

(ఇ) సకృత్కామగతము:- సృష్టికామన కూడా కలుగక పూర్వము అపరమాత్మకు ఎట్టిసంకల్పమూ లేదుగదా! తర్వాత కల్గిన సృష్టికామనయే అతని ఏకైక కామన (కోరిక) ఆ మహాసంకల్పమే సకలసంకల్పాలకు మూలమైనది. సర్వము తానేయైన వానికి ఏమి కోరికలుండ గలవు? "సోఽ కామయత బహుస్స్యామ్యం ప్రజాయేయేతి" ఒక్కడైన తానే, అనేకం కావలెనని కోరెను.ఇదే కోరిక తప్ప ఏకోరికలు ఎన్న డాతనికి గలుగలేదు. కనుక అతడు సకృత్కామగతుడని చెప్పబడినాడు.

(3) ఈ 5 లక్షణములున్నవాడే సద్గురువు అని అనవలెనా? లేక ఐదు విధములగు గురువులుండి, ఒక్కొక్కరికి ఒక్కొక్క లక్షణముండునని చెప్పవలెనా? నిర్గుణరూపములో గురు స్వరూప మేకరూపమే గదా! ఆ గురుస్వరూపమునందీ ఐదు లక్షణములున్నట్లు గమనించితిమి గదా! కనుక యీ ఐదు లక్షణములుగలవాడే గురువనుట యుక్తము. ఇందే యొక్క లక్షణము లేకున్నా ఆదర్శమునకు తగ్గిపోయినట్లేగదా! 'గూఢ' లక్షణము లేకుండా ఆడంబర జీవితం జరుపు గురుని ఆర్భాటపు జీవితం సమాజంలో హాస్యాస్పదమైపోవును. బోధయందు దృఢత్వము లేకున్నా. విశ్వప్రేమలేకున్నా ఆత డాదర్శగురు డెట్లు కాగలడు? అట్లే వాచాలత్వమున్నా కోరికలు పెంచుకొన్నవాడైనా శుద్ధప్రపంచీకుని కన్నా హీనుడే యగునుగదా! యీ ఐదు గుణములు యెవని యందుండునో అతడు సద్గురు డనుటయే లెస్స. అట్లే శ్లోకార్థమును ప్రవచించవలెను చకార ప్రయోగముచే కూడా అన్ని గుణములు వుండవలెననియే స్ఫురించుచున్నది. "పంచధా గురరీరితః" అను మాటలకు యీ ఐదు విధములా గురువు కీర్తింపబడుచున్నాడని అర్థము చెప్పుకొనవలసి యున్నది. ఇట్టి సమస్త కల్యాణగుణాకరుడగు, గురుమూర్తి యొక్క, సగుణనిర్గుణ రూపములు మన అంతఃకరణములయందు సుప్రతిష్ఠితము లగుగాక!

శ్లో॥ సయేవ సద్గురు స్సాక్షాత్ సదసద్బ్రహ్మవిత్త మః
తస్య స్థానాని సర్వాణి పవిత్రాణి నసంశయః॥

తాత్పర్యము :- సద్రూపంగానూ, అసద్రూపంగానూ. యే బ్రహ్మమున్నదో దానిని చక్కగా తెలిసియున్నవాడే సద్గురువు. అతడే సాక్షాత్తు ఆసదసద్బ్రహ్మ ఆతడున్న సమస్త ప్రదేశములు మహాపవిత్రములు. ఇందు సందేహ మేమీలేదు.

విశేషవివరణము:- 1) సదసద్బ్రహ్మ 2) విత్తమః 3) స్థానాని సర్వాణి

1) సదసద్బ్రహ్మ: అనగా సదసద్రూపములు రెండున్నూ కల్గిన బ్రహ్మము. సత్ అనగాత్రికామ్యులయందూవుండి త్రికాలముల చేతనూ బాంధింపబడనిది. త్రికాలము లనగా భూత. భవిష్యత్, వర్తమానములు. భూతకాల మనగా పూర్వము, భవిష్యత్ అనగా అనంతరము, వర్తమాన మనగా తత్సమ కాలము. ఏ సంఘటనకు పూర్వ. అనంతర. సమకాలములు ? అంటే సృష్టి అనేది ప్రథమ సంఘటన. కనుక దానికి పూర్వాపర సమకాలములు. సృష్టికి పూర్వము సృష్టికారణమగు వస్తువు వుండితీరవలెగదా! సృష్ట్యనంతరము జీవేశ్వర జగత్తులుండును. సృష్టి సమకాలమున క్రియారూపముగా సృష్టివ్యాపారము లేక పరిణామక్రమముండును.సృష్టికి పూర్వము కర్తగా, సృష్ట్యానంతరము కర్మగా సృష్టి సమకాలమున క్రియగానుండి యేకైక వస్తువు ఎడతెగకుండా నున్నదో అదియే సత్పదార్థము. సృష్టికి పూర్వము నిరాకారము. అనంతరము సాకారము, ఆపిదప మరల నిరాకారముగా ఈ నిరాకారసాకారములు కల్గియున్నందున ఒకదానియం దొకటి గర్భీకృతమై యున్నందున దీనిని పూర్ణమన్నారు.

అసత్తనగా సత్‌గానిది. సృష్టి సంబంధమగు కారణ కార్యపరిణామ దశలు మూడున్నూ లేనిస్థితి అసత్ అన్నమాట. దానినే శూన్యమనీ అన్నారు. ఐతే, ఆశూన్యమును గుర్తించిన సాక్షినిసత్తన్నారు. ఏలననగా సద్రూపమైన పూర్ణమున్ను అసద్రూపమైన శూన్యమున్ను సాక్షిభాస్య ములు. ఏకాగ్రమైన మనస్సునకు గోచరములు. ఎరుకకు గోచరమలై ఎరుకచేత సేవించదగినవై యున్నవి. జ్ఞానజ్ఞేయములు రెండున్నూ యెరుకేగదా! కనుక యీ సదసత్తులు రెండున్నూ యెరుకే.

ఐతే. సత్పదార్థము మూడు కాలములయందూ వున్నదంటే ఏ కాలమందు లేకపోయిననూ అది అసత్ శబ్దార్థములోనికే రాగలదు.కాలములు మూడింటియందూ కూడా లేనిదేదో అది మాత్రమే అసత్తని అర్థము చెప్పరాదు. ఏలననగా. అట్లు చెప్పినచో అసత్ అనునది కుందేటి కొమ్మువంటి కేవల అలీక పదార్థమే కాగలదు. అసత్తనేది కేవలం వాగాడంబరమే అయిపోవును."సదసత్తులు రెండూ యెరుకే, ఏరుక లేనేలేదు. పుట్టనేలేదు అని పరిపూర్ణ భావంలో చెప్పబడుతోంది కదా. అపుడు సదసద్రూపమగు యెరుక అలీక పదార్థము అగుటలేదా" అను శంక పరిపూర్ణబోధ సమగ్రముగా నెరుగనివారిమాట మాత్రమే. పరిపూర్ణ పరబాహ్యామునందు ఎరుక లేనేలేదు. దానికి యెరుక పుట్టనేలేదు అను నిజార్థము నెరుగని వారి మాటమాత్రమే. యెరుక యందు యెరుక సత్యమేనని గ్రహించవలెను.

మృద్ఘటమును దృష్టాంతముగా గైకొనవచ్చును. ఘటోత్పత్తికి పూర్వము. ఉత్పత్తి సమకాలమున, ఘట నిర్మాణము పూర్తియైన తర్వాత, ఘటనాశనాంతరము కూడా మృత్తు (మట్టి) న్ను అందలి ఘటకారశక్తిన్ని యుండియేయున్నవిగదా! కనుక మృత్తున్నూ ఘటకారక శక్తిన్ని సద్రూపములు. ఘటము యొక్క నామరూపములు ఒక దశలో నుండి ఒక దశలోలేవు గనుక అవి లసద్రూపములు కనుక మృద్ఘటము సదసద్రూపమని అనాలిగాని కేవల

సద్రూపమనిగాని కేవల అసద్రూపమనిగాని అనరాదు. ఘటకారకశక్తి సద్రూపము ఘటముయొక్క నామరూపములు అసద్రూపము.

అట్లే సృష్టికి పూర్వం, సృష్టి సంకల్పంచేసిన తెలివి వున్నది. ఆ తెలివి గల్గినదేదో అదే సృష్టి కర్త. "తత్సృష్ట్వా త దేవాఽ ను ప్రావిశత్" అనగా ఆ సృష్టికర్త సృష్టింపబడిన వానియందు అనుప్రవేశము గావించెను. ఆ తెలివి పనిచేయునపుడు కూడా కార్యరూప సృష్టి యందు నిగూఢంగా వుండనేవున్నది. అదియే మరుపురూపంలో అసత్తనబడుతోంది. ఎరుక మరుపులు సదసద్రూపములు. అవస్థాత్రయ విచారణలో యిది యింకనూ సుస్పష్టము. ఎట్లనగా జాగ్రతయందు మనసు సర్వమూ గుర్తెరుగు తోంది. గాఢ సుషుప్తియందు సర్వమును మరచి మరపురూపంలో వుంది. స్వప్నావస్థలో యెరుక మరువుల సంధిలో పనిచేస్తోంది. మూడవస్థలయందు మనస్సున్నది గాని లేకపోలేదు. యిది సద్రూపము. మూడవస్థలయందు ఏకరూపంగా లేదు గనుక ఆ మనస్సే అసద్రూపము. అట్లే కాలత్రయములయందువున్న యెరుక సద్రూపమూ అసద్రూపమూ అయివున్నది. దీనిని సదసత్తనీ అనవచ్చును. ఈ యెరుకనే సదసద్బ్రహ్మమని శ్లోకము పేర్కొన్నది. "సదసత్" అనే మాటయే విరుద్ధం అని కొందరంటారు. కానీ సృష్టి సంకల్పానుసారం సృష్టి జరిగిన పిమ్మట, ఆ సంకల్పం వికల్పం చెంది ప్రళయంకాక పూర్వం, ఆ సృష్టియందు సంకల్ప వికల్పములు రెండూ గర్భీకృతములై యున్నపుడు దానిని సదసత్ అని యేల అనరాదు? దృష్టాంతం చెప్పాలంటే, జాగ్రతసత్తు, సుషుప్తి అసత్తు. స్వప్నము సదసత్ అని చెప్పవచ్చునుగదా! సృష్టికి పూర్వం అసద్రూప శూన్యం, ప్రళయానంతరమున్ను అసద్రూప శూన్యమే, మధ్యలో సద్రూపం కనుక యిది సదసద్బ్రహ్మమని పేర్కొనబడింది.

"అసదేవేసోఽమ్యేఇద మగ్ర ఆసీత్, తతోవైసదఽ జాయత" అనిన్నీ "తమ ఆసీత్ తమసా గూఢమగ్రే" అనిన్నీ చెప్పు శ్రుతుల రీతిగా మొదట్లోవున్న అసద్రూప శూన్యత మనస్సుని మిప్పుడు సద్రూపం వహించినది."సదేవసోమ్యేదమగ్ర ఆసీత్ ఏకమేవాఽ ద్వితీయం బ్రహ్మ" అన్న శ్రుతి సత్తే సృష్టికి కారణమంటోంది. యీ శ్రుతులలో దేనినీ పరిత్యజించరాదు. రెండూ సమాన ప్రమాణ ప్రతిపత్తి కల్గినవే! రెంటికీ పూర్వపక్షములున్నవి. ఎట్లనగా "కథమసతస్సజ్జాయేతి." అనగా అసత్తునుండి సత్తుయెట్లు పుట్టును? అని శ్రుతి ప్రశ్నించుచున్నదే! అంటే అసత్తునుండి సత్తుపుట్టినదనరాదు. (తల్లికి బిడ్డ పుట్టినదని చెప్పినట్లుగా పుట్టినదనరాదు) కానీ అసత్తే సత్తుగా మార్పు చెందినదని చెప్పుట కేమి అభ్యంతరము?

అసత్తునుండి సత్తు యెట్లు పుట్టును? యిసుకనుండి తైలము తీయగలమా? అట్లే సత్తులేని అసత్తెట్లు పుట్టును? అని మరియొక శంక. కాని ఆ యిసుకలో మొలచిన నువ్వుచెట్టున పండిన నూవులనుండి తైలము తీయవచ్చునుగదా! అట్లే అసద్గర్భమందు సత్తున్నందుననే అసత్తుసద్రూపం చెందినదనుటలో అభ్యంతరమేమి? సత్తే జగత్కారణమను మాటకు "సత్తునుండి సత్తు పుట్టినదనరాదు. రెండూ సత్తేగదా! యిక పుట్టుట యేమి" అని కొందరు శంకింతురు. కార్యమందలి లక్షణము కారణమందు వుండితీరవలెననే సిద్ధాంతమును పురస్కరించుకొని సత్తే జగత్కారణమని శ్రుతి చెప్పినది అని అనుకొంటే సరిపోతుంది. సదసత్తులు కారణకార్యములుగా భావించక ఒకదాని యందొకటి గర్భీకృతములుగానున్నవనీ అవి భిన్న పస్తువులు కావనీ ద్వంద్వరూప మేకమనీ గ్రహించవలసి వున్నది.

"అసన్నేవ సభవతి, అసద్బ్రహ్మేతి వేదచేత్" అసత్తే బ్రహ్మమనేవారు శూన్యస్థితిని

పొందుతారని. సత్తే బ్రహ్మమనే వారు పూర్ణ స్థితినిపొందుతారనీ శ్రుతులు చెప్పుచున్నవి. కానీ ఏ రూపంపొందినా యేమీ బాధలేదు. ఏలననగా స్వభావంచేత అసత్తుసత్తుగానూ, సత్తు అసత్తుగానూ మార్పుచెందే లక్షణం వున్నపుడు ఏరూపం చెందినా ఒక్కటే.

శ్రీకృష్ణదేశికేంద్రులు "సదసద్రహితంబేమి పదార్థమొ" దానిని గురించి కందార్థములు చెపుతామని ప్రతిజ్ఞచేసినారు. అది ఏమి పదార్ధమొ? అంటే ఏ పదార్థమూ కాదని తెలుసుకోవాలి. అది సత్తుగాని అసత్తుగాని, సదసత్తుగాని, గానిది. అది, "వస్తుమద్రహితం" ఆదిశంకరులు వివేక చూడామణిలో మాయనువర్ణిస్తూ,

శ్లో॥ "సన్నాప్యసన్నా ప్యుభయాత్మికానో
భిన్నా ప్యభిన్నా ప్యుభయాత్మికానః
సంగాన్యసంగా న్యుభయాత్మికానో
మహా ద్భుతా నిర్వచనీయరూపా"

అని చెప్పినారు. ఆయా లక్షణములన్నియు యీ సదసద్బ్రహ్మకు వర్తించును. "మాయా బ్రహ్మల అనుసంధాయకునకు నొక్కటాయె దత్తాత్రేయా" అని దత్తాత్రేయ శతకములో చెప్పబడినట్లు మాయా బ్రహ్మము రెండూ ఒకటేగాని వేరుకావు. ఒక్కటేనని. విచారణ చేసినవారికి అనుభవమే. ఈ సదద్బ్రహ్మము మాయయే యగును. దానిని తెలియనేరనివారికి దాని కతీతమగు పరిపూర్ణ బ్రహ్మ మెట్లు తెలియబడును?

2) విత్తమః = బాగుగా తెలిసినవాడు. విత్ అను దాతువునకు తెలియుట అని అర్థము. తెలియుట. మూడు రకములు 1) వినుట వలన గాని, చదువుట వలనగాని తెలిసికొనుట 2) తనకు తానే విమర్శించి వివేకముతో బుద్ధి నిశ్చయము పొందుట 3) అపరోక్షసాక్షాత్కారము చెందుట అనగా ఆ వస్తువుతో తాదాత్మ్యము చెంది తనకన్న అది భిన్నము కాదనీ అభిన్నమనీ ఆరూఢత చెందుట. దీనినే ఆత్మ నిశ్చయ రూప జ్ఞానమని అనవచ్చును. ఈ శ్లోకములో "సాక్షాత్ సదసద్బ్రహ్మ విత్తమః" అని ప్రయోగము చేయబడుటచేత, వినుట చదువుట వివేకముతో బుద్ధి నిశ్చయం పొందుట అను అర్థములు పరాస్తములగు చున్నవి. అపరోక్ష సాక్షాత్కారానుభవము పొందిన ఆరూఢ స్థితియే వుపలక్షింపబడినట్లు తెలియవలెను. "సఏవ సద్గురు" అనుటలో అట్టి ఆరూఢతగాంచిన మహామనిషియే సద్గురువని యీ శ్లోక ముద్ఘాటించు చున్నది. "బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి" ఆ విధంగా బ్రహ్మమును తెలిసిన అతడే బ్రహ్మము అగుచున్నాడని. యుతరత్రా కూడా చెప్పబడినది.

3) స్థానాని సర్వాణి : అన్ని స్థానములు అని అర్థము. ఐతే యిన్ని స్థానములున్నవా? యని సందేహము కలుగవచ్చును. "వెలుపల లోపల. వెలయ దిక్కుల యందు క్రిందను మీదను సందులందు. ఇక్కడ. అక్కడ నెక్కడ జూచిన ఆత్మ లేకున్నచోటరయలేదు." అని ఆత్మ అభివర్ణింపబడినదిగదా! అట్టి పరమాత్మతో తాదాత్మ్య స్థితి పొందినవానికి యే స్థానము చెప్పవలెను? శుకుడు అరణ్యమార్గమున పోవుచుండగా వెనుకనుంచి తండ్రియైన వ్యాసుడు "ఓహో కుమారా! అని యెలుగెత్తి పిలుచుచుండగా సర్వవృక్ష లతానికుంజముల నుండి "ఓ" "ఓ" అను శబ్దములు ప్రత్యుత్తరములుగా లభించుచుండెనట! సర్వ వ్యాపకమైన ఆత్మ యెచ్చట లేదు? ఐతే "స్థానాని సర్వాణి" అని ఏల చెప్పబడినది? అంటే ఆత్మస్థాన స్వరూపము లెరుగని వారి సాకార దృక్పథములో స్థానములనేకములుగా తోచబడవచ్చునుగదా! ఏ స్థానమందా

తమున్నట్లు? స్థూల దృష్టికి గోచరించినా ఆ స్థానములన్నియు మహాపవిత్రములే యగుచున్నవి. ఎట్లనగా, శ్రీకృష్ణుడు మధురలో బుట్టి, గోకులమందు పెరిగి, బృందావనమున గోపికలతో యమునా నదీతీర సైకతస్థలులలో విహరించి, హస్తినాపురమున రాయబారము సలిపి కురుక్షేత్రములో పార్థసారథియై ద్వారకలో నిర్యాణము చెందెను. ఈ క్షేత్రములన్నియు మహాపవిత్రములుగా భావింపబడినట్లే సదసద్బ్రహ్మవేత్తయైన సద్గురువు పుట్టి పెరిగి, పర్యటించి, వ్యవహరించి, బ్రహ్మైక్యము చెందిన స్థానములన్నియు మహాపవిత్ర క్షేత్రములుగా భావింపదగునని యీ శ్లోకము తెలియచేయుచున్నది.

తన గురు వట్టి మహాత్ముడని భావించి శిష్యుడు గురూపాసన గావించుచుండవలెను. తనయందు విశ్వమందు సర్వత్ర ఆ సద్గురు స్వరూపము నిండియున్నదని ఆత్మదృష్టితో నున్నపుడే తన కెప్పటికైనా ఆ సదసద్బ్రహ్మ వేత్తృత్వము గలిగి ఆరూఢతగాంచును. ఇందుకు అట్టి ఆరూఢ స్థితిలోనున్న సద్గురువు నాశ్రయించి ఆత్మయొక్క స్థాన స్వరూప స్వభావముల గుర్తెరిగి క్రమశః ఆరూఢత గాంచవలెను. ఆ పిదప పరిపూర్ణ బోధచే సర్వభ్రాంతి రహితుడు కావలెను. అంతేగాని వున్న బయలున యెరుకనున్న యని వూహతో గొణిగిన వారి కేమి ఫలము?

పై విధముగా వస్తు నిశ్చయ రూపంగా ఆత్మస్థాన స్వరూప స్వభావములు గుర్తింపజేసి సాకార నిరాకార రూపములలో గోచరమగుచున్న సద్గురుస్వామికివే మా ప్రణామములు.

శ్లో॥ సర్వశుద్ధ పవిత్రో సౌ స్వభావాద్యత్రిష్టతి
తత్ర దేవగణా స్సర్వే క్షేత్రపీఠే చరంతి చ॥

తాత్పర్యము : గురుమూర్తి సర్వపరిశుద్ధుడు అనగా సర్వ వస్తువుల కంటెను పరిశుద్ధ స్వరూపుడును మహా పవిత్రుడును అయివున్నాడు. అట్టి గురుమూర్తి యొక్క పీఠమునందు సమస్త దేవతానీకమును స్థానమేర్పరచుకొని యుంటున్నది.

విశేష వివరణము : బాహ్యాంభ్యంతరములయందు అన్య వస్తువులు ఏమీ చేరకుండా నున్నపుడే ఆ వస్తువు పరిశుద్ధమైనదని చెప్పవచ్చును. ఉదాహరణకు, ఆవు నెయ్యియందు గేదెనెయ్యిగాని మరొక చమురు పదార్థముగాని, చివరకు ఆవునెయ్యి, కాచుటతో సరిగా కాగక చెమ్మ నిలచి పోయినపుడుగాని, దానిని పరిశుద్ధమైన ఆవునెయ్యి అని చెప్పజాలము.

విమర్శించిచూచినచో ఒక్క పరిపూర్ణ పరబ్రహ్మము తప్ప పరిశుద్ధమగునది మరొకట లేదు. తానూ నేనూ అనక ద్విపుటి త్రిపుటులు లేక, సంకల్పముగాని సంకల్పించు తెలివిగాని, పంచతన్మాత్రలుగాని, త్రిగుణములుగాని, కర్తృత్వ కారయితృత్వములుగాని లేశమైననులేక నిండి నిబిడీకృతమైయున్నందున అది యొక్కటే నిరపేక్షక పరిశుద్ధమైన వస్తువు. కానీ ఈ శ్లోకమునందు గురుతత్వము సర్వశుద్ధముగానూ మహా పవిత్రముగానూ వర్ణింపబడినది. అన్నిటికంటెను పరిశుద్ధము అని అభివర్ణించినపుడు అన్యపదార్థ స్మరణ యున్నందున అది సాపేక్షక పరిశుద్ధ వస్తువే యగును గాని నిరపేక్షకమైన పరిపూర్ణ పరబ్రహ్మముకాదు. పరమాత్మయె గురుతత్వము. ఆ పరమాత్మ ఒక స్థితి యందు పరిశుద్ధముగా నున్నట్లు గానవచ్చిననూ, మిగతా స్థితులన్నిటి యందునూ మలినత్వము చెందియేయున్నది. ఎట్లనగా, సృష్టికి పూర్వము, సృష్టి బీజములను తనయందు నిగూఢముగా గర్భీకృతము చేసుకొని తానుతానై అచల స్థితియందున్నపుడు మాత్రము నిరపేక్షక శుద్ధత్వము కలదానివలె తొచబడుచున్నది. కానీ సృష్టికామన కల్గిన ప్రథమస్పందనమందే అది వికారము చెంది పరాపరాప్రకృతులుగా

పరిణమించి మలినమై జీవేశ్వర జగత్తుకు కారణభూతమగుచున్నది. కనుక ఈ పరమాత్మ శుద్ధాశుద్ధములను ద్వంద్వ లక్షణములుగలదై యున్నది. ఒక పరమాత్మయే నిస్సంకల్పస్థితియందు శుద్ధమై సంకల్ప స్థితియందు అశుద్ధమై తనయందలి జీవేశ్వరజగత్తును ఆవిర్భావ తిరోభావములు చెందించుచున్నది. నిర్గుణ మనగా గుణములను బీజరూపంగా తనయందు గర్భీకృత మొనర్చుకొన్న స్థితిమాత్రమే అని యిదివరలో చెప్పితిమి. అట్లే యిది శుద్ధ మన్నపుడు మలిన రూప సంకల్పాదులను తనయందు బీజరూపంగా యిముడ్చుకొనియున్న స్థితియని తెలియవలెను.

ప్రకారాంతముగా దీనిని చెప్పవలెనంటే. యీ పరమాత్మ (గురుతత్వము) స్వరూప లక్షనము నందు శుద్ధము తటస్థ లక్షణమునందు అశుద్ధము (మలినము) అని చెప్పనగును. ఈ ద్వయలక్షణములు ఆ పరమాత్మకు సహజము స్వాభావికము అయివున్నవేగాని అన్యవస్తు సంపర్కములవలన కల్గిన లక్షణములుగావు.

"ఏకమేవాఽ ద్వితీయం బ్రహ్మ" అని శ్రుతి చెప్పుచున్నపుడు ఇక అన్యవస్తు వేమున్నది. "మాయా" అనేది ఒకటి. లేకనే తోచి ఆ బ్రహ్మమును ఆవరించి దానిని వికారపరచగా దానికి మాయాకబళిత బ్రహ్మమని పేరు వచ్చినదిగానీ నిజంగా పరమాత్మ యెప్పుడును పరిశుద్ధుడే యని కొందరనవచ్చును. కానీ లేని మాయవున్న బ్రహ్మమును యెట్లు మలినపరచగలదు? ఇంతవరకు ఆ మాయ ఆబ్రహ్మమునందే తోచినదా లేక అన్యదేశమున తోచినదా? అన్యదేశమున తోచినదంటే ఆ బ్రహ్మమున కేక దేశియత సిద్ధించును కనుక బ్రహ్మమునందే తోచిన దన్నారు. తోచే లక్షణము బ్రహ్మము నందుంటేనే తప్ప దానియందెట్లు తోచును? కనుక మాయ దాని కార్యములు అన్నియు బ్రహ్మము యొక్క స్వగత భేదరూపమగు స్వభావ లక్షణములే అని అనాలి. అపుడు శుద్ధత్వ మలినత్వములు రెండూ ఆపరమాత్మకు స్వాభావికములే. స్ఫటిక సాన్నిధ్యమందు ఎరంగు పువ్వు వుంచితే ఆరంగే స్ఫటికము వహిస్తుంది. ఆ విధముగా తాను గానటువంటి అన్యవస్తు సంపర్కమున. లేక సాన్నిధ్యమున. పరమాత్మ మలినమగుటలేదు. తనలోని గుణదోషములచేతనే తాను సర్వవికార ఆకార ఆకృతులను వహించుచున్నది.

గురుపీఠమునందు సమస్త దేవతానివహము వసించునది యీ శ్లోకము యొక్క ముఖ్యాభిప్రాయము. గురుతత్వము సర్వవ్యాపకమైన పరమాత్మకంటె భిన్నంగాదు కదా! సర్వవ్యాపకమైనదానికి వేరే పీఠ నిర్మాణమేల?

శ్లో॥ కిమావాహన మవ్యక్తే వ్యాపకే కింవిసర్జనం
అమూర్తాచ కథం పూజా కథం ధ్యానం నిరామయే॥

అని గురుగీతయందలి మరొక శ్లోకముద్ఘాటించుచున్నది. నిర్గుణ నిరాకార వస్తువుయొక్క వుపాసన అసాధ్యము కనుక గురుపీఠ ప్రతిష్ఠ అవసరమైనది. అది గురుతత్వమున కొక ప్రతీకమే. ఉపాసనా సౌలభ్యమునకై ఏర్పరచబడినది. గురుతత్వమునందే సమస్త లోకములు సర్వదేవతలు సమస్తాపాధులు నున్నవి. గురుపీఠము గురుతత్వమునకు ప్రతీకమైనపుడాయా లోకములు. లోకేశులు. లోకస్థులు అందరు గురుపీఠమునందు నివసించియున్నట్లే. మరిన్నీ

శ్లో॥ గురోఃకృపా ప్రసాదేనవ బ్రహ్మ విష్ణు మహేశ్వరాః
సామర్థ్య భజన స్సర్వే కేవలం గురుసేవయా॥

అనగా త్రిమూర్తులు గురుసేవచేతనే సామర్థ్యము పొందిరి అని చెప్పబడినది కనుక త్రిమూర్తులు

సహా సర్వలూ తెలిసినా తెలియకున్నా ఆ గురుపరమాత్మనే ఆరాధిస్తున్నారు. "వైకుంఠ కైలాసాదులయందు ఆయా లోకేశ్వరులను పరివేష్టించి పరివార దేవతలున్నట్లే గురుతత్వము నందు త్రిమూర్త్యాది ముఖ్యదేవతలే పరివేష్టించి ఆ గురుతత్వమును సేవించుచుందురు. సర్వదేవాలయ నిర్మాణములయందు సర్వదేవతా ప్రతిష్ఠాదులయందు శివకేశవాదులతోపాటు వారి వారి పరివార దేవతలు కూడా ప్రతిష్ఠింపబడుదురు కదా! అట్లే గురుతత్వము నాశ్రయించి సేవించు ముఖ్య దేవతానీకమంతయు గురుతత్వముతోపాటే గురుపీఠమునందు ప్రతిష్ఠింపబడినట్లే అగుచున్నది. ఇక్కడ సహజముగా నొకశంక రావచ్చును. సర్వవ్యాపకమగు గురుతత్వమునందు సకల దేవతానీకమున్నట్లే యక్ష రాక్షస భూతాదులును వుండునుగదా! అవియును గురుపీఠమును ఆశ్రయించి యుండునా? అని అంటే గురుతత్వోపాసనగావించు భక్తుడు గురుకృపా సంసిద్ధిని మాత్రమే ఆసించును. యితరాపేక్ష నేమియు నాతని కుండదు. వుండెనేని అట్టి కోరికలన్నియు నెరవేరుననుటలో నెట్టి సందియములేదు. కానీ అతని ఆధ్యాత్మికోన్నతి కుంటుపడును. ఏపక్షంలోనూ భూతప్రేతాదులిచ్చు క్షుద్రమహత్తుల నాతడెన్నడూ ఆశించడు. ఆసించినచో అవియును లభ్యమగునుగాని అతడాధ్యాత్మికవికాసము పొందలేడు సరిగదా అధఃపతనము చెంది తీరును. గురుభక్తుడు గురుకృపాప్రసాదసిద్ధిని తప్ప యితరము నపేక్షించక నిష్కామభక్తితో గూరూపాసన కావించునేని అతడు కోరకనే అన్ని శుభములు అతనికి కల్గుచూనే వుండును. అంతేగాక హరిభక్తి అంతఃకరణమున ఘనీభవించిన ప్రహ్లాదకుమారునికి

ఆ॥వే॥ సద్గుణంబులెల్ల సంఘంబులై వచ్చి
అసురరాజత నయునందు నిలచి
పాసి చనవు విష్ణు బాయని విధమున
నేడు దగిలియుండు నిర్మలాత్మ॥ అని చెప్పబడినట్లే

నిజమగు గురుభక్తుని అంతఃకరణము సకల కళ్యాణ గుణాకారము కాగలదు.

గురుతత్వమునందు సర్వము యిమిడియే యుండును. గనుక ఊర్ధ్వ అధోలోకము లతోపాటే దుష్టగ్రహములు భూతప్రేత పిశాచాదులును వున్నమాట నిజమేగాని. గురు పీఠమునందు మాత్రమా భూత ప్రేత పిశాచాదులకు స్థానముండదు. వెలుగున్నచోట చీకటి యుండనట్లు శుభగ్రహములు. దేవతామూర్తులు నిలచినచోట భూత ప్రేతాదులు నిలువజాలక పలాయనము చిత్తగించును.

ఏ దేవతామూర్తిని ధ్యానించి ఆహ్వానిస్తే ఆ దేవతామూర్తియే నడుదెంచునుగాని అన్యులు రారుగదా! గజేంద్రుని కుయ్యాలించి. సంరంభముతో. వున్నవాడున్నట్లే నడుదెంచు శ్రీమహావిష్ణు వెన్నంట.

సు॥ తనవెంటఁ సిరి. లచ్చి వెంట నవరోధవ్రాతముఁ దాని వె
న్కను బక్షీంద్రుడు వాని పొంతను. ధనుః కౌమోదకీ శంఖ చ
క్రనికాయంబును. నారదుండు. ధ్వజినీకాంతుండు. దావచ్చి రొ
య్యన వైకుంఠపురంబునఁ గల్గు వారాబాలగోపాలమున్॥

అని శ్రీమద్భాగవతమున వర్ణింపబడిన విధంగా శ్రీమహావిష్ణువు (సర్వవ్యాపకోవిష్ణుః) దిగివస్తే. అతనితోపాటు వైకుంఠవాసులాబాలగోపాలమే వచ్చిరి గాని దుష్టులగు రాక్షసాదులు వచ్చిరా!

అట్లే గురుభక్తుడు గురుతత్త్వమును ధ్యానించి తదుపరి ఆహ్వానిస్తే గురుతత్త్వమందలి సమస్త దేవతలు రాగలరుగాని భూత ప్రేతపిశాచరాక్షసాదులు రానేరారు.

శివకేశవాది దేవతా విగ్రహములకు దేవాలయ ప్రాకారములు నిర్మించి ఆ నామ రూపముల నుపాసించు భక్తులు ఆ దేవాలయాదులను ఎంతో పవిత్రంగానెంచి అటకేగినప్పుడు ఎంతో పరిశుద్ధులై పవిత్రులై యుందురు. ఆ దేవుని దర్శన పూజాభిషేకములచే తమ పాపపంకిలమును క్షాళన మొనర్చుకొని పవిత్రీభూతులైనట్లు భావించుకొందురు. శివకేశవాది దేవాలయములలో యే ఒక్క దేవాలయమునకైనా యింత పవిత్రత యున్నపుడు సర్వమును యిమిడియున్న గురుపీఠమున కెంత పవిత్రతయుండును? సాక్షాత్పర బ్రహ్మస్వరూపుడైన గురుమూర్తి యొక్క పీఠమును (అందు పరివేష్ఠించిన సమస్త దేవతానీకముతో సహా) అర్చించు గురుభక్తుని అంతఃకరణము ఎంత పరిశుద్ధమైనదీ పవిత్రమైనదీ గావలసి యుండును? కనుకనే శ్రీకృష్ణదేశికేంద్రులవారు తమ కందార్థములలో

శ్లో॥ గురు శుశ్రూష నొనర్చుట నెరిగించెద
నెట్లనిన యేర్పడవినుమా ననులిష్టదైవములకుఙ
పరిచర్య యొనర్చునట్లు భక్తితోడుతనూ
గురుమూర్తి కత్యుక్తితోడుతనూ
నిరతామర మరలేక నీవు సల్పితివేని
గురుబోధ మరుగు సద్గురునిచే దెలసేవు
భక్తితోడుతనూ గురుమూర్తి కత్యుక్తితోడుతనూ॥ అన్నారు

కనుక తన గృహమందునూ గురుపీఠ ప్రతిష్ఠగావించుకొని వుపాసన గావించుట గురుపుత్రుల పరమ ధర్మము. సర్వశుద్ధుడు మహా పవిత్రుడు నగు గురుమూర్తికివే మా నమస్కారములు.

శ్లో॥ గురవోబహవస్సంతి, శిష్యవిత్తాపహారకాః
తమేకం దుర్లభం మన్యే, శిష్య హృత్తాపకారకమ్॥

తాత్పర్యము : శిష్యుని ధనము నపహరించుటకు గురువు లనేకులున్నారు. కాని శిష్యుని హృదయతాపమును చల్లార్చి శాంతి నొసంగగల గురువులు మాత్రం బహు అరుదుగా వున్నారు.

విశేష వివరణములు : 1) గురవోబహవస్సంతి 2) తమేకం దుర్లభం 3) హృత్తాపకారకమ్.

1) గురవో బహవస్సంతి : అనగా గురువు లనేకులున్నారు. వారిని పెద్దలు అష్టవిధములుగా నిర్ణయించినారు అష్టవిధగురువు లెవరనగా:

సూచక గురువు : లోకవ్యవహారం నిమిత్తం లౌకిక జ్ఞానము కల్గించు శాస్త్రములు. విద్యలు అనేకములున్నవి. వానిని బోధించు గురువు సూచక గురువని చెప్పబడుచున్నాడు.

వాచక గురువు : వర్ణాశ్రమముల కుచితమగు ధర్మాధర్మములను విధి నిషేధములను బోధించు గురువు వాచక గురువు.

బోధక. గురువు : పంచాక్షరి. అష్టాక్షరి మొదలగు మహామంత్రములను. ఆయా మంత్రా నుష్ఠాన విధులను బోధించు గురువు బోధక గురువు. పై యిద్దరికంటే యీ గురువు శ్రేష్ఠుడు.

కామ్యగురువు : పుణ్యకర్మల నుపదేశించి యిహపరముల యందు సుఖముగల్గించుగురువు.

నిషిద్ధ గురువు : స్తంభన. మోహన. మారణ. వుచ్చాటన. వశీకరణ. శక్తులు గల్గించు క్షుద్రమంత్రముల నుపదేశించువాడు నిషిద్ధ గురువు. యీ శక్తులులోకమునకు మేలుచేకూర్చునవి

కాక పోవుటయే గాక లోకమునకు హాని కల్గించునవిగానున్నందున యీ శక్తుల్ను గల్గించు గురువు నిషేధింపబడిన గురువే యగును.
విహిత గురువు : యితడు ప్రపంచ సుఖములు అన్నియు అశాశ్వతములనియు, దుఃఖమే పర్యవసానముగా గలవనియు. అవి సుఖాభాసములేగాన నిజమగు సుఖములేదు గనుక వానికొరకు ప్రయత్నించరాదనియు పూర్ణ వైరాగ్యము పూనుడనియు బోధించు ఇతడు విహిత గురువని చెప్పబడును. విశేషమగు హితమును బోధించువాడే విహిత గురువని అర్థము. యిహామూత్రార్థఫల బోగవిరాగమను అధికారి లక్షణము యిట్టి ప్రబోధవలన చేకూరును.
కారణ గురువు : నామ రూపాత్మకమగు కార్య రూప ప్రపంచమును నిషేధించి కారణ వస్తు స్వరూప జ్ఞానమును కల్గించుట కితడు కారణభూతుడుగా నున్నందున కారణగురువని చెప్పబడు చున్నాడు.
పరమగురువు : కారణ వస్తువగు పరమాత్మయే మోక్షస్థానము. ప్రత్యక్బ్రహ్మైకము సాధించుమని ఇతడు వుపదేశించును.
పరిపూర్ణ గురువు : ఆత్మ వస్తువే జీవేశ్వర జగదుత్పత్తికి అత్యంత మూలకారణముగా నున్నందున దానికతీతమగు కేవలాత్మను దెలిపి కారణ వస్తు నిషేధ పూర్వకముగా శాశ్వత జన్మ రాహిత్యమును గల్గించు గురువే పరిపూర్ణ గురువు. ఈతడా అష్టగురువులలోనివాడు కాడు.

ఈ గురువలలో నిషిద్ధ గురువు తప్ప యితర గురువులు లోకమునకు కొంత మేలు చేయువారే. కాని లోక కళ్యానము కొరకు గాక కేవలం తన స్వార్థమునకే అనగా తన పొట్టకూటి కొరకు మాత్రమే గాని అతడు గురుశాసనానుసారము వర్తించలేడు. అట్లు వర్తించిన వానికిగాని హృదయ తాపము నివర్తిగాదు. పై శుభలక్షణములన్నియు గురువునందున్నపుడే అతడు శిష్య హృత్తాపహారకుడు కాగలడు.
హృత్తాపహారకం : హృదయ తాపమును హరించువాడే సద్గురువు : హృదయమునందు శిష్యునికి గల తాపమెట్టిది. ఆధ్యాత్మిక ఆది భౌతిక ఆది దైవిక తాపములని త్రివిధ తాపములు చెప్పబడినది. ఇందు శరీర గత వ్యాధులవలన కలుగు ఆధ్యాత్మిక తాపముగానీ యితర ప్రాణుల వల్ల కలుగు ఆది భౌతిక తాపముగానీ. పంచ భూతాత్మకమగు ప్రకృతి వైపరీత్యముల వలన దుఃఖములుగానీ యిందు చేరవు. మరి శిష్యుని హృదయ తాపము ఏమి? అది యెట్లు కలుగుచున్నది? అంటే పూర్వ జన్మ సుకృత విశేషము వలన మాత్రమే.

శ్లో॥ "జన్మ దుఃఖం, జరాదుఃఖం, జాయాదుఃఖం పునః పునః
సంసార సాగరం దుఃఖం తస్మాత్ జాగ్రత జాగ్రత"

అనే వివేకము మానవునికి గలుగుచున్నది. అట్టి దుఃఖ భూయిష్ఠమైన జన్మ యెన్నటికి లేకుండా పోవలెనని తీవ్రమోక్షాపేక్ష ఆ విమ్మట కల్గి ఏ సాధనచే అట్టి విముక్తి కలుగునా అందుకు తగిన గురువు ఎపుడు లభించునా? యని అతని హృదయము పరితపించుచుండగా సద్గురు సందర్శన మాతనికి లభించును.ఈ భావమునే శ్రీకృష్ణదేశికేంద్రులు.

శ్లో॥ "సాధన సంపత్తియుగల సాధకుడొక నరుడు ఘోరసంసారమునఙ్
బాధపడలేక తనపుణ్యోదయమున గురునిగాంచి................"

అనే కందార్థములలో వెల్లడించినారు. ఘోర సంసార బాధనుంచి ఎట్లు ఎవరి సహాయముచే.

యెంత శ్రీఘ్రముగా విముక్తి చెందుదునా అని పరితపించుచుండుటయే శిష్యుని హృదయ తాపము ఒంటరిగా ఘోరారణ్యమున పోవు పాంధునికి పెద్దపులి యెదురైనపుడు దాని బారినుండి యెట్లు తప్పించుకొందునా అని యెంత ఆవెదన కల్గునో, లోతు గురుత్వ మొక వృత్తిగా స్వీకరించినచో వారి వలన లోకమునకు మేలు కన్న కీడే యెక్కువ కల్గును.

1) తమేకం దుర్లభం : ఆదర్శమూర్తి యగు గురువు లభించుట చాలా దుర్లభమని యర్థము. సద్గురువు కుండవలసిన ముఖ్యలక్షణములను గురగీత రెండు శ్లోకములలో నభివర్ణించినది.

శ్లో॥ చాతుర్యవాన్. వివేకీచ ఆధ్యాత్మ జ్ఞానవాజ్ శుచిః
మానసం నిర్మలం యస్య గురుత్వం తస్య శోభతే

శ్లో॥ గురవో నిర్మలాశ్శాంతాః సాధవో మితభాషిణః
కామక్రోధవినిర్ముక్తాః సదాచార జితేంద్రియాః॥

(1) చాతర్యం అనగా ఏ శిష్యుని కెట్లు బోధించిన అతనికి బోధ సులభంగా అతుకగలదో గుర్తించగల నేర్పరితనము.

(2) వివేకం వస్తుస్వరూపమును వున్నదున్నట్లుగా గ్రహించి విచక్షణాబుద్ధితో విభాగించి తెలిసికొనే తెలివి.

(3) ఆధ్యాత్మజ్ఞానవాజ్ = తత్వపరిశోధనచే ఆత్మతత్వమును సాక్షాత్కరించుకొన్నవాడు

(4) శుచిః= ఎల్లపుడును అంతఃకరణ పవిత్రత గల్గి పాపచింతన లేనివాడు

(5) మానసం నిర్మలం = మలవిక్షేప ఆవరణ దోషములు లేని శుద్ధాంతఃకరణ కలిగినవాడు

(6) శాంతః = చిత్త క్షోభములేనివాడు

(7) మితభాషి = లోక శ్రేయోదాయకములగు వాక్యములు పల్కుచు ఇతర విషయముల మౌనము వహించువాడు.

(8) సదాచారః = ఆచరణ యందు త్రికరణశుద్ధితో గూడిన ప్రవర్తన గలవాడు.

(9) జితేంత్రియాః = శబ్దాది విషయముల కాశపడనివాడు. యిత్యాది శుభలక్షణము లన్నియు నున్నవాడే సద్గురువు. యిట్టి గురువే శిష్యుల హృదయ తాపమును నివృత్తి చేయగల్గును. యిట్టి లక్షణము లన్నియు నుండిననే శిష్యుడాతనిని దైవ స్వరూపునిగా యుపాసింపగల్గును. అపుడేగాని గురువాక్యమునందు శిష్యునికి గురి (లక్ష్యము) నమ్మకము కుదరదు. అపుడు నీటలో పడిపోయి. యీతచేతగాక. మునిగిపోయి వుక్కిరి బిక్కిరగువానికి ప్రాణరక్షణకై యెంత ఆవెదన కల్గునో. నలుదిశల నిప్పంటుకొని మండిపోవుచున్న యింటిలో చిక్కుబడి బయటికి పోవు మార్గము లేక యున్న వానికెట్లు ప్రాణము రక్షించుకొందునా యని యెంత తహ తహ హృదయమున కల్గునో అట్లే సంసార ఘోరవారాశినుండి తప్పించుకొనవలెనని తహ తహ కల్గుటయే సచ్ఛిష్యునకు గల హృదయతాపము. ఈ తాపము నుండి రక్షించగల నేర్పరి పైన చెప్పబడిన సమస్త కళ్యాణ గుణ శోభితుడగు సద్గురువే. అతడు శ్రోత్రియ బ్రహ్మ నిష్ఠుడుగా నుండవలెనని శాస్త్ర విధి. శ్రోత్రియ బ్రహ్మ నిష్టుడనగా వేద ధర్మమును చక్కగా గుర్తించి. వాని ద్వారా అనుభవ జ్ఞానమార్జించినవాడని యర్థము. వేద విరుద్ధము గాని సాంప్రదాయక గురుబోధను పరంపరాగతముగ ప్రాప్తింపచేసుకొని అనుభవజ్ఞానముచే తానుస్వయంగా తరించిన

గురువు కూడా శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడే యని చెప్పక తప్పదు. అతడు స్వయముగా నుత్తీర్ణత పొందిన వ్యక్తి కనుక అతడితరులకు తరింపచేయగల సమర్థుడగును. వేదములను తానేచదివి సారము గ్రహించినతప్ప గురువుగా నుండుట కర్హుడుగాడని నిర్ణయింపవలసిన పనిలేదు. ఏలననగా శాసించి రక్షించునదియే శాస్త్రము. కనుక గురు పరంపరాప్రాప్తముగ పరిపూర్ణ బోధను సాధించిన సద్గురువు శ్రోత్రియబ్రహ్మనిష్ఠుడే.

సద్గురుని ధర్మ మేమనగా శిష్యుని హృదయతాపమును నివృత్తి చేయుటయేగాని అన్య విషయములతో ప్రసక్తి లేదు. ఐతే ఆ శిష్యుడు నిజమైన భక్తి ప్రపత్తులు కలవాడై యుండవలెను. యీ విషయమునే శ్రీకృష్ణదేశికేంద్రులు తమ కందార్థములలో కం॥ "హృదయగ్రంథి విడుటకై సదయత యీ బోధ దెల్ప జనదాగురుడై" అని గురు ధర్మమును, "వదలక చిత్తములో గురుపద యుగళము దలపవలదె భక్తుడైనపుడు, భ్రాంతి రహితాసక్తుడైనపుడు" అని నిజశిష్య ధర్మమును సూత్రప్రాయముగా నుద్ఘాటించి యున్నారు.

శిష్యుని హృదయతాప మాతని హృదయ గ్రంథి విడినపుడే చల్లారునని శిష్యుని హృదయ గ్రంథిని ఛేదించు బోధయే గురువు బోధించవలసియున్నదని గుర్తింపవలెను. హృదయ గ్రంథి యేదియో, శ్రీకృష్ణదేశికేంద్రులే శెలవిచ్చినారు. గ్రంథియనగా ముడి. "ముడిబడి కర్మము జ్ఞానము" అనే కందపద్యములవలన కర్మ జ్ఞానముల ముడియే హృదయ గ్రంథియని చెప్పనగును. గుర్తెరుగకుండా యెవరున్నూ యే కర్మ యున్నూ చేయరుగదా! కనుక కర్మజ్ఞానములలో జ్ఞానమే ప్రధానమైనది. కర్మ రాహిత్యము సిద్ధించినా, జ్ఞానము శేషించినచో తిర్గి కర్మ జరుపుటయు కర్మ వాసనలంటుటయు జన్మ యెత్తుటయు జరుగుచుండును. కనుక గుర్తెరిగే జ్ఞాన రాహిత్యము చేయగల పరిపూర్ణ బోధ గురువే హృదయ గ్రంథిని ఛేదించి శిష్య హృత్తాపమును హరించగల సమర్థుడు, పైన తెలియపర్చిన శుభ లక్షణములు గల పూర్ణ గురువు లభించవలెనన్న నిజముగా దుర్లభమే. అట్టి గురువు పూర్వ జన్మ సుకృత ముండినవారికే లభించును. అట్టి గురువు లభించెను గదా! మేము ధన్యులము. మాకిక జన్మరాహిత్యస్థితి కరతలామలకమైయున్నది అని వుప్పొంగుచు వూరకొనక "వదలక చిత్తములో గురుపద యుగళము దలపవలదె?" అను హితోక్తిని విస్మరించక "జలము నెడబాయనొల్లని జలచరముల రీవి బూని సచ్ఛిష్యుడు హృజ్జంజంబను పీఠముపై నిలిపి యితరము మాని గురువునే కొల్చు సుమ్మీ తదూక్తులనే తలచు నమ్మీ" అను రీతిగా పట్టుదలతో కృషి చేసినపుడే గురుకృపా సంసిద్ధికల్గి అతని హృదయ తాపము నివృత్తి కాగలదు.

యిట్టి దివ్య ప్రబోధను మా కనుగ్రహించి అనుష్ఠానాచరణల యందు మమ్ము నిష్ణాతులను గావించి మా హృదయతాపమును చల్లార్చు చున్న మా గురుదేవుల దివ్య శ్రీ చరణముల కివే మా నమస్సుమాంజలులు.

శ్లో॥ గురుబుధ్యాఽఽ త్మ నోనాన్యత్ సత్యం సత్యంవరాననే
తాల్లా భార్థం ప్రయత్నస్తు కర్తవ్యశ్చ మనీషిభిః॥

తాత్పర్యము : గురుతత్వజ్ఞానముచే ఆత్మకంటె భిన్నమైన సత్యమేదియు లేనేలేదనే ధృఢనిశ్చయ జ్ఞానము కలుగగలదు. కనుక వివేకులైన పండితులు గురుతత్వమును తెలుసుకొన ప్రయత్నించుట ముఖ్యకర్తవ్యమైయున్నది.

విశేష వివరణములు : 1) గురుబుద్ధ్యా 2) నాన్యత్ సత్యం 3) తల్లా భార్థం 4) కర్తవ్యం

1) గురుబుద్ధ్యా : గురుబుద్ధిచే అని అర్థము. గురుబుద్ధి అనగా వివిధ నామరూప క్రియానటనలు గల సమస్తము గురుస్వరూపమే అనుధృఢ భావనయే గురుబుద్ధి. యీ దిగువ శ్లోకములను విమర్శిస్తే యీ విషయం స్పష్టమౌతుంది.

1)శ్లో॥ దేహబుద్ధ్యాతు దాసోహం, జీవబుద్ధ్యాత్వదంశకః
ఆత్మ బుద్ధ్యా త్వమేవాహం, యితిమే నిశ్చితామతిః॥

అనగా నేను దేహమునే అను భావన చేస్తే నేను పరమాత్మకంటె భిన్నుడనన్న మాట. యిట్లనుటలో ఆ పరమాత్మకు నాకు గల సంబంధము స్వామి బృత్య సంబంధము కాగలదు. అపుడు నేను ఆ పరమాత్మకు దాసుడనే అగుదును. నేను జీవుడ ననుకొంటే ఆ పరమాత్మతో నాకు గల సంబంధము అంశాంశీభావనసంబంధము. అనగా ఆ పరమాత్మలో నేనొక అంశమును అట్లే యితర జీవులన్నియు ఆ పరమాత్మయొక్క అంశములే నేను దేహముగాను, నేను ఆత్మనే, ఆత్మయేనేను అను భావననాకువుంటే నేనే అఖండాత్మస్వరూపడును కాని వివిధావరణములు జీవులను పరమాత్మ నుండి వేరుపరచుచున్నవి. ఇది అభేధదృష్టి. ఇదే ఆత్మదృష్టి, అద్వైతము యొక్క పరాకాష్ట ఐతే జగత్తుమాట ఏమిటి? జగత్తు మిధ్య అన్నారు కొందరు. కానీ సర్వదృశ్యాదృశ్య ప్రపంచము కూడా ఆత్మయే లేక బ్రహ్మమే యనుట వుత్తమ భావన "ఆత్మనోన్యం నకించన" "బ్రహ్మణోన్యం నకించన" అని శ్రుతులు పల్కుచున్నాయి. యీ శ్రుతులకు ఆత్మ లేక బ్రహ్మమున కన్న వుండే సమస్తము లేనిదే, మిధ్యారోపితమే అను అర్థము చెప్పుట మొదటి వాదము. "యద్యత్పశ్యతి చక్షురాభ్యాం తత్తదాత్మేతి నిశ్చయా..........." "సర్వం మదయ మాత్మా" "బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠం" ఆత్మకన్యంగా తోచబడే దంతాకూడా ఆత్మయే అని రెండువాదములు. రెండవది మిక్కిలి వుదాత్తమైనభావము. ఈ రెండవ వాదమునే అచల ఋషులంగీకరింతురు. ఏలననగా

శ్లో॥ ఆత్మబుద్ధిస్సుఖంచైవ, గురుబుద్ధిర్విశేషతః
పరబుద్ధిర్వినాశాయ స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః॥

అను శ్లోకమునకు న్యాయమైన సబబైన అర్థము గ్రహించాలంటే ఒక్క ప్రశ్న వేసుకొంటే సరిపోతుంది. దేనియందు యీ బుద్ధులుంచాలి అను ప్రశ్నకు "విశ్వమునందు" అని జవాబు చెప్పుకొంటే న్యాయమైన అర్థము ఈ శ్లోకమునకు లభించును. విశ్వమును ఆత్మదృష్టిచే చూస్తే సుఖమే. విశ్వము గురుస్వరూపమే అనుభావన యింకనూ విశేషం. విశ్వము, నేనైన ఆత్మకంటె పరము (భిన్నము) అనుకొంటే వినాశమే విశ్వము, స్త్రీ వలె తనకు లోబడి తన అదుపాజ్ఞలలో నుండవలెనని ఆశిస్తే ప్రళయమే సిద్ధించును అని వ్యాఖ్యానించుట మిక్కిలి న్యాయం. ఈ భావనలో ఆత్మబుద్ధికంటె గురుబుద్ధి విశేషమని చెప్పుటకు కారణమేమి? విశ్వమే నేననుకొనుటలో సుఖముకల్గును. అంటే విశ్వము నాతో సమానముగా ప్రేమాస్పదమగును కానీ గురుబుద్ధిచే విశ్వమంతయు గురువువలె పూజనీయమే కాగలదు. గురుబుద్ధియుంచుటలో యిదియే విశేషము. కనుక తానూ తనకుతోచు విశ్వమూ రెండూ కూడా గురుస్వరూపమే అని భావించుటయే గురుబుద్ధి.

2) నాన్యత్ సత్యం = యితర సత్యం అని అర్థము ఆత్మకు వినాయితర సత్యము లేదు అని అంటే జగత్తుమాటయేమి? అని శంక జీవజగత్తులు పరమాత్మకు శరీర భూతములు అని విశిష్టాద్వైతవాదము దేహిసత్యము, దేహము అసత్యం అని అద్వైతుల తొలిభావన. కానీ

"యధా మృణ్మయో కుంభం తద్వత్ దేహోపి చిన్మయః" అనిన్నీ జగత్తుకూడా ప్రవాహరూపంగా సత్యమే అనిన్నీ ఆదిశంకరులే అన్నారు. నదీప్రవాహములోని జలము ప్రతిక్షణము సముద్రము చేరుచున్నను అట్లుపోవు జలముస్థానే కొత్త నీరు వచ్చి ఆక్రమిస్తూ వున్నందున మొత్తం నదీ ప్రవాహదృష్ట్యా జీవనది సత్యమైయై వున్నది. అట్లే క్షణక్షణపరిణామశీలమగు జగత్తు మారిపోవుచున్నను ఆది మధ్యాంతములయందు అనుస్యూతమైయుండి అనువృతార్థముగా నుండు వస్తువేదో ఒకటున్నందు వల్ల ఆ దృష్ట్యా ఆత్మకారణభూతముగానుండు జగమున్నూ సత్యమే అనాలి. ప్రతిదశయందునూ ఆత్మకావరణమై యొకటుంటూనేయున్నది. అది అవిద్యావరణమో విద్యా (మాయా) వరణమో లేక ప్రకృత్యావరణమో కావచ్చును. ఆత్మతోపాటు దాని యావరణము కూడా సత్యమే అయి వుండి రెండు రూపములుగా ఆత్మయే గానవస్తూవున్నది. ఆత్మ ఏకరూపద్వంద్వ వస్తువు లేక ద్వంద్వ రూప ఏకవస్తువుగా నున్నది. అయితే యిక అసత్యమేది. సత్యాసత్యములు సాపేక్షిక శబ్దములుకదా అని శంకింపవచ్చును. నిజమే ఐతే ఆత్మయే సత్యము అసత్యముగూడనై యున్నది. ఎట్లనగా తనయందు తానుసత్యమే. కానీ ఆ ఆత్మయే పరిపూర్ణ పరబాహ్యమునందు అసత్యమైయున్నది. యీశ్లోకమునందు ఆత్మయొక్క సత్యత్వము మాత్రమే యుద్ఘాటింపబడినది అనిగ్రహింపవలెను. లేక ఆత్మయందలి స్వగత భేదములు అసత్యం ఆత్మయొక్క వికారరూపములు కనుక అవి అసత్యములనియు నిర్వికారరూపంలో (స్వస్వరూపంలో) నున్న ఆత్మయే సత్యము అనియు చెప్పుట యగును. "వాచారంభణం వికారో నామధేయం మృత్తకత్యేన సత్యం" మట్టియే సత్యము. పృద్వికారములగు ఘటశరీరాదులసత్యములు అనిచెప్పినట్లన్నమాట. కారణము సత్యం, కార్యము లసత్యములు అనుకొన్నట్లుమాత్రమే. కార్యకారణ సంబంధములో ఏ ఒక్కటియైననూ సత్యమై రెండవది అసత్యమగునా? సూక్ష్మదృష్టిచే పరికించిన రెండూ సత్యములే రెండూ అసత్యములే ఈ శ్లోకమునందు రెండూసత్యములే అని ప్రతిపాదించినట్లు యెంచవలసియున్నది.

యీ శ్లోకంలో సత్యం సత్యం అని రెట్టించి చెప్పినారు. కారణ మేమియని యించుక విచారించనగును. "ప్రాణోవైసత్యం" అవస్థాత్రయమందునూ ప్రాణము అనుస్యూతమైయున్నది. అట్లే సృష్టి స్థితిలయములందునూ "ప్రాణోవై సత్యం" అని ఆత్మ తురీయావస్థ యందునూ కలదు అది యింకనూ సత్యమైయున్నది. యిన్ని సత్యములుండజాలవు. సత్యమొకటే. అసత్యము లనేకము లుండవచ్చును. పరిపూర్ణ పరబాహ్యము సత్యమా లేక అసత్యమా? అది సత్యాసత్యములు రెండూకాదు దానికి వినా రెండోదేలేదు. కనుక సాపేక్షికములగుటయే ద్వంద్వములందునూ దానిని చేర్చరాదు. ధృడత్వము కొరకే సత్యం సత్యం అని రెట్టించి చెప్పడమైనది అని గ్రహించవలెను. కనుక యీ శ్లోకములో ఆత్మకంటే నిత్యవస్తువు మరొండు లేదు అని సిద్ధాంతీకరించబడినది.

3) తల్లాభార్థం = అది లభించుటకొరకు, లేక అది ప్రాప్తించుటకొరకు అని అర్థము. ఏది లభించుటకొరకు? గురుబుద్ధి లభించుట కొరకా? ఆత్మలభించుటకొరకా? ఏది లభించుటకొరకు ప్రయత్నించుట కర్తవ్యమై యున్నది? ఆత్మ లభించుట కొరకుకాదు ఏలననగా, యిది వరకు లేనిదై యిపుడు క్రొత్తగా ఆత్మ లభింపవలసినపనిలేదు. మనకు తెలిసినా తెలియకున్నా అది లభించియేయున్నది. అది నిత్యప్రాప్తమై యున్నది. దానిని క్రొత్తగా

కర్మ, భక్తి, యోగ, జ్ఞాన మార్గములచేతనో మరో మార్గం చేతనో సృష్టింపవలసిన పనిలేదు. కానీ, అది తెలియబడుట లేదు. కనుక దానిని ప్రాప్త ప్రాప్తవ్యము అని శాస్త్రములు పేరిడినాయి. "కంఠచామీ కరవత్" అని దృష్టాంతమీయబడినది. అనగా తన కంఠసీమయందేవున్న కంఠహారము పోయినదని అనుకొని దానికొరకు వెతుకులాడినట్లు, తనయందూ నిఖిలభూతములందునూ లోపలా బైటానున్న ఆత్మోపలబ్ధికై అన్వేషించుటయూ నట్టిదే. కానీ ఆ జ్ఞానోపలబ్ధికలుగవలెనన్న గురుబుద్ధి అవసరం. ఇది గురుకృపలేక కలుగజాలదు. గురూపదిష్ఠ మార్గమందు పయనించిన గాని ఆ గురుకృపా విర్భావము కాదు. అపుడుగాని "సర్వంయదయమాత్మా" అను అఖండాత్మోపలబ్ధి కలుగదు.

4) కర్తవ్యం = మానవుడై పుట్టినందుకు స్వరూప సాక్షాత్కారము పొంది చివరకు భ్రాంతి రహిత స్థితిని సాధించుటయే కర్తవ్యము. పుట్టినందుకు సార్థకము మరల పుట్టకుండా చేసుకొనుటయే గురుభక్తి. గురుసేవ, గురుని నిష్ఠ కల్గి గురువు సూచించిన వస్తువునందు ఆరూఢస్థితిని సాధించుటయే గురుబుద్ధి ఒక్క మానవోపాధియందే యిందుకు తగిన పరికరములు ప్రసాదింపబడినవి. ఇట్టి వుపకరణములు తన కర్తవ్య సాధనయందు వినియోగించనిచో అతడు మానవపశువేయనవలెను. "ఇహచేదవేదీర్థ సత్యమస్తి, నచేదిహావేదీన్మహతీవినష్టిః" అనగా ఈ శరీరమందు యిపుడే మానవ సార్థకమగు ఈ కర్తవ్యమును సాధించనిచో గొప్ప నష్టము పొందినవాడగుచున్నాడని భావము అందుచే మానవులమై పుట్టుటయే గాక గురుచరణము పట్టిన మనమందరము గురుకృపావిర్భావమునకై గురూపాసన యెంతమాత్రము ఏమరకుందుముగాక!

శ్లో॥ గురుపాదోదకం పానం, గురోరుచ్ఛిష్ఠ భోజనం
గురుమూర్తేః సదాధ్యానం, గురుస్తోత్రం సదాజపః॥

తాత్పర్యము : గురుపాదోదకమును త్రాగుచుండవలెను. గురూచ్ఛిష్టమును భుజింపవలెను. ఎల్లప్పుడును గురుస్వరూపమును ధ్యానించుచుండవలెను. ఎల్లప్పుడును గురుస్తోత్రమును జపము చేసికొను చుండవలెను.

విశేష వివరణము : (1) పాదోదకము (2) ఉచ్ఛిష్ఠము (3) మూర్తి ధ్యానము (4) స్తోత్రజపము అను నీ నాలుగు శబ్దముల వాచ్యార్థ లక్ష్యార్థములను వివరించి తెలిసికొనవలసియున్నది. గురుపుత్రునికి ఈ నాలుగును అవశ్యకర్తవ్యములుగా ఈ శ్లోకము విధించు చున్నది. ఈ మాటలకు కేవలము బాహ్యార్థమునే గ్రహించి సాంప్రదాయ గురుధర్మమును అవహేళన చేయు ప్రబుద్ధులు చాలా మందికలరు. తీర్థ ప్రసాదములవలన శిష్యులకు ఎట్టి లాభము చేకూరగలదో గురుపుత్రులే కాక యితరులును తెలిసికొనుటమంచిది. గురుసాంప్రదాయమును నిందించి పాపము మూటకట్టు కొనకుండా చేయుటకై కొన్ని గురుగోప్య విషయములను వెల్లడించుచున్నందుకు పెద్దలు క్షమింతురుగాక!

1) పాదోదకము వాచ్యార్థము : తనకు మంత్రోపదేశము చేసి ధర్మమును ప్రభోదించిన గురుదేవుని పాదములను ప్రక్షాళనచేయగా జాలువారిన ఉదకదార.

శ్లో॥ వందే గురుపదద్వంద్వం వాఙ్మనోతీత గోచరం
శ్వేతరక్త ప్రభాభిన్నం శివశ్శక్త్యాత్మకంపరం॥

లక్ష్యార్థము : అని గురుగీతయే గురుపాదముల జంటను శివశక్తి స్వరూపములుగా

అభివర్ణించినది. గురుస్వరూపము ( అనగా పరమాత్మ స్వరూపము) శివశక్తి రూపములుగా రెండు గోచరించుచున్నది. ఈ రెండూ భిన్నమా? అభిన్నమా? భిన్నమంటే అద్వైతహాని. మరిన్నీ ఆ శక్తి ఎవరిది? అని ప్రశ్నిస్తే అది పరబ్రహ్మ శక్తేనని చెప్పక తప్పదు. శక్తుని (శక్తి గలవాని) కన్న శక్తి భిన్నమని అనరాదు. అవి చంద్ర చంద్రికాన్యాయంగా అవినాభావసంబంధము కల్గియున్నవి. రెండుగా తోచబడినా, ఆ రెండూ పరమాత్మయొక్క రెండు రూపములే అని అంటే, ఎట్టి విప్రతిపత్తిన్నీ ఉండజాలదు. పరమాత్మయే గురుస్వరూపము. ఆ శివశక్తులు (పురుష ప్రకృతులు) రెండును గురుపాద ద్వంద్వమని అభివర్ణింపబడినవి.

పరమాత్మ (లేక గురుస్వరూపము ) : అట్టి ద్వంద్వ రూపం యేకవస్తువైనది. ఆ గురుపరమాత్మ నుండి సమస్త విశ్వమును విశ్వశక్తులున్ను ఎడతెగని అనంత ప్రవాహ రూపముగా జాలువారు చున్నవి. "విశ్వైవేదం బ్రహ్మమిదం వరిష్టం" అనగా ఈ విశ్వమంతయు ఆ బ్రహ్మమేనని గుర్తించి అట్టి అఖండ బ్రహ్మానుభవముతో ఈ విశ్వమును భోగించుటే గురుపాదోదకపానము చేయుటనగును. గురుపాదోదక స్నానమునకును గురుపాదోదక పానమునకును ఫలప్రాప్తిలో గల వ్యత్యాసమును గుర్తింపవలసియున్నది. స్నానమనగా పాదోదకమును శిరమున ధరించుట. ఆ జలములయందు పూర్తిగ మునిగినా ఆ జలములకు తాను వేరుగా నున్నానే భావనయే ధృడమైయుండును. కనుక అచ్చట విశిష్టాద్వైత లక్షణమే యున్నది. అద్వైతము సిద్ధించుటలేదు. ఉదకములను పానముచేసిన పిమ్మట అవితనలోనే చేరిపోవుటవలన అవి తనకంటే వేరుగానున్నవి. అనే భావనకుయే మాత్రం తావే యుండదు. ఆ ఉదకములతో తాను (స్థూల శరీర దృష్ట్యానే అనుకోండి) అభేదస్థితిని పొందుచున్నాడు.

శ్లో॥ సప్తసాగర పర్యంత తీర్థస్నాన ఫలం చయత్
గురోఃపాదోథబిందోశ్చ సహస్రాం శేన తత్ఫలం"

అనగా సమస్త తీర్థములలోను స్నానమాచరించుటవలన కలుగు మొత్తము ఫలము గురుపాదోదక బిందువు నొక్కదానిని శిరస్సున ధరించుటతో సమముగాదు. శరీర ఆరోగ్యమునకు నదీ ప్రవాహ స్నానము చెప్పబడినది. జలముయొక్క సూక్ష్మాంశము ప్రాణము. పవిత్రమగు గురుపాదోదక స్నానపానమువలన స్థూల శరీరమగు అన్నమయ కోశమునకే గాక సూక్ష్మ శరీర సంబంధమగు ప్రాణమయ కోశమందలి ప్రాణసత్తా పెంపు అగుచున్నది. "గురుపాదతీర్థంబు గ్రోలక కల్గునే జ్ఞాన విజ్ఞాన యోగానుభవము' అని సీతారామాంజనేయ సంవాదమున చెప్పబడినది. కనుక శిష్యుడట్టి పవిత్ర పాదోదకమును "అజ్ఞాన మూలహరణం జన్మ కర్మనివారణం జ్ఞానవైరాగ్య సిద్ధ్యర్థం గురుపాతోదకంపిబేత్" అను శ్లోకభావమును స్మరించుచూ భక్తితోపాదోదకమును సేవింపవలెను.

"బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి" అనే న్యాయంగా బ్రహ్మవేత్త బ్రహ్మమే కాని అన్యముకాదు. బ్రహ్మ విద్యాగురువు "గురుస్సాక్షాత్ పరబ్రహ్మ" అని పేర్కొనబడినాడు. పాదములు శరీరముయొక్క కొస భాగములగుటచే పాదాంగుష్ఠములనుండి జాలువారిన ఉదకధార ద్వారా గురుదేవుని యందలి ఆధ్యాత్మిక శక్తి ఆ పుణ్యోదక స్నానపానములచే శిష్య శరీరములోనికి ప్రవహించును.

"సాధూనాం దర్శనం పుణ్యం స్పర్శనం పాపనాశనం" అని చెప్పబడినది. గురువుయొక్క దర్శన స్పర్శనములే అంతటి మహిమానిత్వములై యున్నప్పుడు గురునియందలి ఆధ్యాత్మిక

శక్తులను తన యందు నింపించుకొన్న గురుపాదోదకము యొక్క స్నానముల విశేష ఫలమును వేరే వర్ణించనవసరములేదు.

2) ఉచ్ఛిష్టము అనగా "ఎంగిలి" అని నీచార్థము. కానీ తినగా (అనుభవించగా) మిగిలిన దంతయు ఉచ్ఛిష్టమే. అట్లే గురుదైవములకు నివేదన కాబడిన పదార్థమంతయు ఆ గురుదైవముల ఉచ్ఛిష్టమే అనదగును. కానీ అది పవిత్రమైన ప్రసాదమని కీర్తింపబడుచుండును. అనుభవింపగా శేషించిన పదార్థమంతయు నుచ్ఛిష్టమే. ఆబ్దికాదులలో వంటకములన్నియు పితృదేవతలకు నివేదించబడును. భోక్తలు భుజించగా మిగిలినదానికి పితృశేషమనిపేరు. అది పితృదేవతా ప్రాసాదముగా దానిని ఇంటివారందరు భుజింతురు. అది పితృదేవతల ఉచ్ఛిష్టము.

గురుపుత్రుడైనవాడు తనకు భోగ్యమగు సమస్తము గురుప్రసాదము (గురువుచే అనుగ్రహింపబడినది) గానే భావించును. విశ్వమంతయు జీవభోగముకొరకు సృష్టింపబడినదేగదా! అది పరమాత్మ యొక్క ప్రసాదమనే భావనతో ధర్మాతిక్రమణము లేక సచ్ఛిష్యుడు పరమతృప్తితో అనుభవించును. గురుపుత్రుని భావనలో సమస్తము గురుని యుచ్ఛిష్టమే గురుసుప్రసాదమే. "గురోచ్ఛిష్టం జగత్సర్వం" అని చెప్పవలసియే యున్నది. సమస్త వస్తువులయందు, గురుప్రసాదమనే దృష్టియే యుండుటచే, వస్తు సంపాదనలో ఆశాపాశములు లేక యదృచ్ఛాలాభ సంతుష్టి గల్గియుండును.

ఈ అర్థ విశేషములను యేతత్ భావనలను గుర్తించక ఉచ్ఛిష్టమనగా గురువునోట నిడుకొని తిరిగి బయటకు తీసిన యెంగిలి వస్తువే అను నీచార్థమును మాత్రమే గ్రహించి అట్టి ఉచ్ఛిష్టమనే శిష్యుడు కోరుట, గురువు ఇచ్చుట, ఎంత మూర్ఖత్వమో యోచించదగును. అయితే యిక గురుప్రసాదమని దేనిని యెంచవలెను?

దేవునకు నివేదింపబడిన ఆహార పదార్థములు (పళ్ళుపాలు సహా) అన్నియు ప్రసాదమే. అట్లే పరమాత్మ భావముతో గురునికి నివేదించిన సమస్తమును ప్రసాదమే కాగలదు. సమక్షమున ఉన్నప్పుడు శిష్యుడు ఫలోపహారాదులను గురునికి భౌతికముగా అర్పించును. గురువు వానిని గ్రహించి మంత్రపూతము గావించి, తనచేతి వ్రేళ్ల ద్వారా తన శక్తిని ప్రవేశపెట్టి శిష్యుని అభివృద్ధి కోరి అనుగ్రహపూర్వకముగా, అంతాగాని, కొంతగాని, శిష్యునికి తిరిగియిచ్చును. యిదియే గురుసుప్రసాదము. గురువు సమక్షమున లేనిచో యెట్లు? అను ప్రశ్న రావచ్చును.

గురుతత్వము లేనిదెచ్చట? సర్వమూ గురుమూర్తి అనుగ్రహ విశేషముననే తనకు లభ్యమైనదను భావము దృఢమగుట తొలుత కష్టము. తన సర్వస్వము గురుస్వరూపమునకు నివేదించి పిదప దానినే ప్రసాదరూపముగా అనుభవింపుమని గురుగీత ఆదేశించుచున్నది యెట్లనగా.

శ్లో॥ శరీర మింద్రియం ప్రాణం అర్థస్వజనబాంధవాన్
ఆత్మదారాధికం సర్వం సద్గురుభ్యోనివేదయేత్॥

ఇందుపయోగించిన శబ్దము యొక్క అర్థము నివేదించుట అనిన్నీ అర్పించుట కాదనిన్నీ గుర్తించవలెను. లేనిచో విపరీతార్థములకు దారితీయగలదు. నివేదించుట అనగా భావరూపమగు మానసిక క్రియ మాత్రమే. అర్పించుట కాయికక్రియ, నివేదింపబడిన సమస్తమూ గురుసుప్రపాదమే యగుచున్నది. ఆసమస్తమునందూ నాది అను మమకారము నశించుచున్నది. అంతేకాదు, "సర్వం గురు ముఖాల్లబ్ధం" అని చెప్పబడినరీతిగా గురుబోధ యంతయు

గురుని నోటినుండి వెలువడినది. గనుక గురోరుచ్ఛిష్టమే. గురుపరంపరా పురుషుల వల్ల క్రమాను గతముగా యిప్పటికి తనకర్ణపుటములచేరినది. ఆ బోధచే తాము తరించి. తమ్మాశ్రయించిన శిష్యులను తరింపచేయుటకై దానిని అనుగ్రహించుచున్నారు. వారనుభవించి కృతార్థులైరి. ఆ అనుభవించినదే శిష్యుల కిచ్చుచున్నారు. నదియు నుచ్ఛిష్టమే యిపుడు గురూచ్ఛిష్ట భోజన మనగా యేమి. గురువాక్యమును పదే పదే స్మరించుటయే గురూచ్ఛిష్టభోజనము.

గురుపరమాత్మ(నిర్గుణరూపం) జీవభోగముకొరకు నొసంగిన సమస్తమునూ మాత్రమే గాక సగుణరూపంలో ప్రసాదించిన బోధయు, శక్తిపాతదీక్షతో నొసగిన ఫలోపహారాదులునుగూడ గురుసుప్రసాద మేనను పవిత్ర భావముతో సేవించటయే కర్తవ్యము.

ఈ యుచ్ఛిష్ట భోజనము (లేక ప్రసాదభక్షణము) వలన యేమి ప్రయోజనము? "గురుసుప్రసాదంబు గ్రొలకున్న కల్గునే ప్రతిలేని చిత్తోపరతి సుఖంబు"? అని సీతారామాంజనేయ సంవాదమునందు చెప్పబడినది చిత్తము బ్రహ్మాకారమును వహించివుండుట చిత్తోపరతి. యిట్టిశక్తి చిత్తమున కెట్లు లభ్యమగును? తినే దంతయూ అన్నస్వరూపమే. అన్నపు సూక్ష్మాంశము మనస్సునకు సత్తాకలిగించుచున్నది. గురుమూర్తి సంకల్పరూపంగా స్పృశించి దానియందు తనశక్తిని చొప్పించుట వలన పవిత్రీభూతమైన అన్నము మరింత శక్తివంతమై మనోబలమును వేయిరెట్లు అభివృద్ధి చెందించును అట్టి మనస్సు నిర్మలమై సాక్షాత్ జ్ఞేయ బ్రహ్మస్వరూపమే అగుచున్నది.

3) మూర్తి ధ్యానము:- మూర్తి అనగా స్వరూపము. గురుస్వరూపమును వస్తునిశ్చయ రూపముగా గురుముఖతః గుర్తెరిగి ఆస్వరూపమునందు మనస్సును అచంచలముగా నిలుపుటయే మూర్తి ధ్యానము. ధ్యానమువలన మనస్సు తదాకారమును వహించును. తానే గురుస్వరూపము, గురుస్వరూపమే తాను. అనే అపరోక్ష జ్ఞానము సిద్ధించుచున్నది.

4) స్తోత్రజపము:- గురువు సమస్త కళ్యాణ గుణాకరుడు. ఆగుణసంపత్తిని కీర్తించుటయే స్త్రోత్రము. జపమనగా ప్రసంఖ్యాన రూపముగా పదేపదే స్మరించుట.

జపము నాలుగువిధములు:- 1) వైఖరీవాక్కుచే బిగ్గరగా పలుకుచుండుట వాచికజపము 2)ఉపాంశువు అనగా పైకి వినబడకుండా పెదవులు కదలిక మాత్రంగా చేయుజపము 3)మానసికము:- కేవలము మనస్సులోనే స్మరించుచుండుట మానసిక జపము. ఈమూడున్ను శబ్దమును మాత్రమే స్మరించును.నాల్గుగవది "తజ్జపస్త దర్థభావనం" అనగా మంత్రార్థమును స్మరించుటయే జపమని చెప్పబడినది. మంత్రార్థమనగా మంత్రమందలి శబ్దముల తాత్పర్యము గ్రహించుటయే మంత్రార్థముగాదు. మంత్రమందలి శబ్దములచే యేవస్తువు సూచింపబడినదో అది మంత్రార్థము. ఆవస్తుస్వరూపమునందు మనస్సు చేర్చుటయే అర్థభావన. యిట్టి జపము సర్వోత్కృష్టమైనది.

యీ విధముగా తీర్థప్రాసాదముల ప్రాముఖ్యతను గుర్తెరిగి వానిని సేవించుచూ పవిత్రీ భూతుడై గురుస్తోత్ర మంత్రజపానుష్ఠాన ధ్యానాదులు సలిపెనేని అట్టిశిష్యుడు కడతేరుట నిస్సంశయము.విపరీత భావనుష్ఠానములచే వుభయ భ్రష్టత్వమే సిద్ధించును. "ఉపాసకానాం హితార్థాయ" సగుణ రూపంలో నామరూపాదులు గ్రహించి తీర్థప్రసాదముల సౌలభ్యము ననుగ్రహించు గురుపరమాత్మ పాదద్వంద్వము మనల నందరినీ రక్షించుగాక!

శ్లో॥ ప్రభో! దేవ! కులేశాన!స్వామిన్!రాజన్! కులేశ్వర!
ఇతి సంబోంధ నైర్భితో గురుభావేన సర్వదా॥

తాత్పర్యము:- గురువునెడల భీతికల్గి, తనకన్న యెన్నో రెట్లు గొప్పవాడైన పరమాత్మ స్వరూపుడేననే భావము ఏక్షణమందును మరువక, గురుమూర్తిని, పరమాత్మను సంబోధించిన రీతిగానే ప్రభోదేవ! కులేశాన, స్వామీ, రాజా, కులేశ్వరా అని సంబోధించవలెను, తనవంటి మానవమాత్రుడే అను భావము పూర్తిగా నశించి పోవలెను.

విశేషవివరణము:- యిందు పేర్కొన్న సంబోధనా శబ్దముల అర్థభావమును ముందుగా తెలిసికొనవలెను. ప్రాపంచిక విద్యలను నేర్పు గురువు తనవంటి సామాన్యమానవుడే. కానీ తన జీవనోపాధి కొక వృత్తి నవలంబించుటకు సహాయభూతుడై వుండును అతని యెడల గౌరవము, విశ్వాసము కల్గియుండిన చాలును.అట్టి ప్రాపంచిక విద్యలను నేర్పినందుకు గురునకు శిష్యు డేదో ధనరూపంగాగాని వస్తురూపంగాగాని సేవరూపంగాగాని ముట్టజెప్పిన చాలును.అందువలన గురు ఋణము తీర్చునవాడు కాగల్గుచున్నాడు. కానీ బ్రహ్మమును దెలసికొన్న బ్రహ్మవిద్యా గురువు నరమాత్రుడుకాడు. కారణజన్ముడు తనవంటి జిజ్ఞాసువులను తరింపచేయుటకై మానవుడై అవతరించిన మహాపురుషుడు."బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి" అనుశ్రుతి న్యాయముగా బ్రహ్మసాక్షాత్కారము పొందిన యా గురువు బ్రహ్మమేగాని అన్యుడు కాజాలడు.

బ్రహ్మమునుగూర్చి బోధించు బ్రహ్మవిద్యను సాకల్యముగా నెరిగించి తనయంతట వానిగా చేసుకొనుచున్న గురుమూర్తిని మేస్టారు, పంతులుగారూ, అని సామన్యపద్ధతిగా సంబోధించరాదు. తనకీ స్థూల శరీరమును ప్రసాదించినవాడు తండ్రి. ఆశరీరమును పోషించుకొనుటకు దారి చూపించువాడు లౌకికగురువు. ఆయనను అవిధంగా సంబోధించిన చాలును. గురువును ఆ విధంగా తండ్రిని సంబోధించినట్లు అయ్యా, నాయనా, బ్రహ్మా, తండ్రీ, బాబూ, బాబయ్యా అని సంబోధించుటయుచాలదు. గురువే బ్రహ్మ విష్ణు మహేశ్వరూపులు. గురువే పరబ్రహ్మ స్వరూపుడుగా ఆయనను స్తోత్రము చేయుచూ మరల నతని సామన్య మానవునిగా సంబోధించట యుక్తముకాదు. మనము చేసిన యుపాసన ఫలించి మనయిష్టదైవం మనంధ్యానించినరూపంలో ప్రత్యక్షమైనపుడు ఆయనను మన మెట్లు సంబోధింతుము" దేవాది దేవా, మహాప్రభో మహానుభావా జగద్రక్షకా, లోకేశ్వరా" అనిసంబోధిస్తూ స్తోత్రములను చేయుదుమే! మరి గురువు కేవలం రూపుదాల్చిన పరబ్రహ్మము అని గుర్తించినపుడాయనను మనము పరమాత్మగానే, సంబోధించవలసివున్నది.

పరమాత్మ లోక ప్రభువు. గురుపరమాత్మ లోక ప్రభువేగాక తనకు ప్రత్యేకముగా ప్రభువైయున్నాడు. ఏలననగా శిష్యుడు గురువునకు "శిష్యస్తేహం శాధి మాం త్వాం ప్రసన్నమ్" నీకు నేనే శిష్యుడను ప్రసన్నుడనై శరణాగతి చేసినాను నన్ను రక్షింపుమని ఆత్మనివేదన చేసుకొన్న భక్తుడుగదా! తను, మన, ధనములు గురువునకు వినయమున ధారపోసెను గదా!

శ్లో॥ "శరీర మింద్రియం ప్రాణం అర్థ స్వజనబాంధవాన్
ఆత్మదారాదికం సర్వం సద్గురుభ్యోనివేదయేత్"

అని తన సర్వస్వము గురువునకు నైవేద్యముగా నర్పించి గురుప్రసాదముగా మాత్రమే వానిని అనుభవించుచున్నాడే! తనూ తన సర్వస్వమూ అంతా గురుమూర్తిదే. తనపైనగాని తనదని అదివరలో భావించినదానియందుగాని తనకేమైన నికపైత్తనములేక అధికారము లేదుగదా!

తాను అహంకార మమకారములు లేకనే తన మనోవాక్కాయములన్ను ప్రవర్తింప చేసుకొనవలెను, యిట్టి ప్రవర్తన ముఖ్యముగా గురు సన్నిధానమందు పాటించవలెను. మనస్సులో గురువుగారు కేవలం దైవ స్వరూపులని భావించుకొనుట మాత్రమే చాలదు. తన మాటలో క్రియలో ఆ భావము నిండి తొణికిసలాడుచుండవలెను. గురునితో మాటాడు సందర్భమున యెట్లు సంబోధించవలెనో యీ శ్లోకము చెప్పుచున్నది.

1) ప్రభో:- ప్రభువనగా రాజు, ఏలిక, పాలించువాడు అని అర్థము గదా! గురువుగారు ఏమి పాలించుచున్నాడు? ఆత్మసామ్రాజ్యమునే పాలించుచున్నాడు. తన శరీరేంద్రియ మనఃప్రాణ ఆత్మలన్నియు నాతనికి శిష్యుడర్పించియున్నాడు. ఇపుడు తన సర్వస్వము గురునిసొత్తే. గురువర్యుల ఆజ్ఞమేరకు వానిని యేవిధంగా నియమమునందుంచి యేవిధంగా వాని ననుభవించవలెనో శాసించువాడు గురుపరమాత్మయే. తన పైత్తనము ఏమియున్నిలేదు. కనుక గురువే తన సర్వస్వమునకు ప్రభువైయున్నాడు.

2) దేవ = గురువు దైవస్వరూపుడే, దివ్ అనుధాతువునకు ప్రకాశము అని అర్థము. ప్రకాశమనగా కేవలం వెలుగేకాదు. జ్ఞానము "జ్ఞానాదేవతు కైవల్యం" అని, "ప్రజ్ఞానం బ్రహ్మ" యనియు శ్రుతులు. పరమాత్మ స్వయంప్రకాశ స్వరూపుడు మరియును గురువు శుద్ధ సత్వప్రధానుడు. పరిశుద్ధాంతఃకరణము గలవాడు "సత్వాత్సంజాయతే జ్ఞానం" ప్రజ్ఞాన ఘనుడై, స్వయంప్రకాశ స్వరూపుడైన పరమాత్మయే గురుడు. గురువును మించిన దైవములేడు. గురుడుదేవా! యని సంబోధించుట కెంతయు తగియున్నాడు.

3) కులేశాన= కులమునకు అధిపతి. అనగా తన కులమును రక్షించువాడు "కులములోన నొక్క గుణవంతుడుండెనా వాని పేరు వంశవర్ధనుండు" అని చెప్పబడిన రీతిగా వంశములో నొక్క లక్షణయుతుడైన గురుపుత్రుడుండి తరించినచో వాని మాతృకులము పితృకులము కూడా తరించుటయే గాక "కులానాం కుల కోటీనాం తారకస్త త్రతక్షణాత్" అనేక కులములు తరింపబడుచున్నవి అని గురుగీతయే అన్యత్ర చెప్పియున్నది. ఇది ఎట్లు సాధ్యము అనుశంకరావచ్చును. దానికే "దీపో దీపాంతరం యథా" అన్నారు. అనగా ఒకదీపము వెలుగుచుండినచో ఆ దీపమునకు యెట్టి హాని, లేకుండగనే సమానప్రకాశములేక యింకనూ అధిక ప్రకాశముగల అనేక దీపములను యెట్లు ముట్టించనగునొ అట్లే గురుమూర్తి వంశములకే యధిపతి యని చెప్పదగును.

4) స్వామిన్= యజమాని, అధికారి. దేవుడు, భర్త. ఆచార్యుడు గొప్పసన్యాసి అని నానార్థములు గలవు. గురుశిష్య న్యాయములో స్వామిభృత్య సంబంధము తీసుకొనదగును. ఏలననగా ముఖ్యముగా ద్వైత సిద్ధాంతములో భగవంతునికిన్నీ భక్తునికిన్నీ గల సంబంధము భగవంతుడు ప్రభువుగా భక్తుడు కింకరుడుగానుండు సేవాభావమేభక్తిగా కొనియాడబడినది. ఆంజనేయుని భక్తి యీ కోవకు చేరినది. నేనే నీ వాడను అను భక్తిభావనలో నీ అంశ స్వరూపుడను కనుక నీ ప్రేమకు నే నధికారిని అనుకొను అహమున్నది. నీవే నేనను అద్వైత బుద్ధిలో యీ అహము పూర్తిగానున్నది. కానీ స్వామీ భృత్య సంబంధములో తనకు బాధ్యతలేగాని హక్కులేమిన్నీలేవు. ఏ యపేక్ష లేకుండా ఎట్టి జీతభత్యములు లేకుండా స్వామి ఆజ్ఞలను ఆంజనేయునివలె పాలించుటయే యిందలి భావము. కులశేఖరాళ్వార్ ముకుందమాలలో చెప్పుకున్నట్లుగా తాను "భృత్యస్య భృత్య పరిచారక భృత్యభృత్య" భృత్యస్య భృత్యుడుగా

గురువును యెట్టి అహంకారమును లేక సేవించుటే ధర్మము. గురువును స్వామీ అని సంబోధించుటెంతయు యుక్తము.

5) రాజన్= రాజా అనగా అనేకులను పరిపాలించువాడు రాజు గురువో? తన్నాశ్రయించిన భక్తకోటినేగాక గురువులకు కూడా గురువై పీఠాధిపతియై పాలించు గురుచక్రవర్తి, రాజాధిరాజు. ఒకచోట కవి "రాజాధిరాజ మకుటాంచిత రత్న సేవ్యం" అని కీర్తించినాడు. వుత్తరాదిని గురువులను పెద్దలను మహరాజ్ అని సంబోధించుట పరిపాటియైవున్నది.

6) కులేశ్వరా = అనగా కులపతి. కులపతి యనగా గురుకులమును స్థాపించి ప్రత్యేక మొక ఆశ్రమమును నిర్మించుకొని అందు భార్యాబిడ్డలతో నివసించి తన్నా శ్రయించవచ్చిన శిష్యులకు సర్వశాస్త్రవిద్యలేగాక బ్రహ్మవిద్యను గూడ బోధించువాడు కులపతి నామముచే కీర్తింపబడెడివాడు.నేటి విశ్వవిద్యాలయములవంటి వా గురుకులములు. వాని కధిపతి కులపతి.

యీ సంబోధనలన్నియు గురువు కేవలం పరమాత్మ స్వరూపుడేగాని నరమాత్రుడుగాడు అని మాటమాటికి గుర్తులో నుంచుకొనుటకే ఆ విషయం విస్మరించి ఏఅపచారమూ చేయకుండుటకే యీ సంబోధనలు విధింపబడినవి. ఇట్టి సంబోధనలతోగాక మరొకరీతిగా తనతో సమానునిగా తనకన్న హీనునిగాగాని సంబోధించి మాట్లాడువానికెంతో దోషము చెప్పబడినది.

ఎట్లనగా,

శ్లో॥ గురుత్వం కృత్య హుం కృత్య గురుసాన్ని ధ్యభాషణః।
ఆరణ్యే నిర్జలే దేశే సంభవేత్ బ్రహ్మరాక్షసః॥

అనగా తన గురువును నీచముగా నీవని సంబోధించి గాని, గురవుతో హుంకరించిగాని, గురుసాన్నిధ్యమందు సంభాషించెడివాడు, త్రాగుటకు నీరులేని కారడవిలో బ్రహ్మ రాక్షసుడై పుట్టునని భావము. అట్టిదోషము పొరపాటుననైన తగలకుండా నుండుటకుగాను గురువును పరమాత్మ స్వరూపునిగా భావించుటతో మాత్రము తృప్తిజెందక, సంభాషణలో మిక్కిలి గౌరవ వాచకములచే మాటిమాటికి సంబోధించు చుండిన యెడల గురువు పట్ల యట్టి అపచారము జరుగజాలదు.

గురువును ఆ విధంగా సంబోధించుటలోగాని, అర్చన వందన, దాస్యాది పరిచర్యలు చేయుటలోగాని, నిరభిమానంగా ప్రవర్తించవలెను. "గురుమూర్తి కెదు రహంకృతి దొరకనరాదనీ, గురుశిష్యులు లజ్జ నొందదగుననీ, హితోపదేశముచేస్తూ సిగ్గువిడచి కొలువుమా నీతివంతా అభిమానముపోనీ నీదంతాయనీ, భయ భక్తి గురుసార్వభౌముని సేవ నిశ్చయముగ చేసితే జయ మందెదవు అనీ" కృష్ణ దేశికేంద్రులువారు గురుభక్తులను హెచ్చరించినారు.

గురువునెడల ప్రేమ మాత్రమేగాకుండా భయమున్నూ వుండవలెను. భయముండినగాని భక్తికి సార్థక్యము లేదు. గురునాజ్ఞ పాలించినచో గురువు విధించిన ధర్మాచరణ చేయనిచో ఏ గురుకృపా సంసిద్ధికై తానుపాటుపడుచున్నాడో ఆ గురుకృపకు తాను దూరస్తుడనైపోదునేమో అను భీతితో భగవద్దృష్టితో గురువును సేవించవలెను. ఇట్టి సచ్ఛిష్య లక్షణము మాకు లభించవలెనని గురుదేవుని అహరహము సేవింతుము గాక!

శ్లో॥ కర్మణా మనసా వాచా సర్వదా ఉ రాధయేంఉ ద్గురుం
దీర్ఘ దండం నమస్కృత్య నిర్లజ్జో గురుసన్నిధౌ॥

తాత్పర్యము : మనో వాక్కాయ కర్మలచే త్రికరణ శుద్ధిగా యెల్లపుడు గురువు నారాధించవలెను. సాష్టాంగ నమస్కారముచేసి అభిమాన రహితుడై గురుసన్నిధి నుండవలెను.

విశేష వివరణము : 1) కర్మణా మన సావాచా 2) సర్వదా రాధయేత్ 3) దీర్ఘ దండం నమస్కృత్య 4) నిర్లజ్జో గురుసన్నిధౌ, అను విషయములను వివరించి తెలుసుకొనదగును.

1) కర్మణా, మనసా, వాచా : శరీరము, మనస్సు, వాక్కు అను త్రికరణములచేతను మనము అన్ని పనులు చేసుకొనుచున్నాము. కరణము అనగా పనిముట్టు. క్రియా రూపమగు బాహ్యకర్మ అంతయు శరీరముచేతనే చేయబడుచున్నను భావన అనగా ఆలోచనారూపమగు కర్మ మనస్సుచేతను, ఆ భావనలను యితరులకు తెలియచేసి వ్యవహారము చేయుటకు, వైఖరీ రూపమగు వాక్కుచేతను, పనిచేయుచున్నాము. గనుక కర్మకు యీ మూడు పనిముట్లు ముఖ్యావసరములు. ఏ పని చేయవలయుననునూ ముందుగా మనస్సు సంకల్పించిగాని పనిచేయుటకే పూనుకొనుము. ఆ పనిచేయు కాలమందుకూడా మనస్సు ఆ పనియందుంచి పనిచేయకున్నచో ఆ పని సౌష్టవముగా అనగా చక్కగా జరుగజాలదు. అట్లే వాక్కుచే మాటలాడు నపుడు గూడ, యిది సుశబ్దము, ఇది అపశబ్దము అని నిర్ణయించి నిర్దుష్టముగాను, సహేతుకము గాను, మార్దవముగాను, సొంపుగానూ మాటలాడవలెనన్న మనస్సు మాటతో జతపడవలెను. ముందుగా యుక్తాయుక్త నిర్ణయము చేసి సంకల్పించుటకూడ మనస్సు యొక్క వ్యాపారమే. త్రికరణములయందున్నూ మనస్సు ముఖ్యపాత్ర వహించుచున్నది. బుద్ధి, చిత్త, అహంకారము కూడ మనఃపరిణామములే గనుక మనస్సు అని చెపితేచాలు. మనోరుగ్మతలవాని మాటలు చేష్టలు అపసవ్యంగానూ అర్థరహితంగానూ యుండును. మనస్సన్యథాయత్తమై యుండచేయు పూజాజప స్తోత్రాదులు యెక్కువ ప్రయోజనకారులు కావు సరిగదా, ఒక్కొక్కపుడు చేయుచున్న జపము ఆగిపోయే ప్రమాదమున్నది.

అభ్యాసదశయందు మనస్సు దాని సహజ విక్షేపలక్షణముచే నిలపిన స్థానమున నుండక యిచ్చవచ్చినరీతి పరుగులిడుచుండును. ఇట్టియెడ సాధకుడేమాత్రము నిరుత్సాహపడక మనసు పరుగిడుచున్నదని గుర్తించిన తక్షణమే యా మనస్సును వుండవలసిన స్థానమునందు తిర్గి పునఃప్రవేశపెట్టి ఏకాగ్రత సాధించవలసియున్నది. మనో వాక్ఛరీరములు మూడున్ను ఒకే లక్ష్యము నందుంచినపుడు మాత్రమే ఏకాగ్రత సాధ్యము. ఎట్లనగా మనస్సు. దృష్టి, ప్రాణము ఈ మూటిలో ఏది ఒకచో నిలచినా మిగతా రెండు అచ్చట నిలచును.

శ్లో॥ దృగ్యుగ్మం లీయతే యత్ర, మనస్తత్రైవ లీయతే
దృఙ్మనోలీయతే యత్ర ప్రాణస్తత్రైవ లీయతే॥

అని చెప్పబడుచున్నది. ఆవరణ రూపమగు ప్రాణమే శరీరము. దృష్టి. వాక్కు యీ రెండూ యింద్రియములు. మన స్సాయింద్రియముల ద్వారా ప్రవర్తించును. ఆ దృష్టితో, మనోవాక్ఛరీరములే, మనో దృక్ ప్రాణములు. మనో వాక్ శరీరములు మూడును ఏకబాటను నడచినపుడే ఏకాగ్రత సిద్ధించును.

ఐతే యీ మనః ప్రాణ వాక్కులు (ప్రాణమన్నా శరీరమన్నా ఒకటే) పరిశుద్ధములుగా నుండవలెను. మానసిక సంయమనము. వాచిక సంయమనము. కాయిక సంయమనము గల్గి త్రికరణములను ఏకబాటను నడిపించవలసియున్నది. ఎందువల్లననగా మనఃప్రాణ వాక్కులు ఆత్మ కాహారమని, ఆత్మకివి అన్నమయకోశమువంటి స్థూలావరణమని చెప్పబడినది.

సప్తాన్నములలో తృణాదులు చతుష్పాత్తులకు (పశువులకు) ధాన్యాదులు ద్విపాత్తులకు (అనగా మానవులకు పక్షులకు), హవిర్భాగములు దేవతలకు, శ్రాద్ధ కర్మలయందుంచబడు పిండోదకముల పితృదేవతలకును. మనఃప్రాణవాక్కులు ఆత్మకున్ను ఆహారములుగా చెప్పబడినవి. ఆహారము భుజించుటవల్ల పుష్టి, తుష్టి కలుగును. అంటే మనఃప్రాణ వాక్కుల ప్రవర్తనయే ఆత్మకు పుష్టి తుష్టి యివ్వగలవు. "ఆహార శుద్ధౌ సత్వ శుద్ధిః" అని చెప్పబడుచున్నది. ఐతే ఆహారశుద్ధి అనగా చేతితో కూడా తాకక ఏ విధమగు మలినమూ అంటకుండావున్న పరిశుద్ధాహారముకాదు. న్యాయముగానూ యితర ప్రాణుల కెట్టి హింసయు లేకుండా సంపాదింప బడిన ఆహారమే పరిశుద్ధాహారము. అదియే పవిత్రము. ఇచ్చట త్రికరణముల ప్రవర్తన యెంత పరిశుద్ధముగా నుంటే అంత పరిశుద్ధాహారము ఆత్మకు లభించుటచే ఆ యాత్మ మహాత్మయగు చున్నది. ఎంత అపవిత్రమైతే అంత పాపాత్మ యగుచున్నది. ఆత్మకు మనఃప్రాణ వాక్కులే స్థూలావరణమనుటకు "సదేకమయ మాతోః ఏకసన్నే తత్రయంః" అని "అయమాత్మా వాఙ్మయో, మనోమయః, ప్రాణమయహః" బృహదారణ్యక శ్రుతులు తెలుపుచున్నవి. మరియును ప్రకారాంతరముగా త్రివృత్కరణ పద్ధతిచే చూచినచో మనఃప్రాణ వాక్కులే వ్యష్టి సమిష్టి అంతఃకరణములై యున్నవి. త్రికరణ శుద్ధివలన అంతఃకరణ శుద్ధి అగుచున్నది. శుద్ధాంతఃకరణమునందు ఆత్మ చక్కగా ప్రతిబింబించుటతో ఆగక కొంతకాలమునకు ఆ అంతఃకరణ మాత్మ రూపమునే చెందగలదు. సాధనయందు త్రికరణశుద్ధి కత్యంత ప్రాముఖ్య మీయబడినది.

ప్రపంచక వ్యవహారములయందు త్రికరణశుద్ధికలిగియున్నంత మాత్రమున చాలదు. Honesty is the best policy అనగా నిజాయితీగా వ్యవహరించుట చాలా లాభసాటి కాగలదని, వర్తకులుగా ప్రారంభించి సూర్యుడస్తమించని సామ్రాజ్యమును స్థాపించగలిగిన బ్రిటీషువారి స్వానుభవసిద్ధాంతమిది. కాని ప్రాపంచిక మగు పురుషాభివృద్ధికి మాత్రమేగాక పారమార్థిక పురోభివృద్ధికి గూడ త్రికరణ శుద్ధి రూపమగు ప్రవర్తనా విధాన మెంతేని యవసరము. ఎట్లనగా 1) రామ భక్తుడగు వాడు రామనామస్మరణ చేయుచు రాముని శీలంసంపత్తి అలవర్చుకొనుటకు ప్రయత్నం చేయక రావణకృత్యములు సలుపునేని వాని రామభక్తి వృథా 2) మమాత్మా సర్వభూతాంత రాత్మా" యని నోట పల్కుచు పొరుగువారినే ప్రేమించలేని వేదాంతము వృథా "గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః" అను శ్లోకము పఠించుచూ గుర్వాజ్ఞాపాలనము చేయలేని పరిపూర్ణ బోధ సాంప్రదాయ కుని గురుభక్తి వృథా. పారమార్థికులు తమ తమ సిద్ధాంతానుసారముగా ప్రవర్తించుటయే పారమార్థిక త్రికరణశుద్ధి ఇట్టి పారమార్థిక త్రికరణశుద్ధి గల్గి గురుమూర్తి నారాధించవలెనని యీ శ్లోకము విధించుచున్నది.

2)సర్వదారాధయే ద్గురం : ఎల్లపుడూ గురువును త్రికరణ శుద్ధిగా నారాధించుచుండ వలెను. సామాన్యార్థములో ఆరాధన (పూజ) అర్చన మొదలగునవి. ఆరాధన యనగా సంతోష పరచుట అనికూడా యర్థమున్నది. ఈ యర్థమునే యిట ముఖ్యముగా గ్రహించవలసి యున్నది. ఏలననగా, సర్వదా పూజాదికములు జరుపుట సాధ్యముకాదు. కాని సర్వదా గురువునకు సంతోషము కలుగునట్లు, శిష్యుడు నిత్యజీవితమును సరిదిద్దుకొని ప్రవర్తించుట సాధ్యము. సర్వదా అను శబ్ద ప్రయోగమునకు సార్థకత చేకూరుటకై యీ అర్థమునే గ్రహించ తగును. అట్టి ప్రవర్తన ఏది?

పారమార్థికులకు ముఖ్యమైనవి రెండేరెండు పనులుగా విభజించవచ్చును. ఆరెంటీకి కొరగానిపనియందు ప్రవర్తించరాదు 1) భుక్తి క్రియ 2) ముక్తి క్రియ యీ రెండు క్రియలందు గురుభక్తుడెట్లు ప్రవర్తించవలెను?

1) పూర్ణ బోధ సన్యాసమును హర్షించదు. మరియు భుక్తికై యితరులపై నాధారపడు టయు నంగీకరించదు. స్వకష్టార్జితమగు ద్రవ్యముతో తాను జీవించుచూ తనపై నాధారపడిన కుటుంబ సభ్యులను పోషించుకొనవలెను. న్యాయమగు విధముగా ధనార్జన చేయవలెను. అట్టి ద్రవ్యములతో చేకూర్చిన ఆహారమే పరిశుద్ధాహారము. అట్టి పరిశుద్ధాహారమువలన సాధకుడు పారమార్థికముగ గూడ పురోభివృద్ధి గాంచగలదు. "ఆహార శుద్ధౌ సత్వశుద్ధి స్సత్వశుద్ధౌ ధృవాస్మృతి స్మృతి లందే సర్వగ్రంధీనాం విప్రమోక్షః తస్మై మృదిత కషాయాయ తమసః పారం దర్శయతి" యని చాంధోగ్యోపనిషత్ చెప్పుచున్నది.

2) ముక్తి క్రియ : గురుముఖతః సాంప్రదాయక ప్రబోధమును విన్న మాత్రమున చాలదు. విన్న విధానమును గూరూపదిష్ట మార్గము ననుసరించి ఆచరణయందుంచి యావజ్జీవము గురుభక్తి, గురుసేవ, గురునిష్ఠలయందు ఏమరక ప్రవర్తించవలెను. ఆచరణ లేనిచో గురువు చెప్పిన బోధ మర్మమే తెలుసుకొనగల్గునుగాని ధర్మము చిక్కదు. పరిపూర్ణ పరబ్రహ్మమందు ఎరుక పుట్టనేలేదు అని శ్రవణము చేసి "నాకు ద్వాదశాంతమైపోయినది. గురువూలేడు, శిష్యుడూలేడు. గురుశిష్యోభయ రాహిత్యమే సిద్ధించినది. నేను అచల పరిపూర్ణుడను, అశరీరుడను" అనుకొని ఆత్మవంచన చేసుకొనరాదు.

"పరిపూర్ణబోధతెలిపే
పర్యంతము సేవచేసి బహు నమ్మికగా,
గురుమూర్తిని తరువాతను
మరి కన్నులగనని వాని మార్గము ఛీఛీ,
"తలచరాదా మాటా ఛీ ఛీ ఛీ"

అని కృష్ణదాసుగారు కందార్థం వ్రాస్తే "మరి కన్నుల గనినవారి మార్గము ఛీఛీ" అని దిద్ది చదువుకొని ఆనందించిన ఘనులు లేకపోలేదు.

గురువునకు సంతోష మెట్లుకలుగును? గురువుచెప్పిన నడక శిష్యుడు నడచు చున్నపుడే సద్గురువు సంతోషించునుగాని. శిష్యుడిచ్చుధన కనక వస్తు వాహనాదులచే సంతోషించడు. శిష్యుడు గురువున కేమియు నివ్వరాదు అని అర్థము చేసుకొనరాదు. తనకున్నంతలో గురుని యవసరము లను తీర్చుట శిష్యుని విధాయక ధర్మమే యనుటలో యెట్టి సందియమూలేదు. శిష్యుని ప్రవర్తన చూచి ఇట్టి సచ్ఛిష్యుడుకదా నిజమైన అధికారి! వీనికి సర్వసందేహ నివృత్తిగావించి శీఘ్రముగా తరించునట్లు చేయవలెనని. గురుని అంతఃకరణమందు ఆవేదన కల్గించునట్లుగా శిష్యుడు ప్రవర్తించవలెను. ఇష్టదైవమువలె గురుని అర్చనాది విధులచే ఆరాదించుటతోపాటు తన ప్రవర్తనచే గురుని సంతోషపరచుట కూడా ఆరాధనయే యని తెలియదగును. బోధయందారూఢతగాంచిన శిష్యులు

"యింగితము నెరిగి సద్గురు
పుంగవుచే నరుడు భుక్తిముక్తి క్రియలన్
సంగాసంగములెడలిన
శృంగారమే వాని చేష్టచూసేవారలకూ"

అని అశరీర పద్ధతిలో నుందురు. యిదియే భుక్తి ముక్తి క్రియల పూర్ణ యోగము పూనుట. ఐతే యీ శ్లోకమందలి రెండవపాదము దృష్ట్యా యీ శ్లోకము అభ్యాసకుల విషయంలో చెప్పినది మాత్రమే అని అనవచ్చును. కాని ఆరూఢత చెందినవారి ప్రవర్తన కూడా యిందుకు భిన్నముగా నుండదు. ఏలననగా ఎంత ఆరూఢుడో అంత ఆదర్శజీవితం గడుపును. అతని నిత్యజీవితమే యొక ఆరాధన, అదియే దివ్య జీవనము.

3) దీర్ఘ దండం నమస్కృత్య : దండమనగా కర్ర, దీర్ఘము అనుటచే అది పొడవుగాను, వంకరలులేక విడివిగానూవున్న కర్రవలె శరీరముచాచి బోరగిల భూమిపై పరుండి, గురుపాదములకు నమస్కారము చేయుటయే సాష్టాంగ నమస్కార మనబడుచున్నది. అష్ట అంగములతో కూడినదే సాష్టాంగము.

శ్లో॥ దోర్భ్యాం పద్భ్యాంచ, జానుభ్యాం, పురసా, శిరసా, దృశా
మనసా, వచసా, చేతి ప్రణమోష్టాంగవుచ్యతే॥

అనగా భుజములు, పాదములు, మోకాళ్ళు, వక్షస్థలము, తల, కన్నులు, మనస్సు వాక్కు అను యీ యెనిమిదీ అష్టాంగములు ఇందు మొదటి ఆరున్నూ శరీరముయొక్క స్థూలావయములు, శరీర మనోవాక్కులు అని మొదట చెప్పబడిన త్రికరణములతో చేసినదే సాష్టాంగ నమస్కారము. వక్షస్థలము నేలకంటకుండగనే మోకరించి చేయు నమస్కారము సాష్టాంగముకాదు. మరియు శరీరము వంపులులేని దీర్ఘదండమువలె నేలకంటనూ అంటదు. అంతేగాక వక్షస్థలమున గల హృదయమే అహంకారమునకు స్థానము. వక్షస్థలము నేల కంటనిచో తన అహంకారమును మిగుల్చుకొన్నట్లే కాగలదు.యిది పరిపూర్ణ శరణాగతి కాదు.

ఆత్మార్పణము గురుమూర్తికి గావించుకొనవలసియుండగా, ఆత్మరూపమగు లేదా కనీసం ఆత్మకు అత్యంత సన్నిహితమగు నేను నేను అను అహంపదార్థము మినహా ఏమి అర్పణగావించినా అది హృదయార్పణ లేక శరణాగతి లేక ఆత్మార్పణముకాదు. మనస్సు నమస్కరించుట యనగా మనస్సుచేత నమస్కారము చేయుచున్నాను అను భావన మాత్రమే కాదు. అట్లే వాక్కుచే నమస్కరించుట యనగా నేను నమస్కరిస్తున్నాను అని నోటితో అనుటయు కాదు. మనస్సు, వాక్కు కూడా గురుమూర్తికి శరీరముతో పాటు సమర్పించుకొనుటయే మనోవాక్కులచే చేయు నమస్కారము. ఆ విధముగా తను మన ధనములు (శరీరమనో వాక్కులు లేక స్థూల సూక్ష్మ కారణ శరీరములు) గురువునకు ప్రతినిత్యము చేయు సాష్టాంగ నమస్కారముతో శిష్యుడు అర్పించుకొనుచుండవలెను. ఇదియే నవవిధ, భక్తులలో చెప్పబడిన ఆత్మ నివేదనమను తొమ్మిదవ భక్తి.

నవవిధ భక్తులు :

శ్లో॥ శ్రవణం కీర్త నం స్మరణం విష్ణోః పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనం

తను మన ధనము లర్పించుట ఆత్మనివేదన మెట్లగును? అంటే మహాకారణ శరీరమైన ఆత్మను

స్థూల సూక్ష్మ కారణ శరీరములు స్థూల రూపములు. బెల్లముక్కను నివేదన మొనర్చిన తీపిని వేరే నివేదన చేయనక్కరలేదుగదా! అట్లే స్థూలరూపములగు తను మన ధనములర్పించినచో ఆత్మరూపుడగు తన్ను గురుమూర్తి కర్పణచేసుకొన్నట్లే యగుచున్నది.

ఇట్టి అర్పణవల్ల ఏది ఎట్లు సిద్ధించుచున్నది? గురుస్వరూపమే తానగుటయే ఫలసిద్ధి. ఇది ఎట్లు సిద్ధించుచున్నది అనగా

శ్లో॥ సముద్రేవై యధా తోయం క్షీరే క్షీరం జలే జలం
భిన్నే కుంభే యధాఽఽకాశం తధాఽఽత్మా పరమాత్మని॥ (గురుగీత)

తాత్పర్యము : నదీజలములు సముద్రములో కలసినట్లు, పాలు పాలలోను నీరునీటిలోను, పగిలిన కుండయందలి ఘటాకాశము మహాకాశములోను కలిసిపోయి తమతమ నామరూప విశిష్ఠతను గోల్పోయినట్లు శిష్యుడు తన వ్యక్తిత్వము గోల్పోయి గురుస్వరూపమే యగుచున్నాడు. వ్యష్టి స్థూల సూక్ష్మ కారణములు, వరుసగా సమిష్టి స్థూల సూక్ష్మ కారణములలో ఏకీభావముపొందిన ఆరూఢత శిష్యునికి సిద్ధించుచున్నది. ఇదియే, గురుస్వరూపము నేనేయై యేక భావము చెందుట.

ఇట్టి ఏక భావన వల్ల ఏమి సిద్ధించుచున్నది? మలదోషకారణములైన స్థూలదేహ మందలి పంచభూతాంశములు, వాని కార్యములు నశించును. అట్లే సుఖదుఃఖాత్మకమై బంధకారణమైన పంచతన్మాత్రల విషయగ్రహణచేయు సూక్ష్మ శరీరమందలి విక్షేపరూపమగు యింద్రియ సన్నికర్షణ జ్ఞానము నశించుచున్నది.అట్లే కారణశరీరమునందలి పంచబీజాత్మక మగు తూలాజ్ఞానము యొక్క ఆవరణ దోషము నశించు చున్నది. ఆవిధముగా శిష్యుని అంతఃకరణ యందలి మల విక్షేప ఆవరణ దోషములు నశించి శిష్యుడు స్ఫటికమణితో సమానమగు శుద్ధాంతఃకరణము కలవాడగుచున్నాడు. అందలి ఆత్మయున్న దున్నట్లుగా స్వకీయమగు నిర్మలత్వముతో ప్రకాశించుటచే శిష్యుడు గురుపరమాత్మయే యగుచున్నాడు.

4) నిర్లజ్జోగురుసన్నిధౌ : పైన చెప్పిన విధంగా సాష్టాంగ నమస్కారము గావించి గురుసన్నిధానమందు సేవా శుశ్రూషాదులు చేయుటకు ఏవిధమగు సంకోచముగానీ అభిమానముగానీ లేక మెలగుచుండవలెను. నిర్లజ్జ యనగా తెగించి సమాన స్థాయిలో మాటలాడుచు గురునియెడల భయభక్తి వినమ్రభావములు లేక యుండుట గాదు. గురువు ప్రభువు. తాను కింకరుడు ప్రభువాజ్ఞలను దలదాల్చి చెప్పిన పనులయందు నీచోత్తమ తారతమ్యమును వదలి నిర్వర్తించుటకు శిష్యుడెల్లపుడు సిద్ధముగా నుండవలెను. ప్రాపంచికులు బంధుమిత్ర దాసదాసీ జనములు చూచుచుండగా గురుమూర్తికి సేవా శుశ్రూషాదులు చేయుటవల్ల తన గౌరవప్రతిష్ఠలకు భంగమగునేమోయని సంకోచ మేమాత్రము నంతఃకరణయందుండరాదు.

గురుకార్య నిర్వహణమునందు నిరభిమానముగా వర్తించుట మాత్రమేకాదు. గురుసన్నిధిని తాను సాధించవలసిన స్వకార్య నిర్వహణమునందునూ ఏ మాత్రము సిగ్గుపడరాదు. గురుముఖతః గురుబోధ యొక్క మర్మములను నేర్చి జన్మరహితము గావించుకొనుటయే తన స్వకార్యము. అది సాధించుటకే గదా! తాను గురుపాదము లాశ్రయించినది? "గురుని సిగ్గువిడచి కొల్వుమా నీతివంతా! అభిమానముపోనీ నీదంతా"

యని ఒక కందార్థములో హెచ్చరించి, మరొక కందార్థములో "యేయే సంగతి నన్నడుగుము బోధస్థితి నీకుదృఢపరతు, తగదు లజ్జించా! గురుశిష్యులు తగు లజ్జనొంచా" అని సెలవిచ్చినారు. బోధ చెప్పుటకు గురువుగాని, సంశయ నివారణకై అడిగి తెలుసుకొనుటకు శిష్యుడుగాని, సంకోచించినచో, శిష్యునికి భ్రాంతి రహితము కాజాలదు. మొద్దు బుద్ధిగలవాడని గురుమూర్తిగాని తదితరులుగాని, తన్ను చులకన చేతురేమోయని సంకోచమేమియునుండరాదు. 'దిద్దుడినే వట్టి బుద్ధిహీనుడ' నని బాహాటముగా నిరభిమానముగ శిష్యుడు గురునిచెంత వప్పుకొని తీరవలసిందే! తానెంత ప్రజ్ఞావంతుడైనా ప్రజ్ఞాన ఘనుడైన గురుమూర్తి చెంత తాను లఘు స్వరూపుడే గదా! మరియును గురుమూర్తికి శరణాగతుడై ఏమియు తనయందు మిగుల్చుకొనకుండా ఆత్మార్పణమే గావించుకొన్నవా రింకనూ అహంకారాభిమానము లుంచుకొని వర్తింపదగునా? ఇక లజ్జకు తావెక్కడ? లజ్జపడినచో త్రికరణశుద్ధిగా తన సర్వస్వము గురువునకు ధారపోసినవాడెట్లగును?

గురుసన్నిధో అనగా సగుణ రూపంలోనున్న గురువుగారు కొన్ని వందల మైళ్ళలో నున్నారుగదా! సాష్టాంగ నమస్కారము, ఆరాధన యెట్లు సాధ్యము? అని అనుకొనరాదు. "శ్రీ గురోఃపరమం రూపం వివేకం చక్షురగ్రతః" అని చెప్పబడినవిధముగా దేశకాలములతో నిమిత్తంలేకుండా గురుమూర్తి తన కట్టెదుటనే యున్నాడు. తను మన ధనములు అర్పించివేసితిని. ఏమియు మిగుల్చుకొనలేదు అనుభావన విడనాడకుండినచో సాష్టాంగ నమస్కారము గురుమూర్తికి చేయుచున్నవాడే అగుచున్నాడు.

ఆరాధన యనగా గురువు సంతోషించునట్లు ప్రవర్తించుటయే. గురుమూర్తి దూరదేశమునందున్నూ అట్టి ప్రవర్తన యున్నవాడు గురుమూర్తిని సర్వదా ఆరాదించినవాడే యగుచున్నాడు.

ప్రపంచ పారమార్థిక విషయములపట్ల త్రికరణశుద్ధిగల్గి గురుకృపను సాధించి అష్టమ దములనుండియు, అష్టపాశములనుండియు విముక్తులమై గురుపరమాత్మ నారాధించుచూ భ్రాంతి రహితము చేసుకొనుటలో కృతార్థుల మగుదుముగాక!

శ్లో॥ గురూపదిష్ట మార్గేణ మన శ్శుద్ధింతు కారయేత్
అనిత్యం ఖండయేత్సర్వం యత్కించిచ్చాత్మ గోచరం॥

తాత్పర్యం : గురుమూర్తి చెప్పిన మార్గముచేత శిష్యుడు చిత్తశుద్ధిని గావించుకొని మనస్సునకు గోచరించు సర్వమును అనిత్యముగా పరిహరించుచుండవలెను.

1) గురూపదిష్టమార్గము, మనశ్శుద్ధి : తన గురువు తనకు చెప్పి చూపిన మార్గముచేతనే శిష్యుడు మనశ్శుద్ధి గావించుకొనవలెను. వుపదిష్ట అనగా వుదేశించిన అనగా కేవలము వాచా చెప్పుట మాత్రమేగాక చూపించిన విధానము అని గ్రహించవలెను. గురువు కూడా మరొక గురువు యొక్క సేవాశుశ్రూషలు చేసియున్నవాడు కనుక తానే మార్గమున సాధనచేసి తరించెనో ఆ మార్గమును చక్కగా చెప్పి తన శిష్యుని ఆ మార్గమునందు ప్రవేశపెట్టి నడుపగలడు. గురుసేవ చేయకనే యుక్తిచే బోధ గ్రహించిన వానికామార్గము తెలియనే తెలియదు. అట్టి వాని వుపదేశము గ్రుడ్డివాడు మరొక గ్రుడ్డివానికి దారిచూపుట వంటిదేనని వర్ణింపబడినది. అందునూ ముఖ్యముగా పరిపూర్ణబోధ శుద్ధమైన గురుపరంపరగా ప్రాప్త మైనపుడు మాత్రమే రాణించును.

ఆ గురూపదిష్టమార్గముచేతనే మనశ్శుద్ధి చేసుకొనవలెను గాని గురువు వుపదేశించిన

పద్ధతి విడచి వేరుమార్గ మనుసరించరాదు. "తారకంబు మనశ్శుద్ధి కారకంబు" అని సీతారామాంజనేయ సంవాదమందు చెప్పబడినది. మనశ్శుద్ధి అనగా మనోదోషములగు సంకల్ప వికల్పాత్మకముగు చంచలత్వము హరింపజేయుట, యుక్తాహార విహారములు బూని, ఆసన, ముద్ర, లక్ష్య, ప్రాణాయమము, మంత్రమననాది ప్రక్రియ అన్నియు ఒకేసారి చేయుచూ మనస్సును అష్టదిగ్బంధన చేయుట తారకయోగము. దానివలన మనస్సు తత్కాలమున చంచలత్వము తప్పక వీడును గాని ఆ పట్టు వదలిన మరుక్షణమునే మనస్సు తన సహజ చంచలత్వమున యథేచ్ఛా విహారము చేయగలదు. ఏలననగా తారక యోగాభ్యాసకాలమున మనస్సు యొక్క స్థూల వృత్తులు ఆగిపోయినవేగాని ఆయా వృత్తులకు కారణములగు సంస్కారములు నశించలేదు. కుక్కతోకను వంకరతీర్చుటకై వెదురుబద్దలకుచేర్చి కట్టియుంచినంతకాలము వంకర తీరిపోయినట్లు తిన్నగాయుండి, కట్లువిప్పిన వెంటనే తిరిగి సహజస్థితి పొందునట్లే తారకయోగము శాశ్వత మనశ్శుద్ధికి నిరుపయోగము. వేపగింజకు చేదు సహజము. దానిని పాలతో శుద్ధిచేసి తేనెలో ముంచి పంచదారలో పొదిగి మ్రింగినపుడు చేదు కన్పించకపోవచ్చునే గాని ఆ వేపగింజను కడిగివేసి కొరికినచో చేదు ఏమైనా చచ్చునా? అట్లే యోగాదులవలన మనోవిక్షేపమనగదు. వాయువునకు చంలనత్వ మెంత సహజమో, వాయుభూత సంబంధమగు మనస్సునకున్ను అంతే సహజము.

మనస్సునకుండే యీ విక్షేపదోషము ఆగంతుకమా? లేక స్వాభావికమా? ఆగంతుక మనగా వస్తువుతోగాక వస్తూత్పత్త్యనంతరం ఆకస్మికంగా సంక్రమించినదైనది. క్రొత్తగా వచ్చినది గనుక దానిని తొలగించుటయు సులభసాధ్యము కావచ్చును. లోహితోష్ణములు అగ్నికి ఎట్లు స్వాభావికములో అట్లే మనస్సుకు చంచలత్వము స్వాభావికము. ఐతే యీ మనోదోషమునకు మందేలేదా? ఇక మనశ్శుద్ధి ఎట్లు కాగలదు? అని సాధకుడు నిరుత్సాహపడవలసిన పనిలేదు. మొండివ్యాధికి బండ వైద్యమే చేయవలె. మనస్సునే లేకుండా చేయవలెను.

జ్ఞానమునందు పూర్వపూర్వ సంస్కారములు (వాసనలు) చేరుటచే మనస్సనే పదార్థ మేర్పడును. మనస్సు సంస్కారముల మూటయని అభివర్ణింపబడినది. ఈ వాసనా క్షయ మైనచో శుద్ధజ్ఞానమే శేషించును. వాసనాక్షయము గావించుటయే మనస్సును శుద్ధమొనర్చుట యగును. అపుడు మనస్సు అనే వస్తువు యొక్క నామరూపములు నశించి ఆ మనస్సు కారణరూపమైన నిర్వాసనా రూపమగు జ్ఞానమై నిలచును. యిదే మనోనాశము. యీ వాసనాక్షయ మనో నాశములు గావించు గురూపదిష్ట మార్గమేది?

ఒక్క మాటలో చెప్పవలెనంటే. తత్వజ్ఞానము అనగా ఆత్మవస్తు సాక్షాత్కార మొక్కటియే వాసనాక్షయ మనోనాశములు గల్గింపగలదు. ఎట్లనగా మనస్సు వాసనా వాసితమగుటకు సంచితకర్మయే కారణము. తత్వజ్ఞానమువల్లనే సంచితకర్మ నశించును.

తత్వజ్ఞానమెట్లు కల్గును?

1) గురుసేవ 2) గురుభక్తి 3) గురునిష్ఠ అను త్రివిధ మార్గములచే తత్వజ్ఞానము అనగా ఆత్మ పరోక్ష సాక్షాత్కారము లభించును.

1) గురుసేవ యనగా గురుడు నరుడనే భావము విడచి గురువునకు చతుర్విధ శుశ్రూషలు జరుపుట యీ చతుర్విధ శుశ్రూషల యొక్క వాచ్యార్థ లక్ష్యార్థములను యిదివరకే అన్యత్రా వివరించడమైనది. గురుడు నరుడనే భావము పోవుటకై "నరులిష్టదైవములకున్

పరిచర్య యొనర్చునట్లు బాహ్యాభక్తి నాచరించవలెను.

2) గురుభక్తి : పై నుదహరించిన భక్తి విశేషముచే శిష్యునకు త్రికరణ శుద్ధి (అంతఃకరణ శుద్ధి) ఏర్పడును. అట్టివాడే సచ్ఛిష్యుడు. అట్టి త్రికరణశుద్ధి కల్గిన శిష్యునికి గురుడు ఆత్మస్వరూప నిశ్చయ జ్ఞానము కల్గించును. "స్వస్వరూపానుసంధానం భక్తిరి త్యభిధీయతే" అని శంకరులు చెప్పిన అర్థంలో స్వస్వరూపాను సంధానము చేయుచూ శిష్యుడు సర్వమునందు ఆత్మస్వరూపము ను అవలోకించుచూ అనన్యభక్తిసోపానమును చేరగల్గును.

3) గురునిష్ట : అపుడా అనన్యభక్తి విశేషముచే తానే ఆ ఆత్మ స్వరూపుడననే గురుకృపా సంసిద్ధి గల్గి ఆత్మాపరోక్ష జ్ఞానరూపమైన ఏకాంతభక్తి సిద్ధించును.

ఇదియే గురుకృప. ఇదియే తత్వజ్ఞానము. ఇట్టి తత్వజ్ఞానము గల్గినపుడే సంచిత కర్మ వాసనలు నిశ్శేషముగ నశించి వాసనాక్షయము కల్గును. వాసనాక్షయమగుటతోడనే మనోనాశము సిద్ధించును. ఇదియే మనశ్శుద్ధికి పరాకాష్ఠ. అపుడు మనస్సు తన కారణస్వరూపమైన శుద్ధ జ్ఞానమై నిలచును.

ఈ విధముగా మనో నాశనమైనపుడు సంచితకర్మ (అనగా జ్ఞానోదయ కాలమువరకుగల పూర్వపూర్వ కర్మఫలములన్నియు) నశించును. ఐనను తదనంతరం అనివార్యముగా జరుగు ఆగామీకర్మచే నూతన సంస్కారము లేర్పడు ప్రమాదమున్నది. ఏతన్నివారణకే పూర్ణ బోధయొక్క ఆవశ్యకత. ఆగామీకర్మఫలోత్పత్తికి బీజరూపం కాకుండా, వేయించిన విత్తనమునందలి అంకురము నశించి మొలవేసినను మొలవని రీతిగా నిర్వీర్యమై తన కర్మ ఫలప్రాప్తికి రాకుండా నశించినగాని పునర్జన్మ భయభ్రాంతులు తొలగవు. ఈ విధానము పరిపూర్ణబోధ విధించిన కర్తృత్వ రహిత కర్మాచరణ విధానమందుగాని సాధ్యంగాదు.

అనిత్యం : అనగా బాధింపబడేది. అస్థిరమైనది. నామరూపాత్మకమగు సర్వము బాధింపబడుచున్నది. మార్పుచెందుచూ అస్థిరమై యున్నది. గోచరించు సమస్తము అనిత్యమై యున్నది. "యద్దృశ్యం తన్నశ్యం" యింద్రియగోచరమగునది అంతయూ అనిత్యమే. "మనస్సష్టానీంద్రియాణి" మనస్సు ఆరవ యింద్రియముగా నున్నది. శుద్ధ మనస్సునకు ఆత్మయున్ను గోచరమే. కనుకనే "మనసై వాను ద్రష్టవ్యం, మనసైవాను శ్రోతవ్యమ్" అని శ్రుతులుద్ఘాటించు చున్నవి. పై విధముగా గురుసేవ గురునిష్టలచే మనస్సు శుద్ధమై ఆత్మ స్వరూపమే అగుచూ ఆత్మనే గోచరింపచేసుకొనుచున్నదన్నమాట. ఆ విధంగా గోచరమగు ఆత్మయున్న అనిత్యమే. అస్థిరమే అని గుర్తించుటయే పూర్ణబోధ.

ఆత్మగోచరమగు సమస్తమూ అనిత్యముగా నిరసించి ఖండించుమని యీ శ్లోక ముటంకించుచున్నది.

ఏదేది యింద్రియ మనస్సులకు గోచరించునో, గోచరించుటకు అవకాశమున్ను వుండునో దానినంతయు లేనిదానినిగా నిరసించుటయే కర్తవ్యము. అందుకే భ్రాంతి రాహిత్యమునకై "ఎరుకానె కల నీకు యెప్పుడు దోచితె యెరుక లేదను మేల్కనెరుగు మప్పుడె చాలు" అని శ్రీకృష్ణదేశికేంద్రుల వారు హెచ్చరించుచున్నారు.

ఆ విధంగా నిరసించ వీలులేనిదేదో, అదియే కేవల నిత్యత్వము కల్గిన పరిపూర్ణ పరబ్రహ్మము. అది ఒక్కటే మనోవా గగోచరము. అది కాని సమస్తమూ గోచరమే. అనిత్యమే.

ఇట్టి నిత్యా నిత్యములను తెలియచేసి కేవల నిత్యత్వముగల పరిపూర్ణ పరబ్రహ్మమును

చూపించకనే వుండజూపి బోధించు గురుమూర్తికివే మా నమస్సుమాంజలులు.

శ్లో॥ యస్యదేవే పరాభక్తి ర్యథా దేవే తథా గురౌ
తస్యైతే కథితాహ్యర్థాఃప్రకాశంతే మహాత్మనః॥

తాత్పర్యము : దైవమునందువలెనే గురువునందు ఎవరైతే పరాభక్తి సేయుదురో అట్టి మహాత్ములగువారికే, యీ గురుగీతయందలి విశేషార్థములన్నియు తేటతెల్లము కాగలవు.

విశేష వివరణము: ఈ శ్లోకమునందలి "పరాభక్తి" యను శబ్దార్థములను వివరించి తెలుసుకొనవలసి యున్నది. అసలు భక్తియనగా నేమి? సామాన్యార్థములో దైవము, తల్లిదండ్రులు, గురువులు, పెద్దలు మున్నగువారి యెడల నుంచబడు భయముతోగూడిన ప్రేమయే భక్తియని చెప్పబడును. వారి యాజ్ఞల నుల్లంఘించినచో వారు తన్ను శిక్షింతురేమో యను భయము, వారి యాదరాభిమానములను సంపాదించుటకై తన సర్వస్వ మర్పించుట కూడ వెనుదీయని ప్రేమ, యీ రెండును కూడినపుడే అది భక్తియని పిలువబడును.

భక్తి యనుశబ్దమునకు భాగమని మరొక విశేషార్థము. ఒక వస్తువు భాగములు గాక పూర్వము దానిని పూర్ణ వస్తువు అంటాము. అట్టి పూర్ణ వస్తువు నందలి యొక భాగము భక్తియనీ, భక్తమని, విభక్తమని చెప్పబడుచున్నది. పరమాత్మ పూర్ణము, అఖండము, అద్వైతము, అయివుండగా సకల చరాచర భూత భౌతికములు ఖండరూపములు, అపూర్ణములు భాగములు మాత్రం అయివున్నవి. అఖండత్వ పూర్ణత్వములే తన నిజరూపమని గుర్తించిన మానవుడా యఖండత్వ పూర్ణత్వముల చెందగోరును. అందుకుచేయు సాధనారూపమైన వ్యవహారమే భక్తి యని చెప్పబడుచూ, భక్తికి రూఢ్యర్థమై నిలచిపోయినది. భక్తి యనగా భాగమనే అర్థంలో పరాభక్తి అనునపుడు, శ్రేష్ఠమగు భాగమే అనగా పరమాత్మయే యని చెప్పనగును. ఎట్లనగా "పాదోస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతందివి" బ్రహ్మమందలి యొక పాదమే (అనగా పాతిక భాగమే) విశ్వమని, మిగతా మూడు పాదములు దివ్యమై అమృత స్వరూపమై యున్నవని దీని అర్థము. ఆ అమృతమగు దివ్య స్వరూపమే శ్రేష్ఠభాగము, పరాభక్తి అనజెల్లును.

సామాన్యముగా భక్తియనునపుడు, భక్తుడు, భగవంతుడు, వారి మధ్యగల సంబంధము అను నీ త్రిపుటి తప్పదు. ద్వైత, విశిష్టాద్వైతులే భక్తులుగాని అద్వైతములో భక్తికి తావులేదనీ. సాకార రూపములోనే భగవంతుని ఆరాధనసాధ్యముగాని అద్వైతుల బ్రహ్మము నిరాకారమూ నిర్గుణమూ గనుక అద్వైతులు జ్ఞానమార్గీయులేగాని భక్తికి అద్వైత మార్గమున తావులేదని చాలా మంది అపోహ. ఆదిశంకరులీ అపోహను తొలగించుటకై.

శ్లో॥ మోక్ష సాధన సామగ్ర్యాం భక్తి రేవ గరీయసీ
స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే॥

అని సెలవిచ్చినారు. తన నిజరూపమును ధ్యానించి ఏకత్వము చెందుటే భక్తియని నిర్వచించి నారన్నమాట. సకల నదీనదముల యొక్క యుత్పత్తి స్థానము మహాసముద్రమే. మహా సముద్రము నందలి జలములే ఆవిరిరూపంగా మేఘమండలంచేరి వర్షించి నదీ నదము లుగా విభక్తమైనవి. ఆ నదీనదములయందలి జలములు తిరిగి యా మహాసముద్రము నందైక్యము కాగోరి ఆ దిశగానే ప్రవహించుచుండుట సహజము. అట్లే స్వస్వరూపమును చెందుటకే మానవుడు ప్రయత్నించుటయు సహజమే.

"శ్రవణం, కీర్తనం, స్మరణం............" యిత్యాదిగా నవవిధ భక్తులున్ను, మరలనివి

బాహ్యభక్తి, అనన్యభక్తి, ఏకాంతభక్తి అని త్రివిధ రూపములుగాన్ను వివరించబడినవి. సగుణారాధన యంతయూ బాహ్యాభక్తిలోనికి చేరును. తన కన్యమైన సమస్తమునందు యిష్ట దేవతా స్వరూపమును అవలోకము చేయుట అనన్యభక్తి, తానా యిష్టదైవము నందలి యొక భాగము మాత్రమే. తద్భిన్నుడు గాడని అనుభవ జ్ఞానము గల్గి ఏకరూపుడై వుపాసించుచుండుటే ఏకాంతభక్తి.

శ్లో॥ చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతినోఽ ర్జున
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ॥ భ॥గీ॥

ఆర్తులు, జిజ్ఞాసులు, అర్థార్థులు, జ్ఞానులు అని భక్తులు నాల్గురీతులుగా విభజింపబడినారు.

ఈ యన్నిటిలో పరాభక్తి యనునది ఏది? ఏకాంత భక్తి సోపానమును చేరినవాడే నిజమగు జ్ఞాని. భక్తి జ్ఞాన మార్గముల కూడలి స్థానమే ఏకాంతభక్తి. పైన చెప్పినవానిలో జ్ఞాని యొక్క భక్తియే పరాభక్తి అని కొనియాడ తగియున్నది. ఎట్లనగా, భక్తులలో ఆర్తులు వున్న దుఃఖమును పోగొట్టుకొనుటకు దైవమునందు భక్తి సల్పుదురు. ఆ దుఃఖ ధ్వంస మగుటతోనే వారు భగవంతుని విస్మరింతురు. జిజ్ఞాసులు భగవంతుని స్థానస్వరూప స్వభావములను గురించి తెలుసుకొనగోరువారు. వీరి భక్తి వాచా వివేకిత్వముతోనే పరిసమాప్తి చెందును. అర్థార్థులు ద్రవ్యముతో (వస్తువునో, ధనమునో కీర్తినో) ఆశించి భగవంతుని స్తోత్రాదులు చేయు స్వార్థపరులు. వీరి భక్తి ఆశించిన అర్థము చిక్కుటతో అంతరించిపోవును. కాని జ్ఞానులు చేయు భక్తిపై మూడు విధములగు భక్తి వంటిదికాదు. కేవలం మోక్షమాశించియే జ్ఞానులు భక్తి సలుపుదురు. జ్ఞానులనగా ఆత్మజ్ఞాన పరాయణులు. వీరు తమ ఆత్మజ్ఞానమునకు సరిపడిన విధముగా తమచే నిత్యజీవితం సరిదిద్దుకొని అనుభవము పొంది ఆరూఢులగుటకు ప్రయత్నింతురు. అందుకు వలయు ధైర్యస్థైర్యములు ప్రసాదించుటకై భగవంతుని ఆశ్రయించి అతని నారాధింతురు. వీరి కేవిధమగు కోరికలు నుండవు. కనుక వీరే యదార్థమగు భక్తులు. వారికున్న ఆత్మజ్ఞానముచే వారి అజ్ఞానము పటాపంచలైనది. అజ్ఞానముచేత ఆత్మకన్యముగా అనేక నామరూపాత్మకమగు వస్తు జాతము యింద్రియ గోచరమై జీవుని ఆకర్షించు చుండును. ఆత్మ జ్ఞానికి, సర్వమునందు ఆత్మనే చూడగలిగిన ఆత్మదృష్టి అలవడును. అప్పుడు దేని నాతడు కోరును? దేనిని ద్వేషించును? మరియు నాతనికేవిధముగ కర్తవ్యము నుండజాలదు గదా! తన భక్తుడైన యిట్టి జ్ఞానినే భగవంతుడు ప్రేమించును. అతడే యుత్తముడగు భక్తుడు. అతడు కేవలం తన యాత్మయేయని భగవానుడు గీతయందాతనిని కీర్తించుచున్నాడు.

చతుర్వేదములు, షట్ఛాస్త్రములు చదివినవాడైననూ వస్తురూప యదార్థజ్ఞానము చిక్కదు. వస్తురూప యధార్థ జ్ఞానము కలిగిన పిమ్మట కూడ నాతనికి గురుభక్తి (లేక యిష్టదైవమందలి భక్తి) అవసరమని భగవద్గీత విధించుచున్నది. జ్ఞానుల యొక్క శ్రేష్ఠమగు నిట్టి భక్తినే పరాభక్తి యందురు. యిట్టి పరాభక్త కందరూ అర్హులుకారు. కేవలం పూర్వజన్మసుకృత విశేషముచేతనే యిట్టి భక్తి కలుగవలసియున్నది.

శ్లో॥ బ్రహ్మభూతా ప్రసన్నాత్మా నశోచతి నకాంక్షతి
సమః సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరాం॥

తాత్పర్యము : బ్రహ్మభావమును పొంది, ఆత్మసాక్షాత్కారము గలవాడై, శోకమోహములులేని స్థితిలో సర్వభూతములందు (ప్రాణులయందు) సమబుద్ధిగల్గి, నా పరాభక్తిని పొందుచున్నాడు. అతనికి సర్వత్ర ఆత్మయే గోచరించుచుండగా యిక యతనికి బేధభావ మెక్కడిది?

ఈ "పరాభక్తి" అట్టి మహాజ్ఞానికి లభించునని గదా యీ శ్లోకం చెప్పుచున్నది. పరాభక్తి యనగా వ్యష్టి భాగము, మిగతా సమిష్టి భాగంతో (పూర్ణత్వమునందు) ఐక్యమగుటయే. ఇది సమిష్టి రూపమగు అఖండ స్థితి. సృష్టికి పూర్వాపరములయందు ఏది తన సహజ స్థితిలో, సంపూర్ణమై, కృత్స్నమై యున్నదో అదియే "పరాభక్తి" యను శబ్దంచే గీతలో సూచింపబడినది. సృష్టియందీ పరాభక్తి రూప అఖండవస్తువే విభక్తమై నానాత్వమైనది. పరమాత్మయొక్క అఖండ సహజ స్వరూప ప్రకాశమే పరాభక్తి. ఆ వస్తువు తానగుటయే లక్ష్యం. ఆదిలో పరోక్షమై జ్ఞానరూపముగ నుండినదే యిపుడు సాధకునికి జ్ఞేయ స్వరూపమై గానవచ్చును. దాని ననుసంధానము చేయుచుండినచో జ్ఞాతృ జ్ఞానజ్ఞేయాది భేదతలంతరించి, సర్వత్రిపుటీ రహితమై నిర్విశేష బ్రహ్మ మొక్కటి మాత్రముండును. అపుడు జ్ఞానియైన ఆ భక్తుడు పరమాత్మ స్వరూపుడే యగుటవలన తన వ్యక్తిత్వము గోల్పోవును. రెండద్దములు తెచ్చి ఒకదాని యెదుట మరొకటుంచినచో రెండు ప్రతిబింబములును ద్రష్ట స్వరూపములే యగును. ఇక బింబ ప్రతిబింబములని రెండు వుండనే వుండవు. అట్లే ఆ జ్ఞానికిక ద్వైతము తోచజాలదు. ఆత్మస్వరూపుడు తానైనపుడు మాత్రమే ఆత్మస్వరూప జ్ఞానం కల్గినదని చెప్పవలసివుండును గదా! బ్రహ్మ స్వరూపుడు కానిదే బ్రహ్మానుభవం కలుగునా! సూర్యోదయానంతరం, అదివర కున్న అంధకారమే ప్రకాశవంతమైనట్లు, ఆ జ్ఞానికి జ్ఞాతృభావము పూర్తిగా నశించి తానే జ్ఞేయ బ్రహ్మమై నిలచును. ఇదే అద్వయ భక్తి లేక పరాభక్తి. అపుడు నేననేభామే యుండదు. అతడనే భావమున్నంత దనుక నేననే భావముండును. అది పోయినది కనుక ఆ వెనుక నేననే భావముండజాలదు. ఇదే అద్వైత సిద్ధి. శిష్యుడు అంశ స్వరూపుడగు లఘు స్వరూపుడు. విభుస్వరూపమగు శ్రేష్టభాగమగు (లేక గొప్పభాగమగు) పరమాత్మయే గురుస్వరూపుడు. గురుశిష్యు లిరువురుగూడి యొకటగుటయే అద్వైతసిద్ధి. యీ స్థితిని పొందుటయే పరాభక్తి.

ఈ పరాభక్తి యెట్లు లభించును? ఇది లభించుటయే పరమావధియా? లేక యీ పరాభక్తి కూడా ఒక సాధనా మార్గమేనా? యిది కూడా సాధనే ఐతే దానివల్ల సాధించదగునది ఏది?

కం॥ గురుశుశ్రూష నొనర్చుట నెరిగించెద నెట్లనిన యేర్పడవినుమా
నరులిష్టదైవములకున్ పరిచర్య యొనర్చునట్లు భక్తి తోడుతనూ
గురుమూర్తి కత్యుక్తి తోడుతనూ, నిరతామర మరలేక నీవుసల్పి
తివేని గురుబోధ మరుగు సద్గురునిచె దెలిసేవు, భక్తి తోడు
తనూ గురుమూర్తి కత్యుక్తి తోడుతనూ॥

అని కృష్ణదేశికేంద్రులవారి కందార్థము. ఇష్టదైవమునకు సాదారణముగా నరులొనర్చు పరిచర్య బాహ్యభక్తి మాత్రమేగాని యిట 'భక్తి తోడుతనూ' అనుటతో నూరుకొనక అత్యుక్తి తోడుతనూ అన్నారు. యుక్తి అనగా కూడిక (యోగము) అత్యుక్తి అనుటచే గురుశిష్యుల గాఢమగు కూడిక లేక ఏకత్వము చెందుట, యేకాంత భక్తికి సంబంధించినదే. అట్టి అత్యుక్తికి (గురు స్వరూపముతో ఐక్యసంధానము, లేక పరాభక్తి) ఫలమేమి? అంటే, "గురుబోధ మరుగు సద్గురునిచే తెలిసేవు" అన్నారు. అనగా పరిపూర్ణ బోధ మరుగంతయు నాతనికి కరతలామలక మగును అనిగదా తాత్పర్యము.

ఇదే భావము "తస్యైతే కథితాహ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః అను మాటలతో యీ

గురుగీతా శ్లోకమునందు చెప్పబడినది. ''బ్రహ్మభూతా ప్రసన్నాత్మా......'' అనే భగవద్గీతా శ్లోకములో పరాభక్తి పొందుటకు అధికారి నిరూపణము గావింపబడెను. అట్టి బ్రహ్మభూతుడు. ప్రసాన్నాత్ముడు. దుఃఖముగాని కోరికలుగాని లేనివాడు. సర్వభూతములయందు సమదృష్టి కలవాడు అయిన మహాత్ముడు పరాభక్తిని పొందిన తర్వాత మాత్రమే వేదాంతమునందు చెప్పబడిన అతీతమగు గంభీరార్థములు తెలియగలడట. ఆ అతీతార్థములు ఏవి? అవి పరిపూర్ణ బోధ పరమైనవేనని చెప్పుటలో ఏమీ సందేహముండజాలదు. ఏలననగా ప్రత్యగ్బ్రహ్మైకరూప పరాభక్తితో అద్వైతము పరిసమాప్తి చెందుచున్నది. గురుస్వరూపమేతాను, తానే గురుస్వరూపము అను పరాభక్తి సిద్ధించిన సచ్ఛిష్యవర్యునికే పరిపూర్ణబోధ అవగత మగునని పిండితార్థము. ఏ గురుకృపవలన అట్టి పరాభక్తియు, అతీత పరిపూర్ణ బోధ సిద్ధాంతమును ప్రాప్తింపగలవో అట్టి గురుస్వరూపముతో నిత్యమూ ఏకభావన పొందుచుందుము గాక!

శ్లో॥ గురువక్త్రే స్థితం బ్రహ్మ ప్రాప్యతే తత్ప్ర సాదతః
గురోర్ధ్యానం సదాకుర్యాత్ పురుషం స్వైరినీ యదా॥

తాత్పర్యము : గురుమూర్తి యొక్క సుఖము (నోటి) యందే బ్రహ్మవిద్య స్థావర మేర్పరచుకొని యున్నది. ఆయన అనుగ్రహము చేత మాత్రమే లభ్యంకాగలదు. శిష్యుడు స్వైరిణి వలె గురుమూర్తిని యెల్లపుడు ధ్యానించవలెను.

విశేష వివరణము : 1) గురువాక్య విశేషము 2) గురుప్రసాదము 3) స్వైరిణీ ధ్యానము అనువానిని వివరించి తెలుసుకొనదగును.

1)వాగింద్రియమునకు స్థానము వక్త్రము లేక నోరు, ఉపనిషత్తు ''వాగ్వైబ్రహ్మ'' అనగా వాక్కే బ్రహ్మమని కూడా కీర్తించుచున్నది. పర, పశ్యంతి, మధ్యమ, వైఖరి అని నాల్గు విధములుగా పరిణమించి వాక్కు యొక్క తొలిరూపం ధ్వన్యాత్మకమగు ప్రణవస్వరూపమే గదా! అదియే నాదబ్రహ్మమని శబ్ద బ్రహ్మమని కొనియాడబడినది. ఆప్రణవమును ''ఓమిత్యేకాక్షరం బ్రహ్మ'' యని శ్రుతిపల్కుచున్నది. అది మానవోపాధియందు వైఖరీ రూపం వహించి స్పష్టముగా భావప్రకటన చేస్తూ, వ్యవహార రూపకమై యున్నది.

సృష్టికి పూర్వమే వున్న గురుపరమాత్మయే, ధర్మసంస్థాపనార్థము మానవాకృతిలో, నామ రూపములు వహించెనన్న లక్ష్యముతో గురుభక్తుడు, గురూపాసనచేయును. గురువాక్యమునందు నిష్ఠ కలిగి శ్రవణ మనన నిధి ధ్యాసలు గావించును. ఆగమ నిగమోప నిషత్సారమధితార్థం అనుభవపూర్వకముగా గురుమూర్తికే చిక్కినది. కోటి గ్రంథములైనను ఆయనుభవమును అనువదించజాలవు. కనుకనే ''గురోర్ముఖేనజ్ఞాతవ్యం నాన్యధాగ్రంధకోటిభిః'' (గురువు చెప్పనిదే కోటి గ్రంథముల చేతకూడా యాబ్రహ్మతత్వం తెలియబడదని భావము) అంతేగాదు. మత సిద్ధాంతముల యొక్కయు. పరస్పర విరుద్ధములగు శ్రుతి స్మృతుల యొక్కయు సమన్వయం చేసుకొనజాలక మతిపోగొట్టుకొనుటయే యగును. కనుకనే ''శాస్త్రజ్ఞానం బహుక్లేశం బుద్ధే శ్చలన కారణం'' అని గురుగీత అన్యత్ర ఆదేశించుచున్నది.

2) గ్రంథములయందు బ్రహ్మవిద్య యున్ననూ దురవగాహమై యున్నది. శాస్త్రమును స్వానుభవమునకు జతచేసి, అధికార తారతమ్యమునుబట్టి శిష్యుని కర్థమగురీతిని చెప్పి సర్వసందేహ నివృత్తి ఆపై ఆత్మ నిశ్చయము గావించి కృతకృత్యుని గావించు గురుబోధకు స్థానమేది? గురువక్త్రమే గదా! గురుమూర్తి తనబోధచేతనే బ్రహ్మము యొక్క స్థాన స్వరూప

స్వభావములను శిష్యునికి వస్తు నిశ్చయ రూపముగా తెలియజేసి బ్రహ్మమును. ఘటమెదుటబెట్టి జూపినటుల శిష్యునికి సాక్షాత్కరింప జేయును. "గురువక్త్రేస్థితం బ్రహ్మ" అని యీ గురుగీతా శ్లోకముద్ఘాటించుచున్నది. గురుడు మూగనోము పడితే. శక్తిపాతముచే దప్ప శిష్యునికి వున్నదున్నట్లుగా బ్రహ్మవిద్య దెలియుట సాధ్యంకాదు.

2) గురుప్రసాదము : "ప్రాప్యతే తత్ప్రసాదతః "అనగా ఆ గురువుగారి అనుగ్రహము చేతను ప్రాప్తింపగలదు అని అర్థము. ప్రసాదమనగా అనుగ్రహము. దయ కృప అని అర్థమేగాని నోటితో భక్షించు ప్రసాదముగాదు. అట్టి గురుకృప యెట్లు ప్రాప్తించును? 'నరు లిష్ట దైవములకున్' పరిచర్య మొనర్చునట్లు భక్తితోడుతనూ. గురుమూర్తి కత్యుక్తితోడుతనూ, నిరతామరమరలేక నీవు సల్పితివేని గురుబోధ మరుగు సద్గురునిచే దెలిసేవు 'అనిన్ని. "నాలుగు శుశ్రూషణములు లోలతగావించుకొనుచు లోకాతీతంబాలోకించి గురునిచే" అనిన్ని శ్రీకృష్ణదేశికేంద్రులువారు తమకందార్థములలో శెలవిచ్చియున్నారు. గురుగీత ప్రథమాధ్యాయములో సంకల్పము చెప్పుచు "గురుకృపా ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః" అన్నారు. గురుగీత

శ్లో॥ "ధ్యానమూలం గురోర్మూర్తిః, పూజామూలం గురోఃపదం
మంత్రమూలం గురుర్వాక్యం ముక్తి మూలం గురోఃకృపా"

అని వుద్ఘాటించినది.

3) స్వైరిణీ ధ్యానము : స్వైరిణీ యనగా, స్వేచ్ఛాస్వాతంత్ర్యము కల్గి యదేచ్ఛగా పురుషులతో సంచరించు స్త్రీ లేక కులట అని రూఢ్యర్థమైయున్నది. ఆమె యెంత కులటయైనను ఆమెకున్ను అందరి విటులకన్నను యెక్కువ ప్రేమాస్పదుడైన పురుషుడుండవచ్చును. అట్టి ప్రియుని ఆమె నిరంతరం యెట్లు ధ్యానించునో అట్లు గురుకృపా ప్రసాదసిద్ధికై శిష్యుడట్లు ధ్యానించుచుండవలెనట. అందలి ఔచిత్యమును విచారించుటకు ముందు ఆమె యొక్క ప్రేమ యే తరగతిలోనికి వచ్చునో విచారించవలసియున్నది. అది కామమా లేక ప్రేమయా? భక్తియా లేక ప్రపత్తియా? శాంత. దాస్య. సఖ్య. వాత్సల్య. మధుర భావములతో ఆమె ప్రేమయే భావమునకు చెందును?

కామమును గూర్చి వివరించవలసిన పనిలేదు. అది కేవలం పశువాంఛతో కూడుకొని విషయానందముతో పరిసమాప్తి జెందుచున్నది. కామము ప్రేమము యీ రెండి తారతమ్యము యీ క్రింద పరిలేఖవలన స్పష్టము కాగలదు.

| **కామము** | **ప్రేమము** |
|---|---|
| 1. పంచదార బొదివిన విష గుళిక వంటిది కనుక నాశనకారి. | 1. దివ్యము అలౌకికము సర్వాత్మము అమృత స్వరూపము |
| 2. విషయానందకారకము | 2. ఆత్మానందసంధాయకం |
| 3. క్షణికానందము | 3. ధారావాహికమగు శాశ్వతానందము |
| 4. ఆది యందు ఆనందము అంత్యమందు దుఃఖము | 4. ఆది మధ్యాంతముల యందు ఆనందరూపమే. |
| 5. పశువాంఛలను పెంచును. | 5. పశువాంఛలను త్రుంచి వైరాగ్యం పెంపొందించును. |

6. స్వార్థ భూయిష్టము చిత్రాంగి వలె ప్రియ వినాశనమునకుగూడ వెనుదీయదు.

6. త్యాగ పూర్వకము. ప్రియుని శ్రేయస్సునకై ఆత్మాహానికైనా సిద్ధపడును యీ ప్రేమము యెట్టి ప్రతి ఫలమూ నాశించదు.

ప్రియుని ప్రేమించుట తన ఆనందము కొరకు గాదు. ప్రియుని కానందము గల్గించుటే దివ్యప్రేమయందలి విశిష్ఠ లక్షణము 'యిచ్చుటయేగాని పుచ్చుకొనుట యెరుగదు. ఎంత ప్రేమించినా, తనివి తీరక యింకా, యింకా, ప్రేమ పెంపొందవలెననే ఆశించుచుండును. క్షుద్రమగు కామ సంతృప్తి కిం దావంతయు స్థానము లేదు. యిది మహా పవిత్రము. కేవలం భగవంతునియందు మాత్రమే యిట్టి ప్రేమ కాస్కారము గలదు. ప్రేమయే భగవత్స్వరూపము "రసోవైసః రసహ్యేవాయం లబ్ధ్వానందీ భవతి", అనీ "ప్రియ ముపాసీత" అనీ శ్రుతులు పల్కుచున్నవి. భగవంతుడే ప్రియుడు భక్తుడు ప్రేయసి. ప్రియుని ఆనందపరుచుటలోనే ప్రేయసి (భక్తుని) ఆనందము ఈషణత్రయము లేదు. ఏమరేమనుకొందురో అను లోకవాసన లేదు. యీ ప్రేమ కవధులు. ఆనకట్టలు లేవు. కామమే లేని ప్రేమ గనుక దీనిని నిష్కామ ప్రేమయని అనవచ్చును. శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధురములని భక్తిభావములైదు. శ్రవణం, కీర్తనం, స్మరణం విష్ణోఃపాద సేవనం, అర్చనం, వందనం అను ఆరున్ను శాంత భావమునకు చెందును. భీష్మ, విదురాదుల భక్తియా శ్రేణిలో చేరును. ఆంజనేయుని భక్తి భావము దాస్యమునకును, అర్జున కుచేలాదుల భక్తి సఖ్యభావము నకును, విభీషణ శరణాగతి ఆత్మనివేదనమునకున్నూ దృష్టాంతములు.యశోదా కౌసల్యాదుల భక్తి వాత్సల్య రూప భక్తి భావమునకున్ను, బృందావన గోపికల భక్తి మధుర భావమునకును వుదాహరణములు. కాని స్వైరిణీ ప్రేమ యిందే భావమునకు చెందును? మధుర భావములో చేరునా? చేరదనియే చెప్పవలెను.

ఏలననగా గోపికల భక్తి దివ్యము. యితరమైన సమస్తమ ు నందు ప్రేమ నశించి, ఆ ప్రేమ యంతయు రాశీభూతమై, 7,8, సం॥ వయస్సుగల బాలకృష్ణుని యందు కేంద్రీకృత మాయెను. కామ సంతృప్తి కిందు ఆస్కారమేలేదు. శ్రీకృష్ణుని ఆనందపరచుటకన్న వారి కన్య చింతనమే లేదు. అతని దివ్య మంగళ విగ్రహమును జూచుట కవరోధము కల్పించు రెప్పపాటు లేకుంటే యెంత బాగుండెడిదో యని వారు పరితపించెడివారు. తమ కనుపాపలలోనే శ్రీకృష్ణుడు కాపురం పెట్టుకొన్నాడు కనుకనే అతడునల్లనయ్య ఐపోయెనని వారు భావోన్నత్యము పొందెడివారు. వారి దివ్య ప్రేమలో భోగము భోగవాంఛలేదు. అంతా త్యాగమే. సంఘ మర్యాదలు. శాస్త్రవిధులు, శరీర సుఖము మానసికానందము సర్వమును తృణప్రాయముగా వారు త్యాగంచేసిరి. ఆ గోపిక యోగివలె ఒకప్పుడు మేను మరచును. చెలికానివలె నాతనితో నాడుచు పాడుచు వినోదించును. తల్లిదండ్రివలె ఒకప్పుడు మందలించి బుద్ధిగరపును. ప్రేయసివలె అతని బిగికౌగిలిలో కరగిపోవును. మధుర భావంలో మిగతా భక్తి భావములన్నియు యిమిడియే యుండును.

గోపికలు జార స్త్రీలుకారు. భగవానుని దివ్యలీలలలో పాల్గొని ఆనందించుటకై అటుతో పాటవతరించిన ఋష్యాదులు. పరమభక్తులు. వారి ప్రేమ అలౌకికము, దివ్యము. గోపికలు లౌకికమగు సర్వబంధములు త్రెంపుకొన్న జీవన్ముక్తులు. అట్టి ముక్తజీవులతో పరమాత్మ రాసక్రీడలో లీలావినోదములు ప్రదర్శించెనని చెప్పబడుచున్నది. ఇట్టి మధురభక్తి కేవలం

పరమాత్మయందే సాధ్యము. గోపికలవలె. యెట్టి మహాత్ముని ఆరాధించుటకు ప్రయత్నించినా అది అనర్థకమే కాగలదు. భక్తుల నుండి అట్టి మధుర భక్తిని ఆశించిన వాడెంతటి మహాను భావుడైనా అతనిని తక్షణం విసర్జించుటే కర్తవ్యం. స్వైరిణి యనగా కులట. జారిణి. యదేచ్ఛగా అనేక మంది పురుషులతో కామ క్రీడల తేలియాడునది. కాని ఆమెకున్న హృదయమున్నది. తన హృదయమే అర్పించి ప్రేమించిన పురుషుడొకడుండును. అతనికి తన సర్వస్వము. ప్రాణములు సహితము. నర్పించగల్గి యుండును. ఎంతమందామెను కామోప భోగములలో తేలియాడించుచున్నను. ఆమె తన ప్రియ సమాగమమునకే నిరీక్షించుచూ పరితపించుచుండును. అతని నామరూపములనే ధ్యానించు చుండును. ఆమెకు తను వొకచోట. తమక మొకచోట. విటులయందామె ప్రదర్శించు ప్రేమ కృత్రిమము. కేవలము నటన మాత్రమే. పతివ్రత పతి భక్తిలో యింత తీవ్రతలేదు. భర్తతోను. అత్తమామలలోను, కాపురము చేయుచు యింటిపనులు చేసుకొనుచుండియు మనసు మాత్రము పరపురుషుని పొందుయందు లగ్నము చేయు భామినికి తన రహస్య వ్యాపారం బైటపడునేమో అనే భయముండును. కాని కేవలం స్వైరిణికి యెట్టి భయ సంకోచములు లేవు. యథేచ్ఛగా సంచరించగలదు. గురుభక్తుడు తన గురుమూర్తిని ధ్యానించు విధానమునకు యిట్టి నీచోపమాన మీయనేల? యిట్టి వుపమాన మిచ్చుట, వుచితమా అని స్థూలముగా తోచవచ్చును. గురుభక్తునికి స్వైరిణి వుపమాన మీయ లేదనియు ధ్యాన విషయంలో మాత్రమే యీ దృష్టాంత మీయబెడననియు ముందుగా జ్ఞప్తి యందుంచు కొనవలెను. పంచాగ్నిహోత్ర మధ్యమందున్నట్లు గృహస్థాశ్రమమునందు పంచ తన్మాత్ర విషయములలో యిరుక్కొనియున్న గురుపుత్రు డేవిధంగా మనసునిలిపి ధ్యానము చేయవలెనో ఈ శ్లోకము చెప్పుచున్నది. స్వైరిణి అనేకులతో సంచరించుచున్నను మనసులో మాత్రము ప్రియుని యెట్లు ధారావాహికంగా ధ్యానించునో అట్లే గృహస్థుడగు గురుభక్తుడు విషయ పంచకమునందు లౌకిక వ్యవహారములయందు నిమగ్నుడై యున్నట్లు లోకులకు గానవచ్చు చున్నను మనసు మాత్రము గురునియందే లగ్నము గావించి ధ్యానము చేసుకొనవలెనని భావము. మనస్సు, స్వైరిణి అనేక విషయములతో సంయోగము చెందుచుండును. ఐనను స్వైరిణి ఎవరితో సంచరించు చున్నను ప్రియుని ధ్యానము మాననట్లుగానే గురుభక్తుని మనస్సు అనేక విషయములయందు వర్తించుట తప్పనిసరి అయినప్పటికి గురుని ధ్యానము మాత్రము ఎల్లపుడు వీడక చేయవలెను. భక్తునికి స్వైరిణికి దృష్టాంతమీయలేదు. మనస్సునకూ స్వైరిణికి దృష్టాంత మీయబడినది. యిది నీచోపమానము కాదనీగురుసేవ గురునిష్ఠ గురుధ్యానములయందు ఏమరక, ఎవరేమను కొందురో అనే లజ్జా, భయ సంకోచములులేక స్వైరిణివలె మనస్సు వ్యభిచరించుచున్నను లెక్కచేయక గురుభక్తుడు సదా గురుధ్యానము సలుపవలెను అని పిండితార్థము. ఇట్టి నిరంతర ధ్యాన శీలత పూర్వజన్మ సుకృత విశేషమునగాని లభింపదు. ఐనను గురుమంత్రానుష్ఠానము చేయుచు గురూపదిష్ట మార్గమున పట్టుదలతో కృషిచేయువానికి యిట్టి సత్తాగలుగగలదు. తన్నాశ్రయించు భక్తులకిట్టి సత్తాననుగ్రహించు గురుమూర్తికివే మా నమస్కారములు.

శ్లో॥ జ్ఞానంవినా ముక్తి పదం లభ్యతే గురుభక్తితః
గురోః సామాన్యతో నాన్యత్ సాధనం గురుమార్గిణాం॥

తాత్పర్యము : జ్ఞానముపొందకున్ననూ, నిజమగు గురుభక్తులకు ఆ గురుభక్తి చేతనే మోక్షము

కరతలామలక మగుచున్నది. సాధారణముగా గురుమార్గ మనుసరించువారికి గురువుకంటే అన్య సాధనము లేదు.

విశేషవివరణము : జ్ఞానసంబంధమగు తత్త్వవిచారణ, చిత్తవృత్తి నిరోధరూపమగు యోగసాధన, మత నిర్ణయానుసారమగు కర్మాచరణ విధానము, భక్తిమార్గము, మంత్రోపాసన అను నీ ఐదుసాధనములను మీరిన అన్యసాధనములేదు. ఏ సాధనయైనా ఈ ఐదు సాధనలలోనే చేరును. గురుభక్తి కుదురుకొనియున్న వానికి ఏ యితర సాధనలతోను అవసరం లేకుండగ, గురుభక్తి ప్రభావముచేతనే ముక్తిపదము లభ్యం కాగలదని యీ శ్లోకముద్ఘాటించు చున్నది.

జ్ఞానమనగా నేమి? శాస్త్రజ్ఞానముగాని, శాస్త్రజన్యజ్ఞానముగాని, కాదని స్పష్టము. శాస్త్రజ్ఞానము పరమాత్మయొక్క స్వరూపజ్ఞానమునందు పర్యవసించిననే సార్థకము. లేనిచో అది కేవలం చిలుకపలుకలవంటి వాచాజ్ఞానమే అగును. శాస్త్రజన్యజ్ఞానము పరోక్షజ్ఞానమును మాత్రమే కల్గించును గాని బ్రహ్మ అపరోక్ష జ్ఞానము కల్గింపజాలదు. కనుకనే "అవిజ్ఞాతే వరే తత్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా" అని చెప్పబడినది. ఇట్టి జ్ఞానము లేకున్నను ముక్తిపదము గురుభక్తులకు ప్రాప్తింపగలదు. ముక్తిపదము అనగా మోక్షస్థానము.

శ్లో॥ నతద్భాసయతే సూర్యో నశశాంకో నపావకః
యద్గత్వా ననివర్తంతే తద్ధామ పరం మమ॥ భ॥గీ॥

అనగా స్వయం ప్రకాశరూపమగు పరమాత్మ స్థానమే ముక్తిపదము లేక గురుతత్వము. అంతకంటే శ్రేష్ఠమగు మరొక స్థానములేదు. అట్టి ముక్తి పదము సాధనాంతరములయొక్క ఆపేక్ష లేకుండగనే కేవలం గురుభక్తిచేతనే లభ్యం కాగలదు. భక్తి త్రివిధము, నవవిధరూపముగా వర్ణింపబడినది. బాహ్యాభక్తి. అంతా గురుస్వరూపంగా చూడగల్గినది అనన్యభక్తి. తానే గురుస్వరూపము గురుస్వరూపమే తాను అనునది ఏకాంతభక్తి. ఏకాంతభక్తియే భక్తికి పరాకాష్ఠ. జ్ఞాన మార్గమునకు లక్ష్యము తానే పరమాత్మ, "అహం బ్రహ్మాస్మి" . "బ్రహ్మైవా హమస్మి" అను జ్ఞానమారూఢ మగుటయే. జ్ఞానమార్గమున్ను భక్తి మార్గమున్ను చివరకు ఏకస్థానమున కలుసుకొనుచున్నవి. జ్ఞానంలేక పోయిననూ గురుభక్తిచే జ్ఞానగమ్యమును భక్తుడు పొందగలడు.

అట్టి భక్తలక్షణములేవి? అట్టి భక్తి యొక్క స్వరూప మేమి? కొంచెము విచారించవలసి యున్నది. "పూజ్యేషు అనురాగో భక్తిః" అనగా పూజనీయులయందు ప్రేమ. గురుదైవముల యందు, తల్లిదండ్రులయందు, పెద్దలయందు కేవల అనురాగము మాత్రంగాక పూజ్య భావమున్నూ, భయముతో కూడిన ప్రేమయున్నూ కల్గియున్నపుడు అది భక్తి యనబడును. పూజ్యభావముండిన చాలదా? ప్రేమయుండిన చాలదా? భయముండవలసిన పనియేమి? అని శంకించవచ్చును. ఆ గురు దైవాదుల అజ్ఞాన పరిపాలన గావించలేకపోదునేమో! అందు కనుకూలమగు శీలసంపత్తియు పరిశుద్ధ ప్రవర్తనయు కొరవడునేమో, తెలిసియో తెలియకో తనవలన వారికేమైన అపచారము కలుగునేమో, ఆకారణమున వారి ప్రేమానురాగములను తాను చూరగొనలేనేమో, యిత్యాదిగా భయమున్నపుడే అది భక్తి యనిపించుకొనును. గురువు నెడల వినయ విధేయ శ్రద్ధాభయభక్తులతో గురుని యాజ్ఞ పరిపాలన గావించుచూ త్రికరణ శుద్ధిగల్గి గురూపాసన గావించుకొనుచూ దీక్షబూని నిష్ఠతో గురుని సేవించుచుండువాడే గురుభక్తుడనబడును.

భగవద్గీత భక్తియోగములో 13 నుండి 19 వరకు గల శ్లోకములలో పేర్కొనబడిన

లక్షణములు గలవాడే నిజమగు భక్తుడనీ తనకిష్టుడనీ భగవాను డానతిచ్చినాడు. ద్వేషములేనివాడు. మైత్రి గలవాడు. అహంకారమమకారరహితుడు. సుఖదుఃఖములయందు సమత్వము గలవాడు. ఓర్పు. నిత్యసంతుష్టిగలవాడు. యోగయుక్తుడు. ఆత్మ నిగ్రహము గలవాడు. భగవంతుడైన తనయందు మనోబుద్ధులను నిల్పినవాడు. లోకమునకు తనవలనగాని తనకు లోకమువలనగాని బాధలేనివారు. సంతోషము. క్రోధము, భయము. వుద్వేగము లేనివాడు. కోరికలేనివాడు. పరిశుద్ధుడు. నేర్పరి. నిర్లిప్తుడు. విచారరహితుడు. కర్మపరిత్యాగి. హర్ష ద్వేషములు. శోకమోహములు లేనివాడు. శుభాశుభ ఫలములను విడచినవాడు. శత్రుమిత్రులయందును మానావమానముల యందును. శీతోష్ణ సుఖదుఃఖములయందును. నిందాస్తుతులయందును. సమబుద్ధిగలవాడు. సంగములేని వాడు. లభించిన దానితో తృప్తి పొందినవాడు. తన గృహమనే అభిమానము లేనివాడు. స్థిరమైన చిత్తము గలవాడు అయినవాడే భక్తుడు. తన కిష్టుడు అని భగవానునిచే చెప్పబడినది.

ఇంతకంటే వుత్తమలక్షణము లేమిన్ని లేవుగదా! యిట్టి సర్వశుభలక్షణములు నిజమగు భక్తుని చేరును. విష్ణుభక్తి బాగా ఆరూఢమైయున్న ప్రహ్లాదుని విషయంలో "సద్గుణంబులెల్ల సంఘుంబులై వచ్చి అసురబాలకునందు నలముకొనియె" అని చెప్పబడినది. ఏలననగా నిజభక్తుని యొక్క శుద్ధాంతఃకరణమే సద్గుణములకెల్ల యోగ్యమగు నివాసస్థానము. అందు దుర్గుణములకు తావుండదని అభిప్రాయము. యీ భక్తలక్షణములతో సాంఖ్యయోగమందలి స్థితప్రజ్ఞాలక్షణములు గుణత్రయ విభాగయోగమందలి గుణాతీత లక్షణములు, పోల్చిచూచినచో ఏమియు భేదము గోచరించదు భక్తుడు జ్ఞాని అను యిరువురిలో ఎవరు శ్రేష్ఠుడు? అంటే, యిర్వురు సమానులే అని చెప్పక తప్పదు.

తనయందు సర్వమూ, సర్వమునందు తననూ చూచుకొనుటయే జ్ఞాని యొక్క అనుభవ లక్షణము. అట్లే ఏకాంత భక్తియందు, గురుతత్వమే తాను, తానే గురుతత్వము అని గుర్తు వీడక యుండుటయే గురుభక్తుని లక్షణము. ఇర్వురియొక్క అనుభవము కూడా ఏకమే.

ఇక యిర్వురకు భేదమేమి? అంటే జగజ్జీవ ఈశ్వర, కూటస్థ బ్రహ్మముల యొక్క స్థాన స్వరూపములను తాను తెలిసికొని యితరులకు సహేతుకసప్రమాణముగా ప్రబోధించు శక్తి మాత్రమే జ్ఞానికి అదనము.

ఐతే, గురుభక్తినియొక్క ఆధిక్యత లేక విశిష్ఠత ఏమి? అంటే 1) శాస్త్ర జ్ఞానము కలవానికి అహంకార మమకారాభిమానములు పాదుకొని యుండును. ఏలననగా, "అహం బ్రహ్మాస్మి" అనే అహం వృత్తి పరిపక్వాహంకారమని చెప్పబడినది. ఒక వంక తానే బ్రహ్మము అని అంటూవున్నా జీవేశ్వర జగత్సృష్టికి నేనే కారణమనే కర్తృత్వ లక్షణం వహించి. మహదహంకారమను పేరువహించిన బ్రహ్మము వలెనే. "అహంబ్రహ్మాస్మి" అని అనుకొంటూవున్నా నేను శాస్త్రజ్ఞానయుతుండననే అహంకారాభిమానముల తేలికగా తొలగజాలవు. అట్లుగాక "భృత్యాను భృత్య పరిచారక భృత్య భృత్య, భృత్యస్య భృత్య యితి మాం స్మర లోకనాథా" అని ముకుందమాలలో చెప్పబడినరీతిగా గురుమూర్తి యొక్క పాదధూళితో సమానమైనవానిగా తన్నుయెంచుకొనుట కభ్యాస పడిన గురుభక్తుడు. భక్తియొక్క పరాకాష్ఠ రూపమగు ఏకాంత భక్తిలో తానే గురుస్వరూపము. గురుస్వరూపమే తాను అని అనుభవరూపంగా గుర్తించినప్పటికి యెన్నడూ అహంకారం పొంద జాలడు. శ్రీ రామకృష్ణపరమహంస శిష్యుడగు నాగమహాశయుడు.

మహామాయపన్నిన మాయవలలో చిక్కుకొని. పైన వుదహరించిన రీతి భక్తిభావంలో ఆవల కన్నము కంటెనూ చిన్నవాడైపోయి ఆవల కన్నములలోనుంచి బైటపడి మాయను జయించెనట.

2) గురుభక్తుడు గురుమూర్తికి శరణాగతుడై సర్వాత్మార్పణ గావించుకొని సంపూర్ణ ప్రపత్తిలక్షణము పూనియున్నందున గురుమూర్తియే నడుముకట్టుకొని "యోగక్షేమం మహామ్యహం" అని శిష్యుని విషయమై సంపూర్ణ బాధ్యత వహించియుండును. అవసరమైతే, శక్తి పాతముచేనైననూ, వానికాత్మస్వరూపజ్ఞానము ఆరూఢపరచి ఆ యుత్తమ స్థానమున (ముక్తిపదమున) శిష్యుని నిలపి, "యిపుడు నిన్ను విడచి చూడుము. అంతా కుంఠితముగాని వైకుంఠమే. కల్పనా రహితమైన కైలాసమే" నని యుద్బోధించి కృతకృత్యుని గావించును. అందుకే శ్రీకృష్ణ దేశికేంద్రులవారు, "అపరోక్షమౌనె మనుజులకు పరోక్షంబైన బయలు గురుకృపలేకన్" అని ప్రశ్నించి, "అతనికి దయవస్తే అర నిముసముననే బోధస్థితి నీకు కుదిరించు" నని అభయ ప్రధానము గావించుచున్నారు.

3) తత్, త్వం, అసి పదముల , పద పదార్థములను అన్వయ వ్యతిరేక యుక్తులతో శ్రవణ మనన నిధి ధ్యాసల చేసినను వస్తునిశ్చయ జ్ఞానము గురుకృపవలన శీఘ్రముగా సిద్ధించును. ఆతత్త్వం, అసి పదములకు లక్ష్య నిర్దేశము గావించి గురుమూర్తి ఆయావస్తువులను దర్శింపచేయగలడు.

4) ఆచరించి చూపువాడే ఆచార్యుడు గనుక, ఆత్మజ్ఞాన సంసిద్ధికి పూర్వాపరముల యందు యెట్టి ప్రవర్తన గల్గి యుండవలెనో తన ప్రవర్తనలో శిష్యునికి జూపి నిజముగా మార్గదర్శకుడు కాగలడు. తానే స్వయంగా వస్తువు నన్వేషించి తెలుసుకొన గోరువాడు తనకు తానే మునుగును అని శ్రీ శివరామ దీక్షితులవారు తెల్పియున్నారు. అట్లుగాక గురుమూర్తి నాశ్రయించిన వానిని, తాను నడచిన మార్గమందు నడిపించి గురువు గమ్యము చేర్చును. "దీపో దీపాంతరం యధా" అనగా వెలుగుచున్న దీపము అనేక దీపములను వెలిగించ గలుగునట్లు గురుమూర్తి శిష్యకోటిని సులభంగానుత్తీర్ణులను చేయగలడు గురుభక్తున కెట్టి లోపమున్ను యుండజాలదు.

5) గురుమార్గము కంటె సులభతరమగు మోక్షమార్గమింకొకటి లేదు అనునపుడు యితర మార్గము లనేకము లున్నట్లు స్పష్టమే. ముక్తపదము చేర్చుటకు మాత్రమే అవి సమర్థవంతములుగాని గురుమార్గమన్నవో దాని కతీతమగు పరిపూర్ణ పరబాహ్యమునందు తనకు శాశ్వత జన్మరాహిత్యమును గల్గించుటకు కూడా సామర్థ్యము కలిగియున్నది. ఏలననగా ముక్తిపదముకూడా నొక పదమే (స్థానమే లేక దేశమే) అది పెంజీకటి కవ్వల ఏకాకృతి వెలుగునది, అనగా అజ్ఞాన స్థానమున కావలనున్న జ్ఞానప్రకాశముచే వెలుగొందునది అని అర్థము పరిపూర్ణ పరబాహ్యమో? జ్ఞానాజ్ఞాన రహితమగు పరబాహ్యము. అట్టి పరబాహ్యము నందు శాశ్వత జన్మరాహిత్యము గలిగింప గలది గురుమార్గము అట్టి గురుమార్గమే ఋజు మార్గము (మలుకలులేని త్రోవ, తిన్నని మార్గము లన్నారు శ్రీకృష్ణ దేశికేంద్రులవారు) అట్టి గురుమార్గమే (గొప్ప మార్గము) అట్టి మార్గమందు తాను నడచుచూ మమ్ము నడిపించు సద్గురు దేవుని కివే మా ప్రణతులు.

శ్లో॥ శిష్యా దన్యత్ర దేవేశి నవదే ద్యస్య కస్యచిత్
నరాణాంచ ఫలప్రాప్తౌ భక్తి రేవహి కారణం॥

తాత్పర్యము : ఓ పార్వతీ! శిష్యుడు కానివానికి ఎవనికైననూ ఈ గురుతత్వమును గూర్చి చెప్పరాదు. కారణమేమనగా, ఫలప్రాప్తి కలుగుటకు భక్తియే ముఖ్యకారణమై యున్నది.

విశేషవివరణము : 1) యస్యకస్యచిత్ : ఏవనికైననూ అని అర్ధము. అనగా ఆ వ్యక్తి ఎంత తెలివి తేటలుగలవాడైనా, ధనవంతుడైనా, పండితుడైనా, రక్తసంబంధీకుడైనా, లేక ఈ మార్గమునందే కృషి చేయు మరియొక గురుపుత్రుడైనా, లేక సాక్షాత్ తన గర్భవాసమున జన్మించిన సంతానమైనా గురుగోప్యములను వెల్లడించరాదు. ఇక ఎవరికి చెప్పవలె ననగా, జన్మ రహితమునందుతీవ్ర ఆపేక్షతో వచ్చి తనకు శరణాగతి చేసి "గురువాక్యం యధా తధా" అనురీతిగా గుర్వాజ్ఞలను తు.చ.తప్పకుండా పాటించుచూ చతుర్విధ శుశ్రూషలయందు దీక్షవహించి, తన భక్తుడైన (శిష్యునికే) పరమ రహస్యమైన 1) గురుస్వరూపము (పరమాత్మ స్వరూపము) 2)పరిపూర్ణ పరబ్రహ్మము. యీ రెంటిని గూర్చి చెప్పిచూపించవలెను అందుకే కృష్ణ దాసుగారు "జఠర జనితులైనను, బహుకఠిన మనస్సులకు ఘోరకలుషాత్ములకున్ శఠులకు, జడమతులకవకు పఠనాశక్తులకు బోధ పట్టుమటం చున్" అనగా గర్భవాసమున పుట్టిన వారైననూ, ఎంతటి జ్ఞానపరులైననూ భక్తిరసముతో ఆర్ధ్రీకృతము గాని కఠినాత్ములకు గాని, మూఢమతులకుగాని, పాపిష్టులకుగాని బోధ చెప్పరాదని శాసించినారు. కేవలము శిష్యుడు తరించవలెననే ఉద్దేశ్యము తప్ప గురువునకు ఇతరమైన స్వార్థ ప్రయోజన ముండరాదు. అట్లే జన్మ రాహిత్యమందు తప్ప ఇతర కోరిక లేమిన్ని శిష్యునకుండరాదు. ఉభయత్రా ఇట్టి లక్షణమున్నపుడే బ్రహ్మవిద్య ప్రకాశింపగలదు.

2. భక్తి : శ్లో॥ "అభక్తేవచంకే ధూర్తే పాషండే నాస్తికాదిషు
మనసాపి నవక్తవ్యా గురుగీతా కదాచన"

అని భక్తుని కానివానికి గురుగీత ధర్మము చెప్పకూడదని గురుగీతయే అన్యత్రా శాసించినది. భక్తియే ముక్తికి త్రోవయని పెద్దల నానుడి కనుక భక్తి యొక్క విశేషార్ధమును కొంచెము విపులముగా తెలిసికొనవలసియున్నది. భక్తి అను శబ్దమునకు పరమేశ్వరుని యందు పరమ ప్రేమ పూజ్యుల యందు అనురాగము, ఉపాసన స్వస్వరూపాను సంధానము. అఖండాకారమైన వృత్తి మొదలగు అర్థములన్నవి. భగవంతునియందు ప్రేమతోపాటు ఆయన యెడల ఏదైన అపచారము చేతునేమో యను భయమున్ను ఉండినపుడే అది భక్తి యనబడునుగాని కేవలము ప్రేమ మాత్రమే ఉండినచో అది భక్తి యనుటకు వీలులేదు. అందుచేతనే ఆత్మయందు ప్రేమ. ప్రవర్తన యందు భీతి, రెండూ కలసినపుడే భక్తి అని పెద్దల సూక్తి "శ్రవణం కీర్తనం స్మరణం విష్ణోఃపాదసేవనం, అర్చనం వందనందాస్యం, సఖ్యం ఆత్మనివేదనమ్" అను నవవిధ భక్తులను భక్తియును పదము యొక్క సామాన్యార్థము లోనే చెప్పతగి యున్నవి. ఇట్టి బాహ్యభక్తి ప్రథమములో సోపాన విధంగా అవసరమైయున్ననూ, ముఖ్యాధికారి ఆశించు జనన మరణ రహిత రూపమైన ఫలప్రాప్తికి హేతువైన భక్తి మాత్రముకాదు. "మన్నాథ, శ్రీజగన్నాథో మద్గురు శ్రీజగద్గురుః స్వాత్మైవ సర్వభూతాత్మ తస్మై శ్రీ గురువేనమః" అని చెప్పబడినరీతిగా తన గురువు తప్ప, ఏమియు లేదనిన్నీ చరాచరాత్మకమగు సర్వదృశ్య ప్రపంచము. గురుపరమాత్మ యొక్క స్థూల రూపమగు మారురూపమేనని ఉపాసన గావించు అనన్య భక్తియే ఈ పై

శ్లోకమునందుసూచింప బడినది. ఇట్టి అనన్యభక్తియే యీదిగవ శ్లోకములో నున్నూ చెప్పబడినది.

శ్లో॥ భక్త్యామామ భిజానాతి యవాన్యశ్చాస్మి తత్వతః
తతోమాం తత్వతోజ్ఞాత్వా విశతే తదనంతరమ్ భ.గీ. 18.55

అనగా భక్తిచే నన్ను చక్కగా తెలుసుకొని నా రూపులై నాలో ప్రవేశింతురు. ఇట్టి ఉత్తమ భక్తియేతురీయ భక్తియని జ్ఞానభక్తియని, స్వసంవితి, పరమ భక్తి, అద్వయభక్త, పరాభక్తి మొ॥గు నామములచే ప్రసిద్ధమైనది. ఆర్త జిజ్ఞాసి అర్థార్థి భక్తుల వంటిదికాదు. పరాభక్తి యిది జ్ఞాని యొక్క భక్తి. జ్ఞాని యెవరు ఆత్మస్వరూపము దెలిపిన వాడే జ్ఞాని "స్వస్వరూపాను సంధానం భక్తిరిత్యభిధీయతే" అనిఆదిశంకరులు. యీ పరాభక్తి మొదటనే సాధ్యపడదుగదా! ఆత్మాను సంధానము చేయుటకు ఆత్మవస్తువు ముందు తెలియబడవలెను గదా! అందుకు గురుపాదము లాశ్రయించి గురూపాసన గావించి గురువాజ్ఞపాలించు నడవడిక గలవానికే గురువు ఆత్మవస్తు నిశ్చయము గావించును. ఆ పిమ్మటగాని శిష్యుడు ఆయాత్మాను సంధానము చేయలేడు గదా! శిష్యుడాది నుంచి చేసిన భక్తి సాధన యిపుడు పరాకాష్ఠ చెంది " మద్భక్తిం లభతేపరాం" అని భ॥గీతలో చెప్పబడిన పరాభక్తియందు పర్యవసించ గలదు. బ్రహ్మభూతా ప్రసన్నాత్మా అని అట్టి పరాభక్తి లభించిన శిష్యుడు కీర్తించనగును. ఆత్మరూపము చెందినవాడే నిజమగు జ్ఞానద్రష్టయనిగు తన రూపమేతనకు దర్శన మగుటయే ఆత్మరూపము చెందుట.

ఫలప్రాప్తి : పైన చెప్పబడిన భక్తి ఫలప్రాప్తికి కారణమని యీ శ్లోక ముద్ఘాటించుచున్నది. ఆ ఫలమేది? కేవలం జనన మరణ భ్రాంతి రాహిత్యమే వుత్తమ ఫలము యీ వుత్తమోత్తమ ఫలప్రాప్తియే అర్థము అవాంతర ప్రయోజనముల ప్రసక్తిలేదు. "సర్వం ఖల్విదం బ్రహ్మ" "అయమాత్మా బ్రహ్మ" అన్నియు నేనే. నేను కానిది ఏమీ లేదు. "అజోహం అమరోహం" నేను పుట్టనివాడను. చావనివాడను. కనుక నాకు మూలమున్నూ యుండజాలదు. ఐతే నాయందే సర్వము దోచుచున్నవి. ఆ తోచబడినవన్నీ నేనే. కనుక నేనే నన్నే చూచుకొని భ్రాంతి చెందుచున్నాను. కనుక భ్రాంతి మూలము నేనే. భ్రాంతి రహితము కావలెనంటే అన్నిటికీ అత్యంత మూలకారణమగు నేనున్నంతవరకు భ్రాంతి కలుగుచునేయున్నది. కనుక, నేనే లేకపోవలె నేను లేనిచో భ్రాంతికారణమే లేదు. భ్రాంతి సమూలంగా నాశనమగు చున్నది. నేనే లేకపోతే యేముండును? ఏమో ఏదో వుండును కాని దానిని వర్ణించుటకు తలంచుటకు నేనుండను గదా! అదే వాచాతీతం మనోతీతం. దానికే పరిపూర్ణమని అచల ఋషులు పేరెట్టినారు. అది యున్నదని వేదోపనిషత్తుల సిద్ధాంతము. దానియందు సర్వమునకు మూలకారణమైన నేనేలేను. అని దృఢమగుటయే యీ పరాభక్తికి ఫలము. ఇట్టి ఉత్తమోత్తమఫలము పరాభక్తి చేత మాత్రమే నరులకు లభించునని యీ శ్లోక ముద్ఘాటించుచున్నది. అట్టి పరాభక్తి గురుకృపా విహీనులకు దుర్లభము. ఆదిలో గురూపాసనచేయని వార్కి గురువే పరుడని భావన లేనివార్కి గురుకృప కలుగదు. ఆ గురుబోధ అట్టి భావన గల శిష్యునికే ప్రసాదింపబడును. "తనకు తావచ్చి సద్బోధను దెల్పుమటంచు మొక్కు తన శిష్యునకు విన జెప్పదొడగె నొక గురుడనుమానించకను వాని కతిదయతోడన్" అనిన్నీ "నా మాటలెన్న వినుమా, సామాన్యం బనుచుచూడ జనదీ బోధన్ ప్రేమాతి శయమునన్ గని వేమారిది గురుని నోట వినవలె సుమ్మీ" అనిన్నీ శ్రీకృష్ణ దేశికేంద్రుల కందపద్య కందార్థములలో సెలవిచ్చిరి. తాను దైవముగా నుపాసించు న గురుని నోట విన్నపుడే తద్బోధ ఫలాకారక మగును. అనుగ్రహ పూర్వకముగా

"నన్నాశ్రయించినావని. అన్నా యీ బోధ నీకు అతుకుట కొరకై యెన్నో యుక్తుల
నంటున్నాడు గురుమూర్తి. అనగా "శిష్యుడు తన గురువునోట వినవలె"
తన్నాశ్రయించిన శిష్యునికే చెప్పవలె" నని నిర్ణయించినవారు. కనుక గురుశిష్య స
లేనిచోట యీ ప్రబోధ ఫలకారికానేరదు. కనుక యితరులెంత యుత్తమములైనా త
లాశ్రయించి తన్నే దైవముగా యుపాసన గావింపని వారికి చెప్పకూడదని పెద్దలు వి
సాక్షాత్ పరబ్రహ్మ స్వరూపుడగు నా గురుమూర్తి నన్నుద్ధరించు టకే పుట్టి బోధించ
గదా అనే లక్ష్యం శిష్యునకు మాత్రమే వుండును. అపుడే గురు వాక్యం యందు ద
మేర్పడును. "నిన్ను నే కడతేర్చెదను నేజెప్పిన కృషి చేయుమని" గురువు నమ్మించి
గనుక సచ్ఛిష్యుడై తన ఆజ్ఞలో మెలగెడి శిష్యుని యెట్లు తొందరగా కృతార్థుని
యెపుడు తన వాగ్దానమును చెల్లించుకొందనా అని గురువు యెదురు చూచు
అట్టి గురుశిష్యుల మధ్యనే యీ గురుబోధ ప్రకాశింపగలదు.

ఇట్టి గురుశిష్య పరంపరను ఆచంద్రార్కము చిరస్థాయిగా వర్ధి
అహరహము కృషి చేయు శ్రీ సద్గురుమూర్తికివే మా నమస్కారములు.



ఓం

శ్రీ గురుభ్యోనమః

## "పరిపూర్ణ దర్శనాచార్య సదానంద"
## శ్రీ యిలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు గారి
## రచన గ్రంథముల వివరములు

| | |
|---|---|
| పరిపూర్ణ దర్శనం | రూ. 40-00 |
| పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత పరంపరా గురువుల జీవిత చరిత్ర | రూ. 15-00 |
| పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత వ్యాస మంజరి (4వ భాగము) | రూ. 18-00 |
| పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతము వేదాంత కథలు | రూ. 15-00 |
| భ్రాంతి రహిత శ్లోకములు - సవ్యాఖ్యానము | రూ. 12-00 |
| నిఖిల వేదాంతార్ధ నివహము | రూ 12-00 |
| పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతము జాబులు - జవాబులు | రూ. 20-00 |
| శ్రీ శివరామదీక్షితీయ సూక్తిముక్తావళి | రూ॥ 20-00 |

ఈ గ్రంథములు వలయువారు :

**శ్రీశ్రీశ్రీ సీతారామచంద్ర పరిపూర్ణ బోధోపదేశ మందిరము**

డో. నెం. : 10-204/ఏ, యర్రబాలెం - 522 503,
మంగళగిరి మండలము, గుంటూరు జిల్లా

సూచన : అడ్వాన్సు పంపిన వారికి వి.పి.పి. చేయబడును.